ఓమ్

శ్రీమద్బాదరాయణమహర్షి ప్రణీత

# బ్రహ్మసూత్రములు

శ్రీశాంకరశారీరకభాష్య - తదాంధ్రానువాదవిశేషాంశసమేతములు



## ద్వితీయాధ్యాయ - ద్వితీయపాదము



ఆంధ్రానువాదకులు :
వ్యవహారధురీణ, కవితాప్రవీణ, వేదాంతపారీణ,
ఆంధ్రభగవద్గీతాపరిష్కృతిగ్రంథకర్త
శ్రీ పాటిబండ సూర్యనారాయణామాత్యులు
గుంటూరు





# కృతజ్ఞత

వేదాంతవిద్యాప్రియులారా !

మాన్యులు, బ్రహ్మణ్యులు నస్మదస్మత్పితృపూజ్యపాదులు తమప్రయాణదివసమువఱకు భగవదనుగ్రహముచే బ్రతిపదార్థతాత్పర్యవివరణములతో నిర్దుష్టముగ నాంధ్రభాషలో వివరించుచు వచ్చిన "బ్రహ్మసూత్ర శ్రీశాంకరశారీరక మీమాంసాభాష్యవిశేషాంశములు" యథాతథముగా లభ్యమైనంతవఱకు బ్రచురించుచు నిప్పటికి బూర్తియైనదని చెప్పుటకు సంతసించుచున్నాను. వ్రాతగ్రంథము నత్యంతశ్రద్ధతో, వివిధదైవిక క్లేశములను సహించి, సరిచూచి ముద్రణయోగ్యముగ కల్గించిన మాన్యులు, సహృదయులు, నిష్కాములు, సారస్వతసేవానిరతులు, బ్రహ్మతత్త్వానందమగ్నులు, నిరాడంబరులు, నగు "పండితకవిప్రియ" బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రిగారు. వారు శ్రమకరమైనయీభారమును వహించకుండిన నీగ్రంథముద్రణము జరిగియుండెడిది కాదని నానిశ్చయము. వారు సమక్షమున కృతజ్ఞతావచనములగూడ స్వీకరించని నిర్మలహృదయులు. ఇక వారితో ప్రత్యేకముమాట చెప్పనేల? వారికి నాకృతజ్ఞత నెంతగా నెట్లు తెలుపదగునో సరిగా దెలియనినన్ను మన్నింప వేడుచు, వారికి హృదయపూర్వకవందనసహస్రముల నర్పించుచున్నాను. ఈ గ్రంథమున మొదటి 40 పుటలు ముద్రణమగునంతవఱకు శ్రీశాస్త్రిగారు గ్రామాంతరమేగియుంటచే వారు చూడనందున పెక్కుదోసగులుండవచ్చును; గాన పాఠకులు మన్నింప బ్రార్థితులు.

కొన్నిసంవత్సరములక్రిందటనే ప్రకటింపబడిన ప్రథమాధ్యాయ ప్రథమపాదము, ద్వితీయాధ్యాయ ప్రథమపాదము గలగ్రంథముల నధ్యాత్మవిద్యయందభిరుచి గలపెద్దల కెందఱకో సమర్పించియుంటిని. ప్రస్తుతమున్న కాగితపుకఱవువలన ద్వితీయాధ్యాయ ద్వితీయపాదము కొలదిప్రతులు మాత్రమే ముద్రింపించగల్గితిని. ఇట్టిగ్రంథములు చదువువారు నానాటికి తరిగిపోవుచుండుట శోచనీయము. అయినను వేదాంతార్థాభిరుచి గలకొందఱకే నుపయోగించు ననునుద్దేశముతోడనే యీగ్రంథములు ప్రచురింపబడినవి. సహృదయులు వీనిని స్వీకరించి పఠించెదరుగాక.

గ్రంథభాగమును గ్రంథకర్తగారు వ్రాసినతరువాత పునఃపరిశీలనమున కెట్టియవకాశము కలిగియుండలేదనవచ్చును. కానవీగ్రంథభాగము యథాతథముగ

ముద్రింపించుటయైనది. అభిమానులగు కొలదిమందికైన నీగ్రంథ ముపయోగించిన రచయితయు నేనును ధన్యులము.

బాల్యమునుండి మాసుఖజీవనయాత్రకు కారకులై, నేటికిని ప్రత్యక్షముగా గాకున్నను పరోక్షముగనే వారికరుణాపూరితదృక్కుల మాయెడ ప్రసరింపజేయుచు మమ్మనుగ్రహించుచుండు నస్మత్పితృపూజ్యచరణులు (గ్రంథకర్త) శ్రీసూర్యనారాయణరావుగారును, అత్యంతాదరముతో నియమబద్ధముగా నన్ను పెంచిన మామాతృదేవి శ్రీమతి ఆదిలక్ష్మమ్మగారును నాకు నిత్యము ప్రాతస్స్మరణీయులు. మాతండ్రిగారు వ్రాసిన యీచిన్నిపద్యము వారిధ్యేయమైయుండుటచే మాకు నిత్యపఠనీయమై మా కాలంబన మగుచున్నది.

కం॥ గురుఁ డొకశంకరుఁ డేసుమి; । ధర హనుమంతుండె యిష్టదైవము సుమ్మీ;
పరమాత్మను నేనే యని । కర మెఱుఁగుటె నాకు ముక్తి కైవల్య మగున్.

ఈగ్రంథము త్వరితగతి నచ్చొత్తించి ప్రకటించుటకు నన్ను ప్రోత్సహించిన మాసన్నిహితులు, శ్రేయోభిలాషులు కీ॥ శే॥ పాటిబండ కృష్ణయ్యగారికిని, ముద్రింపించి యందజేయగనే గ్రంథవిషయములను జదివించుకొని విని, పరామర్శించి, యానందించిన శ్రీశ్రీశ్రీ అనంతానందసరస్వతీస్వామిపాదుల (పూర్వాశ్రమమున శ్రీ నందిగామ రామరాజుగారు) వారికిని నాకృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

గ్రంథముల సమర్పించుచు సావకాశముగ బరిశీలించి తమయభిరుచి ననుగ్రహింపుడని నివేదించిన నామనవిని జిత్తగించి నిష్పాక్షికముగ దమపీఠిక ననుగ్రహించిన 'వేదాంతపారీణ – కవిశేఖర – కవితామహేశ్వర....' ప్రభృతి బహుబిరుదవిరాజమానులగు శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారికిని దమయమూల్యాభిప్రాయముల దయచేసిన పండితప్రవరులు, వేదాంతవిద్యాపారీణులు నగు బ్ర॥ శ్రీ మున్నంగి పున్నయ్యపంతులుగారికిని, కీ॥ శే॥ 'ఆర్షవిద్యాభూషణ' శ్రీ జటావల్లభుల పురుషోత్తము, ఎం.ఏ. గారికిని వినయపూర్వకముగ నాయనేకాభివందనముల సమర్పించుచున్నాను.

హనుమత్ప్రసాదము
అరండల్ పేట, గుంటూరు.
1_2_75

ఇట్లు విన్నవించు బుధజనవిధేయుడు,
పాటిబండ ప్రసాదరావు,
ప్రకాశకుడు.

# పీఠిక

ఆర్యమహాశయులారా! స్వాగతము.

బాదరాయణబ్రహ్మసూత్రములకు శ్రీశంకరభగవత్పాదులు వ్రాసిన భాష్యమున ద్వితీయాధ్యాయ ద్వితీయపాదమున కీగ్రంథ మాంధ్రీకరణము. దీనిని పాటిబండ సూర్యనారాయణామాత్యులు వ్రాసిరి. పాటిబండవా రార్వేలనియోగి బ్రాహ్మణులు, భారద్వాజసగోత్రులు. గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలోని పాటిబండ వీరిస్వగ్రామము. ఆగ్రామాధికారులును పాటిబండవారే. పాటిబండవారు పండితులు పాటిబండ గురుమూర్తి గద్వాలసంస్థానమున వార్షికసత్కార మందిన పండితకవి ఈయన 28 వర్ణనలతో ఋష్యశృంగోపాఖ్యాన మనుబృహద్గ్రంథమును రచించెను. వీరియన్నగారు పురుషోత్తముకవి పిల్లలు పుట్టిపోవుచుంటచే దల్లిదండ్రులు వీరిని పిచ్చయ్య అనెడివారట. ఆపేరే యంతట వ్యాపించినది. వీరు 1809 జనించి 23-7-1882 గతించిరి. ఈపిచ్చయ్యగారు చిత్రకేతూపాఖ్యానమును, శివరాత్రిమాహాత్మ్యమునేగాక అచ్చతెనుగులో కంసవిజయమును వ్రాసిరి. కంసవిజయము నా పీఠికతో 1929 అచ్చుపడినది. వీరికడ నెందఱో శిష్యులుండెడివారట! తురగా వెంకమరాజమన్నగువారు వీరిశిష్యులే. మనకవిగారితండ్రిగారు వేంకటప్పయామాత్యులును వీరిశిష్యులే. వేంకటప్పయ్యగారు 1840 జనించి 1890 గతించిరి. వీరువ్రాసినశివస్తవరాజమును, హరిశ్చంద్రోపాఖ్యానమును వారిద్వితీయపౌత్రులు శ్రీ వేంకటరమణయ్య(అడ్వకేటు)గారు ప్రభులింగలీలను వారియనుజుడగు శ్రీ వేంకటప్పయ్యగారు (అడ్వకేటు) నచ్చువేయించిరి. ప్రభులింగలీలలో వేంకటప్పయ్యకవిగారు తమకవితాపాండితీవైభవముల నెల్లజూపిరి. ఈవేంకటప్పయ్యకవిగారితృతీయపుత్రుడు మన సూర్యనారాయణామాత్యులు. తల్లి వేంకటసుబ్బమ్మగారు. జననము 1879 వత్సరము. వీరు తమపినతండ్రిగా రగు వేంకటరమణయ్యగారు విజయవాడలో బ్రముఖన్యాయవాదులై యుండ వారికడ నుండి చదువుకొని, 1904లో న్యాయవాదిపట్టపరీక్షలో గృతార్థులై గుంటూరులో న్యాయవాదిప్రముఖులుగా బ్రసిద్ధికెక్కిరి. వీరు గుంటూరు అరండల్ పేటలో 1918 స్వగృహము నేర్పఱచుకొనిరి. ఆగృహమున కెదురుగా నీశాన్యభాగమున నూతనపద్ధతిని హనుమద్దేవాలయమును స్వీయధనముతో 1920 లో గట్టించి దానికి ధర్మాచల మని పేరిడిరి. అందు బ్రసన్నత్వము ప్రసన్నత్వము, వీరత్వము మూడు నుండునట్లుగా ధర్మాచలమందలిస్వామి

శ్రీ మూర్తి హనుమంతుఁడని యెల్ల రెంచునట్లుగా హనుమద్విగ్రహమును తయారు చేయించి, యాగుడిలోఁ దమద్రవ్యముతోఁ బ్రతిష్ఠించి దానిని దమకుటుంబారాధ్య దైవముగా నుంచుకొనిరి. స్వామికిఁ బ్రదక్షిణనమస్కారములు చేయునపుడు పఠించు కొనుటకు 36 పద్యములు వ్రాసి హనుమత్ స్తవరాజ మని పేరిడిరి. ఆపద్యములు చదువుచు స్వామిచుట్టును మువ్మారు తిరిగిన 108 నమస్కారము లగును. ఆపద్య ములలో నొక్కొక్కటియుఁ బ్రపన్నత్వ, ప్రసన్నత్వ వీరత్వార్థము లిచ్చుచుండును అచిఱుపొత్తము అవధానిశిరోమణి మధ్వ శ్రీ కాశీకృష్ణాచార్యులవారి పీఠికతో 1930 లో నచ్చుపడినది. వీరు గుంటూరు పురపాలకసంఘమున 1930 మొదలు 1934 వఱకు సభ్యులుగాను, కొన్నియేండ్లు తత్సంఘోపాధ్యక్షులుగాను నుండి యెన లేని ప్రజాసేవ చేసి, యిట్టివాఁడు మఱొకఁడు లేఁ డనిపించుకొనిరి. వీరు తమధర్మ పత్ని యగు ఆదిలక్ష్మమ్మగారితోఁ గూడి 1933 లో కాశీరామేశ్వరాది పుణ్యతీర్థ క్షేత్రముల సేవించిరి. అంతతోఁ దృప్తిలేక 1938 లో బదరీయాత్రగూడ సలిపి ధన్యులైరి.

వీరు 1-1-1929 ఆరంభించి భగవద్గీత నాంధ్రీకరించి 1937లో నచ్చువేయించిరి. దానికి 150 పేజీల ఉపోద్ఘాతమును వ్రాసిరి. ఒక్కొక్కశ్లోకమున కొక్కొక్క గీతపద్యము వ్రాసిరి. శ్రీ శృంగేరివిరూపాక్ష పీఠాధిపతు లగుజగద్గురు శ్రీ కల్యాణానందభారతీమాతాచార్యులసన్నిధి 1932 జులైలో నారంభించి ప్రస్థానత్రయమునకు శాంతిచెప్పిరి. మఱియు బ్రహ్మశ్రీ మల్లాది ఆంజనేయశాస్త్రులవారిని దమ గృహమందొకభాగమం దుంచుకొని వారితో వేదాంతగోష్ఠి నెఱపిరి. అంతేగాక మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ దెందుకూరి నరసింహశాస్త్రులవారిని దమయింటికి రప్పించుకొని కొంతకాలము వారికడ భామతి పఠించిరి

ఇట్లు బ్రహ్మవిద్వరులై సూర్యనారాయణరావుగారు బాదరాయణబ్రహ్మ సూత్రములకుఁ గలశాంకరభాష్యమున కాంధ్రానువాదవిశేషాంశములవ్రాయదొడఁ గొనిరి. ప్రథమాధ్యాయ ప్రథమపాదమున కాంధ్రానువాద విశేషాంశములు వ్రాసి, ద్వితీయ తృతీయ చతుర్థపాదములు సామాన్యజనుల కంతగా నుపయోగపడవనియు, శాస్త్రార్థనిర్ణయమునకుఁ బండితులు-పండితులు వాదించుకొనుట కుపయోగించు ననియుఁ గాఁబోలు వాని నంటక ద్వితీయాధ్యాయ మెత్తుకొనిరి. సాంఖ్యాదిమతాంతరు లద్వైతమునఁ జూపినదోషముల వారించి, వారిదోషములఁ జూపి, సృష్టివిషయమున నుపనిషత్తులందుఁ బరస్పరవిరోధము లేదని వివరించుటచే ద్వితీయాధ్యాయము

నవిరోధాధ్యాయ మందురు. ద్వితీయాధ్యాయ ప్రథమపాదమున సాంఖ్య, యోగ, కాణాదు లద్వైతమునఁ జూపుదోషములు తన్నివారణములు ప్రదర్శింపఁబడినవి. ఇప్పు డీ ద్వితీయపాదమున సాంఖ్యాదిదర్శనములదోషములు చూపఁబడుచున్నవి. అట్లు పరమతదోషములఁ జూపినచో స్వమత మగునద్వైతమందు గాఢవిశ్వాసము గలుగుంగదా! ఇందు 8 అధికరణములు గలవు. అధికరణ మొక్కొక్కవిషయ ముంగూర్చి చెప్పను అం దైదవయవము లుండును. 1. విషయము (విచారింపవలసినది) 2. సంశయము (ఆవిషయముంగూర్చిన సంశయము) 3. పూర్వపక్షము (ఇతరులు చేయువ్యతిరేకవాదము) 4. సిద్ధాంతము (ఇతరులు చెప్పినదానికి సమాధానము) 5. సంగతి (నిర్ణయము=తేలినఫలము) అధికరణ మొకకోర్టు. అందు వ్యాజ్యెము - విచారాంశములు - వాదము - ప్రతివాదము - కోర్టుతీర్పు ఉండును.

ఈ 2వ పాదమున మొదటిది రచనానుపపత్త్యధికరణము. 1 మొదలుకొని 10 సూత్రము లున్నవి. ఇందు సత్కార్యవాదు లగుసాంఖ్యులప్రధానము జగత్కారణము కానేరదని నిరసింపఁబడును.

2వది మహద్దీర్ఘాధికరణము. ఇది 11వ సూత్రము. ఇం దసత్కార్యవాదు లగువైశేషికుల పరమాణువుకూడ జగత్కారణము కానేరదని నిరసింపఁబడును.

3వది పరమాణుజగదకారణత్వాధికరణము. ఇది 12 మొదలు 17 సూ॥ ఇందు కాణాదులు చెప్పెడిచేతనాధిష్ఠితము లగు పరమాణువులును జగత్కారణములు కానేరవని నిరసింపఁబడు.

4వది సముదాయాధికరణము. ఇట 18 మొదలు 27 సూ॥ ఇందు బౌద్ధులలోని బాహ్యార్థప్రత్యక్షత్వవాదము చేయువైభాషికమతమును, బాహ్యార్థానుమేయత్వవాదము చేయుసౌత్రాంతికమతమును నిరసింపఁబడు.

5వది అభావాధికరణము. ఇట 28 మొదలు 32 సూ॥ ఇందు బాహ్యపదార్థములే లేవనియు, నున్నట్లు కన్పించునవి విజ్ఞానాకారములేకాని యన్యములు కావనియు వాదించుయోగాచారమతమును, సర్వశూన్యవాదము చేయుమాధ్యమికమతమును నిరసింపఁబడు.

6వది నైకస్మిన్నధికరణము. ఇట 33 మొ॥ 36 సూ॥ ఇందు జీవుఁడు దేహమంతపరిమాణము గలవాఁడని వాదించుజైనమతము నిరసింపఁబడు.

7వది పత్యురసామంజస్యాధికరణము. ఇట 37 మొ॥ 41 సూ॥ ఇందుపాదానము నిమిత్తము రెండు నొకపదార్థమునం దుండవనియు, పశుపతి యగునీశ్వరుఁడు జగత్తునకు నిమిత్తకారణమే యనియు, పశుపాశవిమోక్షార్థమై కార్య, కారణ యోగ, విధి, దుఃఖాంతములని పదార్థము లైదువిధములుగా నుండునని పంచపదార్థవాదము చేయుమాహేశ్వరమతము నిరసింపఁబడు.

8వది ఉత్పత్త్యసంభవాధికరణము. ఇట 42 మొ॥ 45 సూ॥ ఇందు వాసుదేవవ్యూహము, సంకర్షణవ్యూహము, ప్రద్యుమ్నవ్యూహము, అనిరుద్ధవ్యూహము అను చతుర్వ్యూహవాదము చేయు భాగవతమతము నిరసింపఁబడును.

## రచనా పద్ధతి

నాయెఱింగినవి 9 అనువాదాలు గలవు కాని వానికంటె నిం దొకవిశిష్టత కలదు. వీ రిందు గ్రంథబాహుళ్య మగునని గాని పునరుక్తు లగునని కాని యించుకంతయు జంక లేదు. చదువరికి విస్పష్టముగాఁ దెలియుటయే వీరికిఁ గావలసినది. 3వ పేజీలో "యద్యపీదం" అనుదానిం జూడుఁడు. సూత్రారంభమునఁ బూర్వసూత్రవిషయము నందించిరి సూత్రమున కవతారిక వ్రాసిరి. అట్లే అధికరణములకును పూర్వాపరవిషయముల వివరించిరి ప్రతిసూత్రమునకు ప॥ వి॥ అని పదవిభాగము, అన్వ॥ క్ర॥ అని అన్వయక్రమము, ప్ర॥ ప॥ అ॥ అని ప్రతిపదార్థమును వ్రాసిరి. ఒక్కొకచో దం॥ అ॥ అని దండాన్వయమును వ్రాసిరి సూత్రార్థమని తాత్పర్యము వ్రాసి యూరకుండక, సూత్రభావమని తద్భావమునుగూడ వెల్లడించిరి. సూత్రమందు తు- చ- ఉన్నచో వానిని బ్రత్యేకముగా వ్రాసి వానిభావములఁ దెల్పిరి. పిదప శంకరభాష్యమును ప్రతివాక్యము వేర్వేఱుగా వ్రాసి వానిప్రతిపదార్థతాత్పర్యములు వ్రాసిరి. భాష్యపదములను కుండలీకరించిరి. అర్థసూచకములకీ ( =) చిహ్నము లుంచిరి ఏవిషయమున కావిషయము వేర్వేఱుగాఁ దెలియుటకుఁ దదంశముల కెల్ల సంకెలిచ్చిరి. శ్రుతివాక్యముల కాయుపనిషత్తుల నవి యున్నతావులఁ దెల్పిరి. సర్వే వ్యాఖ్యాతాః- అనియున్న నాసర్వ మేవో వివరించిరి. ఏవం—తథా—తత్ర-తత్— ఇత్యాదులు వచ్చినపుడు వానిని స్పష్టముగా వ్రాసిరి. 'అనవస్థితేః' (13సూ) అనవస్థాదోష ముంటవలన నని వ్రాసి యూరకున్నఁ జదువరి కేమి తెలియును! ఆయనవస్థ యెట్లో వివరించిరి. 'అన్వయాద్యనుపపత్తేః' (1. పేజీ) అని

యుండ 'ఆది' శబ్దముచే వ్యతిరేకముంగూడఁ దెచ్చి, అన్వయవ్యతిరేకములు తద్భేదములుంగూడఁదెలియునట్లు సోదాహరణముగా వ్రాసిరి. కొన్నితావుల తమ ఆంధ్రభగవద్గీతపద్యముల నుదాహరించిరి. కొన్నితావుల నింగ్లీషునుగూడఁ దద్భాషావేత్తలెఱుఁగుటకు వ్రాసిరి. వైశేషికాదిమతములవాదము వచ్చినపు డాయాశాస్త్రపంక్తులఁగూడ వ్రాసిరి. ఒక్కొకచోఁ బూర్వపక్షు లెవరోగూడ వ్రాసిరి. మక్కికి మక్కి వ్రాసిన నితరగ్రంథములవంటిదే యిదియు నగుంగాని దీనివిశిష్టత యేమున్నది? కిం బహునా? వీరియీపుస్తకముం జదువుకొన్న సంస్కృతము రానివారికిని జక్కగా సంస్కృతభాష వచ్చును. పరులతోడు లేకుండ బ్రహ్మవిద్యయుఁ జక్కగా నవగతమగును.

## తుది

మన అమాత్యుల గ్రంథము పెద్దది. పెట్టుకొన్నరచనాప్రణాళిక దుష్కరమైనది. శరీరము క్షణభంగురము. త్వరగాఁ బూర్తి చేయవలయునని తలంచి తమలౌకికవృత్తుల నెల్ల మానుకొని రెండుసంవత్సరము లీరచనాకార్యమందే నిమగ్నులై యుండి పరశాస్త్రీయగ్రంథములఁ జూచుకొనుచు వలసినసామగ్రిని సేకరించుకొనుచు సాయంకాలము షికారునుగూడ మానుకొని రేయి 10 గంటలవఱకు నీపనియందే యుండెడివారు తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును. 27-3-1941 తేది రాత్రి 10 గంటలకు 7వ అధికరణముం బూర్తి చేసి, కల మవ్వల నుంచి శయనించి "రేపు 8వ అధికరణము మొదలుపెట్టుదము; అందు 4 సూత్రములేకదా ; త్వరగా వ్రాసి మూఁడవపాదము మొదలుపెట్టవచ్చును; ఈయధికరణమున భాగవతమతము కలదు; భగవంతుఁడు నాల్గురూపములై నాఁడా!" అని యావాసుదేవుంగూర్చి తలపోయుచుండ నెప్పుడో కనులు మూఁతపడె. అంతే మరలఁ గన్ను తెఱవలేదు. ఏవికారము లేదు. ఏయాయాసము లేదు. "తస్య ప్రాణా నోత్క్రామంతి- అత్ర బ్రహ్మ సమశ్నుతే." ఆహాహా! ఏమి యీసంఘటనము! అయితే "అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనమ్" పుణ్యవంతులకా? జ్ఞానవంతులకా!

కీ॥ శే॥ సూర్యనారాయణామాత్యుల పుత్త్రరత్నము, శ్రీ కాశీవిశ్వేశ్వరప్రసాదరావు (అడ్వొకేటు) గారు తమతండ్రిగారు వ్రాసినయీగ్రంథములో ప్రథమాధ్యాయ ప్రథమపాదమును 1962 లోను, ద్వితీయాధ్యాయ ప్రథమపాదమును 1963 లోను, ద్వితీయపాదము నీ 1975 లోను ముద్రించి పండితుల కంపుచుఁ

దమయ పారపిత్రృభక్తిని వెల్లడించుకొనిరి. ఈరోజులలో రచనముకంటె ముద్రణమే అన్నివిధముల కష్టకార్యము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12 | 5 | హేతుసాధనముల | హేతుసాధ్యముల |
| 20 | 2 | చూడఁబర | చూడఁబడి |
| 55 | 20 | దస్యార్థినో | ద్యస్యార్థినో |
| | | సత్యార్థో | స తస్యార్థో |
| 81 | 23 | శ్రవణాత్ | దర్శనాత్ |
| 95 | 8 | యసమాయి | యసమవాయి |
| 123 | 11 | కారణద్రవ్యాణి కారణ | కారణద్రవ్యాణి కార్య |
| 127 | 2 | కారణమందు | కార్యమందు |
| 131 | 24 | వారించుటకు | వాదించుటకు |
| 137 | 13 | రేగికాయ | రేఁగుకాయ |
| 200 | 11 | ప్రమేయము | ప్రమితి |
| 228 | 27 | నిత్య | అనిత్య |

ఇచట రచయితవిగాఁ దోఁచుదోషములమాత్రమే కంటఁబడినవాని నిచ్చితి.

నాపీఠికను క్లుప్తముగా వ్రాయుఁడని అవకాశ మిచ్చిన శ్రీప్రసాదరావు గారి నీశ్వరుఁ డనుగ్రహించుఁగాక !

బ్రాడీపేట, గుంటూరు
21–2–197౫

బుధవిధేయుఁడు,
మిన్నికంటి గురునాథశర్మ

పరస్మై బ్రహ్మణే నమః

మున్నంగి పున్నయ్య పంతులు
వేదాంతజిజ్ఞాసువు

బ్రాడీపేట, గుంటూరు.
తేది:— 5-2-75

# అభినందనము

ఈగ్రంథము 'బ్రహ్మసూత్ర' మనెడి వేదాంతశాస్త్రముయొక్క ద్వితీయాధ్యాయ ద్వితీయపాదమై యున్నది, ఇది శ్రీశాంకరభాష్యానుసారి యగునాంధ్రీకరణము. దీనిని రచించినవారు కీ॥ శే॥ శ్రీపాటిబండ సూర్యనారాయణామాత్యులుగారు. వ్యవహారమున వీరిని ప్రసిద్ధముగా శ్రీసూర్యనారాయణరావు పంతులుగా రను చుండిరట. వీరితో నేను స్వయంపరిచితుడను గాను. వీరివిజ్ఞానశీలాదియోగ్యతల దదీయాంధ్రీకృత ప్రథమాధ్యాయ ప్రథమపాద గ్రంథమునందలి మున్నుడులందు గమనించితిని.

వీరు న్యాయవాదివృత్తి నవలంబించినలౌకికు లయ్యును, జక్కని వైదిక ధర్మాభిరుచి గలవారై సంస్కృతసాహిత్యమును గడించిరనియు, బిమ్మట శాస్త్రాభిరుచిగూడ నేర్పడ, అద్వైతవేదాంతశాస్త్రమును గురుముఖముగా నభ్యసించి, బ్రహ్మసూత్రశాంకరభాష్య విజ్ఞానమును సంపాదించిరనియు దెలిసికొని యాశ్చర్యమందితిని. వీరియాంధ్రీకరణమున గనబడెడి నిర్దుష్టమైనసంప్రదాయవిజ్ఞానము వీరిప్రజ్ఞాపాటవమును వ్యక్తము చేయుచున్నది.

వీరియాంధ్రీకరణశైలి దివ్యముగా నున్నది. సూత్రములకుగూడ ప్రతిపదటీకను, భావమును వ్రాసిరి. ఆయాభాష్యపరిచ్ఛేదములకు యథావస్థితముగా సమష్టిదృష్టితో దెలుగుభావమును వ్రాయుచు, నవసరమగుచోట్ల భాష్యగతప్రత్యేకపదములకు, పదసముదాయములకు, వాక్యములకుగూడ జక్కని తెనుగు వ్రాసి భాష్యమున గల "తు, చ" లనుగూడ విడువకుండ వానిస్వారస్యము ననువదించిరి.

శ్రీసూర్యనారాయణామాత్యులు గొప్పధార్మికులు. అకించనులకు వీ రన్నవస్త్రాదికము నిచ్చుటేగాక, బ్రహ్మవిద్యాజిజ్ఞాస గలిగి, సంస్కృతము తెలియనియాంధ్రసోదరులయెడ నదభ్రసౌహార్దముతో నిట్టియాంధ్రీకృత వేదాంతభాష్యమును విజ్ఞానదీనులకు బ్రసాదించిరి.

శ్రీసూర్యనారాయణామాత్యులు గావించియుండిన యీలోకకల్యాణకృషి, వారిసుపుత్రులైన శ్రీప్రసాదరావుపంతులుగారు, పితృపాదులయెడ గలభక్తిప్రపత్తులతో నీగ్రంథముద్రాపణమును నిర్వహించిరిగాన సఫలమైనది; లేనిచో నమాత్యులయొక్క యీపవిత్రానువాదగ్రంథ మవ్యక్తముగా నేమూలనో పడియుండుటో, లేక చెదపురుగుల కాహారమై నశించియుండుటో జరిగెడిది. అట్టిదుర్దశ నీపుత్రరత్నము నివారించియుండు టెంతయో సుకృతమైనది. ఈపట్ల ఛాందోగ్యోపనిషత్తునందలి సంప్రత్తివిద్యాసూక్తి నాస్మృతికి వచ్చుచున్నది. ఏదనగా తండ్రి తన మరణకాలమున గుమారుని దగ్గఱకు బిలుచుకొని, యీమంత్రమును జెప్పునట :— 'త్వం బ్రహ్మ ! త్వం యజ్ఞః । త్వం లోకః' అని. దీనిభావ మేమనగా— 'నాయనా! నేను నాజీవితకాలమున దలపెట్టిన యధ్యయనవ్యాపారము, యజ్ఞానుష్ఠానము, ఊర్ధ్వలోకగమనము— అనునీమూడుపనులు చక్కగా నెఱవేరునట్లు నీవు శాస్త్రోక్త విధిని యత్నముచేయుము— అని. ఇందు శ్రీప్రసాదరావుగారు నెఱవేర్చినది తండ్రిగారి యధ్యయనవ్యాపారపరిపూరణ మనెడి సుకృతముక్రిందికి వచ్చును. ఇట్టిసుకృతమునకు భగవానుడు వీరి కభీష్టసిద్ధిని బ్రసాదించునుగాక!

ఈయాంధ్రీకృత భాష్యసంపుటముల మూడింటిని జిజ్ఞాసువులు శ్రద్ధతో పఠింతురేని, వారికి బ్రహ్మవస్తువుయొక్క స్వరూపస్వభావములు తృప్తికరముగనే గోచరింపగలవు. ఈస్వరూపమును నిదిధ్యాసముతో జక్కగ సాక్షాత్కరించుకొనగలరు గూడ. తీవ్రమైనముముక్షు గలజిజ్ఞాసువులకే యిట్టిఫలప్రాప్తి కాగలుగును; గాని సామాన్యజిజ్ఞాసువులకు గాజాలదు.

పాఠకుల గ్రహణసౌలభ్యమునకై యీయాంధ్రీకృతపాదత్రయ గ్రంథ సారాంశము నొకింత దిగువ బొందుపఱచెదను.

బ్రహ్మసూత్రప్రథమాధ్యాయమునకు 'సమన్వయాధ్యాయ' మనియు, ద్వితీయాధ్యాయమునకు 'అవిరోధాధ్యాయము' లేక 'విరోధపరిహారాధ్యాయము' అనియు బేళ్ళు. మొదటిదానియందు దుపనిషత్తులన్నియు బ్రహ్మవస్తువే జగత్కారణము గాని జడప్రకృతి, జీవుడు ఆకాశము, ప్రాణము మొదలగు తత్త్వము లేవియు జగత్కారణము కానేరవని ప్రతిపాదించునని నిరూపింపఁబడినది .... ....

ఇక ద్వితీయాధ్యాయమున అద్వైతబ్రహ్మవాదమునకు బూర్వపక్షవాదము లేవి గలవో, వానివలన బ్రహ్మసమన్వయమునకు నేమాత్రము బాధ లేదుసుమా

యనెడిపరిహారము నిరూపింపబడినది. అద్వైతబ్రహ్మవాదము నంగీకరింపనిపూర్వపక్షులెవరనగా, సాంఖ్యులనెడికపిలాచార్యమతస్థులు, గౌతమకణాద... ఋషుల సాంప్రదాయికులగుతర్కమతస్థులు, బౌద్ధులు, జైనులు, పాశుపతశైవులు, పాంచరాత్రవైష్ణవులు– అనువారలు. "యావత్ పరమతం న నిరాక్రియతే తావత్ స్వమతమప్రతిష్ఠితం భవతి" అను న్యాయము ననుసరించి, యనగా బరమతనిరాకరణము చేయునిచో స్వమతమునకు స్థిరత చేకూరదనెడిన్యాయానుసారము బ్రహ్మవాదియైనవేదవ్యాసమహర్షి యీమతములను ఖండించినాడు. మఱియు 'స్వపక్షసాధనపరపక్షోపాలంభాభ్యాం వస్తునిర్ణయః', అనగా బరమతనిరాకరణము చేయువాడు ముందుగా దనపక్షమును సమర్థించుకొని, పిమ్మట బరపక్షమును ఖండింపవలెను' అనెడిన్యాయము ననుసరించి, వేదవ్యాసు డీద్వితీయాధ్యాయ ప్రథమపాదమున స్వపక్షమైనయద్వైతబ్రహ్మవాదముపై బూర్వోక్తసాంఖ్యాదిమతస్థుల పూర్వపక్షము లేవియు దాకనేరవని సమర్థించుకొని, 2వ పాదమున నీశత్రువుల నందఱిని ఖండించినాడు. ఇట్లు ద్వితీయాధ్యాయము 1, 2 పాదములయందు నిరూపింపబడినది.

... ... ...

బ్రహ్మసూత్రగ్రంథమున మొత్తముమీద నిర్గుణబ్రహ్మవిచారమే ముఖ్యముగాను, సగుణబ్రహ్మవిచారము ప్రాస్తావికముగాను సాగినదనియు, నుపనిషత్తుల యొక్క ధోరణి యిట్టిదే యనియును శ్రీశాంకరభాష్యపరిష్కారమై యున్నది.

లభ్యమైనంతవఱకును. శ్రీమదమాత్యులుగారి యాంధ్రీకృత సంపుటముల మూఁడింటిని జదువుకొని, జిజ్ఞాసువులితోఽధికమును యాచించి సంపాదించి, పఠించి, మననిదిధ్యాసములు గావించి, బ్రహ్మానుభూతిని బడసి ధన్యులగుదురుగాక యని జిజ్ఞాసువులకు మనవిచేయుచున్నాను.

ఓం తత్ సత్

"ఆర్షవిద్యాభూషణ"
జటావల్లభుల పురుషోత్తము, ఎం.ఏ.
ప్రిన్సిపల్, సంస్కృత కళాశాల

కొవ్వూరు, పశ్చిమ గోదావరిజిల్లా.
తేది: 24-4-63

అయ్యా,

బ్రహ్మసూత్రప్రథమాధ్యాయ ప్రథమపాదముపై మీపితృపాదులు రచించినప్రజ్ఞాపాండిత్యవిలసితవివరణమును జూచిన వెంటనే నాయానందమును వెలిబుచ్చుచు వ్రాసియుంటిని. ఆపిమ్మట జదివిన కొలదియు నాగ్రంథమువల్ల నాకు గౌరవము పెరుగుచున్నది. వేదాంతమందభిరుచిని గల్గించుటకును సంశయములను విడదీయుటకును సమర్థమై ముముక్షుజనోపకారకమైన యీగ్రంథమునకు విజ్ఞానవిరతులెల్లరు హార్దికస్వాగతము లీయగలరు గ్రంథ ప్రకటనమునకు గారణభూతులయినతమకు నాయభినందనములు.

  



శ్రీమద్బాదరాయణప్రణీత

# బ్రహ్మసూత్రములు

## శ్రీ శాంకరశారీరకభాష్య-తదాంధ్రానువాద-విశేషాంశసమేతములు

సమన్వయాఖ్య ద్వితీయాధ్యాయము-ద్వితీయపాదము

### రచనానుపపత్త్యధికరణము

2. ద్వితీయపాదావతారిక :—

పూర్వగ్రంథము చేత మోక్షమును బడయఁగోరు వారికి సమ్యక్ జ్ఞాన (బ్రహ్మాత్మైక్యజ్ఞానము) ముదయించు కొఱకు వేదాంత వాక్యములలో నొకదానితో మరియొకటికి విరోధము లేదని చూపించుటమూలమున సమన్వయము చేయబడినది. అట్లు సమన్వయము చేయుటలో వేదాంత సిద్ధాంతముపైఁ బరమతస్థులచే నారోపింపఁబడు దోషములను ఖండించుట మూలముగా బూర్వపాదమందు వేదాంత మతము స్థాపింపఁబడినది. ఇక నీ రెండవ పాదమునందు ఆమోక్షమును గోరువారికి నద్వైతశాస్త్రము నందు నిస్సంశయ విశ్వాసనిరూఢి యేర్పడుటకై పరమదూషణ మారంభింపఁ బడఁబోవుచున్న యది- పరమత దూషణ మేల యనరాదు! పరమత నిరాసమునఁగాని స్వమతమందు గట్టిపూన్కి నిలువ నేరదని గ్రహించునది.

(1) అధికరణావతారిక :—

పరమతములలో సాంఖ్యమతము ముఖ్యమైన యది - ఏలయన నామతమును స్థాపించిన కపిలుఁడు సర్వజ్ఞుఁడను బిరుదమును జేకొన్నవాడు. అతఁడు వేదప్రమాణ

మంగీకరించి తన సిద్ధాంత పోషణమునకై కొంతవరకు వేదముమీదఁగూడ నాధార పడియున్నాడు మఱియుఁ దక్కు మతములకన్న నీ సాంఖ్య మత మెక్కువ యుక్తి యుక్తముగఁ గన్పట్టును. అంతియకాక నీ మతము కొందరు శిష్యులచేత సైతము పరిగ్రహింపఁ బడియున్నది. అట్లయిననేని, వేదాంత మతమునకు విరోధమగు నీ మతము మొదలు నిరాకరింపఁబడవలసి యున్నది. కావున నీ మొదటి యధికరణ మందే యీ సాంఖ్య మతము ఖండింపఁబడఁ బోవుచున్నది. లోగడ నీక్షత్యధి కరణాదులయందు (బ్ర. సూ. I 1.5; I- 1.18, I- 4 28 సూ.) నీ సాంఖ్య మతము భేదింపఁ బడియుండెనే, మఱల నిప్పుడేల యని యందురేమో ? అప్పుడు వారి మత స్థాపమునకై వారాధారపడియున్న వేదవాక్యములకు వారు గల్పించిన యర్థము లపార్థములనియు, సాంఖ్య మతము వేదబాహ్య (అవైదిక) మనియు నిరూపింపఁబడి యుండెను- ఇప్పుడన్ననో యితర వేదబాహ్య మతములతో పాటు నిదియు యుక్తి యుక్తముగూడఁ గాదని చూపుటకు బూని వానిలోఁ బ్రదానమైన యీ సాంఖ్య మతముయొక్క ఖండన మారంభింపఁ బడుచున్నది.

**1** సూత్రావతారిక ;- ఇందు నిరీశ్వరసాంఖ్య మతము ఖండింపఁ బడుచున్నది.

## ౧ సూ॥ రచనానుపపత్తేశ్చనానుమానం

ప. వి:- రచనానుప పత్తేః-చ-న-అనుమానం

అన్వ. క్ర:- రచ - ప త్తేః చ అనుమానం-న

ప్ర. ప. అ:- రచ-పత్తేః; రచన=వివిధ రూప ప్రపంచ నిర్మాణము అనుప పత్తేః=ఉపపత్తి లేకపోవుటవలన అసంభవమైనందువలన చ=కూడ; అనుమానం= సాంఖ్యులచే జగత్కారణమని యనుమానింపఁబడు (=ఊహింపబడు) ప్రధానము; న= (జగత్కారణము) కాదు.

సూత్రార్థము :- (అచేతనమైయుండి)వివిధజగద్రచనముచేయఁగల్గుట యసంభవ మైనందునను- మఱి యితర హేతువు వలను గూడ సాంఖ్యుల ప్రధానమనెడి ననుమానము జగత్కారణముకాదు.

సూత్రభావము :-

(రచనానుపపత్తేః-చ) అచేతనమైన మృత్పిండము (= మట్టిముద్ద) స్వతంత్ర

ముగా వివిధములగు కుండ మొదలగు మట్టి పాత్రలను జేయఁగలిగి యుండుట కానఁబడ నట్లే, అచేతనమైన సాంఖ్యుల ప్రధానము సైతము చేతన సంబంధము లేకుండ నీ విచిత్ర జగత్సృష్టిని (న+అనుమానం) జేయ గలుగుట యసంభవమై నందున, అచేతనమైన ప్రధానము స్వతంత్రముగా జగత్తును బుట్టించునని యనుమానించుట యుక్తముగాదు-

(చ) సుఖదుఃఖమోహాది గుణములు లోపలుండునవి (ఆంతరములు) యని ప్రతీతి (=ప్రసిద్ధి తెలియఁబడుట) యుండుటచేత బాహ్యమందుండు భూత భౌతిక పదార్థములతో వానిని సమన్వయము చేయుట యసంభవ మగుటవలనను గూడ సాంఖ్యుల ప్రధానము జగత్కారణముగా నేరదు- అను భావము సూత్రములోని (చ-కూడ) అను శబ్దము వలన స్ఫురించుచున్నది.

భాష్యము — భాష్యార్థము

యద్యపీదం వేదాంతవాక్యానామైదం పర్యం నిరూపయితుం శాస్త్రం ప్రవృత్తం, నతర్కశాస్త్రవత్ కేవలాభిర్యుక్తిభిః కంచిత్సిద్ధాంతం సాధయితుం దూషయితుం వా ప్రవృత్తం. తథాపి వేదాంతవాక్యాని వ్యాచక్షాణైః సమ్యగ్దర్శన ప్రతిపక్షభూతాని సాంఖ్యాదిదర్శనాని నిరాకరణీయాని.

(ఇదంశాస్త్రం=) ఈ వేదాంతశాస్త్రము (శారీరకమీమాంసాశాస్త్రము = బ్రహ్మసూత్రములు) (వేదాంతవాక్యానాం=) వేదాంత (=ఉపనిషత్) వాక్యముల యొక్క (ఐదంపర్యం=ఇదంపరత్వమును=దీనియందే గల తాత్పర్యమును)= సరియైన భావమును (నిరూపయితుం=) నిరూపించుటకే (యద్యపి ప్రవృత్తం=) పూనుకొన్నదైనను, (తర్కశాస్త్రవత్=) తర్కశాస్త్రమువలె (కేవలాభిఃయుక్తిభిః=) కేవలమగు యుక్తులచేత (కంచిత్సిద్ధాంతం=) నేదియో యొక సిద్ధాంతమును (సాధయితుం దూషయితుం వా=) స్థాపించుటకుఁగాని ఖండించుటకుఁగాని (యద్యపినప్రవృత్తం) పూనుకొన్నది గానప్పటికిని,

(వేదాంతవాక్యాని=) వేదాంత వాక్యములను (వ్యాచక్షాణైః=) సమగ్రముగాఁ జదివిన వారి చేత (సమ్యగ్దర్శన భూతాని=) సమ్యక్ జ్ఞానమునకు (=బ్రహ్మాత్మజ్ఞానమునకు) విరోధములుగా నుండు (సాంఖ్యాదిదర్శనాని=) సాంఖ్యాది మతసిద్ధాంతములు (నిరాకరణీయాని=) నిరాకరింపఁబడుట (త్రోసి వేయఁబడుట విధియైయున్నది.

తదర్థః పరః పాదః ప్రవర్తతే.

(తదర్థః) అందు నిమిత్తమై- అనఁగా సాంఖ్యాది మతనిరాకరణార్థమై, (పరః పాదః=) ఈరాఁబోవు రెండవ పాదము (ప్రవర్తతే=) ప్రవర్తించుచున్నది (=ఆరంభింపఁబడుచున్నది) (అట్లగుచో నీవిషయమింతకు మున్నే) యేల చెప్పఁబడలేదందు రేమో అట్లనరాదు ఎందుచేతననగా)

వేదాంతార్థ నిర్ణయస్యచ సమ్యగ్దర్శనార్థత్వాత్

వేదాంతార్థమిట్టిదని నిర్ణయించుట (సమ్య-ర్థత్వాత్) సమ్యక్ జ్ఞాన(=సంపూర్ణ జ్ఞానము=బ్రహ్మాత్మజ్ఞానము) మను ప్రయోజనమును బడయుటకే యేర్పడినది.

తన్నిర్ణయేన స్వపక్షస్థాపనం ప్రథమం కృతం, తద్ధ్యభ్యర్హితం పరపక్షప్రత్యాఖ్యానాదితి.

అట్టి నిర్ణయముచేత (స్వపక్షస్థాపనం=) మా వేదాంత మతస్థాపనము (ప్రథమం కృతం=) మొదటే (మొదటిపాదమందే) చేయఁబడినది. (తత్=) అట్లు మొదటే స్థాపించుకొనుట (పరపక్షప్రత్యాఖ్యానాత్=) యెదిరి మతమును నిరాకరించుటకంటె (మొదలేయట్టి ఖండనకార్యమును బూనుటకంటె) (అభ్యర్హితం=) పూజ్యమైన విషయము గదా ! (That is the foremost honourable duty)

ఎదురు ప్రశ్న :—

ననుముముక్షూణాం మోక్షసాధనత్వేన సమ్యగ్దర్శన నిరూపణాయ స్వపక్షస్థాపన మేవ కేవలంకర్తుం యుక్తం, కిం పరపక్ష నిరాకరణేన పరవిద్వేషకారణేన.

మోక్షమును బడయఁగోరువారికి సాధనముగా నుపయోగించు నిమిత్తమై సమ్యగ్దర్శన (=పుష్కల జ్ఞాన-బ్రహ్మాత్మజ్ఞాన) మన నెట్టిదో తెలుపుటకుఁ గాను, తమ వేదాంతపక్షస్థాపనము మాత్రమే చేయుట యుక్తముగాని,

అన్యమతస్థులకు (=పరులకు) మనపై విద్వేషమును బుట్టించఁగల తన్మత దూషణఖండన ములతోఁ బ్రయోజన మేమి !

జవాబు :—

సత్యమే,

బాఢమేవం తథాపి మహాజన పరిగృహీతాని మహాంతి సాంఖ్యాది తంత్రాణి సమ్యగ్దర్శనాప దేశేన ప్రవృత్తా న్యుపలభ్య, భవేత్కేషాంచిన్మందమతీనా మేతాన్యపి సమ్యగ్దర్శనా యోపాదేయా నీత్యపేక్షా.

కాని (మహాంతి=) గొప్పవిగాఁ గనుపించు నట్టియు, (సమ్యక్-ప్రవృత్తాని=) పుష్కల జ్ఞానమును గలుగఁజేయఁ గలవియను పేరుతోఁ బ్రాచుర్యమును జెంది నట్టియు, తెలియని మహాజనుల (ప్రాకృతజనుల) చేత స్వీకరింపఁబడనట్టియు సాంఖ్యాది మత సిద్ధాంతములను (ఉపలభ్య=) జూచి

వివర్శచేయఁ జూచితిని మందమతులైన కొందరకు (ఏతాన్యపి=) నివిగూడ సమ్యగ్దర్శనాయ=) సమజ్ఞానము లభించుటకు (ఉపాదేయాని=) స్వీకరింపఁదగినవే యని యపేక్ష (కోర్కె) గలుగవచ్చును.

తథా యుక్తి గాఢత్య సంభావనా నత్సర్వాజ్ఞ భాషితత్వాచ్చ శ్రద్ధాచ తేషు.

(తథా =) మరియును నాసాంఖ్యాదిసిద్ధాంతములు (యుక్తి...వనాత్ =) బలమగు యుక్తులతో నిండియుండుటవలనను (సర్వాజ్ఞ...త్వాచ్చ) వానికర్తలగు వారు సర్వజ్ఞులని వ్యవహరింపఁబడుచుండుటవలనను ఆ సిద్ధాంతములయందు శ్రద్ధయు (= విశ్వాసమును) గలుగవచ్చును.

ఇత్యత స్తదీసారలోపపాదనాయ ప్రయత్యతే.

అందుచేత నాసిద్ధాంతములయొక్క (అసారతా=) యసత్యత్వమును (ఉపపాదకాయ =) బ్రకాశించుటకై (ప్రయత్నతే=) యత్నించుట యన్యాయము గాదు.

ఎదురుప్రశ్న —

నను ఈక్షతేర్నాశబ్దం కామాచ్చ నానుమానాపేక్ష ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతా.

అట్లయిననేని లోగడనే

బ్ర॥సూ॥ I -1-5 "ఈక్షతేర్నాశబ్దం"

బ్ర॥సూ॥ I -1-18 "కామాచ్చనానుమానాపేక్షా"

బ్ర॥సూ॥ I 4-28 "ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః"

ఇతిచ పూర్వత్రాపి సాంఖ్యాధిపక్షప్రతిషేధః కృతః

అను నీ సూత్రములయందే సాంఖ్యాది మతసిద్ధాంతములు (ప్రతిషేధః కృతః =) ఖండింపబడియే యున్నవిగదా.

కిం పునః కృతకరణేనేతి ?

మఱలనివ్వాడావనినే చేయుటచేతఁ గల్గు ప్రయోజనమేమి ?

జవాబు :—

తదుచ్యతే

తగు కారణము లేకపోలేదు.

సాంఖ్యాదయః స్వపక్షస్థాపనాయ వేదాంతవాక్యాన్యప్యుదాహృత్య స్వపక్షానుగుణ్యేనైవ యోజయంతో వ్యాచక్షతే.

సాంఖ్యాదిమతస్థులు తమతమ మతములను స్థాపించుకొనుటకొఱకు వేదాంత వాక్యములను సైతముదాహరించుచు నాయా వాక్యములను దమసిద్ధాంతముల కను కూలించునట్లే (యోజయంతో వ్యాచక్షతే =) సమర్థించుచు వ్యాఖ్యానములను జేయుచున్నారు. (=అర్థములను జెప్పుచున్నారు.)

తేషాం యద్వ్యాఖ్యానం తద్వ్యాఖ్యానాభాసం, నసమ్యగ్వ్యాఖ్యానమిత్యేతావత్పూర్వత్రకృతం.

ఆయా వేదాంతవాక్యములకు వారు చేసిన వాఖ్యానము లేవిగలవో, యవి యెల్లను (వ్యాఖ్యానాభాసం=) వ్యాఖ్యానములుగాఁ గన్పించి భ్రమపెట్టునవిగాని (నసమ్యగ్వ్యాఖ్యానం=) సరియైన వ్యాఖ్యానములు గావనిమాత్రము లోగడ నా యా చోట్ల దెల్పియున్నారము.

ఇహతువాక్య నిరపేక్షః స్వతంత్రః, స్తద్యుక్తి ప్రతిషేధః క్రియత ఇత్యేష విశేషః

(ఇహతు=) ఇప్పుడన్నానో (వాక్యనిరపేక్షః=) వేదాంతవాక్యముల నెత్తు కొనకయే, (స్వతంత్రః=) స్వతంత్రముగానే (తద్యుక్తి ప్రతిషేధః క్రియతే=) కేవల యుక్తులచేతనే యాయా సిద్ధాంతములు ఖండింపఁబడుచున్నవి.

తత్రసాంఖ్యా మన్యంతే

ఆసాంఖ్యసిద్ధాంత మెట్టిదియో ముందుఁజూడుడు.

యదాఘట శరావాద యోభేదా.

కుండలు - మూకుళ్ళు మొదలగు వివిధములైన మట్టిపాత్ర లేవిగలవో యవి యెల్లను (మృదా .... మానాః=) మట్టితోఁ గూడుకొన్నవియై,

మృదాత్మతయాన్వీయమానా, మృదాత్మకసామాన్యపూర్వకాలోకే దృష్టాః

(మృదాత్మక సామాన్యపూర్వకాః=) సామాన్యముగా మట్టినుండి యేర్పడిన స్వరూపములేయని (యథాలోకేదృష్టాః=) లోకమందెట్లు కనఁగొనబడుచున్నదో,

తథా సర్వాఏవ బాహ్యాధ్యాత్మికాభేదా స్సుఖదుఃఖ మోహాత్మతయాఽన్వీయమానాః, సుఖ దుఃఖమోహాత్మక సామాన్యపూర్వకా భవితు మర్హంతి.

(తథా=) అట్లె (బాహ్యాధ్యాత్మికాభేదాః=) బాహ్యములై (=వెలుపలనుండునవియై) యాంతరములై (=లోపల నుండునవియై) యుండు సర్వవివిధ జీవనిర్జీవ పదార్థములు (సుఖ ... న్వీయమానాః=) సుఖ దుఃఖ మోహ స్వరూపములతోఁ గూడుకొన్నవియై (సుఖ ... పూర్వకాః=) సామాన్యముగా సుఖదుఃఖ మోహము ఁనుండి యేర్పడిన స్వరూపములే (భవితు మర్హంతి=( యని యెంచుట నిరాక్షేపణీయముగదా !

(అనగా సుఖదుఃఖ మోహస్వరూపమైన ప్రతిపదార్థము సుఖదుఃఖ మోహ స్వరూపమైన వస్తువునుండియె పుట్టియుండవలెను.

యత్సుఖదుఃఖ మోహాత్మకం సామాన్యం తత్త్రిగుణం ప్రధానం. మృద్వదచేతనం. చేతనస్య పురుషస్యార్థం సాధయితుం స్వభావభేదేనైవ విచిత్రేణ వికారాత్మనా వివర్తత ఇతి.

(1) సామాన్యముగా సుఖదుఃఖ మోహస్వరూపమైన వస్తువేదియో (తత్త్రి ..ధాం) యదియే సత్త్వము (=సుఖము), రజము (=దుఃఖము) తమము (=మోహము) అను మూడుగుణముల కలయికచే నేర్పడిన ప్రధాన మనఁబడును.

(2) (మృద్వదచేతనం=) ఆ ప్రధానము మట్టివలెనే యచేతన (=జడ) పదార్థము

(3) ఆయచేతన పదార్థమైన ప్రధానమే (స్వభావభేదేన + ఏవ) తనయందున్న గుణభేదములచేతనే (అనఁగా నాయా మూడుగుణములు హెచ్చుతగ్గుల భాగములతోఁ గలియుటచేతనే) (చేతనస్య ... సాధయితుం=) చేతనుడైన పురుషునకుఁ (భోగాపవర్గములనెడి) బ్రయోజనములను జేకూర్చునిమిత్తమై (విచిత్రేణ ...కరాత్మనా=) వివిధములగు వికారస్వరూపములతో అనగా వివిధవస్తువులుగాఁ వివర్తతే=) బరిణామమును (=మార్పును) జెందుచున్న యది.

తథా పరిమాణాదిభిరపిలింగై స్తదేవ ప్రధాన మను మిమీతే.

(4) ఆయా వికారవస్తువులయందుండు (అనగా లోకములోని ఘటాదిపదార్థముల కుందుండు) పరిమాణము (=మితి = measurement limitation) మొదలగు హేతువులచేతఁగూడ, నాయావస్తువులయొక్క కారణము (అనఁగా నాయావస్తువు ను బుట్టించిన మూలము) ప్రధానమే యని (అనుమిమతే=) యనుమానింపఁబడు

చున్నది (= అనఁగా నూహింపఁబడుచున్నది) (ప్రధానమనునది అనుమానము (=ఊహచేత జగత్కారణమైనట్లు నిశ్చయింపఁ బడినది. గావుననే ప్రధానము అనుమానమనియుఁ జెప్పఁబడును.)

N. B "భేదానాం పరిమాణా త్సమన్వయాచ్ఛక్తితః ప్రవృత్తేశ్చ కారణ కార్య విభాగాదవిభాగా ద్వైశ్వరూప్యస్య కారణమ స్త్వవ్యక్తం"

వేరుగానుండు కారణపదార్థములోనుండి పుట్టినవస్తువులేయని నిర్ణయించుటకు సాంఖ్యమతస్థులు (1) పరిమాణము (2) సమన్వయము (3) శక్తియని మూడు హేతువులను జెప్పుచున్నారు. లోకములో ఘటాది పదార్థములుగాని, ఇంద్రియములుగాని పంచభూతములుగాని కొంతపరిణామమును (limitation) మాత్రమే గలిగియుండి సర్వవ్యాపకములుగావు గావున అవి మఱియొక కారణపదార్థముతో సంబంధపడియుండునని యనుమానింపఁ దగియుండుననుట వారిసిద్ధాంతము.

సిద్ధాంతిసమాధానము :—

తత్ర వదామః

(తత్ర = ) సాంఖ్య సిద్ధాంత ఖండన విషయమందిట్లు చెప్పుచున్నాము చూడుఁడు.—

యది దృష్టాంతబలేనైవైతన్నిరూప్యేత. నాచేతనంలోకే చేతనానధిష్ఠితం స్వతంత్రం కించి ద్విశిష్ఠ పురుషార్థనివర్తన సమర్థాన్ వికారాన్ విరచయద్దృష్టం.

దృష్టాంతబలములచేతనే అనఁగాకుండ మట్టియనువానిచేత)(ఏతత్ =)ప్రధానమనెడి జగత్కారణము నిశ్చయింపఁబడుచో, అనఁగా కుండ మొదలగు వస్తువులు మట్టిలోనుండి పుట్టినట్లు లోకములోని వస్తువులెల్లను బ్రధానమునుండి పుట్టినట్లుగా నిరూపింపఁబడఁగల్గుచో లోకమందుఁ జేతనములతో (అనధిష్ఠితం) నెట్టిసంబంధము లేకుండగనే (మట్టి మొదలగు) అచేతనపదార్థ మేదియును (స్వతంత్రం=) దనకుఁదానే (పురు ... మర్థాన్) పురుషులకేవియోకొన్ని ప్రయోజనములను నెరవేర్పఁ దగిన (వికారాన్ =) (కుండ మొదలగు) వికారవస్తువులను (విరచయత్ =) జేయుచున్నట్లు (నదృష్టం=) ఎక్కడను గానఁబడదుగదా !

గేహప్రాసాద శయనాసన విహారభూమ్యా దయోహిలోకే ప్రజ్ఞావద్భిః శిల్పిభిర్యథాకాలం సుఖదుఃఖ ప్రాప్తిపరిహార యోగ్యారచితాదృశ్యంతే,

(లోకే=) లోకమందు-ఇండ్లు, (ప్రాసాద=) మేడలు, (శయన=) మంచములు (ఆసన=) పీఠములు, (విహారభూమి=) విలాస విహార ప్రదేశములు (=park) ఈ మొదలగునవి (ప్రజ్ఞావద్భిః శిల్పిభిః=) నైపుణ్యమును సంపాదించిన శిల్పులచేతఁ (యథాకాలం=) గాలానుగుణముగా (సుఖ ... యోగ్యా రచితాః=) (పురుషులకు) సుఖమును గల్గించుటకు దుఃఖమును బోఁగొట్టుటకు దగినవిగాఁ జేయఁబడుచున్నట్లు (దృశ్యంతే=) చూడఁబడుచున్నది.

తదేవం జగదఖిలం, పృథివ్యాది – నానాకర్మఫలోపభోగయోగ్యం బాహ్య మాధ్యాత్మికంచ శరీరాది నానాజాత్యన్వితం, ప్రతినియతావయవవిన్యాస మనేక కర్మఫలానుభవాధిష్ఠానం. దృశ్యమానం ప్రజ్ఞావద్భిస్సంభావితతమైశ్శిల్పిభి ర్మనసాప్యాలోచయితు మశక్యం సత్, కథమచేతనం ప్రధానం రచయేత్.

(తదా-ఇదం-జగత్-అఖిలం=) అట్లే యీయఖిలమైన జగత్తును- అనగా (నానా ... యోగ్యం) వివిధకర్మానుభవమునకు యోగ్యములై (బాహ్యం=) బాహ్యములుగా నుండు (పృథివ్యాది=) పృథివ్యాది పంచభూతములతోడను (నానా జాత్యన్వితం=) పశుపక్షితిర్యగాది వివిధజాతులతోఁగూడియు (ప్రతినియతా ... న్యాసం=) వానివానికి నియతములగు నట్టిదై యవయవ (విన్యాస=) స్థితి యుండ వలయునో నట్టిస్థితితోఁగూడియు (అనేక .... అధిష్ఠానం=) వానివాని వివిధకర్మ ఫలానుభవముల కాశ్రయములుగాఁ గలట్టియు (ఆధ్యాత్మికంచ శరీరాది=) ఆంతర ములుగానుండు శరీరాదులతోడను దృశ్యమానం=) విరాజిల్లుచు (గన్పించునీయఖిల జగత్తును (ప్రజ్ఞావద్భిః=) విశేషనైపుణ్యముగలవారై (సంభావితతమైః=) ఆయా పనులలో మిక్కిలి శ్రేష్ఠులని కొనియాడఁబడు (శిల్పిభిః=) శిల్పిప్రముఖులిట్టి కార్య ములను వారివారి సాధనములతోఁ జేయఁజాలకపోగా (మనసా ... శక్యం సత్=) చేయుటయెట్లాయని మనసుతోనైనను నాలోచించుటకు సాధ్యముగానుండని యీ యఖిలజగత్తును (అచేతనం ప్రధానం=) అచేతనమనియే యొప్పుకొనఁబడు ప్రధాన మనునది (కథం రచయేత్=) యెట్లు చేయఁగలదో విచారింపుఁడు.

లోష్ఠపాషాణాదిష్వదృష్టత్వాత్

అచేతనములగు రాళ్ళు రప్పలు మొదలగువస్తువులకట్టి కార్యరచనాశక్తి చూపట్టుటలేదే !

మృదాదిష్వపి కుంభకారాద్యధిష్ఠితేషు విచిత్రాకారా రచనా దృశ్యతే

మట్టి మొదలగువానినుండి కుండ, చట్టి, మూకుడు, బాన, కూజా మొదలగు (విదిత్రి=) వివిధవస్తువులు పుట్టుచున్నవనఁగా (కుంభ ... తేషు=) కుమ్మరి మొదలగు చేతనపురుషులు పట్టిపనిచేసిన నేగదా (విదితాకారారచనా=) యాయావివిధాకారవస్తునిర్మాణము (దృశ్యతే=) గన్పట్టుచున్నయది.

తద్వత్ ప్రధానస్యాపి చేతనాంతరాధిష్ఠితత్వ ప్రసంగః

(తద్వత్ =) అట్లె (అనఁగా నాదృష్టాంతబలముచేతనే) (ప్రధానస్యాపి =) యచేతనమైన ప్రధానమునుండి యీజగత్తు పుట్టుచున్నదన్నప్పుడుగూడ (చేతనాం ... తత్వ=) మఱియొక చేతనపదార్థముయొక్క సంబంధ మావనియుం దుండితీరవలయునని (ప్రసంగః=) చెప్పవలసివచ్చుచున్నది.

నదమృదాది ద్యుపాదాన స్వరూప వ్యపాశ్రయేణైవ ధర్మేణ మూలకారణ మవధారణీయం. నబాహ్యం కుంభకారాది వ్యపాశ్రయేణేతి కించిన్నియామక మస్తి.

(వస్తువులకు మూలకారణ మేదియో నిశ్చయించు విషయములో వానికుపాదాన కారణ ( material cause ) ముగు మట్టిస్వరూపమును (అనగామట్టిని) నాశ్రయించుకొని యున్న ధర్మమును మాత్రమే (అనఁగా- కుండ యగుటకు దానియందున్న సామర్థ్యమునుమాత్రమే) యాతగాఁ దీసికొని (మూలకారణం=) ఆకుండయొక్క మొదటికారణమును (అవధారణీయ=) నిర్ణయించవలసియుండును. (బాహ్యం =) మట్టికి వెలుపలగానున్న (కుంభ...రేణ) కుమ్మరి మొదలగు చేతనపురుషుల నాశ్రయించుకొనియున్న ధర్మమును అనఁగా నిర్మాణ సామర్థ్యమును (కుండనుజేయు పనితనమును) ( న- అవధారణీయం=) నాలోచనములోనికిఁ దేఁగూడదు. (ఇతి=) అను (కించిన్నియామకం=) నిర్బంధమేదియును (నచ + అస్తి) లేదు. ఇట్లే జగత్కారణమును నిర్ణయించు విషయములోఁగూడ నచేతనమగు ప్రధానమొక్కదానినే కారణముగా ననుసరించి తీరవలెను. ప్రధానమునకు బాహ్యముగానుండు చేతనమునుగూర్చి కారణమగునా కాదాయని విచారింపవలదు. అనునియమముండఁజాలదని భావము.)

నచైవం సతి కించిద్విరుధ్యతే

(ఏవంసతి=) కారణ నిర్ణయపద్ధతి యిట్టిదై యుండఁగా జగత్సృష్టికార్యములో జేతనసంబంధమున్నది యని చెప్పెడి మావాదము (కించిత్-న-విరుధ్యతే=) ఎంతమాత్రము- అనఁగా (మట్టికుండ దృష్టాంతములోవలెనే) నెట్టియూహా కాదు.

(=అనుమానమునకును) విరోధింపదు. (రాళ్ళకు రప్పలకువలె నచేతనమైన ప్రధానమునకుఁగూడఁ గార్యరచనాశక్తి యుండఁజాలదని మున్నే చెప్పఁబడియున్నందునను జగత్కార్యమునకుఁ జేతనకారణమును జెప్పఁగూడదను నియమమెచ్చటకు లేకపోవుటచేతను, జగత్తునకు చేతనవస్తువే కారణమని చెప్పుచున్నామనియు, ఇందుల కెట్టి తర్కానుమాన మడ్డురాదనియు భావము.)

ప్రత్యుత శ్రుతిరనుగృహ్యతే చేతనకారణత్వ సమర్పణాత్.

(ప్రత్యుత=) ఎట్టి యనుమాన (ఊహా) విరోధము లేకపోవుటయే గాక, (చేతన ... ర్పణాత్=)జగత్తునకుఁ జేతనమే కారణమని చెప్పుటవలన (శ్రుతిః అనుగృహ్యతే=) శ్రుతియును అనుగ్రహింపబడుచున్నది.) (=అనుసరింపఁబడుచున్నది) (అనఁగా- మా చేతనకారణవాదమునకు ఇతర తర్కాది విరోధము లేకపోఁగా శ్రుతియు మాకు సహాయమైయున్నదని భావము)

అతో రచనానుపపత్తేశ్చ హేతో, ర్నాచేతనం జగత్కారణ మనుమాతవ్యం భవతి.

(అతః=) కాబట్టి (రచనా .... హేతోః=) వివిధరూప జగన్నిర్మాణము అచేతన పదార్థముచేతఁ జేయఁబడఁ గల్గియుండుట యసంభవమను హేతువునుబట్టి (అచేతనం=) అచేతనమేయని యంగీకరింపఁబడు సాంఖ్యుల ప్రధానము (జగత్కారణం:) జగత్కారణముగుసని (అనుమాతవ్యం న భవతి=) యనుమానింపఁబడజాలదు. (=ఊహింపఁబడఁజాలదు.

అన్వయాద్యనుపపత్తే శ్చేతి'చ' శబ్దేనహేతో రసిద్ధింసముచ్చినోతి.

"రచనానుపత్తేః + చ + న + అనుమానమ్" అనియున్న యీ సూత్రములోని 'చ' అను సముచ్చయార్థకపదము (conjunction) చేత 'రచనానుపత్తేః' అను హేతువొక్కటియేగాక 'అన్వయాద్యనుపపత్తేః' అను హేతువును సైతము కల్పుకొనవలయునని తెలియఁజేయఁబడుచున్నది. అట్టి మఱియొక హేతువునుగూడ సూత్రములోఁ జేర్చుచో, (హేతోః=) ఈమఱియొక హేతువువలనఁగూడ (అసిద్ధిం=) ప్రధానము (=అనుమానము) చేత జగద్రచనము సిద్ధింపదను విషయమును (సముచ్చినోతి=) సూత్రకారుఁడు బలపరుచుచున్నాడు. 'అన్వయాద్యనుపపత్తేః' అనగాఁ అన్వయ వ్యతిరేకములు అసంభవ మగుటవలన- అని యర్థము.

అన్వయమునకు దృష్టాంతములు :—

(1) ఎచ్చట ఘటముండునో యచ్చట మృత్తికయుండును.

కార్యకారణముల యన్వయము.

(2) ఎచట పొగయుండునో నచ్చట యగ్నియుండును.

హేతుసాధనముల యన్వయము.

వ్యతిరేకమునకు దృష్టాంతము :—

(1) ఎచ్చట మృత్తిక యుండదో యచ్చట ఘటముండదు.

కార్యకారణముల వ్యతిరేకము.

(2) ఎచ్చట నగ్నియుండదో యచ్చట ధూమముండదు.

హేతుసాధ్యముల వ్యతిరేకము.

N.B. :— పొగ — హేతువు అగ్ని — సాధ్యము

పురుషార్థసాధన వస్తువులన్నియు నచేతనములు సుఖదుఃఖ మోహాత్మకములు గాన అవియన్నియు నచేతనములైన సుఖ దుఃఖ మోహాత్మకములనుండియే అనఁగా ప్రధానమునుండియె కలుగుచున్నవని సాంఖ్యుల సిద్ధాంతముగదా. ఈసిద్ధాంతము అన్వయ వ్యతిరేముల వలనఁగూడ నిలువదని చెప్పబడుచున్నది- ఎట్లనఁగా :—

అన్వయమిట్లుండును :—

(1) ఏయే పదార్థములు పురుషార్థ సాధవము లగుచున్నవో యవియన్నియు నచేతనములు,

వ్యతిరేక మిట్లుండును :—

(2) ఏవేవి యచేతనములుగావో యవి పురుషార్థసాధకములు గావు.

ఈ యన్వయ వ్యతిరేకము లసంభవములగుట ప్రత్యక్షము. అచేతనమైన వస్తువేదైనను జేతనసంబంధ ముండినగాని పురుషార్థ సాధకముగాఁ బ్రవర్తింపఁ జాలదు.

నహిబాహ్యాధ్యాత్మికానాం భేదానాం సుఖదుఃఖ మోహాత్మకతయాఽన్వయ ఉపపద్యతే.

[లోకములోని బాహ్యాంతర సర్వపదార్థములు సుఖ దుఃఖ మోహా (=ప్రధాన) స్వరూపములే యనెడి సాంఖ్యసిద్ధాంతమునుగూర్చి చెప్పబడుచున్నది]

(బాహ్యా=) ఇంద్రియార్థములై శబ్ద రూప రస గంధ స్పర్శములనెడి బాహ్య (భేదాః=) పదార్థములును, (ఆధ్యాత్మిక=) సుఖ దుఃఖ మోహములనెడి (భేదాః=) ఆంతరములును (సుఖ ... కతయా=) సుఖ దుఃఖ మోహస్వరూపములే యగుటచే (అన్వయః=) సమానములే యని సరిపుచ్చుకొనుట (న హి ఉపపద్యతే=) యెప్పటికిని గుదరదు. ఎందుచేతననగా–

(1) సుఖాదీనాం మాంతరత్వప్రతీతేః

(1) సుఖ దుఃఖ మోహములనునవి (ఆంతరత్వ ప్రతీతేః=) లోపల మనస్సునందు జనించు వృత్తులుగాని పదార్థములుగావు.

(2) శబ్దాదీనాంచా తద్రూపత్వా ప్రతీతేః

(2) శబ్దములగు బాహ్యపదార్థములు (అతద్రూపత్వ=) ఆ తద్రూపములు– అనగా ఆంతరములు (=లోపల నుండునట్టివి) గానివి.

(3) తన్నిమిత్తత్వ ప్రతీతేశ్చ

3) మఱియును నీశబ్దాది బాహ్యపదార్థములు (తత్=)ఆంతరములగు (లోపల నుండు) సుఖదుఃఖాదులకు (నిమిత్తత్వా=) హేతువులగుచున్నవి. (అనగా అవి వీనిని బుట్టించునవి యగుటచే నవి యివియేయై యుండనోవవు)

(ఈ హేతువువలన నీ బాహ్యాంతరములు స్వరూపముచే సమానములు గావు)

శబ్దాద్యవిశేషేఽపి. భావనావిశేషాత్ సుఖాదివిశేషో లబ్ధిః

(శబ్దాద్యవిశేషేఽపి=) శబ్దాదులైదింటిలో దేనియందైననుగాని, లేక వానిలో నొక్కొక్కదానిలో ఆంతర (విశేష=) భేదములేకున్ననుగాని (భావనా విశేషాత్=) చూచువానియొక్క మానసిక వాసనాభేదములవలన (సుఖాదివిశేషోపలబ్ధిః=) సుఖదుఃఖాదుల భేదము లనుభవింపబడుచున్నట్టు గన్పట్టుచున్నది అనగా సాంఖ్యసిద్ధాంతానుసారముగా బాహ్యపదార్థములైన శబ్దాదులయొక్క స్వరూపము గూడ సుఖదుఃఖమోహములే యగుచో అవి యెల్లప్పుడును నందరికిని నన్నిచోట్లను నొకతీరుగానే గోచరింపవలయును. అట్లుగాక యొకవస్తువు ఒకనికి సుఖముగాం దోచుట మఱియొకనికి దుఃఖముగాం దోచుట ఒక వస్తువు ఒకకాలమందు సుఖముగను, మఱియొక కాలమందు దుఃఖముగను, ఒకప్రదేశమందు సుఖముగను మఱియొక

ప్రదేశమందు దుఃఖముగను దోఁచుచుండుట ప్రత్యక్షవిషయము. అందుచే బాహ్యములగు శబ్దాదులకు సుఖాదిస్వరూపముతో నన్వయము (=సంబంధింపఁజేయుట) కుదరదు]

(లోకములోని (సర్వవ్యాపకములుగాని) పదార్థములకు నుండు పరిమాణ (=పరిమితి, ధర్మములనుబట్టి అవి కారణముతో సంసర్గమును (సంబంధమును) గలిగి యుండుననియు ఆకారణ మొకటిగానే యుండుచో మఱియొకదానితో సంసర్గమసంభవమైనందున (మూడుగుణములతో గూడిన ప్రధానమువలె) అనేకముగా నుండుననియుఁ జెప్పు సాంఖ్యసిద్ధాంతమిక ఖర్చింపఁబడ బోవుచున్నది.)

తథా పరిమితానాం భేదానాం మూలాంకురాదీనాం సంసర్గపూర్వకత్వం దృష్ట్వా, బాహ్యాధ్యాత్మికానాం భేదానాం పరిమితత్వాత్ సంసర్గపూర్వకత్వ మనుమిమానస్య, సత్త్వరజ స్తమసామపి సంసర్గపూర్వకత్వ ప్రసంగః పరిమితత్వా విశేషాత్,

(తథా=) అట్లే మఱియు లోకములో (సర్వవ్యాపకములుగాక) పరిమితములై (limited) అనగా కొంత పరిమాణముమాత్రమే గల్గిన) (మూలాంకురాదీనాం =) మూలమైన మఱియొకదాని (విత్తు - మృత్తు మొదలైన) నుండివచ్చు సంకురము ఘటము మొదలగు (భేదానాం=) భేదవస్తువు లెల్లను (సంసర్గపూర్వకత్వం ) విత్తు మృత్తు మొదలగు కారణములతో సంబంధము గల్గియుండుటను (దృష్ట్వా=) జూచి అనఁగా నాదృష్టాంతముల నాధారము చేసికొని,(బాహ్యాధ్యాత్మికానాం=)పురుషునకు వెలుపల లోపలనుండు (భేదానాం=) శబ్దాదులు సుఖదుఃఖాదులు మొదలగు భేద వస్తువులుసైతము (పరిమితత్వాత్ =) పరిమాణములు గలవే (limited) యగుటను బట్టి యివిగూడ అనఁగా నీబాహ్యాంతర పదార్థములుగూడ (సంసర్గ పూర్వకత్వం=) అనేకముగా నుండు కారణముతో సంబంధించియే యుండునని (అనుమిమానస్య=) యూహను (=అనుమానమును) జేయు సాంఖ్యమతస్థుఁడు (సత్త్వరజ స్తమసామపి= (ప్రధానమందు సమానావస్థలోనుండు) సత్త్వము - రజము - తమము అనునవి గూడ (పరిమితత్వా విశేషాత్ =) వారి మతానుసారము విశేషము (హెచ్చుతగ్గులు) లేకుండ (= exactly in the same way as all the other substances) పరిమితములే యగుటనుబట్టి (సంసర్గపూర్వకత్వ ప్రసంగః=) మఱియొక కారణముతో

సంబంధించియే యుండునని యొప్పుకొనవలసి వచ్చును (చెప్పవలసివచ్చును.) అట్లు చెప్పుచో నామతము భంగపడిపోవును. (సాంఖ్య సిద్ధాంతానుసారము బాహ్యాంతర సర్వపదార్థములకు మూలకారణము.) సత్త్వ రజస్తమస్సులని చెప్పుట పొసఁగదు ఏలయన నీసత్త్వరజస్తమస్సులకును మూలకారణము మఱియొకటి యుండవలసినట్లు తేలుచున్నది, కావున నాసిద్ధాంతము నిలువఁదగినది గాదు )

కారణ వస్తువుకంటె కార్యవస్తువు భిన్నమై యుండుటనుబట్టి కారణవస్తు వచేతనమైయుండునను మఱియొక సాంఖ్య సిద్ధాంతము చర్చింపఁ బడుచున్నది.)

కార్యకారణ విభావస్తు ప్రేక్షాపూర్వక నిర్మితానాం శయనాసనాదీనాం దృష్ట ఇతి. న కార్య కారణ భావాద్బాహ్యాధ్యాత్మికానాం భేదానా మచేతన పూర్వకత్వాం శక్యం కల్పయితుం.

(కార్యకారణభావస్తు=) కార్యకారణములు రెండును భిన్నములై యుండుట (ప్రేక్షాపూర్వక=) చేతనునియొక్క (బుద్ధితో) పుష్కల సంకల్పముతో (నిర్మితానాం=) నిర్మించఁబడిన (శయ ... దీనాం=) మంచములు పీఠములు మొదలగు వస్తువుల విషయములో (దృష్టః=) జూడఁబడియున్నది (అనఁగా కార్యకారణములు భిన్నములుగానే యున్నను రెండును నచేతనములుగానే యున్నను కారణమునుండి కార్యమేర్పడుట చేతనునియొక్క సంకల్పము లేనిదే సంభవింపదని మున్నె చూపఁ బడినది) (ఇతి=) కాబట్టి (బాహ్యాధ్యాత్మికానాం=) బాహ్యములు (వెలుపలనుండు వస్తువులు) ఆంతరములు (లోపలనుండు బుద్ధి మొదలగు వస్తువులు) అనెడి (భేదానాం=) వస్తువులకు (కార్యకారణ భావాత్=) గార్యకారణ సంబంధ ముండుటవలన (అనఁగా కార్యములైన బాహ్యాంతర వస్తువులకు గారణముమఱియొకటి యున్నదను కొన్నను. (అచేతన పూర్వకత్వాం=) ఆ వస్తువులకుఁ బూర్వకారణమైన దెల్లను అచేతనమే యని (కల్పయితుం=) కల్పించుటకు (న-శక్యం=) శక్యముగాదు అనఁగా మృత్తు- ఘటమువిషయములో గార్యకారణ సంబంధ మెట్టిదో యొకటి చెప్పుకొనఁ బడినను ఘటమును బుట్టించునది అచేతనమేయని నిశ్చయించుటకు వీలులేదని భావము )

2 సూత్రావతారిక :— ప్రపంచరచనయొక్క యనుపపత్తి (అసంభవము) వలన ప్రధానము జగత్కారణము గానేరదని పూర్వసూత్రమందుఁ జెప్పఁబడినది అట్లే మఱియొక హేతువును గైకొని ప్రధానము జగత్కారణము గానేరదని యీ సూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౨ సూ॥ ప్రవృత్తేశ్చ

ప వి :— ప్రవృత్తేః + (అనుపపత్తేః) చ

ప్ర॥ ప॥ అ :— ప్రవృత్తేః = ప్రయత్నము యొక్క (లేక) వ్యాపారము యొక్క; అనుపపత్తేః = అసంభవమువలన; చ = కూడ.

N. B :— లోగడి సూత్రములోనున్న 'అనుపపత్తేః' అనుమాటను నీ సూత్రములోఁ జేర్చి సందర్భానుసారముగా నర్థమును బూర్తిచేసికొన వలయును,

సూత్రార్థము :— సృష్టినిమిత్తమై ప్రధానము జరుపవలసియున్న ప్రవృత్తి (=వ్యాపారము) యసంభవ మగుట వలననుగూడ (ప్రధానము జగత్కారణ గాదు)

సూత్ర భావము :—

(ప్రవృత్తేః) సత్త్వరజస్తమస్సులైన మూడుగుణములయొక్క సమానావస్థ యనెడి (అచేతన) ప్రధానము సృష్టిని గావించు నిమిత్తమై చేయవలసియున్న ప్రవృత్తి యనఁగా ఆసమానావస్థను జెదరఁదోలి హెచ్చుతగ్గులుగా నేర్పడుట యను నదిగూడ చేతనసంబంధము లేకుండ (అనుపపత్తేః + చ) అసంభవమగుటవలనను ప్రధానము జగత్కారణము గానేరదు.

భాష్యము — భాష్యార్థము

ఆస్తాం తావదియం రచనా: తత్సిద్ధ్యర్థాయా ప్రవృత్తిః సామ్యావస్థానాత్ప్రచ్యుతి స్సత్త్వరజస్తమసా మంగాంగి భావాపత్తిః విశిష్టకార్యస్యాభిముఖ ప్రవృత్తిః. సాఽపి నాచేతనస్య ప్రధానస్య స్వతంత్రస్యోపపద్యతే.

(ఇయం రచనా=) ఈ జగద్రచనా విషయ (ఆస్తాం తావత్ =) మట్లుండ నిండు ! ఆ రచన యనునది సిద్ధించుట కొఱకుఁ జేయవలసియున్న (ప్రవృత్తిః=) ప్రయత్న మేదిగలదో యది. అనఁగా (విశిష్ట ... ప్రవృత్తి=) వివిధ జగత్సృష్టికి ననుకూలమగు (ప్రవృత్తిః=) వ్యాపారము - అనఁగా (సత్త్వ ... తమసాం =) సత్త్వరజస్తమస్సులనెడి మూడుగుణములు (సామ్యావస్థానాత్ =) అదివరకుఁ బ్రధానమై యున్న సమానావస్థనుండి (ప్రచ్యుతిః=) తొలఁగి (అంగాంగి భావాపత్తిః =) ఒకటి ముఖ్యమైనదిగాను (=అంగి) మిగిలినవి యముఖ్యములైనవిగాను (=అంగ)

(ఒకటి విశేషముగాను; మిగిలినవి కొద్దివిగాను) ఏర్పడి వస్తురూపమును దాల్పఁ బూనుట- (సాఽపి) ఇట్టిపనిసైతము (అచేతనస్య స్వాతంత్ర్యే=) అచేతనమై (చేతనుఁడైన) మఱియొకని సహాయమును బొందని (ప్రధానస్య=) ప్రధానమును దానికి (న + ఉపపద్యతే=) నను వు (= ) గాదుగదా.

మృదాదిష్వ దర్శనాత్ రథాదిషు చ.

అట్టి వ్యాపారము (=ప్రయత్నము) మృత్తువు మొదలగు వానియందుఁ గాని రథములు మొదలగు వానియందుఁగాని చూడఁబడ దనుట ప్రత్యక్ష విషయమే.

నహిమృదాదయో రథాదయోవా స్వయమచేతనాస్యంత శ్చేతనైః కులాదిభి రశ్వాదిభిర్వాఽనధిష్ఠితా విశిష్ట కార్యాభిముఖప్రవృత్తయో దృశ్యంతే.

అనఁగా- మృత్తువు మొదలగు పదార్థములు, రథములు మొదలగు వాహనములు తాము అచేతనములై యుండి చేతనులైన కుమ్మరి మొదలగు వారియొక్క-గాని- లేక- గుఱ్ఱము మొదలగు వానియొక్క-గాని (అనధిష్ఠితా=) సంబంధము లేకుండఁగనే (విశిష్టకారి ... త్తయః=) వానివాని విశేష కార్యములను జరుపుటకు (అనఁగా – కుండలకుఁగాని, నడచిపోవుటకుఁగాని) ననుకూలమైన ప్రయత్నమును జేయఁజాలియుండుట (నహి దృశ్యంతే=) కానఁబడదు.

దృష్టాచ్చా దృష్ట సిద్ధిః.

(దృష్టాత్ + చ=)ప్రత్యక్షముగాఁ జూచువిషయమునుండి (అదృష్టసిద్ధిః =) చూడఁజాలని విషయమును నిశ్చయింపవలెనుగదా !

అతః ప్రవృత్త్యనుపపత్తేరపి హేతోర్నాచేతనం. జగత్కారణ మనుమాతవ్యం భవతి.

కాబట్టి ప్రయత్నమునుజేయుట సంభవింపఁ జాలదను హేతువువలననుగూడ, అచేతనమైన ప్రధానము జగత్సృష్టిని గావింపఁగలది యని (అనుమాతవ్యః =) యూహించుట (న + భవతి) సాధ్యముగాదు.

పూర్వపక్షము :—

నను చేతనస్యాపి ప్రవృత్తిః కేవలస్య నదృష్టా.

(అచేతన సంబంధములేక) కేవల చేతనమై యుండువాని యందుమాత్రము (ప్రవృత్తిః=) వ్యాపారమును బూనుట (న దృష్టా=) కానఁబడదుగదా! (అనఁగా

మృత్తుతోఁ గలియని కుమ్మరివాని యందుఁగాని రథముతోఁ గలియని గుఱ్ఱమునందు గాని కార్యప్రయత్న మెట్లు గన్పించఁగలదని భావము.

సిద్ధాంతి జవాబు :—

సత్యమేతత్

ఈమాట సత్యమే !

తథాపి చేతేన సంయుక్తస్య రథాదేరచేతనస్య ప్రవృత్తి ర్దృష్టాః

అట్లయినను (గుఱ్ఱములు మొదలగు) చేతనములతోఁ గూడుకొనియున్న యచేతనములగు రథాదులకే (ప్రవృత్తి =) కార్యప్రయత్నము గన్పించుచున్నది గదా !

పూర్వపక్షి

నత్వచేతన సంయుక్తస్య చేతనస్య ప్రవృత్తి ర్దృష్టా.

అచేతనముతోఁ గూడుకొనియున్న చేతనమందట్టి కార్యప్రయత్నము గన్పింపదుగదా !

సిద్ధాంతి

కింపునరత్రయుక్తం. యస్మిన్ ప్రవృత్తి ర్దృష్టా తస్యసేతి. ఉతయత్సం యుక్తస్య దృష్టా తస్యైవసేతి.

ఇప్పుడు దేలిన సారాంశ మేమనఁగా :— (యస్మిన్ ... దృష్టా=) క్రియా వ్యాపారము (ఏవస్తువునందు=) దేనియందుఁ గన్పించుచున్నదో (తస్యసేతి) ? ఆ వ్యాపారకర్త యావస్తువనియే చెప్పవలయునా? లేక యావస్తువు (యత్సం యుక్తస్య=) దేనితోఁ గలిసియుండుటచేత (నావస్తువునందు) నాక్రియా వ్యాపారము గల్గుచున్నదో (తస్యైవసేతి=) అట్టి వ్యాపారకర్త యా కలసియున్న వస్తువని చెప్పవలయునా ?

అడ్డుప్రశ్న :—

నను యస్మిన్ దృశ్యతే ప్రవృత్తి స్తస్యైవ సేతి యుక్తముభయయోః ప్రత్యక్షత్వాత్.

(ఉభయయోః=) క్రియావ్యాపారము ఆవ్యాపారమున కాశ్రయమైయుండు

(దేనియందు నా వ్యాపారము గన్పించుచున్నదో యట్టి) వస్తువు నీరెండును బ్రత్య క్షములుగాఁ గన్పించు చున్నందున, (యస్మిన్ ... ప్రవృత్తిః) ఏవస్తువునందా క్రియా వ్యాపారము గన్పించుచున్నదో (=ఏవస్తు వాక్రియా వ్యాపారమున కాశ్రయమై యున్నదో ఆ వస్తువే ఆక్రియా వ్యాపారకర్తయని చెప్పుట యుక్తము గదా.

నతు ప్రవృత్త్యాశ్రయత్వేన కేవలశ్చేతనో రథాదివత్ ప్రత్యక్షః,

(ప్రవృ ... త్వేన=) క్రియావ్యాపారమున కాశ్రయమైన వస్తువు అనఁగా క్రియా వ్యాపారము దేనియందుఁ గన్పించుచున్నదో యా వస్తువు (అచేతన సంబధము లేని) కేవల చేతనమైనట్లుగా (నతు ప్రత్యక్షః=) సాక్షాత్కార మగుటలేదు గాని (రథాదివత్= యా వస్తువు (అచేతనమగు) రథము మొదలగు నదియేయని ప్రత్యక్షవిషయము గదా- (అనఁగా రథము పరుగెత్తుచున్నప్పుడు, పరుగెత్తుచు... రథమైనట్లే ప్రత్యక్షముగాని (కనుపించని) చేతనమైన మఱియొకటి గాదని భావము.)

ప్రవృత్త్యాశ్రయ దేహాదిసంయుక్తస్యైవతు చేతనస్య సద్భావసిద్ధిః కేవలాచేతన రథాది వైలక్షణ్యం జీవద్దేహస్య దృష్టమితి

(జీవద్దేహస్య=) జీవించియున్న దేహమునందు (అనఁగా జీవముగలిగి సంచరింపఁగల దేహమునందు)- (కేవలాచేతన రథాది వైలక్షణ్యం=) కేవలము చేతనమై మొద్దుగానుండు రథము మొదలగు వస్తువులయందుకంటె భేదము (=వైలక్షణ్యం) గనుపించుచున్నదను హేతువుచేత, (ప్రవృత్త్యాశ్రయ=) క్రియావ్యాపార మేవస్తువునందుఁ గన్పించుచున్నదో యట్టి యచేతనములైన (దేహాది .... యుక్తస్య=) దేహాదులతోఁ (శరీరము మొదలగువానితోఁ గూడుకొన్నదియే యగుచుఁ (చేతనస్య=) చేతన మనునది యొకటి (సద్భావసిద్ధిః=) యుండవలెనని నిర్ధారణము చేయుచున్నారు.

(జీవ నిర్జీవపదార్థములకుఁ గల భేదమును జూచి, చేతనమనునది యొకటి దేహముతోఁ జేరియున్నదని యూహించుచున్నారేగాని, చేతనముయొక్క యునికి ప్రత్యక్షవిషయము గాదని భావము)

అతఏవచ ప్రత్యక్షదేహేసతి చైతన్యస్య దర్శనా దసతి చా దర్శనా, ద్దేహస్యైవ చైతన్య మితి లోకాయతికాః ప్రతిపన్నాః,

(అతఏవచ=) అందువల్లనే గదా - అనఁగా- (ప్రత్యక్షే దేహేసతి=) దేహము ప్రత్యక్షముగాఁ జూడఁబడనప్పుడే (చైతన్యదర్శనాత్ =) చైతన్య మున్నదని తలంచుట (దేహే) అసతిచ (చైతన్యస్య) అదర్శనాత్) దేహము లేనప్పుడు చైతన్యము లేదని తలంచుట సంభవించుచున్నందున (చైతన్యం =) చైతన్య మనునది (దేహస్య+ఏవ+ఇతి) దేహముయొక్క ధర్మముమాత్రమే (విశేషణముమాత్రము only attribute not an independentity) యని లోకాయతికులు - అనఁగా నిరీశ్వరవాదులైన బౌద్ధులలో నొకతెగవారు (సైతము) (ప్రతిపన్నాః =) తలంచుచున్నారు.

తస్మా దచేతనస్యైవ ప్రవృత్తిరితి.

కాబట్టి (ప్రవృత్తిః=) క్రియావ్యాపార మెల్లను (అచేతనస్య+ఏవ) అచేతనమునకు సంబంధించినది (గాని చేతనమునకు సంబంధించినది గాదు.)

వేదాంత సిద్ధాంతి సమాధానము :—

తత్రాభిధీయతే.

(తత్ర=) పైనఁ జేయఁబడిన పూర్వపక్షమునకు సమాధానము (అభిదీయతే= చెప్పఁబడుచున్నది చూడుఁడు.

న బ్రూమో యస్మిన్నచేతనే ప్రవృత్తిర్దృశ్యతే. న తస్య సేతి. భవతు తస్యైవసా.

(యస్మిన్నచేతనే=) ఏ యచేతనమైన వస్తువునందు (ప్రవృత్తిః =) క్రియావ్యాపారము (దృశ్యతే=) గన్పించుచున్నదో, (న- తస్య- సా+ఇతి) ఆక్రియావ్యాపార మావస్తువుది కాదని (నబ్రూమః=) మేము చెప్పుచుండలేదు. (=మేము చెప్పము.)

భవతు తస్యైవ సా.

ఆక్రియావ్యాపార మచేతన వస్తువుదే కానిండు (=యగుగాక)

న-తు-చేతనా ద్భవతీతి బ్రూమః

అట్లైనను (సాతు) ఆక్రియావ్యాపార మన్ననో (చేతనాత్ = చేతననిమిత్తత్వాత్ =) చేతనముయొక్క ప్రేరేపణముచేత (అచేతనమందు) భవతీతి=) గల్గుచున్నదని మాత్రము (బ్రూమః=) చెప్పుదుము.

తద్భావేభావా. త్తదభావేచాభావాత్.

(అనఁగా – (తద్భావే=) ఆచేతనమున్నది యున్నచో, భావాత్=) ప్రవృత్తి (=క్రియా వ్యాపారము) యుండును. (తత్ + అభావే చ) ఆ చేతనమున్నది లేనిచో (అభావాత్=) ప్రవృత్తి యుండదు.

యథాకాష్ఠాది వ్యపాశ్రయాపి దాహప్రకాశాదిలక్షణా విక్రియాఽనుపలభ్యమానాపి కేవలే జ్వలనే, జ్వలనాదేవ భవతి, తత్సంయోగే దర్శనాత్, తద్వియోగే చా దర్శనా, త్తద్వత్.

(యథా - తద్వత్ = అదియెట్లో దృష్టాంతమును వివరించెదము -చూడుఁడు. (దాహ ... లక్షణా=) రగులుట (=దాహము) వెలుగుట (=ప్రకాశము) మొదలగు లక్షణములుగల (విక్రియా=) క్రియావ్యాపారము (కాష్ఠా... యాపి=) కట్టెలు మొదలగు (దహనశీలములైన- కాలఁదగిన) వస్తువుల నాశ్రయించుకొని (=వస్తువులయందే యుండి) యున్నదైనను, (అనుపలభ్య మానాపి కేవలే జ్వలనే=) ఒక్క నిప్పుమాత్ర మున్నప్పుడా నిప్పునందది కనుపించకున్నదైనను, (జ్వలనాదేవభవతి=) (వేరుగానున్న) యానిప్పును (కట్టెలకు) అంటించుటచేత మాత్రమే (కట్టెలయందా క్రియావ్యాపారము = ప్రవృత్తి) (భవతి =) కల్గుచున్నది. ఎందుచేత ననఁగా— (తత్సంయోగే= ఆ నిప్పంటుకొన్నప్పుడే (దర్శనాత్=) కట్టెలయందు రగులుట వెలుగుట యను ప్రవృత్తి గన్పట్టుచున్నయది- (తద్వియోగేచ=) ఆ యంటింపు లేనప్పు )అదర్శనాత్=) డా ప్రవృత్తి (రగులుట వెలుగుట యను క్రియావ్యాపారము కనుపింపదు.

లోకాయతికానామపి చేతన ఏవదేహోఽచేతనానాం రథాదీనాం ప్రవర్తకో దృష్ట ఇత్యవిప్రతిపన్నం చేతనస్య ప్రవర్తకత్వం.

దేహాత్మవాదులైన (దేహమే యాత్మయనెడి) లోకాయతికులు మనుష్యాదులయొక్క దేహములే చేతనములనియు, (ఇతర నిర్జీవ రథాది వస్తువులే యచేతనములనియు) (చేతనఏవ దేహః=) చేతనములైన (అశ్వాది) దేహములే యచేతనములైన రథాదులను (ప్రవర్తకః=) నడిపించునవియు (దృష్టః) చెప్పుట గలదు. (ఇతి) వారిట్లు చెప్పుటలో (చేతనస్య ప్రవర్తకత్వం=) (నడిపించునది చేతనమే అను వారి మతము (అవిప్రతిపన్నం=) అవిరుద్ధము గాదు. (అనగా నంతవరకు నంగీకరింపఁ దగినదయే)

ఎదురుప్రశ్న :—

నను తవ దేహాది సంయుక్తస్యాప్యాత్మనో విజ్ఞానస్వరూప మాత్ర వ్యతిరేకేణ ప్రవృత్త్యనుపపత్తే రనుపపన్నం ప్రవర్తకత్వమితి.

(దేహా ... యుక్తస్య=) దేహాదులతోఁ గూడుకొన్న (తవ ఆత్మనః=) నీ యాత్మకు (ఆవహిల్లిన) విజ్ఞా ... రేకేణ) జీవస్వరూపముకంటె భిన్నముగా (ప్రవృత్త్యనుపపత్తేః=) మఱియొకపని యసంభవమైనందున (చేతనమైన) ఆయాత్మ (ప్రవర్తకత్వం=) నడిపించునది (అచేతనమందుఁ గ్రియావ్యాపారమును బ్రేరేపించునది) యగుట (నను - అనుపపన్నం - ఇతి=) సంభవ మెట్లగును? (ఆత్మ దేహమును బూని జీవుఁడగుటతప్ప మఱి యేపనిని జేయఁజాలదని మీ సిద్ధాంతముగదా - ప్రవర్తకమగునని యిప్పుడెట్లు చెప్పుచున్నారని భావము)

సిద్ధాంతి జవాబు :—

చే న్న.

అని యాక్షేపింతువా! నీయాక్షేపము సరిగాదు.

అయస్కాంతవద్రూపాదివచ్చ ప్రవృత్తిరహితస్యాపి ప్రవర్తకత్వోపపత్తేః.

(అయస్కాంతవత్=) సూదంటురాయి వలెను (రూపాదివత్ + చ) రూపము మొదలగు నింద్రియార్థములవలెను (ప్రవృ ... తస్యాపి=) తా మెంతమాత్రము కదలకుండ నుండియును (ప్రవర్తకత్వోపపత్తేః=) ఇతరవస్తువులను గదలింపఁ గలుగుటలేదా!

యథా యస్కాంతోమణిః స్వయంప్రవృత్తి రహితోఽప్య యసః ప్రవర్తకో భవతి.

(ఈయర్థమునే వివరించి చెప్పుచున్నాము వినుడు.) ఎట్లు సూదంటురాయి యను లోహమణి (స్వయం ... తోఽపి) తనకుఁదాను గదలలేనిదే యైనను, (అయ .... భవతి) ఇనుమును గదలింపఁ గల్గినది యగుచున్నదో,

యథాచ రూపాదయో విషయాః స్వయం ప్రవృత్తిరహితా అపి చక్షురాదీనాం ప్రవర్తకా భవంతి.

మఱియు నెట్లు (రూపా ... యాః=) రూపము మొదలగు విషయములు (స్వ .... అపి=) తాము స్వంతముగఁ గదలఁజాలనివే యైనను (చ .... వంతి =) కన్ను మొదలగు నింద్రియములను గదలింపఁ గల్గినవి యగుచున్నవో (కంటియొక్క

వనిరూపము నెదుర్కొన్నప్పుడే కనుపించును. కావునఁ బనియందుఁ గంటిని ప్రేరే పించునది రూపమేయని చెప్పవలయును. రూపమన్నది కదలకుండగనే యుండి కంటి యందుఁ బ్రవృత్తిని గల్గించుచుండును.)

ఏవం ప్రవృత్తి రహితోఽపీశ్వర. స్సర్వగత. స్సర్వాత్మా, సర్వజ్ఞ. స్సర్వశక్తిశ్చ సన్, సర్వం ప్రవర్తయేదిత్యుపపన్నం.

(ఏవం) అట్లే సర్వగతుఁడును (అంతటను నుండువాడు) సర్వాత్మయు (సమస్తమునకు స్వరూపమైనవాడును) సర్వజ్ఞుఁడును (సమస్త మెఱిఁగినవాడును) సర్వశక్తి యైనవాడును నైన (ఈశ్వరః=) పరమాత్మ (=చైతన్యస్వరూపము) (ప్రవృత్తి రహితో(పి) వ్యవహార - క్రియావ్యాపార శూన్యుఁడైనను (సర్వం ప్రవర్తయేత్=) సమస్తమును నడిపించుచుండును. (ఇతి=) అని చెప్పుట (ఉపపన్నం =) విరుద్ధము గాదు.

ఎదిరిప్రశ్న :—

ఏకత్వా త్ప్రవర్త్యాభావే ప్రవర్తకత్వా మపపత్తి రితిచేత్.

ఏకత్వాత్ =) ఆపరమాత్మ (అద్వితీయమైన) యేకమేగదా (=ఒక్కటిమాత్రమే యగునుగదా) ప్రవర్త్యాభావే=) దానిచే నడిపింపఁబడు మఱియొకటి లేనప్పుడా పరమాత్మ (=చేతనము) (ప్రవర్త ... పత్తిరితిచేత్ =) మఱియొకదానిని నడిపించుట సంభవము గాదుగదా ! (అనియందువేమో)

న.

(న=) అట్లనరాదు - (ఎందుచేతననగా)

అవిద్యా ప్రత్యుపస్థాపిత నామరూప మాయావేశ వశేనా సకృత్ప్రత్యుక్తత్వాత్.

అవిద్య (సమ్యగ్జ్ఞానము - బ్రహ్మాత్మైక జ్ఞానము లేకపోవుట) చేత (ప్రత్యుపస్థాపిత=) లేవదీయఁబడిన నామరూపముల నెడి మాయయొక్క (ఆవేశవశేన=) యావరణములో (బడియున్నందున- (ఇతి=) అట్లేకమందే యనేకమను భ్రాంతి జనించుచున్నదనియు, వాస్తవమునకొకటి యనియు (అసకృత్ =) ఇదివరకే పెక్కుసార్లు (ప్రత్యుక్తత్వాత్) ఇట్టి యాక్షేపము మాచే ఖండింపఁబడియే యున్నది. (మఱల మఱల నట్టి ప్రశ్నయే చేయుట యసందర్భమని భావము)

తస్మాత్సంభవతి ప్రవృత్తిః సర్వజ్ఞకారణత్వే.

కాబట్టి సర్వజ్ఞుఁడైన పరబ్రహ్మమే యీజగత్తునకుఁ గారణమని చెప్పినప్పుడు, (ప్రవృత్తిః సంభవతి=) క్రియావ్యాపారము (ప్రవృత్తి) సంభవమే యగునుగాని.

నత్వచేతన కారణత్వే-

(అచే .... నత్వే=) అచేతనమైన ప్రధానమే జగత్కారణమని చెప్పినప్పుడు మాత్రము (నతు=) అది (=ప్రవృత్తి) సంభవముగాదు.

3. సూత్రావతారిక :- చేతనసంబంధము లేనిది యచేతనమందుఁ బ్రవృత్తి సంభవము గానందునఁ బ్రధానము జగత్కారణము గానేరదని పూర్వసూత్రమందుఁ దెలుపఁబడినది. దానిపై దృష్టాంతపూర్వకముగాఁ జేయఁబడిన యాక్షేపము- ఆయాక్షేపమునకు సమాధానము- ఈ సూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## 3 సూ॥ పయోంబువచ్చే, త్తత్రాపి స్యాదేతత్

ప. వి. :— పయోంబువత్ - చేత్ - (పూర్వపక్షము)

తత్ర - అపి - స్యాత్ - ఏతత్ — (సమాధానము)

ప్ర- ప. అ :— పయోంబువత్; పయః+వత్ = పాలవలెను, అంబువత్ = నీటివలెను, చేత్ = అన్నట్లగుచో — తత్ర+అపి = ఆ పాలయందును నీటియందును సైతము (ఏతత్=) ఇది (చేతనసంబంధము) స్యాత్ = ఉండియేయున్నది.

సూత్రార్థము :— (చేతన సంబంధము లేకయే) తల్లిపాలు దూడ నోటిలోనికి వచ్చినట్లును, ఒకచోటినుండి మఱియొకచోటికి నీరు పారినట్లును (బ్రధానమందును) బ్రవృత్తి గలుగవచ్చుననుచో, అట్లనరాదు. ఆదృష్టాంతములలో సైతము చేతనసంబంధముచేతనే ప్రవృత్తి గల్గుచున్నది.

సూత్రభావము :—

(పయోంబువచ్చేత్) అచేతనములే యైనను పాలు స్వయముగానే దూడపోషణకొఱకు నెట్లు జారునో, నీరు స్వయముగానే లోకోపకారార్థమై యెట్లు ప్రవహించునో, అట్లే ప్రధానము సైతము ప్రవహించుననుచో సరిగాదు! పాలయందును నీటియందును జేతన సంబంధ ముండియే యున్నది. ఇందులకు బృ॥ V-7-4 'అప్సు తిష్ఠన్' అను శ్రుత్యాదిప్రమాణము సైతము గలదు.

భాష్యము — భాష్యార్థము

(పూర్వపక్షము)

యథా క్షీరమచేతనం స్వభావేనైవ వత్సవివృద్ధయే ప్రవర్తతే, యథాచ జలమచేతనం స్వభావేనైవ లోకోపకారాయ స్యందతే.

అచేతనమైన (తల్లి) పాలు స్వభావముగానే (వత్స వివృద్ధయే=) దూడ యొక్క పోషణము కొఱకు (యథా ప్రవర్తతే =) నెట్లు ప్రవర్తించుచున్నదో (=స్తనములనుండి కదలి దూడనోటిలోనికి జారుచున్నవో) మఱియు నచేతనమైన జలము స్వభావముగానే (లోకోపకారాయ=) లోకోపకారము కొఱకు (యథా స్యందతే=) నెట్లు కదలి పారుచున్నవో.

ఏవం ప్రధాన మప్యచేతనం స్వభావేనైవ పురుషార్థ సిద్ధయే ప్రవర్తిష్యత ఇతి.

(ఏవం=) అట్లే యచేతనమైన ప్రధానముసైతము స్వభావముగానే (పురు... ర్థయే=) పురుషులయొక్క ప్రయోజనము కొఱకు (ప్రవర్తిష్యతే- ఇతి) ప్రవర్తింపఁగలదు (=జగత్సృష్టిని జేయఁగలదు. అనఁగా నందున్న గుణములు హెచ్చుతగ్గులుగాఁ గదలఁబాఱి వివిధ వస్తురూపములను దాల్పఁగలదు)

(సిద్ధాంతి సమాధానము)

నైతత్సాధూచ్యతే.

(ఏతత్ =) ఈ పూర్వపక్షము (సాధు=) సరియని (న+ఉచ్యతే=) చెప్పఁబడదు.

యతస్తత్రాపి పయోంబునోశ్చేతనాధిష్ఠితయోరేవ ప్రవృత్తిరిత్యనుమిమహే.

(యత =) ఎందు చేతనఁగా (చేత .... తయోః) చేతనముతో సంబంధము గల్గిన (తయోః పయోంబునోః + ఏవ=) యట్టి పాలయందును నీటియందును మాత్రమే (ప్రవృత్తిః+ఇతి) క్రియావ్యాపారము జరుగుచున్నదని (అనుమిమహే) యూహించు చున్నాము.

ఉభయవాది ప్రసిద్ధేరథాదావచేతనే కేవలే ప్రవృత్త్యదర్శనాత్.

(ఉభయ ... సిద్ధేః=) పూర్వసూత్రమందు నీవు నేను ఒప్పుకొన్న రథాది దృష్టాంతము చేత (కేవలే+అచేతనే=) కేవల మచేతనములైన (రథాదౌ=) రథా

దులయందు (అశ్వము మొదలగు చేతన సంబంధము లేకుండ (ప్రవృత్త్యదర్శనాత్ =) నడచుటయను క్రియావ్యాపారము సంభవము గాకపోవుట వలన (అట్లు నిశ్చయింపఁ బడుచున్నది)

శాస్త్రంచ

అందులకు శాస్త్రప్రమాణము సైతము గలవు చూడుఁడు.

'యోప్సు & C బృ V _7_4 యోఽప్సుతిష్ఠన్ యోఽపోఽన్తరో యమయతి.

(యః=) ఎవఁడు (అపః + అంతరః=) నీటిలోపల నున్నవాఁడై (యః=) ఎవఁడు (అప్సు =) నీటియందు (తిష్ఠన్ =) నిల్చి యున్నవాఁడై ఆ యుదకములను (యమయతి=) నడపించుచున్నాఁడో

ఏతస్య వా & C బృ V _8_9 ఏతస్యవా అక్షరస్య ప్రశాసనేగార్గి। ప్రాచ్యోఽన్యానద్యః స్యందంతే.

(గార్గి=) ఓగార్గీ! (ఏతస్య + వా + అక్షరస్య=) ఆ యీ అక్షరునియొక్క (ప్రశాసనే=) ఆజ్ఞయందున్నవై. (అన్యాః నద్యః=) మిగిలిన నదులన్నియు (ప్రాచ్యః =) తూర్పుముఖముతో (స్యందంతే=) ప్రవహించుచున్నవి.

ఇత్యేవం జాతీయ కంసమస్తస్య లోకపరిస్పందితస్యేశ్వరాధిష్ఠితాం శ్రావయతి.

(ఇత్యే ... యకం) ఇట్టి ప్రమాణములు (సమస్యస్య లోకపరిస్పందితస్య=) లోకమందుఁ బ్రవహించు (=ప్రవృత్తిని గల్గియుండు) స్వభావముగల సమస్తము (ఈశ్వరాధిష్ఠితాం=) పరమేశ్వరునియొక్క (=చేతనముయొక్క) సంబంధము (=ప్రేరేపణము) గల్గియుండుటనే (శ్రావయతి=) విన్పించుచున్నవి) (చెప్పుచున్నవి)

తస్మాత్ సాధ్యపక్ష నిక్షిప్తత్వాత్ పయోంబవదిత్యనుపన్యాసః.

(తస్మాత్ =) కాబట్టి (సాధ్యపక్ష=) సాధ్యపక్షము అనఁగా అచేతనమందుఁ జేతనసంబంధముతోనే ప్రవృత్తి ఏర్పడుట (ఇదివరకే) సాధింపఁబడి నీవలన నొప్పింపఁబడియున్న యీ విషయము మఱల నిప్పుడు (నిక్షిప్తత్వాత్ =) లేవఁదీయఁబడుట వలన (పయోంబువత్ + ఇతి=) పాలు నీరు- అనునవి స్వయంప్రవృత్తి (తమకుఁదామే కదలుట) గలవియని జూపిన దృష్టాంతవిషయము (అనుపన్యాసః=) నీవు చెప్పఁదగినది కాదు.

(అచేతన మేదియు) చేతన సంబంధములేక ప్రవృత్తిని గలిగియుండనేరదని తెల్పఁబడిన విషయమిదివరకే నీవొప్పుకొని యుండఁగా, మఱల నట్టి యచేతనములనే దృష్టాంతముగాఁ జూపుట నీవు చేయఁదగిన పనిగాదని భావము.)

చేతనాయాశ్చ ధేనోః స్నేహేనేచ్ఛ యావత్సవివృద్ధయే పయసః ప్రవర్తకత్వోపపత్తేః.

(వత్సవివృద్ధయే=) దూడయొక్క పోషణము కొఱకు (చేత ... ధేనోః=) చేతనమైన యావు (స్నేహేన=) దూడయందున్న ప్రేమచేత (ఇచ్ఛయా=) దూడకుఁ బాలీయవలయునను కోర్కెతో (పయసః ... పత్తేః=) బాలను జారవిడుచుచున్నదని చెప్పుటయే సమంజసము.

వత్స చూషణేనచ పయస ఆకృష్యమాణత్వాత్.

మఱియును (వత్సచూషణేన=) చేతనమైన దూడ కుడుచుటచేతఁ (పయసః=) బాలు (ఆకృష్యమాణత్వాత్=) తల్లి పొదుగునుండి లాగఁబడుచున్న వనియుఁ జెప్పవచ్చును. (ఇట్లయినను జేతన సంబంధముతోనే యచేతనములైన పాలు కదలివచ్చుచున్నవి)

నాపాంబునోప్యత్యంతమనపేక్ష.

(అంబునోపి=) పాలేడు జలమునకు సైతము (అత్యంతా=) కేవలముగా (అనపేక్షా=) నితరాపేక్ష (=ప్రేరకము) లేకుండఁగనే ప్రవహింపఁ గల్గుట (నచ=) చూడఁబడదు. (స్వయముగాఁగాక మఱియొకదాని యపేక్ష- అనఁగా ప్రేరేపణము చేతనే నీరు ప్రవహించుచున్నదని చెప్పవలసియుండును.

నిమ్నభూమ్యాద్యపేక్షత్వాత్.

ఆయపేక్ష యేదని యందు రేమో-పల్లపుభూమి-అనఁగా దిగువభూమి పల్లమై యుండుట యను మొదలగునదియే ప్రవాహప్రవృత్తికి నపేక్ష-ఇది ప్రత్యక్షముగాఁ గనుపించు నపేక్ష- పరోక్షముగా మఱియొకటి యుండవచ్చును.

స్యందనస్య చేతనాపేక్షత్వం సర్వత్రోపదర్శితం.

(సర్వత= ప్రతికార్యమందును (స్యందనస్య=) కదలుట యనెడి ప్రవృత్తి =పని) చేతనాపేక్షత్వం=) చేతనసంయోగమువలననే గల్గుచుండుట (శాస్త్రప్రమాణములచే) (ఉపదర్శితా=) చూపఁబడియే యున్నది- (ఈశ్వర ప్రేరణము లేనిది యేమచేతనమందును బ్రవృత్తి గలుగదని శ్రుతిప్రమాణము లు చూపఁబడినవి)

ఉపసంహార దర్శనాన్నేతి చేన్నక్షీరవద్ధి బ్ర॥సూ II-1-24

లోగడి బ్ర॥సూ II-1-24 ఉపసంహార దర్శనాన్నేతి చేన్నక్షీరవద్ధి,

ఇత్యత్రతు బాహ్యనిమిత్త నిరపేక్షమపి స్వాశ్రయం కార్యం భవతీత్యేతల్లోక దృష్ట్యా నిదర్శితం.

(ఇత్యత్ర=) అను సూత్రమునందు (లోకదృష్ట్యా=) లోకానుభవమునుబట్టి (బాహ్యనిమిత్త నిరపేక్షమపి=) బాహ్యసాధన సహాయ మక్కఱలేకయే (పాలనుండి పెరుగునుబోలె) (స్వాశ్రయంకార్యం=)కారణమునుండియే కార్యము బుట్టవచ్చునని (నిదర్శితం=) దృష్టాంతసహితముగాఁ జెప్పఁబడినది. అనఁగా 'కారణమం దాశ్రయించుకొను కార్య ముండనేయున్నది. బాహ్యసాధనాపేక్ష లేకయే కారణమునుండి కార్యము గాఁగలదు' అని బ్ర॥సూ 11-1-24 సూత్రములోఁ జెప్పబడియున్నది. ఇప్పుడన్ననో బాహ్యాపేక్ష లేనిది ప్రవృత్తే కలుగనేరదని చెప్పుచున్నారు. ఈ రెండంశములు పరస్పర విరుద్ధములే యన్నచో అప్పుడు లోకదృష్టినిమాత్ర మనుసరించి చెప్పఁబడినదని భావము.)

శాస్త్ర దృష్ట్యా పునః "సర్వత్రైవేశ్వరాపేక్షత్వ మాపద్యమానం" న పరాణుద్యతే.

(శాస్త్రదృష్ట్యా=) శాస్త్రము బోధించు వాస్తవమిప్పుడు 'సర్వకార్యము లీశ్వరుని సంకల్పము (=ప్రేరణ) మీదనే యాధారపడి జరుగుచున్నవి' అని చెప్పఁబడినది. ఈవిషయ మందుచేఁ (బ్ర॥సూ 11-1-24 చే) (న పరాణుద్యతేననిరస్యతే=) (ద్రోసివేయఁబడలేదు) అనగా రెంటికిని వైరుధ్యము లేదనియు అక్కడ లోకదృష్టి ననుసరించి యిక్కడ శాస్త్రదృష్టి ననుసరించి చెప్పఁబడినదనియు భావము)

4. సూత్రావతారిక :—బాహ్యాపేక్ష లేకయే(చేతన ప్రేరేపణము లేకయే) యచేతనములందుఁ బ్రవృత్తి గలుగనేరదని పూర్వసూత్రమందు నిశ్చయింపఁబడినది ప్రాణుల పూర్వకర్మములుగాని, పురుషుఁడుగాని జగత్సృష్టిని జేయు నచేతనమైన ప్రధానముయొక్క గుణములయందుఁ బ్రవృత్తి గల్గుటకుఁ బ్రేరకము గాఁగూడదా యనివచ్చు పూర్వపక్ష మీసూత్రమందు నిరాకరింపఁ బడుచున్నది.

## ४ సూ॥ వ్యతిరేకానవస్థితేశ్చ నపేక్షత్వాత్

ప. వి :— వ్యతిరేకానవస్థితేః - చ- అనపేక్షత్వాత్ - (ప్రధానం - న - జగత్కారణం)

ప్ర॥ ప॥ అ॥ :— వ్యతి ... స్థితేః. వ్యతిరేక = (ప్రధానముకంటె) వ్యతిరేకముగా, అనవస్థితేః = (మఱియొకటి) లేనందువలనను, చ = మఱియును, అనపేక్షత్వాత్ = (ప్రధానము సాంఖ్యమతానుసారముగా) ఇతరాపేక్ష =(ఇతర ప్రేరకము) లేనిది యగుటవలనను.

సూత్రార్థము :— సాంఖ్యమతానుసారముగా, ప్రధానముకంటె వ్యతిరేకముగా మఱియొకవస్తువు లేనందువలనను, ప్రధానము స్వతంత్రముగానే సృష్టిని జేయుచున్నదని చెప్పఁబడుచుండుట వలనను సాంఖ్యుల ప్రధానము జగత్కారణముగా నేరదు.

సూత్ర భావము :—

(వ్యతిరేకానవస్థితేః) ప్రధానముకంటె వ్యతిరేకమైన మఱియొక వస్తువు అనఁగా ఆప్రధానమును సృష్టికాలమందుఁ బ్రవర్తింపఁ జేయఁగలది గాని లేక ప్రళయకాలమందు నివర్తింపఁ జేయగలదిగాని లేకపోవుటవలన, సాంఖ్యులున్నాడని చెప్పు పురుషుఁ డేపనిని జేయని యుదాసీనుఁడగుటవలన ప్రధాన మనపేక్షమనియె (ఇతర ప్రేరక రహితమనియె) చెప్పవలసి యుండును.

(అనపేక్షత్వాత్ - ఏవ) అందుచేతనే యచేతనమగు నాప్రధానమొకప్పుడు జగత్సృష్టికివలయు మహాదాది రూపమునఁ బ్రవర్తించుటకుఁగాని, మఱియొకప్పుడు ప్రళయానుకూల మగు నివర్తనముఁ జెందుటకుఁగాని సమర్థమగునని చెప్పుట యుక్తముగాదు.

భాష్యము - భాష్యార్థము

సాంఖ్యానాం త్రయోగుణానాం సామ్యేనావతిష్ఠమానానాం ప్రధానం.

(సాంఖ్యానాం=) సాంఖ్యమతానుసారముగా (త్రయో ... మానానాః=) సత్వ రజస్తమోగుణములు మూడును సమానావస్థలో నుండుటయే (ప్రధానం=) ప్రధానమని చెప్పఁబడును.

నతు తద్వ్యతిరేకేణ ప్రధానస్య ప్రవర్తకం నివర్తకం వా కించిద్బాహ్య మపేక్ష్య మవస్థిత మస్తి.

(తద్వ్యతిరేకేణ) ఆ ప్రధానముకంటె వ్యతిరేకముగా (ప్రధా ...కం వా=) నా ప్రధానమును బనిలోఁ బ్రవర్తింపఁ జేయుటకుఁగాని పనినుండి నివర్తింపఁ జేయుటకుగాని (అపేక్ష్యం+అవస్థితం) యవసరమైయున్న (కించిద్బాహ్యం=) మఱియే యితరవస్తు వెంతమాత్రమును (నతు+అస్తి=) లేదుసుమి!

పురుషస్తూ దాసీనో. న ప్రవర్తకో, న నివర్తకః

(పురుషస్తు=) ఆసాంఖ్యు లొప్పుకొను పురుషుఁడన్ననో (న ప్రవ... ర్తకః=) ఆ ప్రధానమును బ్రవర్తింపఁజేయఁ జాలనట్టియు, నివర్తింపఁ జేయఁ జాలనట్టియు (ఉదాసీనః=) నుదాసీనుఁడై యున్నాడు.

ఇత్యతోఽనపేక్షం ప్రధానం.

(ఇత్యతః=) ఇట్లు చెప్పుటవలన (ప్రధానం=) ప్రధానమునునది (అనపేక్షం=) మఱియొక సహాయము (=ప్రేరకము) లేనిదే యగుచున్నది.

అనపేక్షత్వాచ్చ కదాచిత్ప్రధానం మహదాద్యాకారేణ పరిణమతే. కదాచిన్నపరిణమత ఇత్యేత దయుక్తం.

(అనపేక్షత్వాచ్చ=) (అచేతనమగు) ఆప్రధాన మసహాయమగుటచే (కదా ... పరిణమతే=) ఒకప్పుడు (సృష్టికివలయు) మహదాది రూపమును బొందఁగలదు, (కదా ... మతే=) మఱియొకప్పుడు పొందలేదు. (ఇత్యే ... యుక్తం=) అని చెప్పుట సాధ్యముగాదు.

ఈశ్వరస్యతు సర్వజ్ఞత్వా త్సర్వశక్తిత్వా న్మహామాయత్వాచ్చ ప్రవృత్త్య ప్రవృత్తీన విరుధ్యతే,

(ఈశ్వరస్య తు=) మా వేదాంతమతములోని యీశ్వరుఁడన్ననో, సర్వ .... త్వాచ్చ=) సర్వజ్ఞుఁడు, సర్వశక్తి గలవాడు, మహామాయతోఁ గూడుకొన్న వాఁడునై యున్నందున నతనికి (ప్రవృత్తిః+అప్రవృత్తిః) నొకప్పుడు ప్రవృత్తి (క్రియా వ్యాపారము) యుండగలదనియు, మఱియొకప్పు డప్రవృత్తి (ఉదాసీనత్వము) యుండఁగలదనిఁ జెప్పుట (నవిరుధ్యతే=) విరుద్ధ మెంతమాత్రమును గాదు.

5. సూత్రావతారిక :— ప్రధానముకంటె వ్యతిరేకముగా మఱి యేయితర వస్తువును సాంఖ్యమతమునందు లేనందున, అచేతనమైన ప్రధానము జగత్సృష్టిని జగత్ప్రళయమును జేయుటకు సమర్థము గాదని పూర్వసూత్రమందుఁ జెప్పఁబడినది. ప్రధానము సృష్టి ప్రళయములకు పలయు రూపములను స్వభావముగానే యేల పొందఁగూడదని కొన్ని లౌకిక దృష్టాంతములతోఁ జేయఁబడు పూర్వపక్ష మీ సూత్రమందు ఖండింపఁ బడుచున్నది.

## ౫ సూ॥ అన్యత్రాభావాచ్చ న తృణాదివత్

వ॥ వి॥ — అన్యత్ర - అభావాత్ - చ - న తృణాదివత్.

అన్వయక్రమము :— తృణాదివత్ - న - అన్యత్ర - అభావాత్ - చ

ప్ర॥ వ॥ అ॥ — తృణాదివత్ = గడ్డి మొదలగువానికివలె న= (ప్రధానము నకుఁ బరిణామము) లేదు, అన్యత్ర = (అట్టి పరిణామము ఆవు మొదలగు వాని యందుకంటె) ఇతరస్థలములయందు అభావాత్ చ= లేకపోవుట వలనను.

సూత్రార్థము :— తృణాదులకువలెఁ బ్రధానమునకుఁ బరిణామము లేదు. తృణాదులు క్షీరములుగాఁ బరిణమించుట గోవులు మొదలగు వానియందుఁ గాక యితరస్థలములయందు కనుపించక పోవుటవలన.

సూత్రభావము :—

(తృణాదివత్ =) గడ్డి మొదలగు పశ్వాదు లుపయోగించు మేత నిరపేక్షము గానే అనఁగా- ఇతర సహాయము లేకయే స్వభావముగా నావులు మొదలగు జంతు వులయందుఁ బాలు మొదలగు వస్తువులుగ ఁ బరిణామమును జెందుచున్నవి. అట్టి స్వభావ పరిణామమే ప్రధానమునకు సైతము గల్గునని (న) చెప్పుట యుక్తము గాదు, (అన్యత్రాభావాత్) ఆగడ్డి మొదలగువానినే యెద్దులు మొదలగు జంతు వులు తిన్నప్పుడుగాని ఏదోయొక గుంటలోఁ బడవేసినప్పుడుగాని అవి పాలుగా మాఱకపోవుటవలన గడ్డి మొదలగునవి పాలుగాఁ బరిణామమును జెందుటకు హేతువు ఆవు మొదలగు కొన్ని కొన్ని ప్రత్యేక జంతువులు తినుటయేయని యెంచ వలసి యున్నది. గడ్డి యదిమేమి జంతువులయందు స్వభావముగానే పాలుగామారు ననునియమములేదు కాబట్టి 'గడ్డి' మొదలగువాని దృష్టాంతముమీద నాధారపడి ప్రధానమునకు సైతమట్టి పరిణామము గల్గునని చెప్పుట కవకాశములేదు.

భాష్యము — భాష్యార్థము

సాంఖ్య పూర్వపక్షము :—

స్యాదేతత్.

ఇది యట్లు యగునుజుమా! చూడుడు.

యథాతృణపల్లవోదకాది నిమిత్తాంతరనిరపేక్షం స్వభావాదేవ క్షీరాద్యాకారేణ పరిణమతే.

(తృణపల్లవోదకాది=) గడ్డి - తీగెలు - నీరు మొదలగునవి (నిమి... పేక్షం) =మఱియొకదాని యపేక్ష (=సహాయము) లేకుండగనే (స్వభావాదేవ=) స్వభావముగానే (క్షీరాద్యాకారేణ=) పాలు మొదలగు వస్తువులుగా (యథా పరిణమతే=) నెట్లు మారుచున్నవో,

ఏవం ప్రధానమపి మహదాద్యాకారేణ పరిణంస్యత ఇతి.

(ఏవం=) అట్లె ప్రధానముసైతము (మహ ... రేణ=) మహత్తు మొదలగు వస్తురూపముగాఁ (పరిణంస్యత ఇతి) బరిణమించుచున్నది యని చెప్పుచున్నారము.

కథంనిమిత్తాంతర నిరపేక్షంతృణాదీతి గమ్యతే,

(తృణాది=) గడ్డి మొదలగునవి (నిమి .... పేక్షం=) మఱియొకదాని సహాయములేకుండఁ (కథం ... ఇతి గమ్యతే=) బాలు మొదలగు రూపములను బొందుచున్నదని యెట్లు తెలిసికొనఁ దగియున్నదని యందురేమో!

నిమిత్తాంతరా నుపలంభాత్.

మఱియొకదాని సహాయమున్నట్లు (అనుపలంభాత్=) కనుపడకపోవుటవలననే (యట్లు చెప్పినాము)

యదిహి కించిన్నిమిత్తాంతర ముపలభేమహి, తతో యథాకామం తేనతేన నిమిత్తేన తృణాద్యుపాదాయ క్షీరం సంపాదయేమహి. నతు సంపాదయామహే.

(కించి ... తరం=) మఱియొకదాని సహాయ మెంతపాటిదైనను (యది ఉపలభేమహి=) మనము చూడఁగల్గినచో, (తతః=) అప్పుడు (యథాకామం=) మన యిష్టమువచ్చినట్లుగా (తేన తేన నిమిత్తేన=) ఆ యా సహాయపడిన వస్తువులతో (తృణాద్యుపాదాయ=) గడ్డి మొదలగు వానిని జేర్చినట్లయినఁ (క్షీరం ... మహి) బాలు మొదలగు పరిణామ వస్తువులను బొందఁగల్గి యుందుము, కాని (నతు ...

మ హే=) అట్లు పొందుట లేదు. (సహాయపడినదని మన మనుకొన్న యేయితరవస్తువుతో గడ్డి చేర్చి చూచినను పాలు పుట్టుట లేదు అని భావము.)

తస్మాత్స్వాభావిక స్తృణాదేః పరిణామః.

కాఁబట్టి గడ్డి మొదలగునవి పాలుగాఁ బరిణామమును (=మార్పును) జెందుట (స్వాభావికః=) ఆగడ్డి మొదలగు మొదటివస్తువుయొక్క స్వభావమే యగునుగదా!

తథా ప్రధానస్యాపి స్యాదితి.

(తథా=) అట్లె (మహదాది వస్తురూపమును దాల్చుట) ప్రధానమునకు సైతము (స్వభావమే యని నిశ్చయముగాఁ జెప్పుచున్నాము.)

సిద్ధాంతి సమాధానము :—

అత్రోచ్యతే.

సమాధానము చెప్పుచున్నాము; వినుఁడు.

భవే త్తృణాదివత్ ప్రధానస్య స్వాభావికః పరిణామో యది.

(తృణాదివత్) గడ్డి మొదలగువానికిఁ బాలుగా మాఱుపరిణామము (యది స్వాభావికః) వానియొక్క స్వభావమే యైనచో, నట్లే (ప్రధానస్య=) ప్రధానమునకును మహదాదులుగా మాఱుపరిణామము (స్వాభావికః భవేత్=) స్వభావమే కావచ్చు ననుకొందము.

తృణాదేరపి స్వాభావికః పరిణామోఽభ్యుపగమ్యేత; న త్వభ్యుపగమ్యతే; నిమిత్తాంతరోపలబ్ధేః.

(తృణాదేరపి పరిణామః=) గడ్డి మొదలగువాని విషయములోనైనను, ఆపరిణామము (స్వాభావికః అభ్యుపగమ్యేత=) వానికి స్వభావమె యని యెంచవలయునుగదా; కాని (న త్వభ్యుపగమ్యతే=) వాని కది స్వభావమైనట్లు కనుపించుట లేదే! (నిమి ... లబ్ధేః) అట్లు గడ్డి పాలుగా మాఱుటకు మఱియొక హేతు వేదియో యున్నట్లుగా స్ఫురించుచున్నది.

ఎదిరిప్రశ్న :—

కథం నిమిత్తాంతరోపలబ్ధిః ?

మఱియొక హేతువు స్ఫురించుచున్నదని యెట్లు చెప్పెదరు?

సమాధానము :—

అన్యత్రాభావాత్.

గడ్డి కాపరిణామము మఱియొకచోటఁ గన్పించకపోవుటవలననే. (ఎట్లనఁగా:

ధేన్వైవ హ్యుపయుక్తం తృణాది క్షీరీభవతి.

ధేన్వా + ఏవ-హి + ఉపయుక్తం) ధేనువులు మొదలగు నాఁడుజంతువుల చేత నుపయోగింపఁబడిన (తినఁబడిన) (తృణాది - ఏవ) గడ్డి మొదలగునవిమాత్రమే (క్షీరీభవతి) పాలుగా మాఱుచున్నవి.

న ప్రహీణ మనడుహా ద్యుపయుక్తం వా.

(ప్రహీణం=) పాఱవేయఁబడినదిగాని లేక (అనడు ... క్తంవా) ఎద్దులు మొదలగు మగజంతువులచేతఁ దినఁబడినదిగాని (న=) పాలుగా మాఱుట లేదుగదా.

యదిహి నిర్నిమిత్త మేత త్స్యా ద్ధేనుశరీరసంబంధా దన్యత్రాపి తృణాది క్షీరీభవేత్.

(ఏతత్ =) గడ్డి పాలుగా మాఱుట యనునది (నిర్నిమిత్తం - యది స్యాత్ =) మఱియొకనిమిత్తము (=హేతువు) వలనఁ గాని దైనచో (అనఁగా గడ్డి కాపాలుగా మాఱుట స్వభావమే యైనచో, (ధేను ... త్రాపి=) ధేనుశరీరసంబంధము లేని మఱియొకచోటఁగూడను (తృణాది .... భవేత్) ఆగడ్డిమొదలగునవి పాలుగా మాఱ వలసియుండును.

నచ యథాకామం మానుషై ర్న శక్యం సంపాదయితు మిత్యేతావతా నిర్నిమిత్తం భవతి.

(యథాకామం) తమయిచ్చవచ్చినతీరుగా మఱియెట్లైనను (సంపాదయితుం=) గడ్డిని బాలుగాఁ జేయుట (మానుషైః=) మనుష్యులకు (నశక్యం + ఇతి) సాధ్యము గానిపని యని (యథా - ఏతావతా) యెట్లు నిశ్చయింపఁ గల్గుచున్నామో యందు చేతనే (నిర్నిమిత్తా నచ భవతి=) గడ్డి పాలుగా మాఱుట (దానిస్వభావమువలనఁ గాక) కారణాంతరము లేక యగుట లేదని నిశ్చయింపఁగల్గుచున్నాము.

భవతిహి కించి త్కార్యం మానుషసంపాద్యం, కించి ద్దైవసంపాద్యమ్.

మనుష్యులచేతఁ జేయఁబడఁగల్గినవి కొన్నిపనులును, దైవముచేతనే చేయఁ బడఁగల్గినవి కొన్నిపనులును నుండును.

మనుష్యా అపిచ శక్నువంత్యేవ స్వోచితే నోపాయేన తృణా ద్యుపాదాయ క్షీరం సంపాదయితుం; ప్రభూతంహి క్షీరం కామయమానాః ప్రభూతం ఘాసం ధేనుం చారయంతి,

(మను ... అపిచ=) మనుష్యులుసైతము (స్వోచితే నోపాయేన=) తమకు దగినయుపాయములచేత (తృణాది+ఉపాదాయ=) గడ్డి మొదలగువానిని దెచ్చి (క్షీరం సంపాదయితుం=) పాలను జేకూర్చుటకు (శక్నువంతి+ఏవ) సమర్థులే యగుచున్నారు. (కాని యీవిషయములో మనుష్యులపని యెంతవఱకో యెట్టిదియో చూడుఁడు)

(ప్రభూతంహి క్షీరం) ఎక్కువపాలను జేకూర్చవలయునని కోరువారు (మనుజులు) (ప్రభూతం ఘాసం=) ఎక్కువగడ్డిని (ధేనుం చారయంతి) ఆవును మేపుదురు.

తతశ్చ ప్రభూతం క్షీరం లభంతే.

(తతశ్చ=) అందుచే (ప్రభూతం క్షీరం=) నెక్కువపాలను (లభంతే) బొందుదురు. (మనుష్యులు చేయఁగలపని యింతదే - యిట్టిదియె. - గడ్డి పాలుగా మాఱుటకుఁ గారణాంతర ముండును- అదియే దైవకార్యము. ఆవుకడుపులోవలిజీర్ణాది శక్తిమాత్రమే కారణాంతరమని చెప్పుట చాలదు. ఇందును దైవకార్య ముండియే తీరును.)

తస్మా న్న తృణాదివత్ స్వాభావికః ప్రధానస్య పరిణామః.

కాఁబట్టి గడ్డి మొదలగువానికిఁ బాలుగా మాఱుట స్వభావ మైనట్లుగానే ప్రధానమునకును జగత్తుగా మాఱుట స్వభావమని చెప్పఁదగదు.

(గడ్డి మొదలగువాని కది స్వభావము కాదని ఋజువుచేయఁబడినది చూచితిరిగదా.)

6. సూత్రావతారిక :— జగత్తుగా మాఱుట ప్రధానమునకు స్వభావముగా నేరదని పూర్వసూత్రమందుఁ జెప్పఁబడినది. దాని కట్టిస్వభావ మున్న దనుకొన్నను నిష్ప్రయోజన మనుదోషము సాంఖ్యమతసిద్ధాంతమునకుఁ బట్టకపోదని యీ సూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౬ సూ॥ అభ్యుపగమేఽ ప్యర్థాభావాత్

ప॥ వి॥ :— అభ్యుపగమే - అపి - అర్థాభావాత్.

ప్ర॥ ప॥ అ॥ :— అభ్యుపగమే = జగత్తుగా మాఱుట ప్రధానమునకు స్వభావమేయని యంగీకరించినపక్షమందు; అపి=కూడ; అర్థాభావాత్; అర్థ=ప్రయోజనము, అభావాత్ = లేకపోవుటవలన.

సూత్రార్థము :— (జగత్తుగా మారుట ప్రధానమునకు స్వాభావమే యను విషయము) అంగీకరించినపక్షమందైనను, ప్రయోజనము లేకపోవుట యనుదోష ముండుటవలన (సాంఖ్యమతసిద్ధాంతము సరి గాదు)

సూత్రభావము :— (అభ్యుపగమేఽపి) ప్రధానమునకు స్వాభావసిద్ధ మైన జగత్సృష్ట్యనుకూలప్రవృత్తి (=క్రియావ్యాపారము) కలదని యంగీకరించుపక్షమం దైనను

(అర్థాభావాత్) ప్రధానమున కున్నదని చెప్పఁబడునట్టి ప్రవృత్తికిఁ బ్రయోజనము లేకపోవుటవలన సాంఖ్యసిద్ధాంతమునకుఁ బట్టినదోషము వదలిపోదు.

అచేతనమే యని యొప్పుకొనఁబడు ప్రధానము 'పురుషున కీప్రయోజనమును జేకూర్చెదను' అనుబుద్ధితోఁ బ్రవర్తింపఁగలదని చెప్పుట యసంభవము. పురుషుఁడు అనాధేయాతిశయము గలవాఁడు (అనఁగాఁ గొత్తగాఁ దెచ్చిపెట్టఁదగిన యతిశయముతోఁ బనిలేనివాఁడు) గావున నట్టివానికి భోగ మనునతిశయమునుగాని, యపవర్గ మనునతిశయమునుగాని ప్రధానము చేకూర్చఁగల దనుట యతిప్రసంగము.

భాష్యము — భాష్యార్థము

స్వాభావికీ ప్రధానస్య ప్రవృత్తి ర్న భవతీతి స్థాపితమ్.

ప్రధానమునకు (స్వాభావికీ ప్రవృత్తిః=) స్వభావసిద్ధమైన ప్రవృత్తి (=క్రియావ్యాపారము) (నభవతీతి=) యుండఁజాలదని (పూర్వసూత్రమందు) (స్థాపితం=) స్థాపింపఁబడినది.

అథాపినామ భవత శ్శ్రద్ధా మనురుధ్యమానాః స్వాభావికీమేవ ప్రధానస్య ప్రవృత్తి మభ్యుపగచ్ఛేమ: తథాపి దోషోఽనుషజ్యేతైవ.

(అథాపి=) అట్లయినను, (భవతః ... మానాః=) నీవు శ్రద్ధతో - అనఁగా-మూఢవిశ్వాసముతో నవలంబించియున్న మీసిద్ధాంతమును- అనఁగా (స్వాభా... ప్రవృత్తిం=) ప్రధానమునకు స్వభావసిద్ధమైన ప్రవృత్తి (=క్రియావ్యాపారము) గలదనువిషయమును (అభ్యుపగచ్ఛేమ నామ) మేముగూడ నంగీకరింతుమే యనుకొనుఁడు- (తథాపి=) అప్పటికిని (దోషః=) మీసిద్ధాంతమునకు దోషము (అనుషజ్యేత+ఏవ=) వెంటఁబడి రానే వచ్చును.

కుతః ?

దోష మేల వచ్చు నందువేమో!

అర్థాభావాత్.

అందుచేఁ బ్రయోజనము లేకపోవుటవలననే.

యది తావత్ స్వాభావికీ ప్రధానస్య ప్రవృత్తిః, న కించి దన్య దపేక్షత ఇత్యుచ్యేత, తతో యథైవ సహకారి కించి న్నాపేక్షతే, ఏవం ప్రయోజనమపి కించి న్నాపేక్షత, ఇత్యతః ప్రధానం పురుషస్యార్థం సాధయితుం ప్రవర్తత' ఇతీయం ప్రతిజ్ఞా హీయేత.

(తావత్ =) ఇప్పుడు (స్వాభా .... ప్రవృత్తిః ఇతి=) జగత్సృష్టికిఁ గావలయు ప్రవృత్తి ప్రధానమునకు స్వభావముగానే యున్నదనియు, (నకించిత్ ... క్షతే ఇతి=) ఆవిషయములో నది మఱియే యితరసహాయమును నపేక్షింపదనియు (యది+ ఉచ్యేత) నీచేఁజెప్పఁబడుచో (యథా+ఏవ సహా...క్షతే=) ఏయితరసహాయమును నపేక్షింపకపోవుట యెట్లో (ఏవం ప్రయో - పేక్షతే ఇతి=) అట్లే యేప్రయోజన మునుసైత మపేక్షింపకయే యది యాప్రవృత్తిలోనికి దిగుచున్నదనియు నీ వంగీక రించవలసి వచ్చును. (అతః=) అందుచే (=అప్పుడు) (ప్రధానం ... వర్తతే ఇతి) 'పురుషునకుఁ బ్రయోజనమును జేకూర్చుటకే ప్రధానము జగత్సృష్టివ్యాపారములోఁ బ్రవర్తించుచున్నది' యనెడి (ఇయం ప్రతిజ్ఞా =) నీసాంఖ్యసిద్ధాంతప్రతిజ్ఞ (హీయేత=) భంగపడిపోవును.

స యది బ్రూయా త్సహకార్యేవ కేవలం నాపేక్షతే. న ప్రయోజనమపీతి.

(సః=) ఆసాంఖ్యుఁడవైననీవు (సహా ... కేవలం=) 'ఆప్రధాన మితరసహాయ మొక్కదానినిమాత్రమే (న+అపేక్షతే=) యపేక్షింప' దని (బ్రూయాత్ యది=) చెప్పినఁజెప్పుదువుగాక ! (న- ప్రయోజనమపీతి=) ప్రయోజనమునుసైత మది యపే క్షింపదనియు (న బ్రూయాత్ = నీవు చెప్పరాదుసుమా.

(సాంఖ్యులు ప్రధానమునకు స్వతంత్రప్రవృత్తిని జెప్పుటయెగాక ప్రయోజనా పేక్షనుసైతము చెప్పుదురు.)

తథాపి ప్రధానప్రవృత్తేః ప్రయోజనం వివేక్తవ్యం (ఎ) భోగో వా స్యాత్ (బి) అపవర్గో వా (సి) ఉభయం వేతి.

(తథాపి=) ఆమీసిద్ధాంతానుసారమైనను బ్రధానప్రవృత్తికిఁ బ్రయోజన మును (వివేక్తవ్యం=) బ్రత్యేకించి చూపవలసినభారము మీయందున్నది. (మీరు చెప్పెడిప్రయోజనము లెట్టివనఁగా) (1) (ఎ) (భోగః వా=) పురుషులకు

భోగమో, (2) (బి) (అపవర్గశ్చవా) మోక్షమో, (3) (సి) (ఉభయంవా) లేక, యారెండునో (స్యాత్ =) వైయుండవలయునుగదా !

(ఎ) భోగశ్చేత్ కీదృశోఽనాధేయాతిశయస్య పురుషస్య. భోగో భవే దనిర్మోక్షప్రసంగశ్చ

(ఎ) భోగమందురా ! ఎట్టి దది? (అనా .... యస్య=) మీసిద్ధాంతమునందుఁ బురుషుఁడనఁగా ఆధేయాతిశయము (క్రొత్తగాఁ దెచ్చిపెట్టఁబడిన యతిశయము) లేని వాఁడుగదా ! అనఁగా మీసిద్ధాంతానుసారము పురుషుఁడు పరిపూర్ణుఁడుగదా!)

(భోగో భవేత్ =) అట్టిపురుషునకు భోగమే యున్నదని చెప్పుచో, (అనిర్మో ....గశ్చ=) (వెంటనే) వానికి మోక్షమే లే దనవలసి వచ్చునుసుమీ !

(బి) అపవర్గశ్చే త్ప్రాగపి ప్రవృత్తే రపవర్గస్య సిద్ధత్వాత్.

లేక (ప్రధానము సృష్టిచేఁ బురుషునకుఁ గావించుప్రయోజనము) (అపవర్గశ్చేత్ =) మోక్షమందురా ! (ప్రాగపి ప్రవృత్తేః=) ప్రధానము పూనడిప్రవృత్తికి ముందే (అప ... త్వాత్) మోక్ష మాపురుషునకు సిద్ధమే వైయున్నది. గావున,

ప్రవృత్తి రనర్థికా స్యాత్; శబ్దాద్యనుపలబ్ధిప్రసంగశ్చ.

(ప్రవృత్తి ... స్యాత్ =) మోక్షమునకై పూనడియాప్రవృత్తి వ్యర్థమే యగును. అంతియేగాక (పురుషునకు మోక్షమును లభింపఁజేయుటయే ప్రధానము యొక్క యభిప్రాయమన్నచో) ప్రధానము తనప్రవృత్తిచే సృష్టింపఁబోవు (శబ్దా .... సంగశ్చ=) శబ్దాదు లనెడివిషయములయొక్క యనుభవమే (=ఉపలబ్ధి) పురుషునకు లేదని చెప్పవలసివచ్చును.

(సి) ఉభయార్థతాభ్యుపగమేఽపి భోక్తవ్యానాం ప్రధానమాత్రాణా మానంత్యా దనిర్మోక్ష ప్రసంగ ఏవ.

(సి) (ఉభ ... గమేఽపి=) పోనీ! భోగము- మోక్షము- అనునీరెండు ప్రయోజనములను బ్రధానము తనప్రవృత్తిచే (సృష్టివ్యాపారముచే) బురుషునకుఁ జేయు ననుకొందము. అట్లయినను (ప్రధానమాత్రాణాం=) ప్రధానము గావించు సృష్టివిశేషములు (ఆనంత్యాత్ =) అంతులేకుండ నున్నవగుటచే (అనిర్మోక్షప్రసంగ ఏవ=) ఆయాభోగములనుండి పురుషున కెప్పటికిని మోక్షమే లేకపోవలసివచ్చును. (ప్రధానమునకుఁ గోరిక యొకటి యుండి, యాకోర్కెను దీర్చుకొనుటకుఁగాను బ్రవృత్తిని (=సృష్టివ్యాపారమును) నవలంబించిన దందు రేమో)

న చౌత్సుక్యనివృత్త్యర్థా ప్రవృత్తిః.

(ప్రవృత్తిః =) మఱియును ప్రధానము పూనుసీప్రవృత్తి (ఔత్సుక్య =) దానికిఁ గలకోరికను (నివృత్త్యర్థా-న=) నివృత్తిచేసికొనుటకై (=తీర్చుకొనుటకై) కానోవదు.

నహి ప్రధాన స్యాచేతన స్యౌత్సుక్యం సంభవతి,

ఏలయందురా, యచేతనమైనప్రధానమునకుఁ(ఔత్సుక్యం=) గోర్కె యనునది (న సంభవతి=) సంభవమే గాదు,

నచ పురుషస్య నిర్మలస్య నిష్కల స్యౌత్సుక్యమ్.

(లేక పురుషునియొక్క కోరికను దీర్చుటకై ప్రధాన మీాపనిని బూనెనన్నచో) కేవలనిర్మలుఁడు, నిష్కలుఁడు నైనపురుషునకుఁ గోర్కె యనునది యెట్లుండఁగలదు ! (కోర్కెయే యుండఁజాలదు)

(ప్రధానమునకు సృష్టియందుఁ బ్రవృత్తియే లేకపోవుచో)

దృక్ఛక్తి సర్గశక్తి వైయర్థ్యభయాచ్చేత్ ప్రవృత్తిః,

(దృక్ఛక్తి=) పురుషునకుఁగల) చూచు (=భోగాదు లనుభవించు) నేర్పును, (సర్గశక్తి=) ప్రధానమునకుఁ గలసృష్టించునేర్పును (వైయర్థ్యభయాత్=) నిష్ప్రయోజనములై పోవునుగావున (ప్రవృత్తశ్చేత్=) ప్రదానమునకుఁ బ్రవృత్తి నారోపించుచున్నామందు రేమో,

తర్హి దృక్ఛక్త్యనుచ్ఛేదవత్. సర్గశక్త్యనుచ్ఛేదా. త్సంసారానుచ్ఛేదా దనిర్మోక్షప్రసంగఏవ,

(తర్హి=) అట్లగుచో (దృక్ఛక్త్యనుచ్ఛేదవత్=) పురుషునియొక్క దృక్ఛక్తి నిత్యమై (=అనుచ్ఛేద) యున్నట్లె, (సర్గశక్త్యనుచ్ఛేదాత్=) ప్రధానముయొక్క సృష్టిశక్తియు నిత్యమేమై యున్నందునను, (సంసారానుచ్ఛేదాత్=) పురుషునకు సంసార మావిధమున నిత్యమే యగుచుండుటవలనను (అనఁగాఁ బ్రధానము సృష్టించుచుండుట- పురుషుఁడు భోగించుచుండుట - ఈవిధమునఁ బురుషునకు సంసారసంబంధ మేర్పడుట- ఈమూఁడును నెడతెగకుండ వచ్చుచున్నవే యైనందున)

(అనిర్మోక్షప్రసంగఏవ =) పురుషున కెన్నటికిని మోక్షమే లే దనవలసి వచ్చును.

తస్మా త్ప్రధానస్య పురుషార్థాప్రవృత్తి రిత్యేత దయుక్తమ్,

కాఁబట్టి పురుషునకు భోగాపవర్గము లనెడిప్రయోజనములను జేకూర్చుటకుఁ బ్రధానము ప్రవృత్తిని (సృష్టివ్యాపారమును) గావించుచున్నదనుట (అయుక్తం=) యసందర్భము (=సరి కాదు)

7. సూత్రావతారిక :— ప్రధానము సృష్టిప్రవృత్తి బూనుటకు వలయు ప్రయోజన మొకటి యున్నదని చెప్పుట యసంభవ మైనందునఁ బ్రధానము జగత్సృష్టికర్త గానేరదని పూర్వసూత్రమందు సహేతుకముగాఁ జెప్పఁబడినది. ప్రధాన సృష్టిప్రవృత్తికి హేతువు పురుషప్రేరణ మేల కాఁగూడదని వచ్చుపూర్వపక్షమీసూత్రమందుఁ బరిహరింపఁబడుచున్నది.

## 8 సూ॥ పురుషాశ్మవదితి చేత్, తథాపి

ప॥ వి॥ — పురుషాశ్మవత్ - ఇతి - చేత్ - తథాపి.

ప్ర॥ ప॥ అ॥ — పురుషాశ్మవత్; పురుష= (పంగుపురుష) కుంటివానియొక్కయు, అశ్మ= (రాయి) సూదంటురాయియొక్కయు, (సాన్నిధ్యము) వత్ = వలె. ఇతిచేత్ =అనియనుచో; తథాపి=అప్పుడును, (దోష ముండనే యుండును )

సూత్రార్థము :— కుంటివాఁడు గ్రుడ్డివానినివలె, సూదంటురాయి యినుపముక్కనువలెఁ బురుషుఁడు ప్రధానమును బ్రవర్తింపఁజేయు నన్నచో, నప్పటికిని దోషము విడిచి పోదు.

సూత్రభావము :— (పురుషాశ్మవత్.)

దృష్టిశక్తి గలిగినట్టియు నడువలేనట్టియుఁ బంగుపురుషుఁడు - (అనఁగాఁ గుంటివాఁడు) దృష్టిశక్తి లేనట్టియు, నడువఁగలిగినట్టియు నంధపురుషుని - (అనఁగా గ్రుడ్డివానిని) నడిపింపఁజేయఁగల్గుట యెట్లో, సూదంటురాయి తనయందుఁ జలనశక్తి లేనప్పటికి నినుపముక్కను జలింపఁజేయుట యెట్లో (ఇతిచేత్) యట్లే పురుషుఁడును (తనసాన్నిధ్యముచేత) బ్రధానమును బ్రవర్తింపఁజేయుచున్నాఁడని సాంఖ్యుఁ డన్నచో (తథాపి) అట్లు వాదించినను సాంఖ్యమతప్రతిజ్ఞలు (సిద్ధాంతములు) రెండును- అనఁగా (1) ప్రధానము స్వతంత్రప్రవృత్తి గలది. (2) పురుషుఁ డుదాసీనుఁడు- అనునవి భంగపడిపోవును.

భాష్యము — భాష్యార్థము

యథా కశ్చిత్పురుషో దృక్ఛక్తిసంపన్నః ప్రవృత్తిశక్తివిహీనః పంగు, రపరం పురుషం ప్రవృత్తిశక్తిసంపన్నం దృక్ఛక్తివిహీన మంధ. మధిష్ఠాయ ప్రవర్తయతి.

(దృక్ఛక్తి...పన్నః) దృష్టిశక్తి గలవాఁడును (ప్రవృ... హీనః=) ప్రవృత్తి (=నడక) శక్తి లేనివాఁడును (పంగుః =) కుంటివాఁడునునగు (కశ్చిత్పురుషః =) నొకానొకపురుషుఁడు (ప్రవృ ... పన్నం) నడకశక్తి గలిగినట్టియు (దృక్ఛ ... హీనం =) దృష్టిశక్తి లేనట్టియు (ప్రవృ ... పన్నం =) నడకశక్తి గల్గినట్టియు (అంధం=) గ్రుడ్డివాఁడైన (అపరం పురుషం=) మఱియొకనిని (అధిష్ఠాయ=) సంబంధింపఁజేసికొని- అనఁగాఁ బ్రేరేపించుచు (యథా ప్రవర్తయతి=) ఎట్లు ప్రవర్తింపఁజేయునో (నడువలేనికుంటివాఁడు చూడలేనిగ్రుడ్డివానిపై నెక్కి ప్రేరేపించుచు నెట్లు నడిపించునో- యనిభావము)

యథా హ్యయస్కాంతోఽశ్మా స్వయ మప్రవర్తమానోఽప్యయః ప్రవర్తయతి.

(వా=) మఱియు (అయస్కాంతః అశ్మా=) సూదంటురాయి (స్వయం .... మానోఽపి=) తాను స్వయముగాఁ గదలలేనిది యైనప్పటికిని (అయః=) ఇనుమును (యథా ప్రవర్తయతి=) ఎట్లు చలింపఁజేయునో

ఏవం పురుషః ప్రధానం ప్రవర్తయిష్యతీతి దృష్టాంతప్రత్యయేన పునః ప్రత్యవస్థానమ్.

(ఏవం =) అట్లే పురుషుఁడు ప్రధానమును బ్రవర్తింపఁజేయఁగలఁడని (దృష్టాంత... యేన=) దృష్టాంతజ్ఞానముచేత (పునః=) లోఁగడివిషయమే మరల (ప్రత్యవస్థానం=) నారంభింపఁబడినది. (Resumed)

అత్రోచ్యతే. తథాపి నైవ దోషా న్నిర్మోక్షోఽస్తి.

సమాధానము చెప్పుచున్నాము. (తథాపి=) దృష్టాంతములు చూపఁబడినను (దోషాత్ =) రానున్నదోషమునుండి (నిర్మోక్షః=) విడుదల (న + అస్తి + ఏవ) లేనే లేదు.

అభ్యుపేతహానం తావ ద్దోష ఆపతతి.

(తావత్ =) అట్లొందుటలన నఁగా, సాంఖ్యమతప్రాజ్ఞులు- అనఁగా (అభ్యుపేత=) అంగీకరింపఁబడిననియమమును (హానం=) వదలుట - యను (దోషః =) దోషము గలుగును.

ప్రధానస్య స్వతంత్రస్య ప్రవృత్త్యభ్యుపగమాత్.

(దోషము గల్గుట యెట్లంటేని సాంఖ్యప్రతిజ్ఞలకు భంగము గలుగుట మూలముగానే ఆప్రతిజ్ఞ లేవి యనఁగా-)

(స్వాతంత్ర్యస్య ప్రధానస్య =) స్వతంత్రమైన - అనఁగా మఱి దేనియొక్క సాహాయ్యమును గోరనిప్రధానమునకుఁ (ప్రవృత్త్యభ్యుపగమాత్ =) ప్రవృత్తి గలదని యొప్పుకొనుట (ఇది యొకప్రతిజ్ఞ)

పురుషస్య చ ప్రవర్తకత్వానభ్యుపగమాత్.

(పురుషస్య) పురుషునకుఁ (ప్ర .... గమాత్ =) ప్రవర్తింపఁజేయఁగలుగుట లేదని యొప్పుకొనుట - (ఇది మఱియొకప్రతిజ్ఞ)

(అనఁగా- (1) ప్రధానము స్వయముగాఁ బ్రవర్తించుననియు (2) పురుషుఁడెట్టిపనిని జేయక యుదాసీనుఁడనియు- నీరెండు సాంఖ్యమతసిద్ధాంతములు)

కథం చోదాసీనః పురుషః ప్రధానం ప్రవర్తయేత్?

(ఉదా ... రుషః=) ఉదాసీనుఁడే యని చెప్పఁబడుచున్నపురుషుఁడు (ప్రధానం=) ప్రధానమును (కథం ప్రవర్తయేత్ =) ఎట్లు ప్రవర్తింపఁజేయఁగలఁడు? (=ప్రేరేపింపఁగలఁడు?)

పంగురపి హ్యంధం పురుషం వాగాదిభిః ప్రవర్తయతి.

కుంటివానిదృష్టాంతములో నైనను- ఆకుంటివాఁడు గ్రుడ్డివానిని దనమాటలు మొదలగుప్రేరకములచేతఁ (అటుపో - ఇటుపో అనుటచేత) బ్రవర్తింపఁజేయుచున్నాఁడు. (నడిపించుచున్నాఁడు)

నైవం పురుషస్య కశ్చిత్ప్రవర్తనవ్యాపారోఽస్తి నిష్క్రియత్వా న్నిర్గుణత్వాచ్చ.

సాంఖ్యపురుషుఁడన్ననో (నిష్క్రి ... ణత్వాచ్చ) నిష్క్రియుఁడు (=క్రియారహితుఁడు) ను, నిర్గుణుఁడు (గుణశూన్యుఁడు) ను నగుటచేత వానికి (కశ్చిత్ ... వ్యాపారః) నడిపింపఁగలయట్టియాధారమును (న + అస్తి=) లేదు.

నాప్యయస్కాంతవ త్సన్నిధిమాత్రేణ ప్రవర్తయేత్.

(అపి =) మఱియును (అయస్కాంతవత్ =) సూదంటురాయివలె (సన్నిధిమాత్రేణ=) తనసన్నిధానమాత్రముచేతఁ బురుషుఁడు (న ప్రవర్తయేత్ =) ప్రధానమును బ్రవర్తింపఁజేయఁజాలఁడు.

సన్నిధినిత్యత్వేన ప్రవృత్తినిత్యత్వప్రసంగాత్.

ఎందుచేతనఁగా- పురుషునియొక్క సన్నిధానము నిత్యమై యుండుటవలన- పురుషుఁడెడతెగనిసర్వవ్యాపి యగుటవలన (ప్రవృత్త ... సంగాత్=) అతనిసన్నిధానముచేఁ గలుగు (ప్రధానముయొక్క) ప్రవృత్తియు నిత్యమే యైయుండునని చెప్పవలసివచ్చును.

అయస్కాంతస్య త్వనిత్యసన్నిధే రస్తి స్వవ్యాపారసన్నిధిః, పరిమార్జనాద్యపేక్షా చాస్యాస్తీత్యనుపన్యాసః పురుషాశ్మవదితి.

(సూదంటురాయిదృష్టాంతములోనైనను) (అయస్కాంతస్య తు) ఆసూదంటురాయి (అనిత్యసన్నిధేః=) ఇనుమువద్ద నిత్యముగా నుండునది గానందున (అనఁగా నెవఁడో యొకఁడు సూదంటురాతిని దెచ్చి యినుమునొద్దఁ బెట్టుటమూలమున)(అస్తి స్వవ్యాపారసన్నిధిః) ఆయాయితరసాహాయ్యముచేత స్వవ్యాపారము గల్గుచుండ వచ్చును. (మఱియు నాసూదంటురాయి యావ్యాపారముచేయుటలో) (అస్య=) ఆసూదంటురాయికి (పరి ... పేక్షాచ=) మఱియొకనిచే అటునిటు సరిచేయఁబడుట యనుసహాయావసరముసైతము గలదు. (ఎక్కడనో యున్నసూదంటురాయి నినుమునొద్ద (దెచ్చిపెట్టుట- అప్పుడును దాని నటునిటు సర్దుచుండుట యీమొదలగువనులితరులచే జరుపఁబడుచున్నవి- పురుషుఁడన్ననో ప్రధానమందునకంటె నిత్యముండియే యున్నాఁడు. మఱియొకనిసాహాయ్యము లేదు

(ఇతి=) ఈహేతువులచేత (పురుషా...వదితి) కుంటివానివలెను- సూదంటురాయివలెను- అని పురుషునకు నుపమానములను జెప్పుచుఁ బ్రధానమునకుఁ బ్రవృత్తి నారోపించుట (అనుపన్యాసః=) చెప్పఁదగినది గాదు.

తథా ప్రధానస్యాచైతన్యా, త్పురుషస్య చౌదాసీన్యాత్, తృతీయస్య చ తయోస్సంబంధయితు రభావాత్ సంబంధానుపపత్తిః,

(తథా=) అట్లె (ప్రధా ... చైతన్యాత్=) ప్రధానమచేతన మగుటవలనను, (పురు ... సీన్యాత్=) పురుషుఁడుదాసీనుఁడగుటవలనను (తయోః=) ఆయిర్వురను (సంబంధయితుః=) సంబంధపెట్టునట్టి (=కల్పునట్టి) (తృతీయస్య=) మూఁడవవాఁడెవఁడును (అభావాత్=) లేకపోవుటవలనను, (సంబం ... పత్తిః=) ప్రధానపురుషులకు సంబంధము (అనుపపత్తిః=) సంభవింపఁగలది గాదు.

యోగ్యతానిమిత్తే సంబంధే.

(సంబంధే=) ప్రధానపురుషులమధ్యఁ గల్గునని చెప్పఁబడుసంబంధము (మూఁడవ వానియొక్క ప్రమేయము లేకుండఁగనే) (యోగ్యతాయామిత్తేచ=) ప్రధానపురుషుల యొక్క యోగ్యతలను అనఁగా శక్తులనుబట్టియే (ప్రధానముయొక్క యోగ్యత-దృశ్యతాశక్తి- అనఁగాఁ జూడఁబడుశక్తి; పురుషునియొక్క యోగ్యత- దృక్ఛక్తి- అనఁగాఁ జూచుశక్తి) కల్గుచుండునని చెప్పుచో (అనఁగా రెంటియొక్క సంబంధము రెంటియొక్క యోగ్యతయే యని చెప్పుచో)

యోగ్యతానుచ్ఛేదా దనిర్మోక్షప్రసంగః.

(యోగ్యతా=) ఆరెంటియొక్క యోగ్యతలకు (అనుచ్ఛేదాత్=) ఉచ్ఛేదము (=ఎడబాటు విడిపోవుట) లేనందున- అనఁగా నారెంటియొక్క శక్తులు (ఒకదాని కున్నచూడఁబడుశక్తి- మఱియొకదాని కున్నచూచుశక్తి)- ఇవి రెండును నిత్యములే యైయుండుచున్నఁదున (అనిర్మోక్షప్రసంగః=) పురుషునకు మోక్షమన్నది యెప్పటికి నుండఁబోదనియే చెప్పవలసివచ్చును. (ప్రధానముయొక్క బంధమును విడఁగొట్టుకొనుటయే పురుషునకు మోక్షమని సాంఖ్యులు చెప్పుదురు. రెంటికిఁ గలసంబంధము నిత్యమే యైనచోఁ బురుషునకు మోక్షమే లేదని భావము)

పూర్వవ చ్చేహా ప్యర్థాభావో వికల్పయితవ్యః.

(పూర్వవత్-చ =) పూర్వసూత్రమందుఁ జెప్పఁబడినట్లుగానే- అనఁగాఁ బ్రధానప్రవృత్తికిఁ (సృష్టివ్యాపారమునకు) బ్రయోజనము లేదని చెప్పఁబడినట్లుగానే (ఇహాపి=) ఈసూత్రమందును (అర్థాభావః=) ప్రధానప్రవృత్తికిఁ బ్రయోజనముండ దనువిషయమునుగూర్చి (వికల్పయితవ్యః=) వికల్పము చేయఁబడవలసియున్నది. (ప్రయోజన మదియుఁ గాదు- ఇదియుఁ గాదని యాలోచింపఁబడవలసియున్నది.) పురుషప్రేరణముచేతనే ప్రధానము ప్రవర్తించుచున్నదని యీసూత్రమందుఁ బేర్కొనఁబడిన సాంఖ్యసిద్ధాంతవిషయములోఁ-బ్రధానము పురుషునియొక్క భోగమునకై ప్రవర్తించుచున్నదా- లేక మోక్షమునకై ప్రవర్తించుచున్నదా నువికల్పమును వెనుకటివలెనే యిప్పుడుసైత మాలోచింపఁబడవలసియుండును. డును నసంభవములే యని తేలుచోఁ, బ్రధానప్రవృత్తికిఁ బ్రయోజనముసైతము లేదని యప్పుడే తేలఁగలదని భావము.

పరమాత్మనస్తు స్వరూపవ్యపాశ్రయ మౌదాసీన్యం మాయావ్యపాశ్రయం చ ప్రవర్తకత్వ మి త్య స్త్యతిశయః.

(పరమాత్మన స్తు=) వేదాంతమతములోఁ జెప్పఁబడినపరమపురుషుఁ డైన పరమాత్మకన్ననో— (ఔదాసీన్యం=) ఉదాసీనత్వము— అనఁగా నేపనిసంబంధమును లేక యూరకుండుట యనునది-(స్వరూపాశ్రయం=) ఆయనస్వరూప మాశ్రయించు కొనియున్నదనియు— అనఁగా నుదాసీనత్వ మాయనస్వరూపమే యనియు, (ప్రవర్త కత్వం=) జగత్సృష్టిప్రవృత్తి (వ్యాపారము)— (మాయావ్యపాశ్రయం చ=) ఆయ నలో నున్న మాయాశక్తి నాశ్రయించుకొని యున్నదనియు (ఇతి=) నని చెప్పఁ బడుచున్నందున (అస్తి + అతిశయః=) సాంఖ్యపురుషునందుకన్న వేదాంతపరమ పురుషునం దతిశయము గలదు. (వేదాంతసిద్ధాంత మిట్లున్నదగుటచే)సాంఖ్యమతము నకుఁ బట్టినదోషము లీవేదాంతమతమునకుఁ బట్టవని భావము.

8. సూత్రావతారిక :— ప్రధానప్రవృత్తికిఁ బురుషప్రేరణమే హేతువని చెప్పినను, సాంఖ్యమతప్రతిజ్ఞలు (1) ప్రధానము స్వతంత్రప్రవృత్తి గలదనుట, (2) పురుషుఁ డుదాసీనుఁ డనుట— అనునవి భంగమునెందుట యనుదోషములు రాకపోవని పూర్వసూత్రమందు వివరింపఁబడినది. ప్రధానమునకు స్వతంత్ర ప్రవృత్తి మొదలే యసంభవమని కారణాంతరముచే నీసూత్రమందుఁ జూపఁబడు చున్నది.

## ౮ సూ॥ అంగిత్వానుపపత్తేశ్చ

ప॥ వి॥ అంగిత్వానుపపత్తేః—చ

ప్ర॥ ప॥ అ॥ — అంగి ... పత్తేః; అంగిత్వ = ప్రధానమందు సమానా వస్థలో నున్న(త్రిగుణము లన్యోన్యముగా) ఒకటియంగి— అనఁగా ముఖ్యమైనది, మిగి లినవి యంగములు— అనఁగా నముఖ్యములైనవై మాఱుట, అనుపపత్తేః = అసం భవమైనందున— చ = కూడ.

సూత్రార్థము :— (ప్రధానమందలి సత్త్వరజస్తమోగుణము లన్యోన్యముగా) అంగాంగిభావమును జెందుట కుపపత్తి లేకపోవుటవలనఁగూడ (ప్రధానమునకుఁ గ్రియావ్యాపారము సిద్ధింపదు.)

సూత్రభావము :— (అంగిత్వానుపపత్తేః- చ)

సత్త్వరజస్తమోగుణములు సమానావస్థయం దుండుటయే ప్రధానమని చెప్పఁ బడును. అట్టియవస్థలో నాప్రధానముయొక్క గుణము లితరాపేక్ష— అనఁగా నితర

సంబంధము లేనివై తమతమస్వరూపములతో నుండును. ప్రధానము చేయుసృష్టిలో గుణములకు సామ్యావస్థ పోయి వ్యత్యస్తావస్థ రావలసియుండును. కావున నిట్టి వ్యత్యస్తావస్థలో నొకటి యంగిగాను (ముఖ్యమైనదిగాను) మిగిలినవి యంగములుగాను (అముఖ్యములైనవిగాను) నేర్పడ నిచ్చగించుననుట యసంభవ మైనందునను, వాని నట్టియసమానస్థితికిఁ దేఁగల బాహ్యాకారణము లేనందునను బ్రధానమునకు సృష్టి ప్రవృత్తి యుండఁజాలదని నిశ్చయ మగుచున్నది.

భాష్యము — భాష్యార్థము

ఇతశ్చ న ప్రధానస్య ప్రవృత్తి రవకల్పతే.

(ఇతశ్చ=) ఈక్రిందఁ జెప్పఁబోవుహేతువువలనఁగూడఁ (ప్రధానస్య=) బ్రధానమునకు (ప్రవృత్తిః=) సృష్టివ్యాపారము (న + అవకల్పతే=) కల్పింపఁబడఁజాలదు.

యద్ధి సత్త్వరజస్తమసా మన్యోన్యగుణప్రధానభావ ముత్సృజ్య సామ్యేన స్వరూపమాత్రేణావస్థానం సా ప్రధానావస్థా,

(సత్త్వ....మసాం=) సత్త్వరజస్తమస్సు లనెడిమూఁడుగుణములు (అన్యోన్య ... భావం=) తమతమయొక్క — అనఁగాఁ దమలోఁ దమకుఁ బరస్పరముగా నుండవలసియున్న ముఖ్య (=ముఖ్య/సమాన) భావమును (అనఁగా— నొకదానికి ముఖ్యస్థితిని మిగిలినవానికి నముఖ్యస్థితిని) (ఉత్సృజ్య=) బొందక (సామ్యేన=) మూఁడును సమానముగా (స్వరూపమాత్రేణ= తమతమస్వరూపమాత్రముతో (అవస్థానం=) నుండుట యనునది (యత్-హి) యేది గలదో (సా=) యదియే (ప్రధానావస్థా=) ప్రధాన మైనయవస్థ (=భావము - స్థితి) యని చెప్పఁబడును.

తస్యా మవస్థాయా మనపేక్షస్వరూపాణాం స్వరూపప్రణాశభయాత్ పరస్పరం ప్రత్యంగాంగిభావానుపపత్తేః.

(తస్యా మవస్థాయాం =) ఆసామ్యావస్థయందు (అనపేక్ష...రూపాణాం- (గుణానాం=) నపేక్ష లేని స్వరూపము గలమూఁడుగుణములు— అనఁగా- ఒకదానియొక్క యపేక్ష మఱియొకదానికి లేక- అనఁగా నొకదానికంటె మఱియొకటి మించిగాని లొంగిగాని లేక సమానస్వతంత్రస్థితిలో నుండుమూఁడుగుణములు (స్వరూపప్రణాశభయాత్=) తమతమ (స్వతంత్ర) స్వరూపము చెడిపోవు ననుభయముతో (పరస్పరంప్రతి=) నొకదానినిగూర్చి మఱియొకటి (అంగాంగి ... పత్తేః=) యంగిగాను (=ఒకటి ముఖ్యమైనదిగాను), అంగములుగాను (=మిగిలినవి యముఖ్య

మైనవిగాను) నుండవలసినస్థితిని (= భావమును) బొందు ననుట యుక్తియుక్తము గానందువలనను (=అనుపపత్తేః) (అనఁగా—సృష్టికిఁ బూర్వము సమానస్థితిలో నున్న మూఁడుగుణములు తమసమానస్థితిని గోలుపోయి సృష్టికిఁ గావలసినవిషమస్థితిని— అనఁగాఁ దమలోఁ దమ కుండఁబోవు హెచ్చుతగ్గులస్థితిని స్వీకరించు ననుట యసంభవ మైనందునను— అని భావము)

బాహ్యస్య చ కస్యచిత్ క్షోభయితు రభావాత్.

(గుణములు తమలోఁ దాము సమానస్థితిని గోల్పోవుటకు, విషమస్థితిని స్వీక రించుటకు నిష్టము లేనివైనను మఱియొకరిబలాత్కారమువలన నట్టివిషమస్థితిని జెందఁగూడదా యని యందు రేమో)

(బాహ్యస్య చ=) తాముగాక (కస్యచిత్) యెవఁడో మఱియొక (క్షోభ యితుః=) క్షోభింపఁజేయువాఁడు (=బలాత్కరించువాఁడు) (=చెదరఁదోలువాఁడు) (అభావాత్ = లేనందునను సృష్టియేర్పాటుచేయుటకు— అనఁగా సమానస్థితిలో నున్నగుణములను జెదరఁదోలి హెచ్చుతగ్గులస్థితికిఁ దెచ్చుటకు సమానస్థితిలో నున్న యాగుణములు గాక మఱెవ్వరును లేనందునను- అని భావము.)

గుణవైషమ్యనిమిత్తో మహదాద్యుత్పాదో న స్యాత్.

(గుణ ... మిత్తః=) గుణములు హెచ్చుతగ్గులస్థితికి వచ్చుటచేతనే కాఁదగిన (మహ ... త్పాదః=) మహత్తు మొదలగువానియొక్క పుట్టుక (న స్యాత్ =) లేకయే పోవలసివచ్చును. (జగత్సృష్టిలో మహత్తు మొదటఁబుట్టి క్రమక్రమముగా న దులోనుండి మిగిలినవి పుట్టునని సాంఖ్యసిద్ధాంతము.)

9. సూత్రావతారిక :— ప్రధానముయొక్క గుణములు సామ్యావస్థలో అనపేక్షములు (=స్వతంత్రములు) గావున, సృష్టికిఁ గావలయువిషమావస్థయందు వానికి సంగాంగీభావము కుదురకపోవుట యనునీమొదలగుదోషములు సంభవించునని పూర్వసూత్రమందుఁ జెప్పఁబడినది. ఆగుణము లనపేక్షములు గాక సాపేక్షములే యని (Depending on one another) యొప్పుకొన్నను దోషములు లేకపోవని యీసూత్రమందుఁ దెలుపఁబడుచున్నది.

## ౯ సూ॥ అన్యథాఽనుమితౌ చ జ్ఞశక్తివియోగాత్

ప॥ వి॥ — అన్యథా - అనుమితౌ - చ - జ్ఞశక్తివియోగాత్.

ప్ర॥ ప॥ అ॥ — అన్యథా= (గుణము లనపేక్షములు గాక) మఱియొకవిధ

మున- అనఁగా సాపేక్షములని- అనఁగా నొకదానియపేక్షతో మఱియొకటి ప్రవర్తించునవియే యః; అనుమితౌ = ఊహించినప్పటికిని (ఊహాయందును) చ=కూడ; జ్ఞశక్తివియోగాత్ = జ్ఞశక్తి = జ్ఞానశక్తి, వియోగాత్ = లేకపోవుటవలన.

సూత్రార్థము :— (గుణములు సాపేక్షములు గాక) అన్యథా (మఱియొక విధమున) అనుమితి (=ఊహ) చేయఁబడినను (చ), (ఆగుణములకు) జ్ఞాన (=జ్ఞ) శక్తియోగము (కూడిక) లేకపోవుటవలన (పట్టినదోషములు తొలఁగిపోవు.)

సూత్రభావము :— (అన్యథా=) గుణములు నిరపేక్షస్వభావములు గాక సాపేక్షస్వభావములే యని (అనుమితౌ చ) యనుమానము (=ఊహ) చేసినను (జ్ఞశక్తివియోగాత్) ప్రధానమునకుఁ జైతన్యము (= తెలివి) లేకపోవుటవలన, రచనానుపపత్తి మొదలగుదోషములు ప్రధానవాదమునుండి తొలఁగిపోవు.

భాష్యము — భాష్యార్థము

సాంఖ్యవాది :—

అథాపి స్యాదన్యథా వయ మనుమిమీమహే యథా నాయ మనన్తరోక్తో దోషః ప్రసజ్యేత.

(అథాపి స్యాత్=) అది యట్లే కానిండు. (అనన్తరోక్తః=) ఇంతకుమున్ను జెప్పఁబడిన (అయం దోషః=) యీదోషము (గుణములు నిరపేక్షములు- అనఁగా స్వతంత్రములన్నచో వచ్చునని చూపినయాదోషము) (యథా న ప్రసజ్యేత =) ఎట్లు మాసిద్ధాంతమునకుఁ దగులకుండునో యట్లు (అన్యథా=) మఱియొకవిధముగా (వయం=) మేము (అనుమిమీమహే=) ఊహచేయుచున్నాము-చూడుఁడు.

న హ్యనపేక్షస్వభావాః కూటస్థా శ్చాస్మాభి ర్గుణా అభ్యుపగమ్యన్తే, ప్రమాణాభావాత్.

(ప్రమాణాభావాత్=) అందులకుఁ (మాసిద్ధాంతవిషయమని మీరు వ్రేలు పెట్టి చూపినదానికి) ప్రమాణ మేమియును లేనందున, (గుణాః=) గుణములు (అనపేక్షస్వభావాః=) ఒకదానితో మఱియొకదానికి నపేక్ష లేనిస్వతంత్రభావము గలవనియు, (కూటస్థాశ్చ =) కూటమువలెఁ గదలకుండ నుండునవి యనియును (అస్మాభిః=) మాయుతసిద్ధాంతులచేత (నహి + అభ్యుపగమ్యన్తే=,నొప్పుకొనఁబడుట లేదుసుమా !

కార్యవశేన తు గుణానాం స్వభావోఽభ్యుపగమ్యతే.

(కార్యవశేన తు=) వానికార్యము (effects) లెట్లుండనో (గుణా ...

భావః=) గుణములయొక్క స్వభావముసైత (అభ్యుపగమ్యతే=) మళ్లే యుండునని యనుకొనుట సమంజసము.

యథాయథా కార్యోత్పాద ఉపపద్యతే, తథాతథై తేషాం స్వభావోऽభ్యుపగంతవ్యః.

(కార్యోత్పాదే=) (గుణములనుండి) కార్యము (effect = క్రియాఫలము) పుట్టుటకుఁగాను (యథాయథా ఉపపద్యతే=) ఆగుణము లెట్లెట్టివిగా నుండుట యోగ్యమో, (ఏషాం స్వభావః=) ఆగుణములయొక్క స్వభావముసైత (తథా తథా=) మట్టిదట్టిదేయని (అభ్యుపగంతవ్యః) యోచనసేయవలసియుండును.

చలం గుణవృత్త మితి చాస్త్యభ్యుపగమః

(గుణవృత్తం=) సత్త్వరజస్తమోగుణములయొక్క స్వభావము (చలం+ ఇతి=) చలమే యని (అస్థిరమైనదేయని - కూటస్థము గాదని) (అభ్యుపగమః+ అస్తి=) సాంఖ్యసిద్ధాంత మైయున్నది.

తస్మాత్సామ్యావస్థాయామపి వైషమ్యోపగమయోగ్యా ఏవ గుణా అవతిష్ఠంత ఇతి.

కాఁబట్టి (సామ్యా ... మపి=) యాగుణములు (ఆరంభమందు) సమానావస్థయం దున్నవైనప్పటికీ (వైష ... ఏవ=) (సృష్టిలో) విషమావస్థను (=వ్యత్యస్తావస్థను = ఒకటి హెచ్చుగా మఱియొకటి తగ్గుగా నుండుస్థితిని) బొందుటకుఁ దగినవిగానే (అవతిష్ఠంతే+ఇతి) యున్నవని (మాసాంఖ్యవాదము.)

వేదాంతసిద్ధాంతిసమాధానము :—

ఏవమపి ప్రధానస్య జ్ఞశక్తివియోగాత్, రచనామనుపపత్త్యాదయః పూర్వోక్తదోషాస్తదవస్థా ఏవ.

(ఏవమపి=) ప్రధానమందలిగుణములకుఁ జలనస్వభావ మున్న దనుకొన్నను, (ప్రధా .... యోగాత్=) ప్రధానమునకు జ్ఞానశక్తి లేకపోవుటవలన— అనఁగా నది యచేతనమే యైయున్నందున (రచనా .... పత్త్యాదయః=) 'అచేతన మైనవస్తువీవివిధవిచిత్రజగద్రచనము గావించుట యసంభవము'- అను నీమొదలగు(పూర్వోక్త దోషాః=) నీరచనానుపపత్త్యధికరణములో (బ్రహ్మసూ॥ II, 1, 1 అ 10) నిదివఱకే చూపింపఁబడినదోషములు (తదవస్థా ఏవ =) మీసాంఖ్యమతమం దుండనే యుండునుగాని వదలిపోవు.

జ్ఞశక్తిమపి త్వనుమిమానః ప్రతివాదిత్వా న్నివర్తేత.

(జ్ఞశక్తిమపి తు=)జ్ఞానశక్తిసైతము (అనుమిమానః=) ప్రధానమున కున్నదై యనుమానింప (=ఊహింప) వచ్చునందువేమో— (అట్లన్నచో) (ప్రతివాదిత్వాత్ + నివర్తేత=) నీవు మా కెదిరివాది వగుటయే లేకపోవును.

చేతన మేక మనేకప్రపంచస్య జగత ఉపాదానమితి బ్రహ్మవాదప్రసంగాత్.

ఎట్లనఁగాఁ, జేతనమైయున్న యొకవస్తు వేదియో యదియే (అనేక .... జగతః=) వివిధవిచిత్రాకారములతో నుండునీజగత్తునకు (ఉపాదానమితి=) నుపాదానకారణ మని ( meterial cause ) ( బ్రహ్మవాదప్రసంగాత్ = ) మా వేదాంతవాదమై యున్నందువలన.

(మీరు చెప్పునది మేము చెప్పునది యొకటియే యైపోవుచుండగా, సగు నను మావాదిత్వము- కా దనుమీప్రతివాదిత్వము లేకయే పోవునని భావము.)

వైషమ్యోపగమయోగ్యా అపి గుణాః సామ్యావస్థాయాం, నిమిత్తాభావా న్నైవ వైషమ్యం భజేరన్.

(గుణాః =) సత్త్వరజస్తమోగుణములు (సామ్యావస్థాయాం =) సమాన స్థితిలోఁ బ్రధానముగా నున్నప్పుడు (వైష .... అపి =) విషమస్థితిని— అనఁగా హెచ్చుతగ్గులస్థితిని (సృష్టిలోఁ) బొందుటకుఁ దగినవిగానే యున్న వనుకొన్నప్పటికి (నిమిత్తాభావాత్ =) వానికి విషమస్థితిని గలుగఁజేయుమఱియేనిమిత్తము— అనఁగా మఱి యేచేతనకారణము లేనందున, (వైషమ్యం + న + భజేరన్ + ఏవ=) అట్టి విషమస్థితిని బొందనే లేవు.

(గుణములు చలనస్థితికి వచ్చుటకు యోగ్యములుగా నున్నను (Though movable) వస్తుతః అవి యచేతనములే యైనందునఁ జలింపఁజేయువాఁడు మఱి యొకఁడున్నఁగాని, యవి యొకస్థితినుండి, మఱియొకస్థితికి రాఁజాలవని భావము)

భజమానా వా, నిమిత్తాభావావిశేషా, త్సర్వదైవ వైషమ్యం భజేర న్నితి—ప్రసజ్యత ఏవాయ మనంతరోఽపి దోషః.

(భజమానాః వా=) గుణములు విషమస్థితిని బొందునవియైనను (నిమిత్తాభావావిశేషాత్ =) నిమిత్తము లేకపోవుటలో భేద మేమియు లేనందున— అనఁగా వైషమ్యమును గల్గించుటకుఁగాని, వైషమ్యము ను దీసివేయుటకుఁగాని నిమిత్తము (మఱియొక చేతనకారణ) మెవ్విధముగానైనను లేనందున (సృష్టివిషయములోఁగాని, ప్రళయవిషయములోఁగాని యని భావము.)

(సర్వదా + ఏవ) నిరంతరముగా- ఎల్లప్పుడును) (వైషమ్యం భజేరన్ =) పొందిన వైషమ్యము పొందినట్లుగానే యుండును. (సృష్టిస్థితిలోనుండి ప్రళయస్థితికి రాజాలవు) (ఇతి=) కాఁబట్టి (అయమసం ... దోషః=) లోఁగడఁజూపఁబడిన దోషము (ప్రసజ్యతే + ఏవ=) దోషముగానే నిల్చియుండును.

10 సూత్రావతారిక :— గుణములు పరస్పరము సాపేక్షములైనను— అనఁగా వైషమ్యావగమయోగ్యములైనను (=విషమావస్థను బొందుటకుఁ దగినవిగానే యున్నను) చేతననిమిత్తము లేకుండ జగత్కార్యము గానేరదని పూర్వసూత్రమందు ఘ్రువపర్చఁబడినది. ఏయుక్తి ననుసరించి చూచుకొన్నను సాంఖ్యమతము దోషభూయిష్ఠమే యని యీయధికరణపుఁ బూర్వసూత్రములందుఁ జూపఁబడి యీమతసిద్ధాంతములయం దుండుపరస్పరవిరోధమువలననైనను నది యగ్రాహ్యమే యని యీ కడపటిసూత్రమందుఁ జూపఁబడుచున్నది.

## ౧౦ సూ॥ విప్రతిషేధా చ్చాసమంజసమ్

ప॥ వి॥ — విప్రతిషేధాత్ - చ - అసమంజసమ్

ప్ర॥ ప॥ అ॥ — విప్రతిషేధాత్ = పరస్పరవిరోధము లుండుటవలన, చ= ను, అసమంజసమ్ = (సాంఖ్యమతము) అగ్రాహ్యము - అయోగ్యము.

సూ॥ అ॥ — (సాంఖ్యమతమందు) విప్రతిషేధము లుండుటవలనను, నది సమంజస మైనది గాదు.

సూత్రభావము :— (విప్రతిషేధాత్ - చ) సాంఖ్యమతసిద్ధాంతములందు— ఒకచోట నింద్రియము లే డనియు, మఱియొకచోటఁ బదునొకండనియు, మఱియును నింకొకచోటఁ దన్మాత్రలు (విషయములు) మహత్తువలనఁ బుట్టినవనియు, వేఱొకచోట నవి యహంకారమువలనఁ బుట్టినవనియు, నిట్లన్యోన్యవిరుద్ధార్థప్రతిపాదన మున్నందున (అసమంజసం=) ఈసాంఖ్యమత మెంతమాత్రము సమంజసము గాదు.

భాష్యము — భాష్యార్థము

పరస్పరవిరుద్ధ శ్చాయం సాంఖ్యానా మభ్యుపగమః.

I సాంఖ్యమతము సమంజసము గాదు.

(ఎ) దానిసిద్ధాంతములు పరస్పరవిరుద్ధములు.

సూత్రార్థము :—

సాంఖ్యులయొక్క (అయం అభ్యుపగమః=) యీసిద్ధాంతము పరస్పరవిరుద్ధాంశములతోఁ గూడియు నున్నది.

(1) ఇంద్రియము లేడని యొకచోటను, బదునొకండని వేఱొకచోటను,

క్వచి త్సప్తేంద్రియా ణ్యనుక్రామంతి; క్వచి దేకాదశ.

(క్వచి త్స ప్తేంద్రియాణి=) ఒకచోట నింద్రియము లేడని (అనుక్రామంతి=) లెక్కించుచున్నారు. (క్వచి దేకాదశ =) మఱియొకచోటఁ బదునొకండని చెప్పుచున్నారు.

(2) తన్మాత్రలు పుట్టుట మహత్తునుండియా, యహంకారమునుండియా ?

తథా క్వచి న్మహత స్తన్మాత్రసర్గ ముపదిశంతి; క్వచి దహంకారాత్.

అట్లె యొకచోట మహత్తునుండి (తన్మాత్రసర్గం...కారాత్ =) తన్మాత్రలయొక్క – అనఁగా విషయములయొక్క యుత్పత్తిని బోధించుచున్నారు. మఱియొకచోట నహంకారమునుండి పుట్టినవని చెప్పుచున్నారు.

(3) అంతఃకరణ మొకటియా – మూఁడా ?

తథా క్వచి త్త్రీ ణ్యంతఃకరణాని వర్ణయంతి; క్వచి దేకమితి.

మఱియు నట్లె యొకచోట నంతఃకరణములు మూఁడని వర్ణించుచున్నారు. మఱియొకచోట నొకటియే యని చెప్పుచున్నారు.

(బి) జగత్కారణవిషయమందు వేదాంతమతమునకు వ్యతిరేకము.

ప్రసిద్ధ ఏవతు శ్రుత్యేశ్వరకారణవాదిన్యా విరోధః, తదనువర్తిన్యా చ స్మృత్యా.

తస్మా ద ప్యసమంజసం సాంఖ్యానాం దర్శనమితి.

(ఈశ్వరుఁడు జగత్కారణము గాదని వాదించునీసాంఖ్యమతము)(శ్రుత్యేశ్వరకారణవాదిన్యా=) ఈశ్వరుఁడే జగత్కారణమని బోధించుశ్రుతులతోడను (వేదాంతములతోడను) ఆశ్రుతుల ననుసరించియే (=తదనువర్తిన్యాచ స్మృత్యా) యుండు స్మృతులతోడను (విరోధః =) విరోధించుచున్నదనుట ప్రసిద్ధవిషయమేగదా! కాఁబట్టిసాంఖ్యదర్శనము (=సిద్ధాంతము) సమంజసమైనది గాదు–అని సూత్రార్థము.

సాంఖ్యపూర్వపక్షము :—

అత్రాహ — ఈవిషయమందు సాంఖ్యుఁ డేమి చెప్పుచున్నాఁ డనఁగా :—

II వేదాంతమతముగూడ నసమంజసమే.

నన్వౌపనిషదానా మ ప్యసమంజసమేవ దర్శనం;

(ఔపనిషదానాం =) ఉపనిషత్తుల ననుసరించువారియొక్క (దర్శనమపి =) సిద్ధాంతముసైతము (నను అసమంజసమేవ) అసమంజసము గాకపోదుగదా !

(ఎ) జీవజగత్తు (=తప్యము)- భోగ్యజగత్తు= (తాపకము) రెండును ఆత్మయె యని వేదాంతులు చెప్పుట యసంభవవాదము.

తప్యతాపకయో ర్జాత్యంతరభావానభ్యుపగమాత్.

ఆవేదాంతులు (తప్యతాపకయోః=) తప్య (=కష్టపడునది)-తాపకము (=కష్టపెట్టునది) లనునవి (జాత్యంతరభావ =) వేఱువేఱుజాతిలోఁ జేరినభావము (వస్తువులు) లని (అనభ్యుపగమాత్=) యొప్పుకొనరు (ఇందుచేఁ గష్టపెట్టుకారణములు కష్టపడుజంతువులు భిన్నము లనెడిప్రత్యక్షవిషయము భంగపడిపోవుచున్నది.

ఏకంహి బ్రహ్మ సర్వాత్మకం సర్వప్రపంచస్య కారణ మభ్యుపగచ్ఛతాం, ఏకస్యైవాత్మనో విశేషౌ తప్యతాపకౌ న జాత్యంతరభూతా విత్యభ్యుపగంతవ్యం స్యాత్.

ఏకముగా నున్నబ్రహ్మమే (సర్వాత్మకం=) సర్వమునకు నాత్మ (= స్వరూపము) యనియు (సర్వ ... కారణం=) సర్వప్రపంచమును బుట్టించుకారణపదార్థమనియు (Material as well as efficient) (అభ్యుపగచ్ఛతాం=) నంగీకరించు నీవేదాంతులు (తప్యతాపకౌ=) తప్యము (కష్టపడుజీవుఁడు) - తాపకము (కష్టపెట్టు జగత్తు) అనునీరెండును (న జాత్యంతరభూతౌ=) భిన్నజాతులకుఁ జెందినవి గావనియు, (ఏక ... విశేషౌ=) ఒక్కటియే యైయుండునాత్మయొక్క (విశేషములే- ఆత్మకుఁ జెందినవే) యనియు (అభ్యుపగంతవ్యం స్యాత్=) ఒప్పుకొనవలసియున్నట్లే గదా ! (ఒప్పుకొన్నవారే యగుచున్నారు)

(1) రెండును నొకయాత్మయొక్క ధర్మములే యైనచో, మోక్షోపదేశము నిరర్థకము.

యది చైతౌ తప్యతాపకా వేక స్యాత్మనో విశేషౌ స్యాతాం.

(ఏతౌ తప్యతాపకౌ=) ఈతప్యతాపకములు రెండును (ఏకస్య...విశేషౌ=) ఒక్కటేయై యున్నయాత్మయొక్క విశేషములే (attributes = స్వభావములే) (యది స్యాతాం=) యైయున్నచో.

న తాభ్యాం తప్యతాపకాభ్యాం న నిర్ముచ్యేతేతి.

(సః=) ఆయాత్మకు (తాభ్యాం .... కాభ్యాం =) ఆతప్యతాపకములనుండి (న నిర్ముచ్యేత=) మోక్ష (=విడుదల) మన్నది లేకయేపోవును. (ఇతి=) గావున.

తాపోపశాంతయే సమ్యగ్దర్శన ముపదిశ చ్ఛాస్త్ర మనర్థకం స్యాత్.

(తాపోపశాంతయే=) తాపోపశాంతికొఱకు— అనఁగా— బంధవిముక్తికొఱకు, (సమ్యగ్దర్శనం=) పరిపూర్ణజ్ఞానమును, అనఁగా నాత్మైక్యజ్ఞానమును (ఉపదిశత్=) బోధించుచున్న (శాస్త్రం=) యుపనిషచ్ఛాస్త్రము (అనర్థకం స్యాత్=) వ్యర్థమయి యే పోవును.

(2) వేడిమి – వెల్తురు- అనుధర్మములకు వెలుఁగునుండి విడుదల (=మోక్షము) సంభవించునా ?

న హ్యౌష్ణ్యప్రకాశధర్మకస్య ప్రదీపస్య తదవస్థస్యైవ తాభ్యాం నిర్మోక్ష ఉపపద్యతే.

(ఔష్ణ్యప్రకాశధర్మకస్య=) ఉష్ణత్వము- ప్రకాశము- అనుధర్మములు గల అనఁగా- వేడిమిని- వెల్తురును గలుగఁజేయుస్వభావములు (=విశేషములు) గల (ప్రదీపస్య=) పెద్దదీపము (=పెద్ద వెలుఁగు) (తదవస్థస్యైవ=) అది (=ప్రదీపము) దీపముగా నున్నంతకాలము (తాభ్యాం=) ఆవేడిమి వెల్తురులనుండి (నిర్మోక్షః=) విడుదలను బొందుననుట (నహి ఉపపద్యతే=) యుక్తము గాదుగదా! (అనఁగా దీపమున్నంతవఱకు దానికి సంబంధించి వేడిమి వెల్తురు లుండునవియేగాని యాదీపము నుండి విడిపోవునవి గావని భావము)

(3) వీచీతరంగ ఫేనములకు సముద్రమునుండి విడుదల సంభవించునా ?

యోఽపి జలవీచీతరంగఫేనాద్యుపన్యాస, స్తత్రాపి జలాత్మన ఏకస్య వీచ్యాదయో విశేషా, ఆవిర్భావతిరోభావరూపేణ నిత్యా ఏవేతి సమానో జలాత్మనో వీచ్యాదిభి రనిర్మోక్షః.

(దీపదృష్టాంతము నట్లుంచి) (జల ... ఫేనాది=) ఆత్మను సముద్రమునకును (=జల) తప్యతాపకము లనెడిజీవజగత్తులను వీచీతరంగఫేనాదులకును (=వచ్చిపోవుచుండునలలు – తరంగములకును బుద్బుదములకును) బోల్చి (యః + అపి + ఉపన్యాసః=) వేదాంతులు చేసెడి (తత్రాపి యాప్రసంగమందైనను – (జలాత్మనః + ఏకస్య=) జలస్వరూపమై యొక్కటిగానే యుండుసముద్రమునకు (వీచ్యాదయః=) వీచీతరంగ ఫేనములనెడి (విశేషాః=) విశేషములు – (స్వభావములు) (ఆవిర్భావ... రూపేణ=) ఉబికివచ్చుచుండుట - అడఁగిపోవుచుండుట యనునాకారములతో

(నిత్యాః + ఏవ) నిత్యములై (=నిరంతరములై) యుండునవియే (ఇతి=) గావున- (జలాత్మనః=) జలస్వరూప మైనసముద్రమునకు (వీచ్యాదిభిః=) వీచీతరంగాదులతో (అనిర్మోకః=) నెడఁబాటన్నది (=విడుదలయున్నది) లేదనియే చెప్పవలసియున్నది.

(ప్రదీపదృష్టాంతమందు వేడిమి వెల్తురు లంటియున్నట్లు గన్పించుచున్నను, సముద్రదృష్టాంతమందు వీచీతరంగాదులు వచ్చిపోవుచున్నట్లున్నను రెంటియందును నాయావిశేషములు నిత్యములై ప్రదీపము సముద్రము నున్నంతవఱకు నుండునవియే యని భావము.)

(బీ) జీవజగత్తు, భోగ్యజగత్తు, భిన్నజాతులలోఁ జేరినవనుట లోకమందుఁ బ్రత్యక్షవిషయము.

ప్రసిద్ధశ్చాయం తప్యతాపకయో ర్జాత్యంతరభావో లోకే.

(అయం ... భావః= తప్యతాపకములు రెండును (=జీవజగత్తులు) వేఱు వేఱు తెఱగుపదార్థము (=భావః) లైనట్లు (లోకే ప్రసిద్ధః) లోకమందుఁ బ్రత్యక్షముగాఁ గన్పించుచునే యున్నది.

(1) కోరుపురుషుఁడు – కోరఁబడువస్తువు రెండును భిన్నజాతులే కానిచో- అనఁగా నొకటియే యైనచోఁ– గోరఁబడువస్తువే యుండదు.

అర్థీ చార్థ శ్చాన్యోన్యభిన్నౌ లక్ష్యేతే.

(అర్థీ చ=)కోరువాఁడును (అర్థశ్చ=) కోరఁబడునదియు ననునీరెండును (అన్యోన్యభిన్నౌ=) ఒకదానికంటె మఱియొకటి వేఱైనట్లుగా (లక్ష్యేతే=) చూడఁబడుచున్నవిగదా!

యద్యర్థిన స్స్వతోఽన్యోఽర్థో న స్యాత్, యస్యార్థినో యద్విషయ మర్థిత్వం సత్యార్థో నిత్యసిద్ధ ఏవేతి తస్య తద్విషయ మర్థిత్వం న స్యాత్.

(అర్థినఃస్వతః =) కోరువానికంటె (అర్థః=) కోరఁబడునది (అన్యః=) వేఱైనది (యది నస్యాత్ =) కాకపోయినచో (అనఁగాఁ గోరువాఁడును గోరఁబడునదియు రెండును నొకటియె యైనచో) (యస్య + అర్థినః=) ఏకోరువానికి (యద్విషయం=) నేవిషయము (అర్థిత్వం =) కోరఁబడునది యగుచున్నదో, (సః + అర్థః =) ఆకోరఁబడువిషయము (తస్య=) ఆకోరువానికి (నిత్యసిద్ధః + ఏవ + ఇతి) నిత్యముగా సిద్ధమై (ప్రాప్తమై) యున్నదియెగావున (తద్విషయం =) ఆవిషయము (తస్య =) వానికి (అర్థిత్వం=) కోరఁబడునది నస్యాత్ =) కాకయె పోవలెను. అనఁగా- కోరు

వానితోఁబాటు కోరఁబడునదియు నిత్యసిద్ధమై యున్నదియె గావున నేదియు నెవనికిని గోరఁబడువస్తు వనునది యుండనే యుండదు.)

(2) కోరఁబడునది తనయందు లేనిదానికే వర్తించునుగాని తనయందు నిత్యసిద్ధమై యున్నదానికి వర్తించదు.

యథా ప్రకాశాత్మనః ప్రదీపస్య ప్రకాశాఖ్యోऽర్థో నిత్యసిద్ధ ఏవేతి న తస్య తద్విషయ మర్థిత్వం సంభవతి.

(యథా=)అది యెట్లో దృష్టాంతములోఁజూడుఁడు (ప్రకాశాత్మనః=) ప్రకాశ స్వరూపమైన (ప్రదీపస్య=) ప్రదీపమునకు (ప్రకాశాఖ్యః+అర్థః=) ప్రకాశ మను పేరుగలవిషయము (నిత్యసిద్ధః - ఏవ - ఇతి) నిత్యముగాఁ బ్రాప్తమై యున్నదియే కావున (తస్య =) ఆప్రదీపమునకు (తద్విషయం =) ప్రకాశ మనునావిషయము (అర్థిత్వం=) కావలెనని కోరఁబడునదియై యుండుట ( న సంభవతి =) సంభవింపదు. (అనఁగా- దీపముతోఁబాటు వెల్తు రుండునదయే గావున, వెల్తురు కావలెనని దీపము కోరదు- అని భావము.

అప్రాప్తే హ్యర్థేऽర్థినోऽర్థిత్వం స్యాదితి.

(అప్రాప్తే హి=) పొందఁబడని- అనఁగాఁ దనకు లేని (అర్థే=) విషయములో, (అర్థినః=) కోరువానికి (అర్థిత్వం=) కోరఁబడువిషయము (స్యాత్+ఇతి) ఉండుట సంభవము- (అనఁగా- కోరువాఁ డెప్పుడును దనకు లేనివస్తువునే కోరునుగాని యున్న వస్తువును గోరుట సంభవింపదని భావము )

(3) అట్లు రెండును నొకటియే యైనచోఁ, గోరువాఁడునైతె ముండఁజాలఁడు.

తథాऽర్థస్యాప్యర్థిత్వం న స్యాత్. యది స్యాత్స్వార్థత్వమేవ స్యాత్.

(తథా=) ఆప్రకారమే- అనఁగాఁ గోరువాఁడును, గోరఁబడునదియు వేఱు వేఱు గాక రెండును నొకటియే యైనచోఁ గోరువాఁ డనువాఁడే యెట్లుండఁజాలఁడో అట్లే) (అర్థస్య+అపి=) కోరఁబడునదిగూడఁ (అర్థి+అర్థిత్వం=) గోరువానిచేఁ గోరఁబడునదిగా (న స్యాత్ =) నుండఁబోదు. (యది స్యాత్ =) కోరఁబడునది యున్న దన్నచో (స్వార్థత్వమేవ స్యాత్ =) దాని కదియే విషయ మగునుగాని మఱి యొకదానికి (మఱియొకకర్తకు) విషయముగా నుండదు.

(అనఁగాఁ- గోరువాఁడనువాఁడే యెట్లుండఁజాలఁడో యట్లే కోరఁబడునదియు నుండఁజాలదని భావము)

(4) కాని కోరువాఁడు- కోరఁబడునది- అనునీరెండును మనయనుభవములో వేఱువేఱుగా నుండుచున్నవి.

న చైతదస్తి.

కాని (ఏతత్ =) యీవిషయము (నచ – అస్తి=) అనుభవములో లేదు. (అనఁగా– కోరువాఁడును– గోరఁబడునదియు రెండును ననుభవములో నుండుచునే యున్నవని భావము.

(5) అర్థీ (–కోరువాఁడు-) – అర్థః (కోరఁబడునది) అని యన్యోన్యసంబంధమును సూచించులోకములో నిశబ్దములే, రెండును భిన్నములైనట్లు చెప్పుచున్నవి.

సంబంధిశబ్దౌ హ్యేతా వర్థీ చార్థశ్చేతి.

(అర్థీ చ=) కోరువాఁడును (అర్థశ్చ=) కోరఁబడునదియు నను (ఏతౌ=) నీ రెండును (సంబంధిశబ్దౌ – హి – ఇతి=) అన్యోన్యసంబంధము గలవి గావున,

ద్వయోశ్చ సంబంధినోః స్సంబంధ స్స్యాత్. నైకస్యైవ.

(ద్వయో ... ధినోః=) అన్యోన్యసంబంధము గలయట్టిరెండును వేఱుగా నున్నప్పుడే (సంబంధః – స్యాత్ =) యీసంబంధ ముండునుగాని (న–ఏకస్య – ఏవ) యొకటియేయై యున్నప్పు డట్టిసంబంధ ముండదుగదా!

(6) కాఁబట్టి కోరువాఁడు – కోరఁబడునది భిన్నములేగాని యొకటి గానేరదు.

తస్మా ద్భిన్నావే వార్థార్థినౌ.

కాఁబట్టి (అర్థార్థినౌ =) కోరఁబడునదియుఁ, గోరువాఁడును ననునీరెండును (భిన్నౌ + ఏవ) భిన్నములేగాని యొకటి గాదు.

(7) అట్లే (అనర్థీ=) కోరనివాఁడు, (అనర్థః= కోరఁబడనిది–) అనునీరెండు గూండ భిన్నములే.

తథాఽనర్థాఽనర్థినావపి.

(తథా=) ఆప్రకారమే (అనర్థః=) కోరఁబడనిదియు (అనర్థీ=) కోరకుండు వాఁడును ననునీరెండు (అపి=) సైతము భిన్నములే–

(8) పురుషునకుఁ గోరఁబడుదానితోను, గోరఁబడనిదానితోను గలసంబంధమే భిన్నములని స్పష్ట పఱచుచున్నది.

అర్థినోఽనుకూలోఽర్థః ప్రతికూలోఽనర్థ స్తాభ్యా మేకః పర్యాయే ణోభాభ్యాం సంబధ్యతే.

(అర్థినః=) కోరువానికిఁ (అర్థః =) గోరఁబడునది (అనుకూలః =) యెంతెంత యనుకూలమైనదైనను, (అనర్థః=) కోరఁబడనిది (ప్రతికూలః=) యెంతెంతప్రతికూలమైనదైనను, (తాభ్యాం - ఉభాభ్యాం=) కోరఁబడునది, కోరఁబడనిది- యను నారెంటితోడను (ఏకః =) పురుషుఁడనువాఁడు (పర్యాయేణ =) క్రమముగా - ననఁగాఁ - గోరునప్పుడు కోరఁబడుదానితోడను, గోరనప్పుడు కోరఁబడనిదానితోడను, (సంబధ్యతే=) సంబంధము గలిగియే యుండును.

(9) అర్థానర్థములు రెండును దాపక మనియుఁ, దప్య మనియుఁ జెప్పఁబడుటలో నాక్షేప మేమియు నుండదు.

తత్రార్థ స్యాల్పీయస్త్వాత్, భూయస్త్వా చ్చానర్థ స్యోభావ ప్యర్థానర్థా వనర్థ ఏవేతి;
తాపక స్స ఉచ్యతే.

(తత్ర=) ఈసందర్భములోఁ (అర్థ ... స్త్వాత్ =) గావలెనని కోరఁబడువాని సంఖ్య (సాధారణముగా) యతిస్వల్పముగా నుండుటనుబట్టియు (అనర్థస్య + భూయ స్త్వాత్ - చ=) నక్కఱ లేదని విసర్జింపఁబడవలసినవానిసంఖ్య బాహుళ్యముగా నుండుటనుబట్టియు, (ఉభౌ + అపి + అర్థానర్థౌ =) కోరఁబడునది, కోరఁబడనిది యనునీరెండునుగూడ (అనర్థః + ఏవ + ఇతి) అనర్థమే యని చెప్పవలసివచ్చును; గావున (సః=) అది-అనఁగా నర్థానర్థరూపమైనయీయనర్థము (తాపకః- ఉచ్యతే= తాపకమని- అనఁగాఁ దపింపఁజేయువస్తువని చెప్పఁబడును.

తప్యస్తు పురుష ఏకః పర్యాయే ణోభాభ్యాం సంబధ్యత ఇతి.

(ఆతాపకవస్తువులన- అనఁగా నర్థానర్థవస్తువులన) (తప్యస్తు-పురుషః=) తపింపఁజేయఁబడుపురుషుఁడన్ననో (జీవుఁడన్ననో) (ఏకః=) యొక్కఁడే యయ్యును (పర్యాయేణ =) వరుసగా (ఉభాభ్యాం =) నర్థానర్థవస్తువులరెంటితోను (=జగత్తుతో) (సంబధ్యతే + ఇతి=) సంబంధము గలిగియుండును.- (కావలెనని కోరఁబడు వస్తువు - అక్కఱ లేదని వదలివేయఁబడువస్తువు- ఈరెండును బురుషుని బీడింపఁజేయునవియేగాన, నారెంటిని 'తాపకమే'యని పిల్చుటలో దోష మేమియును లేదని భావము.)

(సి) తప్యతాపకములు రెండును నొక్కయాత్మయే యని వాదించువేదాంతమతమందు మోక్ష మన్నది యుండుట కవకాశము లేదు.

తయో స్తప్యతాపకయో రేకాత్మతాయాం, మోక్షానుపపత్తిః.

(తయోః ... తాయాం=) తప్య మనుపురుషుఁడును, దాపక మనెడిజగత్తును నీరెండును (భిన్నములు గాక) నొకేస్వరూప మైయున్నచో (మోక్షానుపపత్తిః=) మోక్ష మనెడిప్రసంగమే యుండదు.

(మోక్షమనఁగా- విడుదల- ఈవిడుదల పురుషున కుండవలయును. జగత్తునుండి కలుగవలయును. పురుషజగత్తులు రెండును వేఱైనవి గానిచో మోక్ష (విడుదల) మనెడి వ్యవహారమే యుండఁజాలదు – అని భావము.)

(డి) తప్యతాపకములు రెండును నన్యోన్యసంబంధము గల వేఱువేఱు వస్తువులని బోధించుసాంఖ్యమతమునందుఁ దాపకమునుండి తప్యమునకు మోక్ష ముండునని చెప్పుట తగియున్నది.

జాత్యంతరభావే తు తత్సంయోగహేతుపరిహారా త్స్యాదపి కదాచి న్మోక్షోపపత్తిరితి.

(జాత్యంతరభావే తు=) ఆరెండును- అనఁగా నాతప్యతాపకము లనెడి రెండును వేఱువేఱగు రెండుతెగలకుఁ జెందినవై భిన్నములని యొప్పుకొన్నప్పుడే, (తత్సం .... రాత్=) ఆరెండును గలియుటకు హేతు వేది గలదో యట్టిహేతువును దొలఁగించుటవలన (కదాచిత్=) నొకప్పుడు గాకున్న నొకప్పుడైనను (మోక్షోపపత్తిః – స్యాత్ – ఇతి) మోక్షమనునది (=విడుదల) సంభవింపఁగలదని చెప్పఁదగియుండునుసుమా !

అద్వైతసిద్ధాంతిసమాధానము :—

అత్రోచ్యతే — (అత్ర =) పై పూర్వపక్షవిషయములో సమాధానము (ఉచ్యతే =) చెప్పఁబడుచున్నది చూడుఁడు.

నైకత్వాదేవ తప్యతాపకభావానుపపత్తేః.

(న=) పూర్వపక్షము సరిగాదు. (ఏకత్వాత్ + ఏవ =) భేదము లేకుండ నాత్మ యొక్కటియే మైయున్నందుననే, (తప్య ... పత్తేః =) అందు (ఆయాత్మయందు) తప్య (జీవ) – తాపక (జగత్) భేదము లుండుటకే యవకాశము లేదు.

భవే దేష దోషో, య ద్యేకాత్మతాయాం తప్యతాపకా వన్యోన్యస్య విషయవిషయిభావం ప్రతిపద్యేయాతామ్.

(తప్యతాపకౌ=) తప్యతాపకములు రెండును (పురుషజగత్తులు) (ఏకాత్మతాయాం=) నొక్కయాత్మకు సంబంధించినవేయై (అన్యో ... భావం=) ఆరెంటిలో

నొకటి గ్రహించువాఁడుగాను (=విషయి = పనిచేయువాఁడు = కర్త = subject) రెండవది గ్రహింపఁబడునదిగాను (విషయము = పనిచేయఁబడునది =కర్మ= object) (యది ప్రతిపద్యేయాతాం=) నుండునట్లగుచో, (ఏషః దోషః=) నీవు పైనఁజెప్పిన దోషము (భవేత్ =) వచ్చునుగాక !

న త్వేత దస్తి, ఏకత్వాదేవ.

(ఏకత్వాదేవ=) అవి రెండును (తప్యతాపకములు = పురుషజగత్తులు) భిన్నములు గాక యొక్కటే (ఒక్కయాత్మయె) యైనందున (ఏతత్ =) నాదోషము (న+తు+అస్తి=) లేనే లేదు.

న హ్యగ్ని రేకస్స న్నాత్మానం దహతి, ప్రకాశయతి వా, సత్య ప్యౌష్ణ్యప్రకాశాదిధర్మభేదే పరిణామిత్వే చ.

(అగ్నిః ఏకఃసన్ =) ఒక్కటేయై యుండునగ్నియందు (సత్యపి - ఔష్ణ్య ... భేదే =) వేడిమి (= ఔష్ణ్యం) వెలుగు (= ప్రకాశః) ననుస్వభావ (= ధర్మ) భేదము లున్నప్పటికిని, (సత్యపి ... పరిణామిత్వే చ=) అది (=ఆయగ్ని) పరిణామమును (= మార్పును) జెందుచుండు స్వభావము గలదైనప్పటికిని, ఆయగ్ని (ఆత్మానం=) తన్నుఁ దాను (నహి దహతి=) కాల్చుకొనుటగాని (నహి-ప్రకాశయతి వా=) వెల్గించుకొనుటగాని యుండదుగదా.

కిము కూటస్థే బ్రహ్మ ణ్యేకస్మిం స్తప్యతాపకభావ స్సంభవేత్.

(కూటస్థే=) ఏవిధమైనమార్పులు లేనట్టియు (ఏకస్మిన్=) నొక్కటియే యై యుండునట్టియు (బ్రహ్మణి=) బ్రహ్మమందు (=ఆత్మయందు) (తప్యతాపకభావః=) తప్యతాపకభేదములు (పురుషజగద్భేదములు) (కిము సంభవేత్ =) ఉండనేర వని వేఱుగఁ జెప్పవలయునా ! !

ఎదిరిప్రశ్నము :—

క్వ పున రయం తప్యతాపకభావ స్స్యాదితి.

(పునః=) దేనివియుఁ గాకపోవుచో, (అయం తప్యతాపకభావః =) ఈతప్యతాపకము లనెడిభేదములు (క్వ-స్యాత్-ఇతి=) ఎక్కడినుండి వచ్చినవో చెప్పుఁడు)

సిద్ధాంతి :—

ఉచ్యతే — చెప్పఁబడును వినుఁడు.

కిం న పశ్యసి కర్మభూతో జీవద్దేహ స్తప్యస్తాపక స్సవితేతి.

(కర్మభూతః=) కర్మస్వరూపమై (=క్రియకుఁ గర్మగా - (object గా నున్న) (జీవత్=) జీవించియున్న దేహమే (పురుషశరీరమే) (తప్యః+ఇతి) తప్యమనియు (సవితా=), (దృష్టాంతమునకు-మాటవరుసకు) సూర్యుఁడే (తాపకః+ఇతి) తపింపఁ (దహింప = కాల్పఁ) జేయువాఁడనియుఁ (హేతువైనవాఁడనియు) (కిం న పశ్యసి=) బ్రత్యక్షముగాఁ జూచుటలేదా !

తిర్యక్ప్రశ్నము — (అడ్డసవాలు)

నను తప్తిర్నామ దుఃఖం, సా చేతయితు, ర్నాచేతనస్య దేహస్యః

(నను... దేహస్య=) తాపమనఁగా దుఃఖము (కష్టము=నొప్పి=బాధ- (సా=) ఆదుఃఖము చేతనమైనయాత్మకుఁ గలదుగాని, అచేతనమైన దేహమున కుండదుగదా!

యది దేహస్యైవ తప్తి స్స్యా త్సా దేహనాశే స్వయమేవ నశ్యతీతి, తన్నాశాయ సాధనం నైషితవ్యం స్యాదితి.

(తప్తిః=) తాపము (యది .... స్యాత్=) దేహమునకు సంబంధించినదే యగుచో (దేహనాశే=) దేహము నశించునది యగుచుండఁగా (స్వయమేవ ... తీతి=) తాపముగూడ నశించిపోవునదియేగదా ! అట్టిసందర్భములో (తన్నాశాయ=) నాతాపమును నశింపఁజేయుటకై వేఱుసాధనమును (న ఈషితవ్యం+స్యాత్=) గోర నేల ? వేఱుసాధనము గోరఁబడవలసినది గాదుగదా)

సిద్ధాంతి ప్రత్యుత్తరము :—

ఉచ్యతే -— చెప్పెదము వినుఁడు.

దేహాభావే హి కేవలస్య చేతనస్య తప్తి ర్న దృష్టా.

(దేహా .... హి=) దేహము లేకపోవుచో, (కేవ .... నస్య=) కేవలచేతనమునకుఁ (తప్తిః=) దాప మనునది (న దృష్టా=) లేదుగదా ! కనుపింపదుగదా.)

నచ త్వయాపి తప్తిర్నామ విక్రియా చేతయితుః కేవలస్యేష్యతే,

(తప్తిర్నామ విక్రియా =) తాప మనువికారము (కేవలస్య చేతయితుః=) కేవలచేతనమున కుండునని (త్వయాఽపి) సాంఖ్యుఁడ వైననీవుసైతము (నచ+ఇష్యతే=) చెప్పవుగదా !

(చేతనమనఁగా- పురుషుఁ డసంగచిద్రూపుఁడనియే సాంఖ్యసిద్ధాంతము)

నాపి దేహచేతనయో స్సంహతత్వ మశుద్ధ్యాదిదోషప్రసంగాత్.

(అశుద్ధ్యా ... ప్రసంగాత్=) దేహముయొక్క మాలిన్యాదిదోషములు చేతనమున కంటును గావున(అంటునని యొప్పుకొనవలసివచ్చును గావున) (దేహ చేత ... తత్వం=) దేహ చేతనములయొక్క కూడిక (=సంహతత్వము) (నాపి-ఇష్యతే=) సైతము (నీసిద్ధాంతమునకు విరుద్ధముగా నీచే నంగీకరింపఁబడదుగదా!)

నచ తప్తేరేవ తప్తి మభ్యుపగచ్ఛసీతి.

(తాపమన్నది దేహమునకు సంబంధించినదియుఁ గాక, చేతనమునకు సంబంధించినదియుఁ గాక – ఈ రెండుపద్ధతుల నొప్పుకొననిచో) (తప్తిం =) ఇఁకఁ దాపమన్నది (తప్తేః+ఏవ=) తాపమునకు సంబంధించినదే యని (నచ+అభ్యుపగచ్ఛసి=) చెప్పుదువా యేమి? (ఒప్పుకొనవుగదా !)

కథం తవాపి తప్యతాపకభావః ?

(తప్య ... భావః=) తపింపఁజేయఁబడునది (=తప్యం), తపింపఁజేయునది (తాపకః) యనుసంబంధమును) (కథం తవాపి=) ఇంక మరెట్లు సరిపుచ్చఁగలవు ? (గుణవిభాగ మసంభవమని యాక్షేపింపఁబడుచున్నది)

సత్త్వం తప్యం, తాపకం రజ ఇతిచే, న్న;

ఇఁక గుణములలో (సత్త్వం తప్యం=) సత్త్వమే తప్యమనియు (తాపకం రజః=) రజస్సే తాపకమనియు (ఇతిచేత్=) జెప్పుదువేమో ! (న=) అట్లు చెప్పుటయు సరిగాదు.

తాభ్యాం చేతనస్య సంహతత్వానుపపత్తేః.

ఎందుచేతననఁగా (తాభ్యాం=) ఆతప్యతాపకములతో (చేతనస్య=) చేతనమునకు– అనఁగా నాత్మకుఁ (సంహ ... పత్తేః=) గలయిక యుండఁజాలదుగదా !

సత్త్వానురోధిత్వా చ్చేతనోఽపి తప్యత ఇవేతి చేత్.

(సత్త్వా ... త్వాత్=) చేతన మైనయాత్మ తప్య మైనసత్త్వముతో ననుసరించియుండునుగావున (చేతనోఽపి=) ఆయాత్మయు (తప్యత ఇవ - ఇతిచేత్ =) తప్య మైనదానివలె నుండు నందువేమో.

పరమార్థత స్తర్హి నైవ తప్యత ఇత్యాపతతి.

(తర్హి=) అట్లనుపక్షములోనైనను జేతనమైనయాత్మ (పరమార్థతః=) వాస్తవమునకు (నైవ - తప్యతఇతి=) తప్యము (తపింపఁజేయఁబడునది) గాదని (ఆపతతి=) చెప్పినట్లే యగును.

ఇవశబ్దప్రయోగాత్.

అట్లేల చెప్పవలనందువేమో! (ఇవ ... గాత్=) 'నీవు మొదలు చెప్పుట లోనే (ఇవ ... గాత్=) 'ఆత్మ తప్యమైనదానివలె నుండును' అని చెప్పినావు గావున— 'వలె' అనుమాట కర్థ 'మది గా' దనియేగదా!

నచే త్తప్యతే. నేవశబ్దో దోషాయ.

చేతనము (వాస్తవమునకు) తప్యము (తపింపఁజేయఁబడునది) గాదని యెంచు పక్షములో 'ఇవ = వలె' అను శబ్దప్రయోగము (న దోషాయ=) క్రమముగాఁ జేయఁబడినదియే - (అనఁగా- చేతనము వాస్తవమునకుఁ దప్యము గాకపోయినను, దప్యమువలెఁ గనుపించు ననుటలో దోషము లేదని భావము.)

నహి డుండుభ స్సర్పఇవే త్యేతావతా సవిషో భవతి; సర్పోవా డుండుభ ఇవే త్యేతావతా నిర్విషః.

(ఈభావమునే దృష్టాంతపూర్వకముగాఁ జెప్పెదము చూడుఁడు)

(డుండుభః=) దుడ్డుకట్ల (సర్పఃఇవ) 'పామువలె నున్నది' (ఇత్యేతావతా=) అని యిట్లన్నంతమాత్రముచేత (నహి సవిషో భవతి=) నాదుడ్డుకట్ల విషము గలది గాదుగదా! (వా=) లేక (సర్పః=) పాము (డుండుభఃఇవ=) 'దుడ్డుకట్లవలె నున్నది' (ఇత్యేతావతా=) అని యిట్లన్నంతమాత్రముచేత, నాపాము (నిర్విషః=) విషము లేనిది (నహి భవతి=)కాదుగదా!

అత శ్చావిద్యాకృతోఽయం తప్యతాపకభావో న పారమార్థిక ఇత్యభ్యుపగంతవ్య మేతత్.

(అతశ్చ=) కాఁబట్టి (అయం ... భావః=) నీవు చెప్పెడి తప్యతాపక భేదభావములు (అవిద్యాకృతః=) అజ్ఞానముచేత వచ్చినవిగాని(న పారమార్థికఃఇతి=) సత్యములైనవి కావని (అభ్యుపగంతవ్యమ్ =) నీ వంగీకరించవలసియుండును. (ఏతత్ =) మేము చెప్పునది యిదియే.

నైవంసతి మమాపి కించి ద్దుష్యతి.

(ఏవంసతి=) ఇట్లగుచో, (మమాపి=) మాకును (న-కించి ద్దుష్యతి=) విరోధమేమియును రాదు.

(అనఁగా— ఇందులకు నీ వొప్పుకొన్నచో, మా వేదాంతసిద్ధాంతము ను నీ వొప్పుకొన్న ట్లే యగు నని భావము)

అథ పారమార్థిక మేవ చేతనస్య తప్యత్వ మభ్యుపగచ్ఛసి, తవైవ సుతరా మనిర్మోక్షః ప్రసజ్యేత.

(అథ=) అట్లుగాక (చేత ... ప్యత్వం=) చేతన మైనయాత్మయే తప్య మను విషయము (పారమార్థిక మేవ=) సత్యమే యని (అభ్యుపగచ్ఛసి=, నీవు వాదించు పక్షములో (తవ+ఏవ =) నీసిద్ధాంతమందుఁగూడ (సుతిరాం+ అనిర్మోక్షః =) మోక్షమన్నది యెంతమాత్రము నుండ నేరదనియే (ప్రసజ్యేత=) ప్రసక్త మగును.

నిత్యత్వాభ్యుపగమాచ్చ తాపకస్య.

ఎందుచేననఁగా— (తాపకస్య=) తాపక మైఁ ప్రధానము నీసిద్ధాంతానుసార ముగా (నిత్య ... మాచ్చ) నిత్యమని నీవు వాదించుచుండుటవలనఁ [దప్యమునకు (=పురుషునకు) మోక్షము (=విడుదల) (నిత్యమైనదానినుండి) ఎట్లు గలుగును?] (కలుగనే కలుఁగదని భావము)

తప్యతాపకశక్త్యో ర్నిత్యత్వేఽపి సనిమిత్తసంయోగాపేక్షత్వాత్ తప్తే స్సంయోగనిమిత్తాదర్శన నివృత్తా వాత్యంతిక స్సంయోగోపరమః;

(సాంఖ్యులు తాపకమని చెప్పుప్రధానము నిత్యముగావునఁ దప్య మనెడి పురుషునకుఁ బ్రధానమునుండి మోక్షము లేదని వచ్చిన ఆచిక్కును దప్పించు కొనుటకై సాంఖ్యవాది)

(తప్య ... త్వేఽపి=) తప్యతాపకములయొక్క శక్తులు— అనఁగాఁ— దప్య మనెడి పురుషునియొక్క తపించుస్వభావము— తాపక మనెడి ప్రధానముయొక్క తపింపఁజేయు స్వభావము— ఈరెండును నిత్యములే యైనప్పటికిని, (తప్తేః=) పురుషుఁడనుభవించుతాపము (సనిమిత్త ... పేక్షత్వాత్ =) నిమిత్తముతోఁ గూడిన— అనఁగా అవివేక మనుకారణముతోఁగూడిన (=సనిమిత్త) సంయోగము (=కలయిక) మీఁద నాధారపడియుండుటవలన (అనఁగాఁ బురుషునియొక్క తాపము ప్రధానము కంటెఁ దాను వేఱని తెలిసికొనలేకపోవుట— యను అవివేకము చేతఁ గల్గుచుండుట వలన) (సంయో ... నివృత్తౌ=) ఆసంయోగ (=ప్రధానమునుండి విడిపోలేకుండుట) మునకుఁ గారణ (=నిమిత్త) మైనయవివేకము (=అదర్శనము = ప్రధానమునుండి తన్ను వేఱుగాఁ జూడలేకపోవుట) పోయిన దగుచుండఁగా (=నివృత్తౌ) (అనఁగాఁ—

బ్రిధానముకంటెం దాను వేఱని తెలిసికొనంగల్గినవివేక మెప్పుడు గల్గునో యప్పుడు) (ఆత్యం ... పరమః=) ప్రధానముతోం బురుషుండు కలిసియుండుట యనెడి సంయోగముయొక్క శాంతించిపోవుట (=ఉపరమః = భంగపడిపోవుట) (ఆత్యంతికః =) పుష్కలమైనదై యుండును.

(అనంగా :— ప్రధానముకంటె వేఱైనవాండను— (అసంగుండను, జిదూప్రుండను) అని పురుషుండు తెలిసికొనలేకపోవుటయే పురుషునకు బంధము. ఇదియె సంయోగము ప్రధానముతోం పురుషుండు గలిసియుండుట) తెలిసికొనుటయే పురుషునకు మోక్షము— బంధమునకుం గారణ మవివేకము (=వేఱుచేయలేకపోవుట) మోక్షమునకుం గారణము వివేకము (=వేఱుచేయుట) వివేకమువలన సంయోగమనుబంధము పూర్తిగాం దొలంగిపోవును— అని భావము.)

తత శ్చాత్యంతికో మోక్ష ఉపపన్నః.

(తతః=) ప్రధానముతో సంయోగ మనెడిబంధము పూర్తిగాం దొలంగిపోవుటవలన (ఆత్యంతికః మోక్షః=) సంపూర్ణ మైనమోక్ష మప్పుడే (ఉపపన్నః=) కుదిరిన దగును.

(అనంగా :— ప్రకృతితో నవివేకకార్య మైనసంయోగమే పురుషునకు బంధము- వివేకముచేత సంయోగము పోవుటయే పురుషునకు మోక్షము— అని భావము)

ఇతి చేత్ న.

అని సమాధానమును జెప్పుదువేమో— (న=) ఆసమాధానము పనికిరాదు. (పురుషునకుం బ్రధానముతో సంయోగమును గూర్చుచున్నదని సాంఖ్యుండు చెప్పిన యవివేకము తొలంగిపోం జాలదని వేదాంతి యెదుర్కొనుచున్నాండు)

అదర్శనస్య తమసో నిత్యత్వాభ్యుపగమాత్.

అవివేకమే (సాంఖ్యమతములో) అదర్శనమని చెప్పంబడును. (అదర్శన (=కన్గొనలేకపోవుట) మనంగాం బ్రధానపురుషులను వేఱుచేసికొనలేకపోవుట – ఈ యదర్శనమే 'తమస్సు' అని నిర్వివాదాంశము. సాంఖ్యులు నిత్యములని చెప్పుమూండు గుణములలో నీ 'తమస్సు' ఒకటి- కాన 'తమస్సు' అనునది నిత్యమైన దని సాంఖ్యులొప్పుకొనక తీరదు. నిత్యమైన వస్తువెప్పటికి బోనేపోదుగదా- కాన 'తమస్సు' (= అదర్శనము = అవివేకము) పోవునది కాదు, ఈతమస్సు పోనిచో సంయోగమే పోదు- మోక్షమే రాదు.

గుణానాం చోద్భవాభిభావయో రనియత స్సంయోగనిమిత్తోపరమ ఇతి.

(తమస్సు - అనునది పూర్తిగా మాసిపోఁజాలనిదైనను వివేకముచేఁ దమో బలము తగ్గుటవలనఁ బ్రధానపురుషులసంయోగము విచ్ఛిపోవు నందు రేమో- అట్లును గాఁజాలదు.)

(గుణానాం చ=) సత్త్వరజస్తమోగుణములయొక్క (ఉద్భవ =) వికసించుటయు (అనఁగా హెచ్చగుటయు), (అభిభావ=) లయించుటయు (అనఁగాఁ దగ్గిపోవుటయు) (అనియతః=) నియతములుగాఁ గలుగునవి కావు (అవి మొద్దులై యచేతనములై యందువను వానిని నియమించునది మతియొకటి లేనందునను వానిలో వానికి హెచ్చుతగ్గులు కలుగనేరవని భావము) - (సంయో .... పరమః=) కావునఁ బ్రధానపురుషులయొక్క సంయోగ హేతువునకు నుపరమము (=భంగము చెందుట- శాంతించిపోవుట) కలుగదు.

(సంయోగహేతు వైనతమోగుణబలము తగ్గుటకు నవకాశము లేనప్పు డదర్శనము (=అవివేకము) తగ్గిపోఁజాలఁదు - ఇది లేనప్పుడు సంయోగము పోఁజాలదని భావము.)

వియోగస్యా ప్యనియతత్వా త్సాంఖ్యస్యై వానిర్మోక్షో౽పరిహార్య స్స్యాత్.

అందుచేఁ బ్రధానపురుషులయొక్క (వియోగస్యాపి) వియోగముగూడ (విడిపోవుటగూడ) నియతముగాఁ గలుగనేరదు. (సంయోగము పోవుటయే వియోగమని యెఱుఁగునది)- ప్రధానపురుషులయొక్క స యోగము (=కలయిక) పోయి వియోగము రాఁజాలకపోవుటచే ( సాంఖ్యస్య + ఏవ ) (సాంఖ్యునకే (అనిర్మోక్షః =) మోక్షము లేకపోవుట (అపరిహార్యః + స్యాత్ ) తప్పనిసరియే యగునునుమా !

ఔపనిషదస్య త్వాత్మైకత్వాభ్యుపగమా దేకస్య చ విషయవిషయిభావానుపపత్తేః.

(ఔపనిషదస్య తు=) ఇఁక మావేదాంతసిద్ధాంతములోనన్ననో, ఆత్మైకత్వ .... గమాత్ =) సర్వ మొక్కయాత్మయే యని మే మంగీకరించుటచే (ఏకస్య చ=) నొక్కటిగానే యుండునాయాత్మ (విషయ ... పత్తేః =) చూడఁబడునది (=విషయ)= యని, చూచువాఁడని (=విషయి) భిన్నపదార్థము (=భావ) లగుటకు నవకాశము లేనందునను,

వికారభేదస్య చ వాచారంభణమాత్రత్వశ్రవణాత్.

(వికారభేదస్య చ=) (చూచెడి- అనఁగా గ్రహించెడి) జీవులుగాను (చూడఁ

బడు- ననఁగా (గ్రహింపఁబడు) పాంచభౌతికవస్తువులుగాను (వికారభేదస్య=) వివిధ భేదములతో గోచరించు (పరావరరూప) జగత్తు (వాచా ... శ్రవణాత్ =) వాక్కుతో నుచ్చరింపఁబడునవి మాత్రమే యని (అనఁగా వాస్తవములు గావని) (శ్రుతి ఛాం. VI- ) చెప్పుచుండుటవలనను

అనిర్మోక్షాశంకా స్వప్నేఽపి నోపజాయతే.

(అనిర్మోక్ష + ఆశంకా=) మోక్షము లేకపోవునది యగు ననెడిసందేహము (స్వప్నే .... యతే=) స్వప్నమందైనను బుట్టుట కవకాశము లేదు.

(అనఁగా- ఉన్న దొక్కటియే యనియు, లేనిది లేనిదియే యనియుఁ దెలిసికొనుటయే (=సమ్యగ్జ్ఞానమ్) మోక్షమగుటలో (సాంఖ్యమతమందువలె) నెట్టియసంభవమును రాఁజాలదని భావము.)

వ్యవహారే తు యత్ర యథాదృష్టస్తప్యతాపకభావ, స్తత్ర తథైవ స ఇతి, న చోదయితవ్యః, పరిహర్తవ్యో వా భవతి.

(వ్యవహారే తు=) సమ్యగ్జ్ఞానమునను సంబంధించని యీయింద్రియాది గోచర జగద్వ్యవహారములో నన్ననో (అనఁగా వాచారంభణమాత్ర జగద్వ్యవహారములో నన్ననో) అట్టివ్యవహార మున్నంతవఱకుఁ (తప్యతాపకభావః=) దప్యములని (=జీవులని - పురుషులని) — తాపకములని (=ప్రకృతియని) భిన్నములుగా (యథాదృష్టః=) ప్రత్యక్షమున కెట్లు గోచరించుచున్నవో (తత్ర తథైవ సః + ఇతి) ఆవ్యవహారదశలో నాభేదభావ మంతయు నట్లట్లే యుండనిండు- ఆవ్యవహారదశలో నాభేద భావమునుగూర్చి (న చోదయితవ్యః=) మేము చేయునాక్షేప మేమియును లేదు. (అనఁగా నందులనుగూర్చి విచారింపఁబడవలసిన దేమియును లేదని భావము.) (న పరిహర్తవ్యః భవతి=) మఱియు నట్టివ్యవహారదశలో నాభేదభావము త్రోసివేయఁబడునదియుఁ గాదు. (అనఁగా నప్పు డట్లు గన్పించుట లేదని నిరాకరింపఁబడుటయు లేదని భావము)

## మహద్దీర్ఘాధికరణము

2 అధికరణావతారిక :—

జగత్కారణ మచేతన మగుప్రధానమే యగునుగాని చేతనబ్రహ్మము గానేరదని వాదించుసాంఖ్యమతము పూర్వాధికరణమందు ఖండింపఁబడినది. అట్లే జగ

త్కారణ మచేతనము లగుపరమాణువులే యగునుగాని చేతనబ్రహ్మము గానేరదని వాదించు వైశేషికమత మీయధికరణమందు ఖండింపఁబడుచున్నది.

11. సూత్రావతారిక :—

అదృశ్యములై పరిమండల (=Infinite simel) పరిమాణము (=గుణము) గల రెండుపరమాణువులు చేరినచో నదృశ్యమై హ్రస్వ(=Short)పరిమాణము(=గుణము) గలద్వ్యణుక మేర్పడుననియు, నట్టినాల్గు ద్వ్యణుకములు చేరినచో మహత్పరిమాణ మగు (Big) (త్ర్యణుకముగాని (లేక) - లేక దీర్ఘపరిమాణము గల (Long) త్ర్యణుకముగాని ( లేక ) యేర్పడుననియు, నీ (త్ర్యణుకము దృశ్య మనియు, నిట్టి ద్వ్యణుక త్ర్యణుకముల కలియికచేతనే జగత్తు పుట్టుచున్నదనియు వైశేషికులు చెప్పుచున్నారు. పైనఁ జెప్పినవిధమునఁ గారణమందు లేనిగుణములు కార్యమం దేర్పడుచున్నవి. ఇట్టివాదము గలవారు బ్రహ్మజగత్కారణవాదము నాక్షేపించఁదగరని యీసూత్రమందుఁ జూపఁబడుచున్నది.

## ౧౧ సూ॥ మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యామ్

అన్వయక్రమము :- హ్రస్వపరిమండలాభ్యాం మహద్దీర్ఘవద్వా.

ప॥ వి॥ — హ్రస్వపరిమండలాభ్యాం - మహద్దీర్ఘవత్ - వా

ప్ర॥ వ॥ అ॥ — హ్రస్వ .... లాభ్యాం = హస్వమువలన, పరిమండలము వలన - మహద్దీర్ఘహ్రస్వవద్వా = (మహద్దీర్ఘములతోపాటు హ్రస్వమునుగూడఁ జేర్చికొని చదువవలసియుండును.) మహద్వద్వా=మహత్తువలెఁగాని, హ్రస్వవద్వా= హ్రస్వమువలెఁగాని.

సూత్రార్థము - సూత్రభావము :— హస్వపరిమాణము గలద్వ్యణుకముల నుండి (1) మహత్పరిమాణము గలత్ర్యణకములుగాని (2) దీర్ఘపరిమాణము గల త్ర్యణుకముగాని - లేదా పారిమాండల్యపరిమాణము గలపరమాణువులనుండి (3) హ్రస్వపరిమాణము గల ద్వ్యణుకముగాని, కారణగుణములకంటె వ్యతిరేకమైనగుణములు గలకార్యము లెట్లు పుట్టుచున్నవో - అట్లే చేతనబ్రహ్మమునుండి యచేతన జగత్తు పుట్టుచున్నదని యేల చెప్పరాదు ?

2 పరమాణువులు (అదృశ్యము)
(గుణము లేక పరిమాణము–
పారిమాండల్యము)

4 ద్వ్యణుకములు–గుణము లేక పరిమాణము హ్రస్వము–(అదృశ్యము)
త్ర్యణుకము (దృశ్యము)

ద్వ్యణుకము (గుణము లేక పరిమాణము హ్రస్వము)
(అదృశ్యము)

మహత్ పరిమాణము లేక గుణము
○ వర్తులము లేక □ చతురశ్రము

దీర్ఘ పరిమాణము లేక గుణము

భాష్యము — భాష్యార్థము

అధికరణావతారిక :—

ప్రధానకారణవాదో నిరాకృతః;

ప్రధానజగత్కారణవాదము పూర్వాధికరణమందు నిరాకరింపఁబడినది.

పరమాణుకారణవాద ఇదానీం నిరాకర్తవ్యః.

వైశేషికులు చెప్పుపరమాణుజగత్కారణవాద మిప్పుడు నిరాకరింపఁబడవలసియున్నది.

తత్రాదౌ తావ ద్యోऽణుకారణవాదినా బ్రహ్మవాదిని దోష ఉత్ప్రేక్ష్యతే స ప్రతిసమాధీయతే.

(తత్ర=) ఆవిషయములోఁ బరమాణుజగత్కారణవాదులైనవైశేషికులచేత బ్రహ్మజగత్కారణవాదులైనవేదాంతులయందు (యః దోషః =) నేదోషము (ఉత్ప్రేక్ష్యతే=) చూపెట్టఁబడుచున్నదో (సః=) ఆదోష మిప్పు (ఆదౌ + తావత్ =) డారంభమందు (ప్రతిసమాధీయతే=) నిరాకరింపఁబడుచున్నది. (= ఖండింపఁబడుచున్నది.)

తత్రాయం వైశేషికాణా మభ్యుపగమః.

(తత్ర=) జగత్కారణవిషయములో వైశేషికులయొక్క (అయం అభ్యుపగమః) సిద్ధాంత మేమిటో పేర్కొనఁబడుచున్నది.

I జగత్కారణవిషయమైన వైశేషికసిద్ధాంతము (1) కారణగుణములే కార్యమందు వచ్చితీరును.

కారణద్రవ్యసమవాయినో గుణాః కార్యద్రవ్యే సమానజాతీయం గుణాంతర మారభంతే.

(1) (కారణ=) జగత్తున కాదికారణమైన (ద్రవ్య=) ద్రవ్యముతో (సమవాయినః=) సంబంధించిన (గుణాః =) గుణములు (అనఁగా— కారణమం దున్నగుణములే) (కార్యద్రవ్యే=) కార్యద్రవ్యమందు— అనఁగా జగత్తునందుఁ (సమా ... తరం=) దమగుణములవంటివేయగు (గుణాంతరం=) గుణములను (ఆరభంతే=)బుట్టించుచున్నవి- ఎట్లనఁగా—.

తంతుపటదృష్టాంతము :— దారమునందలిరంగే వస్త్రమునకు వచ్చితీరును.

శుక్లేభ్య స్తంతుభ్య శ్శుక్లస్య పటస్య ప్రసవదర్శనా త్తద్విపర్యయాదర్శనాచ్చ.

(శుక్లే .... భ్యః =) తెల్లనిదారములనుండి (శుక్లస్య పటస్య =) తెల్లని వస్త్రమే (ప్రస ... నాత్ =) పుట్టుట (= తయారగుట) చూపట్టుచుండుటయు, (తద్వి ... నాచ్చ=) తెల్లనిదిగాక మఱియొకరంగు గలవస్త్రము పుట్టుట చూపట్టకుండుటయుఁ (ప్రత్యక్షములేగదా !)

(2) పై దృష్టాంతమునుబట్టియే వేదాంతమతానుసారము చేతనబ్రహ్మ మీయచేతనజగత్తునకుఁ గారణమని చెప్పుట పొసఁగదు.

తస్మాచ్చేతనస్య బ్రహ్మణో జగత్కారణత్వేఽభ్యుపగమ్యమానే, కార్యేఽపి జగతి చైతన్యం సమవేయాత్.

కాఁబట్టి (చేత ... మానే=) చేతనస్వరూపమైనబ్రహ్మమునుండియే యీ జగత్తు పుట్టినదని యంగీకరించుపక్షములో, (కార్యేఽపి జగతి =) కార్యమైన (పుట్టిన) యీజగత్తునందు సైతము (చైతన్యం సమవేయాత్ =) చేతనస్వరూపమే (=చైతన్యమే) సంబంధించి యుండవలసియుండును. (=అంటి రావలసియుండును)

తదదర్శనాత్తు న చేతనబ్రహ్మ జగత్కారణం భవితు మర్హతీ తీమ మభ్యుపగమం తదీయైవ ప్రక్రియయా వ్యభిచారయతి.

(తదదర్శనాత్తు=) అట్లు చూపట్టకుండుటవలననే— అనఁగాఁ బుట్టినదని చెప్పనీజగత్తు అచేతనమై యుండుటవలననే (చేత ... భవితుం=) చేతనబ్రహ్మమునుండి యీయచేతనజగత్తు పుట్టినదని చెప్పుటకు (న+అర్హతి=) నవకాశము లేదు.

సృష్టిప్రక్రియలో వైశేషికసిద్ధాంతము వేదాంతసిద్ధాంతమునకు భిన్నమై యుండును.

(ఇమం+అభ్యుపగమం=) వైశేషికు లాక్షేపించు నీవేదాంతమత (సృష్టివిషయ) సిద్ధాంతమును (తదీయ ... యయా=) సృష్టివిషయములో నావైశేషి

కులు చెప్పుపద్ధతితో (వ్యభిచారయతి=) వేఱుపఱచుచున్నారు. (అనఁగాఁ దమ సిద్ధాంతముకంటె వేదాంతులసిద్ధాంతము సృష్టివిషయములో వేఱని తలఁచుచున్నారు)

II సూత్రముచే సమాధానము

వైశేషికసిద్ధాంతానుసారముగాసైతము కారణగుణము లన్నియుఁ గార్యమందు రావు. ఎట్లనఁగాఁ గారణగుణము లైనపారిమాండల్యాణుత్వ హ్రస్వత్వాదు లు కార్యము లైనద్వ్యణుకత్ర్యణుకాదులయందు లేవు.

'మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యామ్.

(హ్రస్వ – పరిమండలములవలన మహత్త్వముగాని దీర్ఘత్వముగాని యెట్లు పుట్టుచున్నవో (అట్లే బ్రహ్మమువలన జగత్తు పుట్టుచున్నది.)

III (1) వైశేషికసిద్ధాంతానుసారము సృష్టిప్రక్రియ ప్రళయకాలములో నిశ్చలముగా నున్నపరమాణువులు సృష్టికాలములోఁ బారిమాండల్యపరిమాణము గలవై యుండును.

ఏషా తేషాం ప్రక్రియా.

(తేషాం =) ఆవైశేషికులయొక్క (ప్రక్రియా) సృష్టివిధాన (ఏషా =) మిదిగో చూడుఁడు.

పరమాణవః కిల కంచిత్కాల మనారబ్ధకార్యా, యథాయోగం రూపాదిమంతః పారిమాండల్యపరిమాణా స్తిష్ఠంతి.

పరమాణువులు (కంచిత్కాలం=) కొంతకాలము- అనఁగాఁ బ్రళయకాలమందు (అనారబ్ధకార్యాః =) ఎట్టికార్యమును (=పదార్థమును) బుట్టించకుండ (అనఁగా నొకపరమాణువు మఱియొకదానితోఁ గలియకుండ) నిశ్చలములై (యథాయోగం=) దానిదాని కనుగుణమైన (రూపాదిమంతః=) పంచభూతములయొక్క ప్రత్యేకప్రత్యేక రూపములు గలవై (పారి —— పరిమాణాః=) పారిమాండల్యమును (పరమాణువుయొక్క పరిమాణము పరిమండల మనఁబడును. అనఁగా వటుప్రతనము- ఇది యదృశ్యము- రెండుపరమాణువులు కలిసిన ద్వ్యణుక మగును. ఇదియు నదృశ్యమే- నాల్గు ద్వ్యణుకములు గలిసినఁ దర్యణుకమగును. (ఇదిమాత్రము దృశ్యము) పరిమాణమును గలవై (తిష్ఠంతి=) యుండును.

(అనఁగాఁ- బంచభూతముల పరమాణువులు వేఱువేఱైనవై యేయేభూత

మేర్పడునప్పుడు వానివాని ప్రత్యేకపరమాణువులే కలిసికొన్నవై యాయాభూతములు ప్రత్యేకముగా నేర్పడునని భావము.)

(2) సృష్టికాలములో నదృష్టాదిపురస్సరములై యంతకుఁబూర్వము నిశ్చలముగా నున్న పరమాణువులు ద్వ్యణుకాదికార్యములుగా నేర్పడును.

తే చ పశ్చా దదృష్టాదిపురస్సరాః స్సంయోగసచివాశ్చ సంతో ద్వ్యణుకాదిక్రమేణ కృత్స్నం కార్యజాత మారభంతే; కారణగుణాశ్చ కార్యే గుణాంతరమ్.

(పశ్చాత్=) అనంతరమందు– అనఁగా సృష్టికాలము సమీపించినప్పుడు (తేచ=) ప్రళయకాలములో నిశ్చలములై వేఱువేఱుగా నున్న యాపరమాణువులు (అదృష్టాదిపురస్సరాః =) ఇట్టిదని చెప్పరానియదృష్టము మొదలగు కారణములచే లాగఁబడినవై (సంయోగసచివాశ్చ) యొకదానితో మఱియొకటి కూడుకొన్నవగుచు (ద్వ్యణుకాదిక్రమేణ=) ముందు రెండురెండుగాను, అట్టివి మూఁడుమూఁడు నాల్గునాల్గుగాను గుంపులుగుంపులగుచు (కృత్స్నం=) నీసమస్తమైన (కార్యజాతం=) జగత్తులోని వస్తుసమూహమును (ఆరభంతే =) బుట్టించును. (కారణగుణాశ్చ =) గుంపు లగుటకు ముందు వేఱువేఱైనవానియందున్నగుణములే (కార్యే=) ఆగుంపు మొత్తమునందు (గుణాంతరం=) తమతమ గుణములవంటి గుణములను గలుగఁజేయుచుండును.

(3) కారణపరమాణువులందున్న రూపాదిగుణములే కార్యములైన ద్వ్యణుక త్ర్యణుకాదులయందు వచ్చును.

యదా ద్వౌ పరమాణూ ద్వ్యణుక మారభేతే, తదా పరమాణుగతా రూపాదిగుణవిశేషా శ్శుక్లాదయో ద్వ్యణుకే శుక్లాదీ నపరా నారభంతే.

ఎట్లనఁగా (ద్వౌ పరమాణూ=) రెండుపరమాణువులు గలిసి (ద్వ్యణుకం=) ద్వ్యణుక మనుదానిని (యదా ఆరభేతే =) నెప్పుడు గలుగఁజేయునో (అనఁగా రెండైనముకా యెప్పు డేర్పడునో) (తదా=) అప్పుడు (పరమాణుగతాః=) ముకా గాకపూర్వము పరమాణువులందున్న (శుక్లాదయః=) తెల్పు మొదలగునవి యేవి గలవో (రూపాది గుణవిశేషాః =) అట్టిరూపము మొదలగు గుణవిశేషములు (ద్వ్యణుకే=) రెండుగాఁ జేరినముకాయందుఁగూడ (శుక్లాదీన్ =) అట్టితెల్పుమొదలగు (అపరాన్ =) గుణవిశేషములను (ఆరభంతే=) బుట్టించుచున్నవి (అనఁగా నొక పరమాణువునం దెట్టిగుణము గలదో యట్టిదే యగుగుణ మాయాముకాలయందును నేర్పడునని భావము.)

(4) కారణములయొక్క రూపాదిగుణములు కార్యములయందు వచ్చినను, గారణములయొక్క పరిమాణగుణములుమాత్రము కార్యములయందు రావు.

పరమాణుగుణవిశేషస్తు పారిమాండల్యం న ద్వ్యణుకే పారిమాండల్య మపర మారభతే.

(పర .... డల్యం=) పరమాణువుయొక్క గుణవిశేష మైనపారిమాండల్యము (=పరిమండలత్వము) (ద్వ్యణుకే=) రెండుపరమాణువులముతాయందు (అపరం పారిమాండల్యం=) భిన్న మైనపారిమాండల్యమును (న+ఆరభతే=) బుట్టింపదు.

(వైశేషికసిద్ధాంతప్రకారము రూపాదులు గుణము లెట్లని చెప్పఁబడునో పరిమాణము నైతము గుణమని చెప్పఁబడును. పారిమాండల్య మనునది పరమాణువుయొక్క పరిమాణముగావునఁ బారిమాండల్యమునైతి మొకగుణమే- కారణ మగు పరమాణువునం దున్న పారిమాండల్య మనెడిగుణమే కారణమైన ద్వ్యణుకము నందును రావలసియున్నదని భావము.

(5) కారణము లైనపారిమాండల్య-హ్రస్వత్వాదులు పోయి కార్యములందు (అణుత్వ=)హ్రస్వత్వ మహత్త్వదీర్ఘత్వము లనెడిభిన్నగుణములు వచ్చును అనఁగాఁ గారణములు కార్యమందు భిన్నగుణములను బుట్టించుచున్నవి.

ద్వ్యణుకస్య పరిమాణాంతరయోగాభ్యుపగమాత్.

ద్వ్యణుకమునకు- అనఁగా రెండుపరమాణువులు గలముతాకు (పరి ... మాత్=) మఱియొక పరిమాణము వచ్చునని వారిసిద్ధాంతము. (అనఁగా మొదటఁ బరమాణువుల కున్న పారిమాండల్యపరిమాణమే రాదుగాని, రెండుగాఁ గలిసిన ద్వ్యణుక మనెడిముతాకు మఱియొకరక మగుపరిమాణము- అనఁగా- అణుత్వము గాని హ్రస్వత్వముగాని వచ్చునని వారిమతము.)

అణుత్వహ్రస్వత్వే హి ద్వ్యణుకవర్తినీ పరిమాణే వర్ణయంతి.

(అణు ... త్వేహి=) అణుత్వము - హ్రస్వత్వము ననునవియే (ద్వ్యణుక ... మాణే=) ద్వ్యణుకమందుండుపరిమాణములుగా (వర్ణయంతి=) నావైశేషికులు చెప్పుచున్నారు.

యదాపి ద్వే ద్వ్యణుకే చతురణుక మారభేతే. తదాపి సమానం ద్వ్యణుకసమవాయినాం. శుక్లాదీనా మారంభకత్వమ్. అణుత్వహ్రస్వత్వే తు ద్వ్యణుకసమవాయినీ అపి నైవారభేతే.

(యదా ... భేతే=) ద్వ్యణుకములయొక్క ముతాలు రెండు గలిసి 'చతురణుక' (నాల్గుపరమాణువులు గలిసినది) మనుముతాను బుట్టించినప్పుడు (ద్వ్యణు...

కత్వం=) మొదటి ద్వ్యణుకములతో సంబంధించియున్న తెల్పు మొదలగుగుణములే 'చతురణుక' మనుమఱొకదానియందును బుట్టించుట (సమానం =) సమానమేగాని (ద్వ్యణు – యినీ) ద్వ్యణుకముఁతో సంబంధించియున్న (అణుత్వ ... తు + అపి) అణుత్వము హ్రస్వత్వము– అను పరిమాణములనుమాత్రము (చతురణుకమందు) (న + ఆరభేతే + ఏవ=) పుట్టింపనే పుట్టింపవు.

(అనఁగాఁ గారణ మైన మొదటిదానియందున్న రూప మనుగుణమువంటిదగు రూప మనుగుణము వచ్చునుగాని, మొదటిదానియందున్న పరిమాణ మనుగుణము వంటిపరిమాణముమాత్రము కార్య మైన రెండవదానియందు రాదని భావము.)

చతురణుకస్య మహత్త్వదీర్ఘత్వపరిమాణయోగాభ్యుపగమాత్.

(ద్వ్యణుకముయొక్క పరిమాణములు (అదృశ్యములైన అణుత్వము– హ్రస్వత్వము అయినట్లు గానే) చతురణుకముయొక్క పరిమాణము దృశ్యము లగు మహత్త్వ – దీర్ఘత్వము– లని యావైశేషికులయొక్క సిద్ధాంతము.

(○ లేక □ ఇవి రెండును మహత్త్వము – అనఁగాఁ బరిమాణము. ▯ లేక ▭ ఇవి రెండును దీర్ఘత్వము– అనఁగాఁ బరిమాణము )

V వైశేషికసిద్ధాంతసృష్టిప్రక్రియసైతము వేదాంతసృష్టిప్రక్రియకు భిన్నముగా లేదు

(ఎ) వైశేషికసిద్ధాంతానుసారము రూపాదు లెట్లు గుణములో పరిమాణాదులు సైత మట్లే గుణములు. తమయందున్నపరిమాణములకంటెఁ గారణములు కార్యములందు భిన్నపరిమాణములను బుట్టించుచున్నవిగదా.

యదాపి బహవః పరమాణవో, బహూని వా ద్వ్యణుకాని, ద్వ్యణుకసహితో వా పరమాణుః కార్య మారభతే, తదాపి సమా నైషా యోజనా.

ఎప్పుడేని బరమాణువులు గలిసి లేదా యనేకద్వ్యణుకములు గలిసిగాని లేదా పరమాణువు ద్వ్యణుకముతోఁ గలిసిగాని (కార్య మారభతే=) కార్యమును బుట్టించునో (తదాపి=) అప్పుడును (ఏషా యోజనా=) ఈపైఁజెప్పఁబడినపద్ధతి– అనఁగా మొదటికారణమందున్నపరిమాణ మనెడిగుణము కార్యమందు రాక మఱియొక పరిమాణ మనెడిగుణాంతరము వచ్చుట యనుపద్ధతి (సమానా=) సమానముగానే యుండును.

తదేవం యథా పరమాణోః పరిమండలాత్సతోఽణు హ్రస్వంచ ద్వ్యణుకం జాయతే, మహ ద్దీర్ఘం చ త్ర్యణుకాది న పరిమండలం. యథావా ద్వ్యణుకా దణో ర్హ్రస్వాచ్చ సతో మహ ద్దీర్ఘంచ త్ర్యణుకం జాయతే నాణు నో హ్రస్వమ్.

(తదేవం=) అది యెట్లంటేని (మీ వైశేషికసిద్ధాంతానుసారము) పరిమండలత్వము పరిమాణముగాఁ గలపరమాణువు లనెడికారణమునుండి యణుత్వ హ్రస్వత్వములు పరిమాణముగాఁ గలద్వ్యణుకము లనెడికార్యములును, మహత్త్వ దీర్ఘత్వములు పరిమాణములుగాఁగల త్ర్యణుకములు మొదలగుకార్యములును (జాయతే=) బుట్టునుగాని (న- పరిమండలం=) (మొదటికారణ మగుపరమాణువునం దున్నపరిమండలత్వము (యథా న=) ఎట్లు పుట్టఁజాలదో, మఱియు నణుత్వహ్రస్వత్వపరిమాణములు గలద్వ్యణుక మనెడి కారణమునుండి మహత్త్వదీర్ఘత్వము లనెడిపరిమాణము గలత్ర్యణుకము పుట్టునుగాని (మొదటికారణ మగుద్వ్యణుకమం దున్న) అణుత్వహ్రస్వత్వము లెట్లు పుట్టఁజాలవో.

(బి) అట్లే కారణ మైన చేతనబ్రహ్మము, కార్య మైనజగత్తునం దచేతనత్వ మను భిన్నధర్మమును బుట్టించు చున్నదని యేల చెప్పఁగూడదు ?

ఏవం చేతనా ద్బ్రహ్మణోऽచేతనం జగ జ్జనిష్యత ఇత్యభ్యుపగమే కిం తవ చ్ఛిన్నమ్ ?

(ఏవం=) అట్లే (చేత ... ష్యతీతి) చేతన మగుబ్రహ్మమునుండి యచేతన మైనజగత్తు పుట్టఁగలద నెడి (అభ్యుపగమే=) మావేదాంతసిద్ధాంతవిషయమై (కిం తవ చ్ఛిన్నమ్=) నీకు వచ్చిననొప్పి యేమి ? (=నీవు చెప్పఁగలయాక్షేప మేమి ?)

VI పూర్వపక్షము :—

(ఎ) కేవలపరమాణుపరిమాణ మైనపారిమాండల్యమే గాక మఱియొక పరిమాణము వచ్చిపడుటచేతఁ గార్యమందు భిన్నపరిమాణము పుట్టుచున్నది.

అథ మన్యసే,

అట్లుగాక పూర్వపక్షి వైననీ విట్లు తలఁతువేమో—

"విరోధినా పరిమాణాంతరే ణాక్రాంతం కార్యద్రవ్యం ద్వ్యణుకాదీ త్యతో నారంభకాణి కారణగతాని పారిమాండల్యాదీ న్యభ్యుపగచ్ఛామి.

"కార్యద్రి ... కాది=) (కారణ మైనపరమాణువునుండి) కార్యముగాఁ బుట్టినద్వ్యణుకము మొదలగునది (విరోధి ... తరేణ=) పరమాణువునం దుండు పరిమాణమునమీఁద నందులకు వ్యతిరేకముగా— అనఁగాఁ— బెచ్చుగా మఱియొకపరిమాణము వచ్చిపడుటచేత (ద్వ్యణుకము మొదలగునది) నేర్పడుచున్నయది. (ఇత్యతః=) ఈహేతువుచేత (కారణగతాని=) మొదటికారణ మైనపరమాణువునం దున్న (పరిమాణమైన) పారిమాండల్యము మొదలగునవిమాత్రమే (న+ఆరంభకాణి=)

(ద్వ్యణుకము మొదలగు) కార్యమును బుట్టించుట లేదని (అభ్యుపగచ్ఛామి=) తలంచుచున్నాను. (అట్టి యాక్రమణముచేతనే- అనఁగా మఱియొకటి పెచ్చుగా వచ్చుటచేతనేసుమీ కారణమం దున్నపరిమాణముకంటెఁ గార్యమందుఁ బరిమాణము మాఱినదని – భావము.)

(బి) వేదాంతమతానుసారము కారణమైన చేతనబ్రహ్మముకంటెఁ గార్యమైన జగత్తునందు మఱియొకటి వచ్చిపడుట లేదుగదా.

(చేతన మైనబ్రహ్మమునుండి జగత్తు పుట్టినదని చెప్పుమీ వేదాంతసిద్ధాంతములో)

నతు చేతనావిరోధినా గుణాంతరేణ జగత ఆక్రాంతత్వ మస్తి, యేన కారణగతా చేతనా కార్యే చేతనాంతరం నారభేత

(చేతనావిరో ... రేణ =) కారణ మైన చేతనముకంటె వ్యతిరేకముగా – అనఁగాఁ బెచ్చుగా మఱియొకగుణ మేదియును (జగతః ఆక్రాంతత్వ మస్తి=) కార్య మైనజగత్తు పుట్టుటలో వచ్చిపడ లేదుగదా.

(యేన=) అట్లు వచ్చిపడినదని యొప్పుకొన్నప్పుడే (కారణగతా చేతనా =) కారణ మైనబ్రహ్మమం దున్న చేతనత్వము (కార్యే=) కార్యమైనజగత్తును (చేతనాంతరం=) జేతనముగానే (న + ఆరభేత=) పుట్టించలేకపోయెనని చెప్పఁదగియుండును.

(అనఁగాఁ– బరిమండలమునుండి హ్రస్వత్వాదులు పుట్టినప్పుడు పరిమండలాంతరము వచ్చి దాని నాక్రమించుటచేఁ గారణమందలి గుణముకంటెఁ గార్యమందు నూతనగుణ మేర్పడినదని చెప్పవచ్చును. వేదాంతసృష్టిప్రక్రియలోఁ జేతనమునుండి జగత్తుపుట్టినప్పు డాచేతనముపై మఱియొకటి వచ్చి యాక్రమించనందునఁ గారణ మైన చేతనమునందుకంటెఁ గార్య మైనజగత్తునందు విరుద్ధధర్మ (అచేతనత్వ) మెట్లేర్పడినదని– భావము.)

(సి) అచేతన మనునదియే మఱియొకటి వచ్చిపడినదని చెప్పుటకు వీలు లేదు. అచేతనము భిన్నగుణము గాదు.

న హ్యచేతనా నామ చేతనావిరోధీ కశ్చి ద్గుణోఽస్తి చేతనాప్రతిషేధమాత్రత్వాత్.

(చేతనమునకు విరోధియైన యచేతనమె- అనఁగా నజ్ఞానమె వచ్చి యాక్రమించిన దందురేమో- అట్లనుటకు వీలు లేదని చెప్పఁబోవుచున్నాఁడు.)

(అచేతనా నామ=) అచేతనమనఁగా (చేతనావిరోధీ=) చేతనమునకు విరోధి యైన (కశ్చిద్గుణః) యేదోయొకగుణము (నహి + అస్తి=) కానేరదుసుమా- ఎఁదు

చేత ననఁగా నాయ చేతనము (చేతనా...మాత్రత్వాత్=) చేతనము గానిది యని చెప్పఁబడఁదగిన దేగాని (ఒకపత్త్యేకగుణము గాదు-)

(డి) కాఁబట్టి పారిమాండల్యాది దృష్టాంతమును గ్రహించి వేదాంతులు తమ సృష్టిసిద్ధాంతమును నిల్వఁబెట్టుకొనఁజాలరు.

తస్మా త్పారిమాండల్యాదివై షమ్యా త్ప్రాప్నోతి చేతనాయా అరంభకత్వమితి.

కాఁబట్టి (పారి ... వైషమ్యాత్=) (జగత్కారణములగు) వైశేషికుల యొక్క పారిమాండల్యాదులకును వేదాంతులయొక్క చేతన బ్రహ్మమునకును వైషమ్య (= సామ్యము లేకపోవుట) మున్నందున (చేతనాయాః =) చేతనమైన బ్రహ్మము (ఆరంభకత్వమితి=) చేతన మైనజగత్తునే- అనఁగాఁ దనకంటె భిన్నము గానిదానినే పుట్టింపఁగలిగియుండవలెను. (అనఁగా బ్రహ్మజగత్కారణవాదము నకును- బరమాణుజగత్కారణవాదమునకును బోలిక లేదని భావము.)

VII సిద్ధాంతిసమాధానము —

(1) కారణగుణ మైనపారిమాండల్యము కార్యమందు రాక భిన్నగుణము వచ్చుటవఱకె వేదాంతులు చెప్పెడిదృష్టాంతసాదృశ్యము.

మైవం మంస్థాః; యథా కారణే విద్యమానానామపి పారిమాండల్యాదీనా మనారంభకత్వ మేవం చైతన్యస్యాపి.

(ఏవం=) ఈతీఱుగా (మా + మంస్థాః=) నెవ్వడును దలఁచవలదు. (కారణే=) కారణ మైనపరమాణువునందుఁ (విద్యమానానాం=) గల (పారి ... దీనాం + అపి=) పారిమాండల్యాదిగుణములు (యథా + అనారంభకత్వం =) ద్వ్యణుకాది కార్యమం దేవ్రకారము రావో, (ఏవం=) అప్రకారమే (చైతన్యస్య + అపి=) కారణ మైనచేతనబ్రహ్మమునం దున్న చేతనధర్మముసైతము కార్యమైన జగత్తు నందు రాలేదు.

ఇ త్యస్యాంశస్య సమానత్వాత్.

ఈయంశములోమాత్రమే (పారిమాండల్యాది) దృష్టాంతపుఁబోలిక సమాన మగుచున్నది.

(2) పారిమాండల్యముపై మఱియొకపరిమాణము వచ్చిపడుటచేతనే కార్యమం దాపారిమాండల్యమే వచ్చుటకు వీలు లేకపోయినదని వైశేషికులు సరిపుచ్చఁజాలరు.

నచ పరిమాణాంతరాక్రాంతత్వం పారిమాండల్యాదీనా మనారంభకత్వే కారణమ్.

(పరిమా...క్రాంతత్వం=) కారణమైనపరమాణువునం దుండుపారిమాండల్యమనెడి పరిమాణముకంటె భిన్నమైన మఱియొకపరిమాణము (హ్రస్వత్వముమొదలగు) కార్యమందు వచ్చిచేరుట (పారిమాండల్యాదీనాం=) పారిమాండల్యాదులు (అనారంభకత్వే కారణం =) కార్యమందు వచ్చి చేరలేకపోవుటకుఁ గారణము గాదు. (అనఁగా మొదటిపరమాణువుపై మఱియొకపరమాణువు వచ్చి పడుటచేతనే కార్యమైనద్వ్యణుకమునందు మొదటి పరమాణువుయొక్క పరిమాణము- అనఁగాఁ బారిమాండల్యము కల్పించుట కవకాశము లేకపోయినట్లు చెప్పుటకు వీలు లేదని భావము)

(3) కార్యము పుట్టినపిదప దానియందుఁ గొ్రత్తగుణము వచ్చిచేరుటకు ముందొకక్షణకాల మేగుణమును లేక యది యుత్తదిగా నుండునని వైశేషికులు చెప్పుచున్నందున నట్టికాలములోఁ గారణగుణమే వచ్చి కార్యమం దేల పడఁగూడదు?

ప్రాక్పరిమాణాంతరారంభా త్పారిమాండల్యాదీనా మారంభకత్వోపపత్తేః.

(ద్వ్యణుకాది) కార్యమందు (ప్రాక్పరి ... రంభాత్=) పరమాణువుయొక్క పరిమాణము (పారిమాండల్యాది) కంటె భిన్నమైన (హ్రస్వత్వాది) మఱియొకపరిమాణము వచ్చిచేరుటకు ముదు (పారి .... పత్తేః) మొదటిపారిమాండల్యాదులే (రావలెనన్నచో) వచ్చిచేరుట కవకాశ మున్నదిసుమా! (అవకాశము లేకపోలేదు)

ఆరబ్ధమపి కార్యద్రవ్యం ప్రాగ్గుణారంభాత్ క్షణమాత్ర మగుణం తిష్ఠతీ త్యభ్యుపగమాత్.

(కార్యద్రవ్యం=) (ద్వ్యణుకాది) కార్యవస్తువు (ఆరబ్ధమపి=) పుట్టినతరువాతఁగూడ (ప్రాగ్గుణారంభాత్ =) దానియందు (హ్రస్వత్వాది) గుణాంతరము వచ్చి చేరకముందు (క్షణమాత్రం =) నొకక్షణకాల మా (ద్వ్యణుకాది) కార్యము (అగుణం=) ఎట్టిగుణము లేకుండ (తిష్ఠతి+ఇతి) నట్టిదిగా నుండుననిగదా (అభ్యుపగమాత్ =) మీసిద్ధాంతము!

(అట్టి నట్టిక్షణకాలములో మొదటికారణమైనపారిమాండల్యము మొదలగునదియే కార్యమం దేల వచ్చిచేరఁగూడదని భావము)

(4) కారణగుణము కార్యమందు భిన్నగుణమును బుట్టించుటయే పనిగాఁ గలది గాదు; అనఁగా దానిస్వభావ మది గాదు.

నచ పరిమాణాంతరారంభే వ్యగ్రాణి పారిమాండల్యాదీని.

మఱియును (పారి ... దీని=) గారణగుణ మైనపారిమాండల్యము మొదలగు నది (పరిమా ... రంభే=) కార్యమందుఁ బరిమాణాంతరమును బుట్టించుటయే (నచ వ్యాగ్రిణీ=) వనిగాఁగలది గాదు. (అనఁగా దానియొక్క స్వభావము కేవల మది గాదని భావము,)

(5) కాఁబట్టి కార్యమందు భిన్నగుణము వచ్చుటకు హేతువు కారణగుణము కంటె మఱియొకటి యుండితీరవలెను.

అత స్స్వసమానజాతీయం పరిమాణాంతరం నారభతే.

(అతః=) కాఁబట్టియే (స్వసమానజాతీయం=) కారణగుణము తనతో సమాన జాతిగల (పరిమాణాంతరం=) మఱియొకపరిమాణమును (న+ఆరభతే=) కార్య మందు (కారణగుణము) పుట్టించ లేదు.

(6) వైశేషికసిద్ధాంతసూత్రములే కార్యమందు భిన్నపరిమాణము పుట్టుటకు బహు కారణము లున్నట్టుగాఁ జెప్పుచున్నవి.

పరిమాణాంతర స్యాన్య హేతుత్వాభ్యుపగమాత్.

(పరి ... రస్య=) కార్యమందుఁ బరిమాణాంతరము వచ్చి చేరుటకు (అన్య హేతు .... గమాత్=) (కేవలకారణగుణములు గాక) నితర హేతువు లున్నవని మీసిద్ధాంతము చెప్పుచున్నది చూడుఁడు.

'కార ... మహత్' 'తద్వి ... మణు' 'ఏతేన ... వ్యాఖ్యాతే'

వైశేషిక సూ॥ VII_1_9 కారణబహుత్వా, త్కారణమహత్త్వాత్, ప్రచయవిశేషాచ్చ, మహత్.

'(మహత్=) మహత్త్వ అనఁగా గొప్పఁదనము (bigness) (కారణబహు త్వాత్=) (త్ర్యణుకములైన యనేక కారణము లుండుటనుబట్టియు (కారణమహ త్త్వాత్=) నున్నకారణ మొకటియే మిక్కిలిపెద్ద దగుటను బట్టియు (ప్రచయ విశేషాచ్చ=) కారణమం దుండునవయవములయొక్క వృద్ధినిబట్టియుఁ గలుగు చున్నది.

సూ॥ VII_1_10 'తద్విపరీత మణు'

(తద్విపరీతం=) ఆమహత్త్వకంటె విరుద్ధమైనది (అణు=) అణుపరిమాణ మనఁ

బడును

సూ॥ VII_1_17 ఏతేన దీర్ఘత్వహ్రస్వత్వే వ్యాఖ్యాతే.

(ఏతేన=) ఇట్లు చెప్పుటచేత (దీర్ఘత్వే=) త్ర్యణుకముయొక్క దీర్ఘపరిమాణమును (హ్రస్వత్వే=) ద్వ్యణుకముయొక్క హ్రస్వపరిమాణమును (వ్యాఖ్యాతే=) చెప్పఁబడినవే యగుచున్నవి.

ఇతి హి కాణభుజీని సూత్రాణి.

ఈపైన నుదాహరింపఁబడినవి వైశేషికమతస్థాపకుఁడైన కణాదునిచే రచియింపఁబడినసూత్రము లైయున్నవి.

(7) కార్యమందు భిన్నగుణమును బుట్టించునది కారణగుణమే యనుటకంటె మఱియొక కారణమే యని యేల చెప్పఁగూడదు?

నచ సన్నిధానవిశేషాత్ కుతశ్చిత్కారణబహుత్వాదీన్యేవారభంతే; న పారిమాండల్యాదీనీత్యుచ్యేత.

(కారణబహుత్వాదీని+ఏవ=) పరమాణు (=కారణ) బాహుళ్యము మొదలగు హేతువులుమాత్రమే (కుతశ్చిత్సన్నిధానవిశేషాత్ =) కార్యముతోఁ దమకుండునేదో సన్నిధానవిశేషముచేతఁ (ఆరభంతే =) గార్యమందు (హ్రస్వాది) పరిమాణాంతరమును బుట్టించుచుండునుగాని (వానిపరిమాణవిశేషము లైన) (న పారిమాండల్యాదీని) పారిమాండల్యాదులు (కార్యమందుఁ బరిమాణాంతరమును) పుట్టించవని (నచ+ఉచ్యేత) చెప్పుట కవకాశము లేదు. (అనఁగాఁ గార్యములందు హ్రస్వత్వాదిపరిమాణాంతరములను బుట్టించునది పరమాణువులేగాని పారిమాండల్యాదులు గాదని చెప్పుటకు వీలులేదు. అనఁగాఁ గారణగుణము లైనపారిమాండల్యాదులు గాక కారణము లైనపరమాణువులే కార్యమందుఁ బరిమాణాంతరమును బుట్టించుచుండునని చెప్పిన బాగుగనుండునని భావము)

(8) కారణమం దుండుసమస్తగుణము లెప్పుడును నాకారణమును వదలిపోకయే యుండుననుటలో వివాదము లేదు. భిన్నద్రవ్యముగాని, భిన్నగుణముగాని పుట్టినప్పుడులకు హేతువు కారణస్వభావము కాఁజాలదు.

ద్రవ్యాంతరే గుణాంతరే వాఽఽరభ్యమాణే సర్వేషామేవ కారణగుణానాం స్వాశ్రయసమవాయావిశేషాత్.

(ద్రవ్యాం ... మాణే = ) ఒకక్రొత్తద్రవ్యముగాని క్రొత్తగుణముగాని పుట్టింపఁబడినప్పుడు (సర్వే... ణానాం=) కారణద్రవ్యమం దుండుసమస్తగుణములు

(స్వాశ్రయ... పాత్ =) ఆకారణద్రవ్యముతో సమవాయసంబంధముతోఁ గలిసియుండు ననువిషయములో హెచ్చు తగ్గు లేవియును నుండవు (=అవిశేషాత్)— అనఁగా — ఆ కలిసియుండు నను నియమ మొకటిగానే (uniform) యుండును.

తస్మా త్స్వభావాదేవ పారిమాండల్యాదీనా మనారంభకత్వం; తథా చేతనాయా అపీతి ద్రష్టవ్యమ్.

కాఁబట్టి కారణము లైనపరమాణువులం దుండుపారిమాండల్యాదులు (స్వభావాదేవ=) తమ స్వభావము చేతనే (హ్రస్వాది) కార్యమందుఁ బరిమాణాంతరమును బుట్టించవు.

(9) అట్లై చేతనము సైతము మఱియొక చేతనమును బుట్టించుట దానిస్వభావము గాదని యెఱుంగునది.

(తథా =) ఆప్రకారమే (చేతనాయాః + అపి =) కారణ మైనబ్రహ్మమందుండుచేతనము సైతము కార్య మైనజగత్తునందు సజాతీయ మైన చేతనాంతరమును దనస్వభావము చేతనే పుట్టించదని (ద్రష్టవ్యం=) గ్రహించవలసినది.

(10) రెండుద్రవ్యములయం దుండుసంయోగ మనెడిగుణముచేత నాద్రవ్యములకంటె భిన్నమైనది పుట్టుచుండుటవలన నొకరకపుఁబదార్థమువలన నారకమైన పదార్థమే పుట్టుచుండు నను నియమము లేదు.

సంయోగాచ్చ ద్రవ్యాదీనాం విలక్షణానా ముత్పత్తిదర్శనాత్ సమానజాతీయా త్సమానజాతీయోత్పత్తివ్యభిచారః.

(వైశేషికసిద్ధాంతప్రకారము సంయోగ మనునది గుణమనియు, ద్రవ్యముకంటె విలక్షణ మైనదనియు నెఱుంగునది)

(ద్రవ్యాదీనాం=) రెండుద్రవ్యములకు (సంయోగాచ్చ=) సంయోగసంబంధము గలిగినప్పుడు (విలక్షణానాం=) ఆరెండుకారణద్రవ్యములకంటె భిన్నమైన ఉత్పత్తి ... శ్రవణాత్ =) యుత్పత్తి కలుగుట కనఁబడుచున్నందున (సమాన ... జాతీయాత్ =) సమానజాతీయములవలన — అనఁగా నొకరక మైనపదార్థములవలన సమాన ... వ్యభిచారః =) సమానజాతీయములయొక్క యుత్పత్తి కలుగుట— అనఁగా నట్టిరక మగుపదార్థములే కలుగుట యనునది నియమముగా (Hard & fast rule గా) లేదు. (అనఁగాఁ గారణద్రవ్యమునుండి కార్యగుణము గలుగవచ్చునని భావము )

(ఎ) ఆక్షేపము :— బ్రహ్మమునుండి జగత్తు పుట్టఁగలదా? యనువిషయము— అనఁగా నొకద్రవ్యమునుండి మఱియొకవిధమైన ద్రవ్యము పుట్టఁగలదా యనువిషయమునకు గుణమునుండి ద్రవ్యము పుట్టుచుండు ననుట సరియైనదృష్టాంతము గాదు.

ద్రవ్యే ప్రకృతే గుణోదాహరణ మయుక్త మితిచేత్,

(ద్రవ్యే ప్రకృతే=) కారణద్రవ్యములవలనఁ గార్యద్రవ్యములు గలుగు ననువిషయమే ప్రకృతమై (subject under discussion) యుండఁగా, (గుణోదాహరణం=) ఆకారణద్రవ్యముల యొక్క గుణములు కార్యద్రవ్యములయందు వ్యత్యస్తములై యుండునని చెప్పుట (అయుక్తం+ఇతి+చేత్) యుక్తము గాదన్నచో

(బి) ఆదృష్టాంతముచేతఁ గారణముకంటెఁ గార్యము విలక్షణముగా నుండవచ్చునని చెప్పుటమాత్రమే ప్రయోజనము.

న; దృష్టాంతేన విలక్షణారంభసూత్రస్య వివక్షితత్వాత్,

(న=) అట్లుకాదు, (దృష్టాంతేన— ఆదృష్టాంతముచేతఁ (విలక్ష...తత్వాత్=) గారణముకంటెఁ గార్యము విలక్షణ (=భిన్న) మై యుండునని చూపుటయే ప్రయోజనముగాని వేఱు గాదు.

(సి) ద్రవ్యమునకు ద్రవ్యము, గుణమునకు గుణము దృష్టాంత ముండవలయు ననునియమ మెక్కడను లేదు.

నచ ద్రవ్యస్య ద్రవ్యమే వోదాహర్తవ్యం, గుణస్యవా గుణ ఏవేతి కశ్చి న్నియమే హేతు రస్తి,

(ద్రవ్య ... ర్తవ్యం=) ద్రవ్యవిషయములో ద్రవ్యమునే యుదాహరించవలసియుండును; (గుణ .... గుణఏవ=) గుణవిషయములో గుణమునే యుదాహరించవలసియుండును; (ఇతి=) అని (నియమే=) యొకనియమము గల దనుటయందు (కశ్చిత్ హేతుః+నచ+అస్తి=) నొకానొక హేతు వేమియును లేదు,

వైశేషికసిద్ధాంతకర్త యైనకణాదుఁడే ద్రవ్యవిషయములో గుణము నుదాహరించినాఁడు చూడుఁడు :—

సూత్రకారోఽపి భవతాం ద్రవ్యస్య గుణ ముదాజహార,

(భవతాం సూత్ర కారోఽపి=) మీసూత్రకారుఁడైనకణాదుఁడును (ద్రవ్యస్య గుణం=) ద్రవ్యవిషయములో గుణమునే (ఉదాజహార=) యుదాహరించినాఁడు— చూడుఁడు.

'యథా ... న విద్యతే. వై. సూ. IV-2-2 "ప్రత్యక్షాప్రత్యక్షాణా మప్రత్యక్షత్వా త్సంయోగస్య పంచాత్మకత్వం న విద్యతే."

(ప్రత్య ... క్షాణాం=) (ప్రత్యక్ష=) ఇంద్రియములకు గోచరించువాని యొక్కయు (అప్రత్యక్ష=) ఇంద్రియములకు గోచరించనివానియొక్కయు (సంయోగస్య =) కూడిక (అప్రత్యక్షత్వాత్ =) గోచరించనిదిగావున (పంచాత్మకత్వం =) దేహము పంచభూతసంయోగము (నవిద్యతే=) కానేరదు?

(డి) పంచభూతములనుండి దేహము కల్గుట లేదు. భూతములయొక్క సంయోగముచేత అనగా గుణముచేత దేహ మనెడిద్రవ్యము కల్గుచున్నదని వైకణాద సూత్రముయొక్క భావము.

యథా ప్రత్యక్షాప్రత్యక్షయో ర్భూమ్యాకాశయో స్సమవయన్, సం గో ప్రత్యక్షః, ఏవం ప్రత్యక్షాప్రత్యక్షేషు పంచభూతేషు సమవయచ్ఛరీర మప్రత్యక్షం స్యాత్. ప్రత్యక్షంతు శరీరం దృశ్యతే, తస్మా న్న పాంచభౌతికమ్– ఇతి.

(ప్రత్యక్షా ... శయోః=) ప్రత్యక్షముగాఁ గనిపించుభూమియుఁ బ్రత్యక్షముగాఁ గనిపించనియాకాశము ననునీరెండును (సమవయన్ =) గలియుచుండఁగా నైన (సంయోగః=) కలయిక (సంబంధమునునది) (అప్రత్యక్షః=) ప్రత్యక్షముగాఁ గన్పించునది గాదు. (ఏవం=) ఇవ్విధముగానే (ప్రత్య ... తేషు=) ప్రత్యక్షములు నప్రత్యక్షములు నైన పంచభూతములనుండి (సమవయత్ + శరీరం =) పుట్టునట్టి దేహము (అప్రత్యక్షం స్యాత్ =) ప్రత్యక్షముగాఁ గన్పించునది గాదు.) (ప్రత్య.... శ్యతే=) కాని దేహము ప్రత్యక్షముగాఁ గన్పించుచున్నయది. (తస్మాత్ =) కాఁబట్టి దేహము (న పాంచభౌతికమ్=) పంచభూతములనుండి కల్గినది గాదు– అని యీ వైశేషిక (= కణాద) సూత్రమున కర్థము.

ఏతదుక్తం భవతి గుణశ్చ సంయోగో, ద్రవ్యం శరీరం,

కాఁబట్టి మీసిద్ధాంతసూత్రముచేతనే సంయోగము గుణము, దేహము ద్రవ్యము నై యున్నవి.

VIII (1) కారణముకంటెఁ గార్యము విలక్షణముగా నుండవచ్చునని యిది వఱకే బ్ర॥ II-1-6 సూత్రమువలనఁ జెప్పఁబడియున్నది.

'దృశ్యతే' త్వితి చాత్రాపి విలక్షణోత్పత్తిః ప్రపంచితా.

'దృశ్యతే తు' (బ్ర. II 1-6) అను సూత్రములోనే (విలక్షణోత్పత్తిః =) కారణముకంటెఁ గార్యము భిన్నముగా నుండవచ్చుననువిషయము (ప్రపంచితా=) విపులీకరింపఁబడియున్నది (చూడ లేదా)

పూర్వపక్షప్రశ్నము :—

(2) పూర్వమే యీవిషయము నిర్ధారణము చేయఁబడియుండఁగా మరల నీక్రొత్తసూత్ర మెందులకు ?

నన్వేవంసతి, తేనైవైతద్గతం.

(ఏవంసతి=) అట్లగుచో, (ఏతత్=) నీవిషయము (తేనైవ=) ఇదివఱకందులోనే (గతంనను—) తేల్చఁబడియున్నదిగదా ? (మరల నిప్పుడు చర్చించవలసిన యవసర మేమి ? యని భావము.

సమాధానము : —

(3) అక్కడ సాంఖ్యసిద్ధాంతఖండనసందర్భములోఁ జెప్పియున్నాము. ఇప్పుడు వైశేషికసిద్ధాంతఖండనసందర్భములో విపులముగాఁ జెప్పఁబడినది.

నేతి బ్రూమః.

నీ వనుకొన్నట్లు కాదని చెప్పుచున్నాము.

తత్సాంఖ్యం ప్రత్యుక్తమ్. ఏతత్తు వైశేషికం ప్రతి.

అక్కడ బ్ర. సూ. II-1-6 లో సాంఖ్యసిద్ధాంతఖండనసందర్భములోఁ జెప్పియున్నాము. ఇప్పుడిక్కడనో మీవైశేషికసిద్ధాంతసందర్భములోఁ జెప్పుచున్నాము.

(4) సాంఖ్యమతఖండనవిషయమే వైశేషికమతఖండనమునకును వర్తించునని బ్ర. సూ. II-1-12 చేత నతిదేశము చేయఁబడియుండఁగా నట్లే చేయక ప్రత్యేక సూత్ర మెందులకు ?

నన్వతిదేశోఽపి సమానన్యాయతయా కృతం; ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతా ఇతి.

అట్లగుచోఁ బూర్వసూత్రములందు సాంఖ్యవాదనిరాకరణము చేయఁబడియుండుటనుబట్టి యణ్వాదికారణవాదములున్నైతము సమానన్యాయము ననుసరించి నిరాకరింపఁబడినట్లే యెంచుకొనవలసినదిగా లోఁగడి 'ఏతేన ... వ్యాఖ్యాతాః' (బ్ర. సూ. II-1-12) అను సూత్రమునం దతిదేశము (extension of the aforesaid principle) చేయఁబడియున్నదిగదా. (నను + అతిదేశో + అపి = ) ఇప్పుడు మరల నీచర్చతో నవసరము లేకయే యట్టియతిదేశమే యిప్పు డేల చేయఁగూడదు ?

(5) అక్కడ సంక్షేపముగాఁ జెప్పఁబడినయాక్షేపమే వైశేషికసిద్ధాంతమందలి నిదర్శనములను జూపించుటమూలముగా నిప్పుడు విపులీకరింపఁబడినది.

సత్యమేతత్: తస్యైవ త్వయం వైశేషికపరీక్షారంభే తత్ప్రక్రియానుగతేన నిదర్శనేన ప్రపంచః కృతః.

ఇది సత్యమే— అక్కడ సాంఖ్యమతఖండనపద్ధతియే వైశేషికమతఖండనమున కతిదేశము (=extension)=వ్యాప్తి) చేయఁబడినది. (వైశేషికపరీక్షారంభే=) వైశేషికమతసిద్ధాంతములను విరళముగాఁ బరిశీలించుట కిది యారంభమైనందున (తత్ప్రక్రియానుగతేన=) ఆమతసిద్ధాంతమునం దనుగతమైయున్న (=పేర్కొనఁబడియున్న) (నిదర్శనేన =) దృష్టాంతముతో — అనఁగాఁ బారిమాండల్యాదిదృష్టాంతముతో స్వీకరించి (అయం=) ఇప్పుడీచెప్పుట (తస్య+ఏవ+తు) యక్కడ— ననఁగా 'శిష్టాపరిగ్రహాధికరణ'మందుఁ (బ్ర. II-1-12 లోఁ) జెప్పఁబడియున్నదానికి (ప్రపంచః కృతః=) విపులీకరణమే యని యెంచవలెను.

N B :— బ్ర. సూ. II-1-12 లో సణ్వాదికారణము లగువైశేషికాది వాదములు సాంఖ్యవాదము లె నిరాకరింపఁబడఁదగిన వనిమాత్రము చెప్పఁబడినది. వైశేషికులయొక్క సిద్ధాంతములో దారమునం దున్నరూపమే వస్త్రమునం దంటి వచ్చునట్లుగాఁ గారణగుణమే కార్యమందు వచ్చునని నిదర్శనపూర్వకముగాఁ జెప్పఁబడుచుండును జగత్కారణవిషయములో నన్యమతసిద్ధాంతఖండనములకై యేర్పడిన యీద్వితీయాధ్యాయ ద్వితీయపాదములో వైశేషికమత నిదర్శనపూర్వక సిద్ధాంత ఖండనమును జేయునీయధికరణ (బ్ర. సూ. II-2-12) మందుఁ బూర్వమందుఁ (బ్ర సూ II-1-12 లో) జేయఁబడిన సంక్షేపనిరాకరణమే వారిసిద్ధాంతమందలి పారిమాండల్యాదినిదర్శనముతో విపులీకరింపఁబడినదని భావము.

## పరమాణుజగదకారణత్వాధికరణము (సూ॥ 12 నుండి 17 వఱకు)

3. అధికరణావతారిక :—

కారణబ్రహ్మమం దున్నచైతన్యము కార్యజగత్తునందు లేకపోవుటంజేసి బ్రహ్మజగత్కారణవాదము సరిగా దని యాక్షేపించువైశేషికుల మతసిద్ధాంతములోనైత మట్లే యున్నదిగావున వా రట్లాక్షేపించుట కవకాశము లేదని పూర్వాధికరణమునందు వారిమతమం దున్నయనుపపత్తి నిదర్శనపూర్వకముగా వివరింపఁబడినది. వారిసిద్ధాంత మగుపరమాణుజగత్కారణవాద మసంభవమని యీయధికరణమందుఁ జూపఁబడుచున్నది

12. సూత్రావతారిక:— వైశేషికసిద్ధాంతానుసారముగా నచేతనములైన పరమాణువులు తమకుఁ దామే కలిసికొని జగత్సృష్టిని జేయఁగల్గుటయుఁ దమకుఁ

దామే విడిపోయి జగత్ప్రళయమును గావింపఁగల్గుటయు నసంభవములని యీ సూత్రముచేఁ జెప్పఁబడఁబోవుచున్నది.

## ౧౨ సూ॥ ఉభయథాఽపి, న కర్మా తస్తదభావః

ప॥ వి॥ ఉభయథా – అపి – న – కర్మ – అతః – తదభావః.

దం. అ. ఉభయథా – అపి – కర్మ – న – అతః – తదభావః.

ప్ర॥ ప॥ అ॥ — ఉభయథా + అపి = రెండువిధములుగానైనను, కర్మ = (పరమాణువులను గలుపఁగలట్టియు, విడఁదీయఁగలట్టియు) ప్రయత్న మనుకర్మము, న = లేదు; అతః = కాఁబట్టి (తదభావః=) తత్ = ఆసృష్టిప్రళయములయొక్క, అభావః=లేకపోవుట (సంభవించును)

సూత్రార్థము :— (సృష్టిప్రళయముల) రెంటిలోఁగూడ, (అవసరమగు) (జేతనప్రయత్నమున కవకాశము లేనందున, ఆసృష్టిప్రళయములు రెండును గలుగఁజాలవు.

సూత్రభాష్యభావము :— పృథివ్యప్తేజోవాయువులు నాల్గింటికి సంబంధించిన పరమాణువులు నిరవయవములై వేఱువేఱుగా నుండుననియు, నట్టిదేనిదేని పరమాణువు లొకదానితో నొకటిగాఁ గలిసికొన్నప్పు డాభూతచతుష్టయముతోఁ గూడినజగత్తును బుట్టించుననియు, నాయాపరమాణువు లొకదానినుండి వ ఱియొకటి విడిపోయినప్పుడు జగత్ప్రళయమును గావించుననియుఁ బరమాణుకారణవాదులైన వైశేషికులు చెప్పుదురు. అట్లగుచో సృష్టికాలమం దాయచేతనపరమాణువులను గల్పుటకును, బ్రళయకాలమందు వానిని విడఁదీయుటకును నవసర మగునేదియో యొకపని (చేతనప్రయత్నము - కర్మము) యుండితీరవలయునని యంగీకరింపవలసి యున్నది. సాధారణముగా మనము చూచుకార్యములలో నెల్ల – అనఁగాఁ గట్టుటకుఁ గాని బడఁగొట్టుటకుఁగాని యట్టి కనఁబడునదియో, కనఁబడనిదియో యొకప్రయత్నము (=కర్మము) అవసర మగుట విస్పష్టవిషయము.

ఈయనంతపరమాణువుల నొక్కసారిగాఁ గలుపుటకుఁగాని, కలిసియున్న వానిని విడఁదీయుటకుఁగాని హేతువైన ప్రత్యక్ష (=దృష్ట) ప్రయత్న మేదియు మఱియొకటి లేదని వారిసిద్ధాంత మొప్పుకొనుచున్నందునను ధర్మాధర్మరూపమైనయదృష్ట మనుప్రయత్న మొకటి యున్నదని వాదించినను నయ్యదృష్టమును నది పరమాణువులకు సంబంధించియున్నదో, జీవునకు సంబంధించియున్నదో నిరూపించుట

కవకాశము లేనందునను (ఉభయథాపి) ఆసృష్టిప్రళయముల రెంటిలోఁగూడఁ గల్పుటకు విడఁదీయుటను నవసర మగు (కర్మ - న) ప్రయత్న మేదియు సంభవింపదు. (అతః) అందుచేత (తదభావః) పరమాణువులయొక్క సంయోగవిభాగములే యగుసృష్టిప్రళయములే యేర్పడుట సంభవింపదు. (కాఁబట్టి వైశేషికులయొక్క పరమాణుజగత్కారణవాద మసమంజసము.)

భాష్యము — భాష్యార్థము

ఇదానీం పరమాణుకారణవాదం నిరాకరోతి.

ఇప్పుడు (సూత్రకారుఁడు) పరమాణువులవలన జగత్తు పుట్టినదని చెప్పువైశేషికులమతమును ఖండించుచున్నాఁడు

సచ వాద ఇత్థం సముత్తిష్ఠతి.

(సచ వాదః=) వారిమతసిద్ధాంత మిట్లున్నది (=సముత్తిష్ఠతి) (ఎట్లనఁగా)

పటాదీని హి లోకే సావయవాని ద్రవ్యాణి స్వానుగతైః సంయోగసచివైస్తంత్వాదిభిర్ద్రవ్యై రారభ్యమాణాని దృష్టాని తత్సామాన్యేన యావత్కించిత్సావయవం ద్రవ్యం తత్సర్వం స్వానుగతైరేవ సంయోగసచివైస్తైస్తైర్ద్రవ్యై రారబ్ధమితి గమ్యతే.

లోకమందు నవయవములు (=భాగములు) గలద్రవ్యములలోఁ జేరిన (పటాదీని=) వస్త్రములు మొదలగునవి (స్వానుగతైః=) తమయందు ననుసరించియున్నట్టియు (సంయో ... సచివైః) సంయోగ (=కలయికయనెడి) సంబంధముతోఁ గూడుకొన్నట్టియు (తం ... ద్రవ్యైః=) దారము లనెడి ద్రవ్యములచేత (ఆరభ్యమాణాని=) బుట్టింపఁబడుచున్నవిగాఁ (దృష్టాని=) గన్పించుచున్నవి. (తత్సామాన్యేన =) ఆన్యాయముచేతనే (యావ ... త్సర్వం=) యవయవములు గలదిగానుండునేద్రవ్యమైనను దమయం దనుసరించి సంయోగసంబంధముచేతఁగూడుకొన్నట్టి ద్రవ్యములచేతనే పుట్టింపఁబడునట్లు స్పష్టమగుచున్నది.

న చాయ మవయవావయవివిభాగో యతో నివర్తతే సోऽపకర్షపర్యంతగతః పరమాణుః.

(సచ - అయం - అవయవ ... విభాగః=) అవయవములు గలద్రవ్యములోనుండి యవయవములను (= భాగములను) విడఁదీసికొనుచుఁ బోఁగాఁబోఁగా (యతః నివర్తతే=) ఆయావిడఁదీయుట యెక్కడనాగిపోవునో, (సః—అపకర్షపర్యంతగతః=) ఆవిడఁదీయుటకుఁ దుట్టతుదిహద్దైనదియై యనఁగా నేచివరిభాగమును నంత

ర్భాగములుగా విడఁదీయుట కసంభవమో యదియే (పరమాణుః) పరమాణువని చెప్పఁబడును

సర్వం చేదం గిరిసముద్రాదికం జగ త్సావయవత్వా దాద్యంతవత్.

పర్వతములతో సముద్రములతోఁ గూడినయీసమస్తజగత్తును (సావ ... త్వాత్=) (పైనఁజూపఁబడినప్రకారము) అవయవములతోఁ గూడినదే గావున— అనఁగా ముక్కలుముక్కలుగాఁ జేయుటకు వీలైనదియే గాన నది (ఆద్యంతవత్=) మొదలు చివర గలిగినది యనియే చెప్పవలసియుండును.

న చాకారణేన కార్యేణ భవితవ్య మిత్యతః పరమాణవో జగతఃకారణ మితి కణభుగభిప్రాయః.

(కార్యేణ=) ఏవస్తువైనను (అకారణేన=) కారణము లేకుండ (న భవితవ్య మితి) బుట్టదు. (అతః=) గావున నీజగత్తునకుఁ గట్టకడపటిభాగాంశమైన పరమాణువులచేతనే యీజగత్తు ఏర్పడినదని వైశేషికమతస్థాపకుఁ డైనకణాదుఁ డభిప్రాయ పడుచున్నాఁడు.

తా నీమాని చత్వారి భూతాని భూమ్యుదకతేజఃపవనాఖ్యాని. సావయవా న్యుపలభ్య చతుర్విధాః పరమాణవః పరికల్ప్యంతే,

(అట్లు పరమాణువులతో నేర్పడిన) ఆయీ భూమ్యాపస్తేజోవాయువు లనెడి పేర్లుగల వేఱువేఱైన నాల్గుభూతములును (సావయవాని=) భాగములు గలవిగాఁ (ఉపలభ్య=) గనిపెట్టి (చతు ... ణవః=) వానివానికడపటిభాగములైనపరమాణువులుసైతము నాల్గువిధములైనవని (పరికల్ప్యంతే=) నిర్ధారణ చేయఁబడుచున్నవి.

తేషాం చాపకర్షపర్యంతగతత్వేన పరతో విభాగాసంభవా, ద్వినశ్యతాం చ పృథివ్యాదీనాం పరమాణుపర్యంతో విభాగో భవతి, స ప్రళయకాలః.

(తేషాంచ=) ఆనాల్గుభూతములును (అప ... గతత్వేన=) గట్టకడపటివిభాగమువఱకుఁ దీసికొనిపోఁబడినవియై (పర ... భవాత్=) యాపైన నంతర్విభాగము చు బొందుట కశక్యములైనందున (వినశ్యతాంచ ... దీనాం=) నవ్విధమున నష్టములై పోవు (ఎంతవఱకు భిన్నములైపోఁ దగియున్నవో యంతవఱకుఁ బోయియున్న) యీపృథివ్యాదిభూతములు (పర ... భవతి) పరమాణువులవఱకుఁ బోవుటయే (స ప్రళయకాలః=) ప్రళయకాలమని చెప్పఁబడును.

తత స్సర్గకాలే వాయవీయే ష్వణు ష్వదృష్టాపేక్షం కర్మోపపద్యతే. తత్కర్మ స్వాశ్రియ మణు మణ్వంతరేణ సంయునక్తి.

(తతః=) ప్రళయానంతరము (సృష్టికాలే=) మరల సృష్టికాల మాసన్న మైన ప్పుడు (నాల్గుభూతములలో సూక్ష్మమైన) వాయుసంబంధ మైనపరమాణువులయందు నదృష్టముచేతఁ గలిగింపఁబడిన చలన మనుకర్మ మొకటి పుట్టును. (స్వాశ్రియం—తత్కర్మ=) అంతవఱకు నావరమాణువులయందు డాగియున్నయాచలన మను కర్మము (అణు ... రేణ=) ఒకపరమాణువును వేఱొకపరమాణువుతోఁ (సంయునక్తి=) గల్పును.

తతో ద్వ్యణుకాదిక్రమేణ వాయు రుత్పద్యతే.

(తతో ... క్రమేణ=) అట్లు మొదట రెండు రెండుగాఁ గలియుట కారంభించి పోఁగాఁబోఁగా నావరమాణువు లన్నియు నొకటిగా నేర్పడి, వాయు వనుభూత మేర్పడును.

ఏవ మగ్నిః. రేవ మాప. ఏవం పృథి వ్యేవమేవ శరీరం సేంద్రియ మితి.

ఇట్లే యగ్ని యనుభూతము, జల మనుభూతము, భూమి యనుభూతము వాని వానిపరమాణువులచేరికతో నేర్పడును. ఇట్లే యింద్రియములతోఁ గూడినశరీరము సైత మేర్పడును.

ఇత్యేవం సర్వ మిదం జగ దణుభ్య స్సంభవతి.

(ఇత్యేవం ... జగత్) ఇవ్విధముగానే యీసమస్తజగత్తు (అణుభ్యః =) పరమాణువులనుండి (సంభవతి=) పుట్టుచున్నది.

అణుగతేభ్యశ్చ రూపాదిభ్యో ద్వ్యణుకాదిగతాని రూపాదీని సంభవంతి; తంతుపటన్యాయే నేతి కాణాదా మన్యంతే.

(తంతుపటన్యాయేన=) దారములయం దుండురంగే వస్త్రమునకు వచ్చిన విధమున (అణు ... దిభ్యః=) పరమాణువులయం దుండురూపాదిగుణవిశేషముల నుండియే (ద్వ్యణు ... దీని=) రెండు రెండుగా నేర్పడినజంటలతో నారంభించి యీయీసమస్తాణువులయం దుండుగుణవిశేషములు సర్వమును (సంభవంతి=) పుట్టు చున్నవని (కాణాదాః=) కణాదమతస్థులు (మన్యంతే=) తలంచుచున్నారు. (వాదించుచున్నారు.)

కణాదసిద్ధాంతఖండనము :—

తత్రేద మభిధీయతే.

కాణాదమతసిద్ధాంత మీవిధమున ఖండింపఁబడుచున్నది.

విభాగావస్థానాం తావ దణూనాం సంయోగః కర్మాపేక్షోఽభ్యుపగంతవ్యః. కర్మవతాం తంత్వాదీనాం సంయోగదర్శనాత్.

(కర్మవతాం ... దర్శనాత్=) దారములు మొదలగునవి యొకకర్మసాహాయ్యముచేతనే వస్త్రముగాఁ గలియుచుండుట చూపట్టుచున్నందున, (తావత్=) అట్లై ప్రళయకాలమందు (విభా ... ణూనాం=) వేఱు వేఱుగా నున్న పరమాణువులు సైతము కలియుట కొకకర్మ నపేక్షించునని (అభ్యుప ... గంతవ్యః=) యంగీకరింప వలసియుండునుగదా !

కర్మణశ్చ కార్యత్వా న్నిమిత్తం కిమ ప్యభ్యుపగంతవ్యం.

(కర్మ ... ర్యత్వాత్=) కర్మ యనఁగాఁ జేయఁబడునదిగావున, (నిమిత్తం కిమపి=) అది యేదో యొకకర్త నపేక్షించునని (అభ్యు ... తవ్యం=) యంగీకరింపక తప్పదు.

అనభ్యుపగమే నిమిత్తాభావా న్నాణు ష్వాద్యం కర్మ స్యాత్.

(అనభ్యుపగమే=) కర్తతో నవసర మంగీకరింపనిచో. (నిమిత్తాభావాత్=) కర్త యనువాఁడు లేకపోవుటవలన (అణుషు + ఆద్యం కర్మ=) సృష్ట్యారంభమందుఁ గదలకుండఁ బడియున్న పరమాణువులను లేవఁదీసి యొకదానితో మఱొక్కదానిని జేర్చుట యనుకర్మ (న స్యాత్ =) యుండనే యుండదు.

అభ్యుపగమేఽపి, యది ప్రయత్నోఽభిఘాతాదిర్వా. యథా దృష్టం కిమపి. కర్మణో నిమిత్త మభ్యుపగమ్యేత, తస్యాసంభవాత్, నైవాణు ష్వాద్యం కర్మ స్యాత్.

(అభ్యుపగమేపి=) కర్మకొకకర్త యవసరమని యంగీకరించుచో, (యథా .... కిమపి=) సహజముగా మనకు గోచరించుదానివంటి దేదోయొకటి- అనఁగా (ప్రయ .... ర్వా=) పురుషనిష్ఠ మగుప్రయత్నమో, యభిఘాతమో (=కలుపునట్టిదెబ్బయో) (కర్మణో నిమిత్తం=) కర్మను బుట్టించఁగలది యొకటి (అభ్యు ... మ్యేత =) యుండవలెనని యొప్పుకొనవలయుఁగదా ! (తస్యా ... వాత్ =) అట్టిది (కర్మనిమిత్తమైన ప్రయత్నమో, యభిఘాతమో) ప్రళయకాలములో నుండుట

యసంభవ మైనందున (అణుషు + ఆద్యం + కర్మ =) సృష్ట్యారంభమందు రెండు పరమాణువులను గలియఁజేయఁ గలకర్మ (న స్యాత్ + ఏవ=) లేనే లేదుగదా!

నహి తస్యా మవస్థాయా మాత్మగుణః ప్రయత్నః సంభవతి శరీరాభావాత్.

(తస్యాం + అవస్థాయాం=) సృష్టికి లోఁగడియాప్రళయకాలమందు (శరీరాభావాత్ =) (సృష్టికిఁ దరువాతఁ బుట్టఁగల) శరీర మనునదియే లేనందున (ఆత్మ గుణః ప్రయత్నః =) ఆత్మగుణ (attribute) మైన ప్రయత్న మనునది (నహి సంభవతి=) పుట్టుట కవకాశమే లేదు.

(ఆత్మ నిత్యమైనను నది శరీరముతోఁ జేరినఁగాని పని చేయఁజాలదని వైశేషికు లొప్పుకొందురు. మనస్సుసైత మట్టిదియే.)

శరీరప్రతిష్ఠే హి మన స్యాత్మన స్సంయోగే స త్యాత్మగుణః ప్రయత్నో జాయేత.

(శరీర ... మనసి =) శరీరములో మన స్సున్నప్పు డారెంటితోను - అనఁగా శరీరముతోను మనస్సుతోను (ఆత్మ... సతి =) ఆత్మకు సంయోగము (కలయిక) గల్గినప్పుడే (ఆత్మ ... యత్నః=) ఆత్మగుణ మైనప్రయత్నము (జాయేత=) పుట్టఁగలదు.

ఏతే నాభిఘాతాద్యపి దృష్టం నిమిత్తం ప్రత్యాఖ్యాతవ్యమ్.

(ఏతేన =) కర్మనిమిత్త మైనప్రయత్నము పుట్టుట కవకాశము లేదని యే హేతువులచేతఁ బైనఁజెప్పఁబడినదో యాహేతువులచేతనే (దృష్టం =) ప్రత్యక్షముగాఁ గనిపించు (అభిఘాతాద్యపి=) నభిఘాతము (=దెబ్బ) మొదలగు (నిమిత్తం=) నిమిత్తములు (= agents) (ప్రత్యాఖ్యాతవ్యం=) ప్రళయకాలములోఁ బుట్టుట కవకాశము లేదని త్రోసివేయఁబడవలసి యున్నది.

సర్గోత్తరకాలం హి తత్సర్వం, కర్మణో నిమిత్తం సంభవతి.

(తత్సర్వం=) ఆయాప్రయత్నముగాని యభిఘాతముగాని (సర్గోత్తరకాలం హి =) యీమొదలైనది సృష్టి యైనపిమ్మట వచ్చునవిగాన, (ఆద్యస్య కర్మణః =) సృష్ట్యారంభములోఁ గావలసిన (ద్వ్యణుకారంభమునేడి) మొదటికర్మకు (నిమిత్తం=) నిమిత్త మేదియు (న సంభవతి=) గనిపించదు.

అథాదృష్ట మాద్యస్య కర్మణో నిమిత్త మిత్యుచ్యేత తత్పున రాత్మసమవాయి స్యా, దణుసమవాయి వా.

(అథ=) ప్రయత్నాభిఘాతాదిదృష్ట (=ప్రత్యక్ష) నిమిత్తము లుండుట కవకాశము లేదని త్రోసివేయఁబడినను, (ఆద్య ... నిమిత్తం=) మొదటికర్మము పుట్టుటకు (అదృష్టం=) అదృష్టమనునదియే నిమిత్తమని (అథ+ఉచ్యేత=) యిఁక (వైశేషిక పూర్వపక్షి) చెప్పదువేమో. (తత్పునః) ఆయదృష్ట మనెడినిమిత్తము (ఆత్మ .... వాయివా=) ఆత్మతో సంబంధించియున్నదని చెప్పదువా, లేక పరమాణువులతో సంబంధించి యున్నదని చెప్పదువా?

ఉభయథాపి నాదృష్టనిమిత్త మణుషు కర్మావకల్పేత.

(ఉభయథాపి=) రెంటిలో నేయొకవిధముగాఁ జెప్పినను, (అదృ ... త్తం =) అదృష్ట మనెడినిమిత్తము (అణుషు =) పరమాణువులయందుఁ (కర్మ =) గర్మను (న+అవకల్పేత=) బుట్టించ లేదు.

అదృష్ట స్యాచేతనత్వాత్.

ఎందుచేననఁగా (అదృష్టస్య=) అదృష్ట మనునది (అచేతనత్వాత్=) అచేతనమే యైయున్నదిగదా.

న హ్యచేతనం చేతనే నానధిష్ఠితం స్వతంత్రం ప్రవర్తతే, ప్రవర్తయతి వేతి.

(చేత ... ష్ఠితం=) చేతనముచేత నధిష్ఠింపఁబడియున్న నేతప్ప (అచేతనం=) నచేతనమైనది (స్వతంత్రం=) స్వతంత్రముగాఁ (నహి ... ప్రవర్తతే=) బ్రవర్తింపఁ జాలదు. (ప్రవర్తయతి వా=) ప్రవర్తింపఁజేయఁజాలదు. (ఇతి=) అని.

సాంఖ్యపరీక్షాయా మభిహితం.

( సాంఖ్యపరీక్షాయాం =) లోఁగడఁ జేయఁబడిన సాంఖ్యమతనిరాకరణమందే (అభిహితం=) చెప్పఁబడినది.

ఆత్మన శ్చానుత్పన్నచైతన్యస్య తస్యా మవస్థాయా మచేతనత్వా. దాత్మసమవాయిత్వాభ్యుపగమాచ్చ. నాదృష్ట మణుషు కర్మణో నిమిత్తం స్యా దసంబంధాత్.

(ఆత్మ ... స్యస్య=) దేహములో నున్నమనస్సుతో నాత్మ కలియునప్పుడే చైతన్య మనెడిగుణము– అనఁగాఁ బ్రయత్నాభిఘాతములు మొదలగునవి– పుట్టును గావున నట్టిచైతన్యము పుట్టకముందు– అనఁగా (తస్యా మవస్థాయాం =) సృష్టిప్రారంభమునకు లోఁగడిప్రళయకాలమందుఁ (ఆత్మనః - అచేతనత్వాత్=) చైతన్య మనెడివాసన లేకుండ నున్నయాత్మ కేవల మచేతనమే యైయున్నందున, (ఆత్మసమ

.... మాచ్చ=) (అదృష్ట మనెడికిమిత్తము (agent) ఆత్మతో సంబంధించియున్న దనుకొన్నను (అదృష్టం =) ఆయదృష్టమనునది (అణుషు కర్మణో నిమిత్తం =) పరమాణువులయందుఁ గర్మను బుట్టించుటకు నిమిత్తము (నస్యాత్ =) గాఁ జాలదు. ఎందుచేతననఁగా (ఆయదృష్టము - ఆత్మయు నీరెండును నచేతనములే యైయున్నందున) (అసంబంధాత్ =) అదృష్టమునకు నణువులకు నెట్టిసంబంధమును లేకపోవుట వలననే—

అదృష్టవతా పురుషేణాస్త్యణూనాం సంబంధ ఇతి చేత్.

(అదృష్టవతా పురుషేణ=) అదృష్టమునునది యెల్లప్పుడును నాత్మకు నంటి యుండును గావున సర్వవ్యాపి యైనయట్టియాత్మకు (= పురుషేణ) (అణూనాం సంబంధః =) అణువులతో సంబంధము— అనఁగాఁ గర్మను బుట్టించఁగలది— కలదని (ఇతి చేత్ =) చెప్పుచో,

సంబంధసాతత్యాత్ప్రవృత్తిసాతత్యప్రసంగో, నియామకాంతరాభావాత్.

(సంబం ... త్యాత్ =) ఆసంబంధము నిరంతరముగా నుండునదియే గావున (ప్రవృత్తి ... సంగః=) నందువలనఁ గలుగుప్రవృత్తియు (=కర్మయు) నిరంతరముగా నే యుండునని చెప్పవలసివచ్చును ఎందుచేననఁగా (నియామ ... వాత్ =) దానిని నియమింపఁగల (=ఆపఁగల) మఱియొకటి యేదియును లేనందుననే—

తదేవంనియతస్య కస్యచిత్కర్మనిమిత్తస్యాభావా, న్నాణుష్వాద్యం కర్మ స్యాత్.

(తదేవం=) కాఁబట్టియె- (నియతస్య ... స్యాభావాత్ =) అణువులయందుఁ గర్మను బుట్టించునియతహేతు వేదియు (agent = Cause of action) లేనందున (అణుషు + ఆద్యం + కర్మ=) మొదలేయణువులయందు నెట్టికర్మయుఁ (నస్యాత్ =) బుట్టఁజాలదు.

తన్నిబంధన స్సంయోగో న స్యాత్.

కర్మ (motion = చలనము) పుట్టనందున (తన్ని ... యోగః=) కర్మవలనఁ గలుగునణుసంయోగము (సృష్టినిమిత్త మొకపరమాణువుతో మఱియొకపరమాణువు గలిసికొనుటయే) (న స్యాత్ =) ఉండనేరదు.

సంయోగాభావాచ్చ తన్నిబంధనం ద్వ్యణుకాదికార్యజాతం న స్యాత్.

(సంయో .... వాచ్చ=) అణుసంయోగ మనునదియే సంభవము గానప్పుడు,

(తన్నిబాధనం=) అందువలన నేర్పడు (ద్వ్యణు ... జాతం=) సృష్ట్యుపయోగకరము లగుద్వ్యణుకములు మొదలగుకార్యవస్తువులు (రెండు మూఁడు నాల్గు మొదలగు పరమాణువులముతాలు) (న స్యాత్ =) కలుగనే కలుగవు.

సంయోగ శ్చాణో రణ్వంతరేణ (1) సర్వాత్మనా వా స్యాత్ (2) ఏకదేశేన వా:

(అణో రణ్వాంతరేణ=) ఒకయణువుతో మఱియొకయణువుయొక్క (సంయోగశ్చ=) సంయోగ (= కలయిక) విషయ మాలోచింతము. ఆసంయోగము (1) (సర్వాత్మనా వా స్యాత్ =) రెండణువులు పూర్తిగా నొకదానితో నొకటి కలిసిపోవునా; (2) (ఏక దేశేం వా =) లేక ఒకభాగములోమాత్రమే రెండణువులు గలియునా ?

(1)సర్వాత్మనా చే దుపచయానుపపత్తే రణుమాత్రత్వప్రసంగో దృష్టవిపర్యయప్రసంగశ్చ.

(1) (సర్వా ... చేత్ =) పూర్తిగా నొకదానితో మఱియొకటి కలిసిపోవు ననెడిపక్షములో, (ఉపచయానువపత్తేః=) రెండణువులు గలిసినమొత్తము (=ఉపచయః = వృద్ధి) అణువుకంటె నెక్కువ యగుట కవకాశము లేనందున (అణుమాత్రత్వప్రసంగః=) రెండణువులు గలిసినను నొకయణువుగానే యుండిపోవునని చెప్పవలసివచ్చును. అట్లు రెండణువులు గలియుఁగా మొత్తము పెరుగునందురా యది (విపర్యయప్రసంగశ్చ =) స్పష్ట మగుప్రత్యక్షవిషయమునకు విరుద్ధ (= వైరుద్ధ్య) మేర్పడును. ఎందుచేతననఁగా

ప్రదేశవతో ద్రవ్యస్య ప్రదేశవతా ద్రవ్యాంతరేణ సంయోగస్య దృష్టత్వాత్.

(సంయోగస్య =) సంయోగ మనునది (ప్రదేశవతా... రేణ=) ప్రదేశము — అనఁగా భాగము (part) గలిగినయొకవస్తువుతో (ప్రదేశ – ద్రవ్యస్య=) ప్రదేశము (=భాగము) గలిగిన మఱియొక వస్తువునకుమాత్రమే— అనఁగాఁ బ్రదేశము గలరెండువస్తువులమధ్య మాత్రమే (దృష్టత్వాత్ =) యుండుట చూచుచున్నందు వలన— (పరమాణువులు భాగములు లేనివి యనియే వైశేషికసిద్ధాంతము.)

(2) ఏకదేశేన చేత్ సావయవత్వప్రసంగః.

(2) (ఏక దేశేం చేత్ =) రెండణువు లొక భాగములోమాత్రమే కలియు నను పక్షములో, (సావయవత్వప్రసంగః=) పరమాణువు లవయవములు గలద్రవ్యము లని చెప్పవలసివచ్చును. (ఇట్లు చెప్పినను వైశేషికసిద్ధాంతమునకు విరుద్ధమే.)

పరమాణూనాం కల్పితాః ప్రదేశా స్స్యు రితిచే, త్కల్పితానా మవస్తుత్వా. దవస్త్వేవ సంయోగ ఇతి వస్తునః కార్య స్యాసమవాయికారణం న స్యాత్.

(పర ... నాం=) పరమాణువులకుఁ (కల్పి ... రితి చేత్=) బ్రదేశములు (=భాగములు నిజముగా లేనప్పటికి నున్నట్లుగాఁ గల్పించఁగూడదా యని చెప్పచో (కల్పి ...వస్తుత్వాత్=) కల్పింపఁబడినవస్తువు లెప్పుడును నిజములు గా నేరవుగావున (అవస్త్వేవ ... ఇతి=) వస్తువులే లేనప్పుడు వానిమధ్య సంయోగముమాత్ర మెట్లు నిజమగును? (వస్తునః కార్యస్య=) అప్పుడు కార్యమును జేయఁదగిన (అసమ .... రణం=) యసమవాయికారణము- అనఁగా సంయోగము (=కలయిక) (న స్యాత్=) లేకపోవును.

అసతి చాసమవాయికారణే ద్వ్యణుకాదికార్యద్రవ్యం నోత్పద్యేత.

(అసతి ...రణే=) అసమవాయి కారణ మే (=సంయోగ మే) లేకపోయినప్పుడు (ద్వ్యణు ... ద్రవ్యం =) ఏది యున్నఁగాని ప్రపంచసృష్ట్యారంభకము లేర్పడఁ జాలవో యట్టిద్వ్యణుకములు (పరమాణువులు రెండేసి మూఁడేసిచొప్పునఁ గలిసిన ముతాలు) మొదలగునవి (న+ఉత్పద్యేత=) పుట్టనే పుట్టవు.

యథా చాదిసర్గే నిమిత్తాభావా త్సంయోగోత్పత్త్యర్థం కర్మ నాణూనాం సంభవ; త్యేవం మహాప్రళయేఽపి విభాగోత్పత్త్యర్థం కర్మ నైవాణూనాం సంభవేత్.

(ఆదిసర్గే=) సృష్ట్యారంభమందు (నిమిత్తాభావాత్ =) నిమిత్త మేదియును లేనందున (అణూనాం=) రెండణువులను (సంయో .... త్త్యర్థం=) సంయోగింపఁ జేయు (కర్మ=) కర్మ (=కదలిక = motion) (యథా నసంభవతి=) ఎట్లుండఁజాలదో (ఏవం=) అట్లె (మహా ... యేఽపి=) మహాప్రళయమందును (=జగద్వినాశకాలమందును) ( అణూనాం విభాగో ... కర్మ =) అణువులయొక్క యెడఁబాటును జేయఁగలకర్మ (= motion, న సంభవేత్=) యెట్టిదియు నుండఁబోదు.

నహి తత్రాపి కించి న్నియతం నిమిత్తం దృష్ట మస్తి,

(తత్రాపి=) ఆయెడఁబాటును గలుగఁజేయు విషయములోనైనను, (కించి న్నియతం నిమిత్తం=) అవసర మగునియతమైన నిమిత్తము (అనఁగా నట్టివనిని స్వాధీనమం దుంచుకొని యాపఁగలది) (దృష్టం) కనఁబడఁగలది(న+అస్తి+ఏవ=) యేదియు లేనే లేదు.

(అనఁగా, బరమాణువుల నెడఁబాటు చేయుట కారంభమైనను నాపనిని నియమము చేయఁగలది – అనఁగా నాపనిని నాపఁగలది లేనందున నెప్పుడును బ్రళయమును జేయుచునే యుండునని భావము.)

అదృష్టమపి భోగప్రసిద్ధ్యర్థం న ప్రళయప్రసిద్ధ్యర్థ మిత్యతో నిమిత్తాభావా న్న స్యా దణూనాం సంయోగోత్పత్త్యర్థం విభాగోత్పత్త్యర్థం వా కర్మ.

(అదృష్టమపి=) అదృష్ట మనెడినిమిత్తము (= agent)యొక్క కల్పనము (భోగ ప్రసిద్ధ్యర్థం=) పురుషుఁడు ధర్మాధర్మఫలముల ననుభవించుటకుఁగాను జేయఁబడినది గాని (న ప్రళయ ... మితి=) ప్రళయమును దెచ్చిపెట్టుటకొఱకుఁ గాదన్నచో, (నిమిత్తాభావాత్=) నిమిత్త మేదియు లేనందుననే (అణూనాం=) పరమాణువులు (సంయో .... త్పత్త్యర్థంవా) కలియుటకుఁగాని విడిపోవుటకుఁగాని (కర్మ=)తగినకర్మ మేదియుఁ (న స్యాత్=) గలుగనేరదు.

అతశ్చ సంయోగవిభాగాయత్తయో స్సర్గప్రళయయో రభావః ప్రసజ్యేత.

(అతః=) కాఁబట్టి యణువులు గలియుటకు విడిపోవుటకు సంభవింపనప్పుడు (సంయో ... యత్తయోః=) ఆయణువులయొక్క సంయోగ విభాగములమీఁదనే యాధారపడియుండు (సర్గ...ప్రళయయోః=) జగత్సృష్టిప్రళయములనునవి (అభావః ప్రసజ్యేత=) లేకపోవుటయే తటస్థించును.

తస్మా దనుపపన్నోఽయం పరమాణుకారణవాదః.

అందువలన (అయం ... వాదః=) పరమాణువులవలన జగత్తు కలిగినదని చెప్పునీవైశేషికులవాదము (అనుపపన్నః=) సరియైనది గాదు.

13. సూత్రావతారిక :— సృష్టికిఁ గావలసినపరమాణుసంయోగము— ప్రళయమునకుఁ గావలసినపరమాణువిభాగము— అనెడి కర్మములను గల్గింపఁగల నిమిత్త మొకటి- అనఁగఁ జేతనప్రయత్నము మొదలగునది యొప్పుకొనఁబడనందున వైశేషికుల పరమాణుజగత్కారణవాద మనుపపన్నమని పూర్వసూత్రమందుఁ జెప్పఁబడినది. జగదారంభకము లగుద్వ్యణుకములకును బరమాణువులకును మధ్య సమవాయసంబంధ మంగీకరించుటవలనఁగూడ వైశేషికుల పరమాణుజగత్కారణ వాద మనుపపన్నమని యీసూత్రమందు నిరాకరింపఁబడుచున్నది.

## ౧౩ సూ॥ సమవాయాభ్యుపగమాచ్చ తదభావః సామ్యా దనవస్థితేః॥

ప॥ వి॥ — సమవాయాభ్యుపగమాత్ - చ – తత్ - అభావః - సామ్యాత్ - అనవస్థితేః.

ప్రి॥ ప॥ అ॥ — సమ ... గమాత్; సమవాయ = (వైశేషికులు) సమవాయ మనెడి సంబంధమును భిన్నపదార్థముగా; అభ్యుపగమాత్ = అంగీకరించుట వలన; చ = కూడ; (తదభా॰ః, తత్ = జగత్సృష్టి. అభావః = లేకపోయినదే యగును.) సామ్యాత్ = సమానత్వమునుబట్టి; అనవస్థితేః = అనవస్థాదోషము గల్గుటవలన -

దం॥ అ॥ — వైశేషికులు సమవాయ మనెడిసంబంధమును భిన్నపదార్థముగా నంగీకరించుటవలనఁగూడఁ బరమాణుకారణవాద మసంభవ మగును. (ఎందుచేతననఁగా) సామ్యమునుబట్టి యనవస్థాదోషము గలుగును.

(ద్వ్యణుకము – సమవాయము – పరమాణువులు)

సూతార్థము :— రెండుపరమాణువులు గలియఁగాఁ బుట్టినట్టి ద్వ్యణుకమును నది, పరమాణువులకంటె భిన్నమైనదనియు, సమవాయ మనెడిసంబంధముచేత నా ద్వ్యణుకమును బరమాణువులును నిల్చి (కలిసి) యుండుచున్నవనియు సిద్ధాంతము చేసి (వైశేషికులు)

(సమవాయాభ్యుపగమాచ్చ=) సమవాయమనెడిసంబంధ మంగీకరించుటవలనఁ గూడ (తదభావః) పరమాణుకారణవాదము సంభవింపఁజాలదు.

(సామ్యా దనవస్థితేః) ఎందుచేతననఁగా— ద్వ్యణుకము పరమాణువుకంటె నెట్లు భిన్నమైనదో యట్లే సమవాయమునకంటెఁగూడ భిన్నమైనదే యని వైశేషికులు చెప్పుదురు. ద్వ్యణుకమును బరమాణువులను భిన్నపదార్థము లగుటంబట్టి వానిమధ్య నుండుసమవాయసంబంధముచేత నవి కలియుచున్నవని చెప్పినప్పుడు సమవాయ మనునదియు ద్వ్యణుకముకంటె భిన్నమైన పదార్థముగావున నీరెంటిని గలుపఁ గలమఱియొకసమవాయ ముండవచ్చును. ఇట్లే యంతము లేకుండఁ బోవుచుండును. ఇది శాస్త్రమునం దొకమహాదోషము. ఇట్టిసమవాయసంబంధము నాధారము చేసికొని వైశేషికులు చెప్పుపరమాణుజగత్కారణవాదము చెల్ల నేరదు.

భాష్యము — భాష్యార్థము

సమవాయాభ్యుపగమాచ్చ తదభావ ఇతి ప్రకృతే నాణుకారణవాదనిరాకరణేన సంబధ్యతే.

సూత్రములోని సమవాయాభ్యుపగమాచ్చ (=సమవాయసంబంధము నంగీకరించుటవలనను గూడ) అనుమాటలతరువాతే, తదభావః (=జగత్సృష్టి లేకపోవును) అను మాటలను జేర్చికొని (ప్రకృతేన=) ప్రస్తుతాంశమైన (అణుకా ... ణేన=) "కావునఁ బరమాణువులవలన జగత్తు పుట్టినదని చెప్పు వైశేషికుల సిద్ధాంతము సరికాదు" అనుసారాంశముతో (సంబధ్యతే=) సంబంధింపఁజేసి భావమును బూర్తిచేసికొనవలయును.

ద్వాభ్యాం చాణుభ్యాం ద్వ్యణుక, ముత్పద్యమాన, మత్యంతభిన్న మణుభ్యా మణ్వోస్సమవైతీత్యభ్యుపగమ్యతే భవతా. న చైవ మభ్యుపగచ్ఛతా శక్యతేఽణుకారణవాద స్సమర్థయితుమ్.

(ద్వ్యణుకం=) ద్వ్యణుకమనునది (ద్వాభ్యాం ... భ్యాం=) రెండుపరమాణువులనుండి (ఉత్పద్యమానం=) పుట్టినదగుచు (అణుభ్యాం=) నాపరమాణువుల కంటెఁ (అత్యంతభిన్నం=) బూర్తిగా భిన్నమైనవస్తువేయై (అణ్వోః=) యాపరమాణువులయందు (సమవైతి+ఇతి) సమవాయసంబంధముచేత నుండుచున్నదని (భవతా=) వైశేషికుఁడవైననీచేత (అభ్యుపగమ్యతే=) నంగీకరింపఁబడుచున్నదిగదా. (ఏవం+అభ్యుపగచ్ఛతా=) అట్లంగీకరించునీచేత (అణుకారణవాదః=) పరమాణుజగత్కారణవాదము (సమర్థయితుం =) నిల్వఁబెట్టఁబడుటకు (నచ+శక్యతే =) సాధ్యము గాదుసుమా.

కుతః ?— ఎందుచే నందువేమో

సామ్యాదనవస్థితేః

(సామ్యాత్ =) సమానత్వమునే యంగీకరించు మీసిద్ధాంతమునుబట్టి (అనవస్థితేః=) అనవస్థాదోషము సంభవించుటవలన—

యథైవ హ్యణుభ్యా మత్యంతభిన్నం స ద్ద్వ్యణుకం సమవాయలక్షణేన సంబంధేన తాభ్యాం సంబధ్యతే, ఏవం సమవాయోఽపి సమవాయిభ్యోఽత్యంతభిన్నస్సన్ సమవాయలక్షణే నాన్యేనైవ సంబంధేన సమవాయిభి స్సంబధ్యే తాత్యంతభేదసామ్యాత్.

(యథైవహి=) అదెట్లో చూడుఁడు. ద్వ్యణుక మనునది పరమాణువులకంటెఁ బూర్తిగా భిన్నమైనదై సమవాయ మనెడిసంబంధముచేత (తాభ్యాం=)

నా పరమాణువులతోఁ (సంబధ్యతే =) గలియును- అని మీరు చెప్పుచున్నారు. (పరమాణువు + సమవాయము + పరమాణువు) (ఏవం=) అట్లగుచో (సమవాయోఽపి =) నీసమవాయముసైతము (సమవాయిభ్యః =) దీనితో (సమవాయముతో) నంటుకొనవలసిన రెండుపరమాణువులకంటె (అత్యంతభిన్నస్సన్ =) మిక్కిలిభిన్నమైన దే యైనందున (సమవాయి ... బంధేన=) మఱియొక్కసమవాయమనుసంబంధముచేత (సమవా ... ధ్యేత=) నాపరమాణువులతోఁ గలియవలసియుండును- ఎందుచేతననఁగా- (అత్యంతసామ్యాత్ =) ఒకపరమాణువునకు మఱియొక పరమాణువునకు నెట్టిభేదము గలదందురో, ఆపరమాణువునకును సమవాయమునకునుసైతము నట్టిభేదమే గలదని మీరు చెప్పుదురుగదా.

తతశ్చ తస్య తస్యాన్యోఽన్యస్సంబంధః కల్పయితవ్య ఇత్యనవస్థా ప్రసజ్యేత.

(తతశ్చ=) అందువలన (తస్య .... తవ్యః=) రెండుపరమాణువులను గల్పుటకు సమవాయ మెట్లవసరమో పరమాణువును సమవాయమును గల్పుట కట్లే మఱియొకసమవాయ మవసరమైనందున నీవిధముగా సమవాయములను మధ్య మధ్య దెచ్చిపెట్టుచుండుటకు (అనవస్థా=) నంతులేకపోవుట (ప్రసజ్యేత=) సంభవించును.

వైశేషికపూర్వపక్షి యడ్డుప్రశ్నము—

నన్విహ ప్రత్యయగ్రాహ్యస్సమవాయో నిత్యసంబంధ ఏవ సమవాయిభి ర్గృహ్యతే. నాసంబంధ స్సంబంధాంతరాపేక్షో వా.

(నన్విహ ..వాయః=) సమవాయ మనఁగా మే మెట్లు భావించుచున్నామో వినుఁడు- (సమ .... గృహ్యతే=) సమవాయ మన్నది దానితో నంటుకొనవలసిన రెండుపరమాణువుల (సమవాయిభిః) మధ్య నెప్పుడును విడిపోనినిత్యసంబంధమై కలిసియుండును. అది (అసంబంధః-వా) యాపరమాణువులతోఁ గలియకుండ దానివలె నుండునదిగాని లేదా (సంబంధాంతరాపేక్షః-వా) వానితో దానిని గల్పుటకు మఱియొకదానిని-అనఁగా మఱియొక సంబంధమును గోరునదిగాని (న=) యెంతమాత్రమును గాదు.

తతశ్చ న తస్యాన్య స్సంబంధః కల్పయితవ్యః, యేనానవస్థా ప్రసజ్యేతేతి.

(తతశ్చ=) కాఁబట్టి (యేనా ... జ్యేత=) అంతులేకుండ సమవాయములను దెచ్చిపెట్టవలసివచ్చుట యనునదనవస్థాదోషము వచ్చునట్లుగా (తస్య=) ఆసమవాయము పరమాణువుతోఁ గలియుటకుఁగాను (అన్యః సంబంధః=) మఱియొక సమ

వాయుసంబంధమును (న కల్పయితవ్యః=) గల్పింపఁగూడదు. (కోరునది యని చెప్పఁగూడదు.)

సిద్ధాంతిసమాధానము :—

నేత్యుచ్యతే.

అట్లు గాదు. నీవాదము సరిగాదు.

సంయోగో ప్యేవంసతి. సంయోగిభి ర్నిత్యసంబద్ధఏవేతి సమవాయవ న్నాన్యం సంబంధమపేక్షేత.

(ఏవంసతి=) అట్లగుచో (సంయోగోఽపి=) సంయోగముసైతము (సంయోగిభిః=) సంయోగింపఁబడు (కలుపఁబడు) రెండణువులతో (నిత్య... వేతి=) నెడతెగని సంబంధము గలదియేగావున, అణువునకు సంయోగమునకు మధ్య (సమవాయవత్=) సమవాయమువంటి (అన్యం సంబంధం=) వేఱొకసంబంధమును (న+అపేక్షేత=) కోరకుండవలసినది. (=వేఱొకసంబంధ మేల కావలసివచ్చినది!)

(రెండుభిన్నవస్తువులకు మధ్య వానిని గల్పుటకు సంయోగ మనునది (Conjunction) యుండవలెనని వైశేషికులు చెప్పుదురు. అందుచే రెండుపరమాణువులకు మధ్య సంయోగ మన్నది యుండును. ఈసంయోగముగాక యాపరమాణువులకంటె సమవాయముసైత ముండునని వారిసిద్ధాంతము.

అణువు+సమవాయము+సంయోగము+సమవాయము+అణువు.

రెండణువులను గల్పుటకు సంయోగమన్నది యుండఁగా మఱియొకసమవాయసంబంధ మేల గావలసివచ్చినదనియు, సంయోగమున్నను సమవాయము తెచ్చిపెట్టినప్పుడు సమవాయమున్నను మఱియొక సమవాయము రావలెనని యేల యనఁగూడదనియు భావము

అథార్థాంతరత్వా త్సంయోగ స్సంబంధాంతర మపేక్షేత.

(అథ=) ఒకవేళ (సంయోగః=) సంయోగమునునది (అర్థాంతరత్వాత్=) యొకప్రత్యేకవస్తు వగుటవలన (సంబంధాంతరం=) దానికిని, అణువులకును మధ్య నొక (వేఱొక) సంబంధ (అపేక్షేత) ముండితీరవలె నని యందురేమో!

సమవాయోఽపి తర్హ్యర్థాంతరత్వా త్సంబంధాంతర మపేక్షేత.

(తర్హి=) అట్లన్నచో సమవాయోఽపి=) సమవాయముసైతము (అర్థాంతరత్వాత్=) ఒకప్రత్యేకపదార్థమేగావున (సంబంధాంతరత్వాత్=) దానికిని నణువు

నకును మధ్యమాత్రము వేఱొకసంబంధము (అపేక్షేత=) కావలసియేవచ్చునని చెప్ప వలసియుండును.

నచ గుణత్వాత్సంయోగ స్సంబంధాంతర మపేక్షతే, న సమవాయోఽగుణత్వా దితి యుజ్యతే వక్తుమ్.

(గుణత్వాత్=) సంయోగము గుణముగావున (సంయోగః=) నది ద్రవ్యముతోఁ గలియుటకు (సంబంధాంతరం=) వేఱొకసంబంధమును (అపేక్షతే=) అపేక్షించునుగాని, సమవాయో౽గుణత్వాత్=) సమవాయ మట్టిగుణము గాదుగావున (ఇతి=) వేఱొకసంబంధము నపేక్షింపదని (వక్తుం=) చెప్పుటకు (నయుజ్యతే=) నవకాశము లేదు. (న్యాయశాస్త్రానుసారము సమవాయ మన్నది యేడుపదార్థము లనెడి మెట్టుభాగములలో నొకటి- ఆయేడింటిలో మఱియొకటి యైనగుణముయొక్క యంతర్భాగములలో సంయోగ మన్నది యొకటి.)

అపేక్షాకారణస్య తుల్యత్వాత్ గుణపరిభాషాయా శ్చాతంత్రత్వాత్.

(అపేక్ష ... తుల్యత్వాత్=) మఱియొక (కలపు) దానిసాహాయ్యము నపేక్షించుటలో సంయోగసమవాయములు రెండును సమానములే (=ఒకతీరువే) గావునను, (గుణపరిభాషాయాశ్చ=) గుణ మనిచెప్పఁబడునొకవస్తువు ప్రత్యేకముగా నున్నట్లు (అతంత్రత్వాత్=) ఏశాస్త్రమందును నేగ్రంథమందును లేనందునను.

తస్మా దర్థాంతరం సమవాయ మభ్యుపగచ్ఛతః ప్రసజ్యేతై వానవస్థా.

(తస్మాత్=) ఈహేతువులవలన (అర్థాం ... గచ్ఛతః=) సమవాయ మన్నది యొకప్రత్యేకపదార్థముగా నంగీకరించువారికి (అనవస్థా=) అనవస్థాదోషము- అనఁగా నంతులేని సమవాయములను దెచ్చిపెట్టుకొనవలసి వచ్చునంతటి తీఱనిదురవస్థ (ప్రసజ్యేత+ఏవ=) సంభవించియే తీరును.

ప్రసజ్యమానాయా మవవస్థాయా మేకాసిద్ధౌ సర్వాసిద్ధే ర్ద్వాభ్యా మణుభ్యాం ద్వ్యణుకం నైవోత్పద్యేత.

(ప్రసజ్య ... వస్థాయాం=) సమవాయము నంగీకరించుపక్షములోఁ బైని జూపఁబడినరీతిగా ననవస్థాదోషము వచ్చుచున్న దగుచుండఁగా (అనఁగా సమవాయ మనునది త్రోసివేయఁబడవలసిన దే యని తేలుచుండఁగా) (ఏకాసిద్ధౌ సర్వాసిద్ధేః=) '(ఉన్న రెంటిలో) ఒకటి సరిగానిది యగుచుండఁగా నన్నియు (రెండును) సరిగానివే యగు' ననున్యాయానుసారముగా నీసిద్ధాంతములందలి మొదటిది యనఁగా సమవా

యము మీఁద నాధారపడిన రెండుపరమాణువులసంయోగ మన్నదే కుదురకుండఁ బోయినప్పుడు, (ద్వాభ్యా మణుభ్యాం=) రెండు పరమాణువులయొక్క కలయికవలన (ద్వ్యణుకం=) సృష్టి కత్యవసర మగుద్వ్యణుక మన్నదియే (న+ ఉత్పద్యేత + ఏవ) పుట్టనే పుట్టఁజాలదు.

(పరమాణుద్వయసంయోగమే కుదురనప్పుడు ద్వ్యణుకోత్పత్తి కుదురనే కుదురదు. కాన పరమాణువులవలన నగుసృష్టి యసంభవము)

తస్మాద ప్యనుపపన్నః పరమాణుకారణవాదః.

కాఁబట్టి యీ హేతువువలనఁగూడఁ బరమాణువులవలన జగత్తు పుట్టినదని చెప్పువైశేషికులసిద్ధాంతము సమంజసము గాదు.

14. సూత్రావతారిక :— రెండు పరమాణువులమధ్యను సమవాయసంబంధ ముండుటచేత సృష్టి కవసర మగుద్వ్యణుక మేర్పడుచున్నదని వైశేషికు లంగీకరించుటచేత రెండుపరమాణువు లన్యోన్య మెంతటిభిన్నములో పరమాణువులును సమవాయము నంతటిభిన్నములే గావునఁ బరమాణువును సమవాయమును గలుపఁగల మఱియొకసమవాయమును, ఈసమవాయమును బరమాణువుతోఁ గల్పుటకు నింకొక సమవాయమును నిట్లే యనంతముగా సమవాయముల నంగీకరింపవలసివచ్చి యనవస్థాదోషము పట్టును; గావున వైశేషికులయొక్క పరమాణుజగత్కారణవాదము దూష్యమని పూర్వసూత్రమందుఁ ద్రోసివేయఁబడినది. మఱియొకహేతువువలనను గూడ నావాదము దూష్యమే యని యీసూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౧౪ సూ॥ నిత్యమేవ చ భావాత్

ప॥ వి॥ నిత్యమ్ - ఏవ - చ – భావాత్.

అ॥ క్ర॥ — భావాత్ – నిత్యమేవ – చ

ప్ర॥ ప॥ అ॥— నిత్యమ్ = నిత్యమైనది; ఏవ = ఏ; చ= మఱియు; భావాత్ = ఉండుటవలన.

సూత్రార్థము :— (పరమాణువులకుఁ బ్రవృత్తిస్వభావమే యున్నదని చెప్పుచో (సృష్టి యన్నది) నిత్యమే యైయుండును. మఱియును (అట్లే నివృత్తి స్వభావమే) యున్నదని చెప్పుచో (ప్రళయ మన్నది) నిత్యమే యైయుండును. (ఇట్లగుటచేఁ) బరమాణుజగత్కారణవాదము సమంజసము గాదు.

భాష్యార్థసంగ్రహము :—

పరమాణువులు ప్రవృత్తి (=కదలుటట్టి) స్వభావములే యన్నచో (నిత్యమేవ) సృష్టి నిత్యమే యగును. ఏలయన (భావాత్) పరమాణువులకుఁ బ్రవృత్తియే యుండుటవలన, నిఁకఁ బ్రళయమే యుండదు. (చ) పరమాణువులు నివృత్తి (=విడిపోవుఁట్టి) స్వభావములే యన్నచోఁ బ్రళయము నిత్యమే యగును. ఏలయన- పరమాణువులకు నివృత్తియే యుండుటవలన- ఇఁక సృష్టియే యుండదు.

భాష్యము — భాష్యార్థము :—

అపి చాణవః ప్రవృత్తిస్వభావా వా. నివృత్తిస్వభావా వా. ఉభయస్వభావా వా, అనుభయస్వభావా వాఽభ్యుపగమ్యేరన్ గత్యంతరాభావాత్.

(అణవః=) పరమాణువులు (ప్రవృత్తి ... భావావా=) ప్రవృత్తి (=చలన =వ్యాపార) స్వభావము గలవనిగాని, నివృత్తి (=నిర్వ్యాపార= అచలన) స్వభావము గలవనిగాని, ప్రవృత్తినివృత్తి (=ఉభయ = చలనాచలన) స్వభావము గలవనిగాని, (అనుభయ =) ప్రవృత్తినివృత్తిస్వభావములు రెండును లేని వని గాని (అభ్యుపగమ్యేరన్=) వైశేషికులు చెప్పవలసియున్నదిగదా.

ఏలయనఁ బైనాల్గువిధములు గాక మఱి యొకయైదవవిధ మేదియునుఁ జెప్పఁదగినది లేదు.

చతుర్ధాపి నోపపద్యతే.

పైనాల్గింటిలో నేయొక్కటియుఁ గుదురదు చూడుఁడు.

(1) ప్రవృత్తిస్వభావత్వే నిత్యమేవ ప్రవృత్తే ర్భావాత్. ప్రళయాభావప్రసంగః.

(1) (ప్రవృ ... వత్వే=) అవి యెప్పుడును జలనస్వభావము కలవే యనుపక్షమున, (నిత్య ... వాత్=) నవి యొకటితో నొకటి గలిసిపోవుచుండవలసిన దేగాని విడిపోవుట యెప్పుడును దటస్థింపనందునఁ (ప్రళయా...ప్రసంగః=) బ్రళయ మనునది లేదనియే చెప్పవలసివచ్చును.

(2) నివృత్తిస్వభావత్వేఽపి నిత్యమేవ నివృత్తే ర్భావాత్ సర్గాభావప్రసంగః.

(2) అవి యెప్పుడును (నివృ ... త్వేఽపి=) గదలిక లేనివే (=అచలనస్వభావాః=) యనుపక్షమున (నిత్య ... భావాత్=) నవి (మొద్దులవలెఁ గదలిక లేకుండ) యొకచోటనే యున్నవై (అనఁగా సృష్టి కవసరము లగుద్వ్యణుకాదులు

గాకుండ(బోయి) (సర్గా ... సంగః=) సృష్టి యనునది యుండదనియే చెప్పవలసి వచ్చును.

(3) ఉభయస్వభావత్వంచ. విరోధా. దసంభావ్యం.

(3) అవి (ఉభయ ... త్వంచ=) కలియుస్వభావము, కలియనిస్వభావము గలవి యనుపక్షమున (విరోధాత్=) ఆరెండుభావము లొకదానితో నొకటి విరుద్ధము లైనందున (అసంభావ్యం =) నట్టియుభయస్వభావ మొకచోట నుండనే యుండదు. (ఉండుట యసంభవము.)

(4) అనుభయస్వభావత్వే తు నిమిత్తవశా త్ప్రవృత్తినివృత్త్యో రభ్యుపగమ్యమానయో రదృష్టాదే ర్నిమిత్తస్య నిత్యసన్నిధానా న్నిత్యప్రవృత్తిప్రసంగః.

(4) అవి (అనుభయ .... త్వే తు=) రెండు స్వభావములును లేని వనుపక్షమున, (నిమిత్తవశాత్=) ఏదోయొకనిమిత్తము (operative cause) లభించుసందర్భములో (ప్రవృత్తి ... మానయోః=) ప్రవృత్తినివృత్తులు రెండును గల్గుట కవకాశ మున్నందునను (అదృష్టా ... ధానాత్ =) వైశేషికులసిద్ధాంతానుసారమదృష్ట మనెడినిమిత్త మొకటి పరమాణువులకంటె నిత్యముగా నున్నందునను(నిత్య ... సంగః=) ఎప్పుడును నాపరమాణువులకుఁ బ్రవృత్తి (= చలనము) యున్నదనియే చెప్పవలసివచ్చును

అతంత్రత్వే ప్యదృష్టాదే, ర్నిత్యాప్రవృత్తిప్రసంగః.

(అతంత్ర .... ష్టాదేః=) అదృష్టాదులు నిమిత్తములు (operating causes) గా నేరవని యెంచుపక్షమున (నిత్యా ... సంగః=) అణువులకు నిత్యమును నప్రవృత్తి (=కదలిక లేకపోవుట) యుండునని చెప్పవలసివచ్చును.

తస్మాద ప్యనుపపన్నః పరమాణుకారణవాదః.

కాఁబట్టి పరమాణువులవలన జగత్తేర్పడిన దనువైశేషికులవాదము (అనుపపన్నః=) భంగపడిపోవుచున్నది.

15 సూత్రావతారిక :— పరమాణువులు ప్రవృత్తిస్వభావములైగాని నివృత్తిస్వభావములైగాని యుండునన్నచో, సృష్టియో లేక ప్రళయమో నిత్యమై యుండవలయును. రెండును గలవని చెప్పు వైశేషికులయొక్క పరమాణుజగత్కారణవాదము సరిగాదని పూర్వసూత్రమందుఁ ద్రోసివేయఁబడినది. ఇంకొక హేతువువలనఁ గూడ నావాదము దూష్యమే యగుచున్నదని యీసూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౧౫ సూ॥ రూపాదిమత్త్వాచ్చ, విపర్యయో దర్శనాత్

ప॥ వి॥ — రూపాదిమత్త్వాత్ – చ; విపర్యయః – దర్శనాత్ –

ప్ర॥ ప॥ అ॥ — రూపాదిమత్త్వాత్ = రూపము మొదలగుగుణములు గలిగి యుండుటవలన – చ = మఱియును – విపర్యయః = విరుద్ధత్వము (కలుగును) – దర్శనాత్ = అట్టిది ప్రత్యక్షముగాఁ గనుపడుచుండుటవలన–

సూత్రభావము :— (రూపాదిమత్త్వాచ్చ =) పృథివ్యాపస్తేజోవాయువు లనునాల్గువిధములైనభూతములకు నాల్గువిధములై యుండుపరమాణువులు వరుసగా గంధరసరూపస్పర్శము లనెడిగుణములను గలిగియుండుటవలన (విపర్యయః=) పరమాణువుల కున్నదని చెప్పఁబడు నణుత్వము (=విభాగానర్హత) – నిత్యత్వము వ్యతిరేకములై పోవును. (దర్శనాత్) ఏలయన రూపరసాదిగుణములు గలపదార్థములు భాగింపఁబడఁదగినవిగాను ననిత్యములుగాను నుండుట ప్రత్యక్షవిషయము.

భాష్యము — భాష్యార్థము

సావయవానాం ద్రవ్యాణా మవయవశో విభజ్యమానానాం, యతః పరో విభాగో న సంభవతి, తే చతుర్విధా రూపాదిమంతః పరమాణవః చతుర్విధస్య రూపాదిమతో భూతభౌతిక స్యారంభకా నిత్యాశ్చేతి–

(సావ .... వ్యాణాం=) భాగములతో నేర్పడినద్రవ్యములు (అవయవ ... నానాం=) ఆయాభాగములలోనికి విభజింపఁబడుటకు నవకాశ మున్నందున (యతః ... న సంభవతి=) విభజించుచుఁబోఁగా నట్టివిభాగ మెంతకుఁబైని వశము గాదో, (తే చతు ... ణవః=) యవి పరమాణువులనియు, నవి రూపములు గలవనియు (చతుర్వి .... రంభకాః=) అవి నాల్గు విధములై రూపాదులు గలపృథివ్యప్తేజో వాయువు లనెడిభూతములను, ఆభూతములకు సంబంధించినభౌతికములను బుట్టించు ననియు (నిత్యాశ్చ=) నవి నిత్యము లనియు (వైశేషికులచేతఁ) జెప్పఁబడుచున్నది.

య ద్వైశేషికా అభ్యుపగచ్ఛంతి స తేషా మభ్యుపగమో నిరాలంబన ఏవ.

(యద్వై ... గమః=) అట్లు చెప్పువైశేషికులసిద్ధాంతము (నిరాలంబనఏవ=) ఆధారము లేనిదియే (=అప్రమాణమైనదే) యైయున్నది.

యతో రూపాదిమత్త్వా త్పరమాణూనా మణుత్వనిత్యత్వవిపర్యయః ప్రసజ్యేత.

(యతో .... మత్త్వాత్ =) పరమాణువులు రూపాదులు గలవిగావున, (పర మా .... ర్ణ్యయః =) అవి విభాగింపఁబడఁజాలనియణువులు నిత్యములు నని చెప్పుటకు భంగము (ప్రసజ్యేత=) తటస్థించును.

పరమకారణాపేక్షయా స్థూలత్వ మనిత్యత్వంచ తేషా మభిప్రేతవిపరీత మాపద్యేతేత్యర్థః.

ఏలయన, (పరమ .... త్వంచ=) రూపము గల్గినవస్తువు స్థూలమై యుండును. అంతకంటెఁదక్కువస్థూలములైనట్టియు ననిత్యములైనట్టియు భాగములు దానికినుండు ననియు, నాభాగములే యావస్తువునకుఁ (అనఁగాఁ బరమాణువునకు) గారణమనియుఁ దేలునుగావునఁ బరమాణువులకంటె స్వల్పమైనవి యుండునని ప్రాప్తించి (తేషా మ ... పద్యేత=) వైశేషికులసిద్ధాంతమునకు వైరుధ్య (భంగము) మేర్పడును.

కుతః ? ఎందుచే నందురేమో -

ఏవం లోకే దృష్టత్వాత్.

లోకములో మనము సాధారణముగా నిట్లే చూచుచున్నాము-ఎట్లనఁగా

యద్ధి లోకే రూపాదిమ ద్వస్తు తత్ స్వకారణాపేక్షయా స్థూల మనిత్యం చ దృష్టమ్.

(లోకే=) లోకమందు (యద్ధి రూపా .... ద్వస్తు=) రూపము గలవస్తువు ప్రతిదియు (తత్ స్వకార .... క్షయా=) దానిదాని కారణమైనదానికంటె (స్థూల .... దృష్టం=) స్థూలముగాను, ననిత్యముగాను నున్నట్లు స్పష్టపడుచున్నది.

తద్యథా పట స్తంతూ నపేక్ష్య స్థూలోఽనిత్యశ్చ భవతి.

(తద్యథా=) ఆవిషయమునే దృష్టాంతములోఁ జూడుఁడు. (పటః=) వస్త్రములు (తంతూ నపేక్ష్య=) దారములకంటె స్థూలములు ననిత్యములు.

తంతవ శ్చాంశూ నపేక్ష్య స్థూలా అనిత్యాశ్చ భవంతి.

(తంతవశ్చ = ) దారములు (అంశూనపేక్ష్య = ) వానివానిభాగములకంటె (స్థూలా ... భవంతి=) స్థూలములు ననిత్యములునై యున్నవి.

తథా చామీ పరమాణవో రూపాదిమంత స్తై రభ్యుపగమ్యంతే.

(తథాచ=) అట్లే (అమీ పరమాణవః=) యీపరమాణువులుసైతము (రూపా .... మంతః=) రూపము గలవే యని (తైః =) ఆవైశేషికులవలన (అభ్యుపగమ్యంతే=) నంగీకరింపఁబడుచున్నది. (అవి రూపము గలవియైనప్పుడు స్థూలములే

ములైయుండవలెను. అంతకంటెఁ దక్కువైనభాగములు వీనికిఁ గారణములై యుండవలెను.

తస్మా త్తేఽపి కారణవంత స్తదపేక్షయా స్థూలా అనిత్యాశ్చ ప్రాప్నువంతి.

(తస్మాత్=) కాఁబట్టి (తేఽపి=) ఆపరమాణువులు (కారణవంతః=) తమకంటెఁ దక్కువైనవి తమకుఁ గారణములుగా నుండవలెనుగావున (తదపేక్షయా=) ఆకారణములకంటె నవి (స్థూలా.... భవంతి=) స్థూలములనియు, ననిత్యము లనియు నేర్పడుచున్నది

యచ్చ నిత్యత్వే కారణం తై రుక్తం_

(యచ్చ... రుక్తం=) పరమాణువులు నిత్యములని వైశేషికు లేప్రమాణమును జూపుచున్నారో యాసూత్రము లివిగో చూడుఁడు.

'స దకారణవ న్నిత్యమ్' వై. సూ॥ IV_1 1

('(అకారణవత్=) కారణము లేకుండ (సత్=) నున్నదియే (నిత్యమ్=) నిత్యమని చెప్పఁబడును.

తద ప్యేవం స త్యణుషు న సంభవతి.

(ఏవంసతి=) ఈవైశేషికసూత్రమందలినియమ మేది గలదో (తత్=) అది_అనఁగాఁ గారణము లేకుండుట (అణుషు=) వైశేషికులు చెప్పు (రూపముగల) పరమాణువులయందుఁ (న సంభవతి=) గనుపించదు.

ఉక్తేన ప్రకారే ణాణూనామపి కారణవత్త్వోపపత్తేః.

ఎందుచేతననఁగా (ఉక్తేన ప్రకారేణ=) పైని జెప్పఁ బడినవిధానమున (కారణ.... త్తేః= ఆపరమాణువులు తమకంటెఁ దక్కువైనవి తమకుఁ గారణములు గలవిగా నున్నవని చెప్పక తప్పదు.

యదపి నిత్యత్వే ద్వితీయం కారణ ముక్తం_

పరమాణువులు నిత్యములే యని వాదించుటకు వారు చెప్పురెండవ కారణమును జూడుఁడు.

'అనిత్య ... భావః' ఇతి. వై॥సూ॥ IV_1_4 'అనిత్య మితిచ విశేషతః ప్రతిషేధాభావః.

'(అనిత్యమితి=) అనిత్యమని (విశేషతః=) ప్రత్యేకించి (ప్రతిషేధాభావః=) (త్రోసివేయఁబడుట లేకుండ నున్న దేదియో యది (నిత్యము)

తదపి నావశ్యం పరమాణూనాం నిత్యత్వం సాధయతి.

(తదపి =) ఈసూత్రముసైతము (పరమాణూనాం =) పరమాణువులు (అవశ్యం=) తప్పనిసరిగా (నిత్యత్వం=) నిత్యములే యని (న సాధయతి=) ఋజువు చేయుట లేదు.

అసతి హి యస్మిన్ కస్మింశ్చి న్నిత్యే వస్తుని నిత్యశబ్దేన నఞ స్సమాసో నోపపద్యతే.

న పునః పరమాణునిత్యత్వమే వాపేక్ష్యతే.

(అసతి .... వస్తుని=) నిత్యమగువస్తు వొకటి ముందుగా నున్నప్పుడుగదా (= నిత్యమైనవస్తు వొకటి యేదియో నిశ్చయమైలేనప్పుడు) (నిత్యశబ్దేన.. పద్యతే= అది కానిదియని (=అనిత్యమని నిత్యము గానిది యని) సమాసముగాఁ జెప్పుట సంభవింపదు. (అట్టిపక్షములోఁ బరమాణువులు నిత్యములని మొదలే యంగీకరించి యంతకంటె భిన్నములైనవి యనిత్యములని చెప్పిన ట్లగును.)

(న పునః ... పేక్ష్యతే=) పరమాణు వొకటియే నిత్యమై యున్నదని నీవు యుక్తివలన ఋజువుచేయవలసియున్నప్పుడు పరమాణువు నిత్యమైనదని మొదలే యంగీకరించి యంతకంటె భిన్నమైనవి యనిత్యములుగాఁ ద్రోసివేయఁగా మిగిలినది నిత్యమనియు, నదియే పరమాణు వనియుఁ జెప్పిన ట్లగును

తస్మాత్స్యేవ నిత్యం పరమకారణం బ్రహ్మ.

నీకు నిత్యమైనవస్తు వెక్కడను నిర్ధారణము చేయఁబడి యుండలేదు) మాకన్ననో వేదములో బ్రహ్మ మనుపరమకారణము నిత్యమైనదిగా నిర్ధారణము చేయఁబడియున్నది.

నచ శబ్దార్థవ్యవహారమాత్రేణ కస్యచి దర్థస్య ప్రసిద్ధి ర్భవతి.

(శబ్దార్థ .... మాత్రేణ=) పరమాణువు నిత్యమని నీవు చెప్పినంతమాత్రము చేత (కస్యచిదర్థస్య =) ఆయర్థ మాశబ్దమునకుఁ గలుగుటకు (ప్రసిద్ధిః=) ప్రసిద్ధి (=ఋజువు) యేమియు (నచ భవతి=) లేదు. (అట్టిప్రసిద్ధి యేమి గలదు?)

ప్రమాణాంతరసిద్ధయో శ్శబ్దార్థయో ర్వ్యవహారావతారాత్.

(ప్రమా .... రాత్=) ఇతరప్రమాణముచేత, ఆయర్థ మాపదమునకు సిద్ధమైనప్పుడే యాయర్థముతో నాపదము లోకవ్యవహారమునకు వచ్చుటవలన వ్యవహారమునకు యోగ్య మగును.

యదపి నిత్యత్వే తృతీయం కారణ ముక్తం అవిద్యా చ (వై. సూ. IV_1_5) ఇతి.

(యదపి .... ముక్తం =) పరమాణువు నిత్యమని చూపుటకు నీవు చెప్పెడి మూఁడవకారణము నీకణాదసూత్రములలో

వై ॥సూ॥ IV-15 అవిద్యా చ

అనునీసూత్రముమీఁద నాధారపడియున్నది.

తద్యద్యేవం విప్రీయేత "సతాం పరిదృశ్యమానకార్యాణాం, కారణానాం ప్రత్యక్షేణాగ్రహణ మవిద్యే"తి తతో ద్వ్యణుకనిత్యతాఽఽపద్యేత.

(తద్య ... విప్రియేత=) ఈసూత్ర మీక్రిందఁజెప్పఁబడినరీతిగా వివరింపఁబడినచో- అనఁగా నర్థము చెప్పఁబడినచో- (అనఁగా నాసూత్రార్థ మేమనఁగా) (సతాం ... కార్యాణాం=) గోచరించుచున్న కార్యములకు- అనఁగాఁ ద్వ్యణుకములకు నున్నట్టి (కారణా ... హణం=) కారణములను బ్రత్యక్షముగా గ్రహింపలేకపోవుట- అనఁగాఁ గానఁబడకపోవుట (అవిద్యా + ఇతి) 'అవిద్య' యని చెప్పఁబడును. "అట్లు గ్రహింపలేకపోవుట యేవస్తువునందుఁగలదో" యది నిత్యము గోచరించునవి త్ర్యణుకములుమాత్రమే)

(N B. — ఈవాక్యము పై 'అవిద్యా చ' అనుసూత్రమున కర్థము; అవిద్య = కారణము తెలియఁబడకపోవుట- పరమాణువులకుఁ గారణము తెలియఁబడదుగావున నవి నిత్యములని వైశేషికసిద్ధాంతము.)

(తతః = ) అందువలన - అనఁగా నీపైసూత్రమునుబట్టి కనుపడునట్టి త్ర్యణుకకార్యమునకుఁ గారణ మైనద్వ్యణుకము ప్రత్యక్షముగాఁ గనుపించనిదే గావున) (ద్వ్యణుక .... ద్యేత=) ద్వ్యణుకము నిత్య మనియే చెప్పవలసివచ్చును. (కాని వైశేషికసిద్ధాంతములో ద్వ్యణుకము నిత్యము గాదు. దానికిఁ గారణ మైనపరమాణువుమాత్రమే నిత్యము.)

అథాఽద్రవ్యత్వే సతీతి విశేష్యేత.

(అథాఽద్రవ్యత్వే సతీతి విశేష్యేత=) పైనుదాహరించిన 'అవిద్యా చ' అను వైశేషికసూత్రము ద్వ్యణుకమునకు వర్తించ (=apply) కుండ నుండుటకుఁగాను సూత్రార్థముగాఁ బైనఁజెప్పఁబడిన 'సతాం... మవిద్యా' యనువాక్యములో 'కారణానాం' అన్నమాటతరువాత 'అద్రవ్యత్వే సతి' యనుమాటలను జేర్చిచదువుకొనవలయునని వైశేషికులవాద మంగీకరించినను (వైశేషికసిద్ధాంతప్రకారము - 'ద్రవ్యములు' — అనఁగా ముఖ్యముగాఁ గార్యారంభక = కార్యమును బుట్టించు

ద్రవ్యములుమాత్రమే- అనఁగా ద్వ్యణుకాది కార్యములను బుట్టించు కారణము లైన ద్వ్యణుకములుఁ మాత్రమే యగును- ఈ 'ద్వ్యణుకములే' ద్రవ్యము లని చెప్పఁ బడును. ఈద్వ్యణుకములు గానివి 'అద్రవ్యములు' అనఁగాఁ గారణములు లేనివి- 'కారణానాం' అన్నమాటతరువాత 'అద్రవ్యత్వే సతి' అను మాటలను జేర్చినచో 'ద్వ్యణుకములు గాని కారణములే'- అనఁగాఁ బరమాణువులే నిత్యములని పైసూత్రమున కర్థ మేర్పడునని వారియాశ.

తథా ప్యకారణవత్త్వమేవ నిత్యతానిమిత్త మాపద్యేత.

(తథాపి=) 'అద్రవ్యత్వేసతి' అనుమాటలను జేర్చి చదువుకొన్నను (అకారణవత్త్వమేవ=) కారణములు లేకుండ నుండునవియే (నిత్య ... ద్యేత=) నిత్యములని చెప్పుట కర్థము లగును- అని 'అవిద్యా చ' అను సూత్రమున కభిప్రాయ మైనట్లు తెలును.

తస్య చ ప్రాగేవో క్తత్వాత్ 'అవిద్యా చ' ఇతి పునరుక్తం స్యాత్.

(తస్య...త్వాత్=) సరిగా నీయభిప్రాయమునే యిచ్చుసూత్రము- అనఁగా 'స దకారణవ న్నిత్యమ్' (= కారణము లేకుండ నుండునదియే నిత్యము) అను వై IV-1-1 సూత్ర మింతకుఁ బూర్వమే చెప్పఁబడియున్నందున ("అవిద్యా చ ఇతి ... స్యాత్ =) మరల నాయర్థమునే యిచ్చు మఱియొకసూత్రము - అనఁగా వై IV-1.5 'అవిద్యా చ' అను సూత్రమును రచించుట వ్యర్థమే. (reduntant) యగును. ఇందువలనఁ బ్రాప్తించుపునరుక్తదోషము శాస్త్రరీతింబట్టి మహాదోషముగా నెంచఁబడును. (కావున 'అద్రవ్యత్వేసతి' అను మాటలను జేర్చుచోఁ గలుగు ప్రయోజనము లేదని భావము.)

వైశేషికపూర్వపక్షి :—

అథాపి కారణవిభాగా త్కారణవినాశా చ్చాన్యస్య తృతీయస్య వినాశహేతో రసంభవోఽవిద్యా; సా పరమాణూనాం నిత్యత్వం ఖ్యాపయతీతి వ్యాఖ్యాయేత.

(అథాఽపి=) అట్లు కాదనుకొన్నను, (విభాగాత్ =) వై.IV-1.1 లోఁ జెప్పఁబడినట్లు కారణవస్తువు మఱియు నంతర్భాగములలోనికి విభాగింపఁబడుట కవకాశము లేకపోవుటయు, (కారణవినాశాచ్చ=) వై.IV-1-4 లోఁ జెప్పఁబడినట్లు కారణవస్తువును నాశనముచేయుట కవకాశము లేకపోవుటయు ననెడియీరెండు హేతువులకంటె (అన్యస్య తృతీయస్య వినాశహేతోః=) వేఱొకమూఁడవ వినాశ

హేతువు (అసంభవః =) కారణవస్తువునందు సంభవింపకపోవుటయే - అనఁగాఁ గారణవస్తువునందుఁ దెలియఁబడకపోవుటయే 'అవిద్యా చ' (వై. సూ॥ IV-1-5) అని చెప్పఁబడును (స-అవిద్యా) అట్టిమూఁడవవినాశహేతు వేకారణవస్తువునందుఁ దెలియఁబడకుండుట గలదో యదియే (పరమా ... తేతి=) పరమాణువులు నిత్యములని పరికటింపఁగఁ దని (వ్యాఖ్యాయేత=) యేల వ్యాఖ్యానము చేయఁగూడదు (అనఁగా :—

(1) కార్యవస్తువును విభాగించుచుఁ బోఁగఁ బోఁగా నేవిభాగము నొద్దకు వచ్చినప్పుడందుఁగో మఱియు సంగ్రవిభాగము చేయుట కవకాశము లేదో యట్టివిభక్త వస్తువే పరమాణువనియు నదియే నిత్యమనియు గ్రహించవలయును.

(2) కార్యవస్తువును నాశనముచేయుచుఁబోఁగాబోఁగా నేస్థితికి వచ్చినప్పుడు మఱింక నాశనముచేయుట కెందు సాధ్యము గాదో యదియే పరమాణువనియు నిత్యమనియు గ్రహించవలయును.

(3) పై రెంటిలోఁ దెలిపినవిభాగముగాక నాశనముగాక యేవస్తువునందు నేట్రాకటి తెలియఁబడదో-అనఁగా నవిద్య-అజ్ఞాన మేర్పడునో యదియే పరమాణువనియు, నిత్యమనియు గ్రహించునది. ఈమూఁడవదానిలోఁ జెప్పఁబడినదియే 'అవిద్యా చ' అను సూత్రమునకు భావమని వైశేషికుని యభిప్రాయము.)

సిద్ధాంతిసమాధానము :—

నావశ్యం వినశ్యద్వస్తు ద్వాభ్యామేవ హేతుభ్యాం వినష్టు మర్హతీతి నియమోఽస్తి.

అట్లనుటకు వీలు లేదు (వినశ్యద్వస్తు =) వినాశనమును జెందువస్తువు (ద్వాభ్యామేవ హేతుభ్యాం =) పైనిదెలిపిన రెండు హేతువులవలన మాత్రమే అనఁగా విభాగమువలనను వినాశనమువలననుమాత్రమే (అవశ్యం విన ... తీతి=) తప్పనిసరిగా వినాశమును జెందఁగల దను (నియమః =) నియమము (Hard and fast rule) (న+అస్తి) లేదుసుమా!

సంయోగసచివే హ్యేకస్మింశ్చ ద్రవ్యే ద్రవ్యాంతర స్యారంభకేష్వభ్యుపగమ్యమానే ఏత దేవం స్యాత్.

(సంయోగసచివే హి=) రెండుమూఁడు మొదలగుకారణవస్తువులు సంయోగము (=కలయిక) వలనఁ గలిసికొని (ద్రవ్యాంత ... మానే=) మఱియొకవస్తువుగా నేర్పడినదని యంగీకరించఁబడిన (ఏకస్మింశ్చ ద్రవ్యే=) యట్టియేదో యొక

వస్తువు విషయములోనే (ఏత దేవం స్యాత్=) విభాగానర్థ్యము – నాశనార్థ్యము– అను నీమొదలగునూహాల కవకాశము గలదు.

(ఒకవస్తువునకు నాశనము గల్గుట విభాగము. వినాశనమువలనమాత్రమే గాని మఱియొకమార్గము లేదా యని సూచింపఁబడుచున్నది.)

యదా త్వపాస్తవిశేషం సామాన్యాత్మకం, కారణం, విశేషవ దవస్థాంతర మాపద్యమాన మారంభక మభ్యుపగమ్యతే. తదా ఘృతకాఠిన్యవిలయనవ న్మూర్త్యవస్థావిలయనేనాపి వినాశ ఉపపద్యతే.

(అపాస్తవిశేషం=) (గుండ్రముగనుండుట మూతి మొగము మొదలగు రూపము లనెడి) విశేషము లేమియు లేకుండఁగ (సామాన్యాత్మకం=) సామాన్యస్వరూపములో నుండు (కారణం) కారణవస్తు వేదియైనను(విశేషవత్=)గుండ్రముగనుండుట మొదలగు) విశేషములు గల (అవస్థాంతరం=) వేఱొకయాకారస్థితిని (ఆపద్యమానం=) బొందుచున్నదగుచు (ఆరంభకం=) (నామాంతరముతోఁ బిల్వఁబడు) మఱియొకవస్తువును బుట్టించఁగలదని (యదాతు + అభ్యుపగమ్యతే =) యంగీకరించు పక్షమున (అనఁగా– ఒకవస్తువు మఱియొకవస్తువుగాఁ బరిణమించవచ్చునని– అనఁగా నొకవస్తు వది చెందుపరిణామమువలన మఱియొకవస్తువునకుఁ గారణము గావచ్చునని) (యదాతదా=) యంగీకరించుపక్షములో (ఘృత .... లయనవత్=) (నిప్పుసెగవలన) నేతియందు దుంపబిరుసుతనము చెందెడివినాశముపలె- (మూర్త్య ... నాపి= కార్యవస్తువునందు దుండునా కారస్థితి–అనఁగా రూపాదులు-పోవుటచేతఁగూడఁ (వినాశః ఉపపద్యతే=) గార్యవస్తువు వినాశనమును జెందునని చెప్పవచ్చునుగదా !

తస్మా ద్రూపాదిమత్త్వాత్ స్యా దభిప్రేతవిపర్యయః పరమాణూనామ్.

(తస్మాత్=) కాఁబట్టి పరమాణూనాం (రూపాదిమత్త్వాత్=) పరమాణువులు రూపరసగంధస్పర్శములు గలవగుటవలన (అభిప్రేతవిపర్యయః) వైశేషికులయొక్క-యభిప్రాయమునకు (=వాదమునకు) వ్యతిరేకత- అనఁగాఁ బరమాణువులే మొదటి కారణ మనెడివాదమునకు వ్యతిరేకత – అనఁగా వైశేషికులు తలంచినట్లు పరమాణువులు మొదటికారణము గాక మఱియొకదానినుండి పుట్టినకార్యములే యన్నటుల (స్యాత్=) నగుచున్నది. (ఇట్లగుచో వైశేషికసిద్ధాంతమునకు మొదటికే భంగము వచ్చుచున్నదది భావము )

తస్మాద ప్యనుపపన్నః పరమాణుకారణవాదః,

(తస్మాదపి=) ఈహేతువువలనఁగూడ (పర .... వాదః=) జగత్తునకుఁ బరమాణువులే కారణ మనెడివైశేషికులవాదము (అనుపపన్నః=) భంగపడిపోవుచున్నది. (=అసమంజస మగుచున్నది)

16. సూత్రావతారిక :— పృథివ్యాదినాల్గుభూతముల ననుసరించి వానివాని వగునాల్గువిధము లైనపరమాణువులున్నైతము గంధరసరూపస్పర్శము లనెడిగుణములను గల్గియుండునవియే గావునను, నట్లనుటచే నాపరమాణువులకు వైశేషికులున్నవని చెప్పు నణుత్వనిత్యత్వము లుండఁజాలనట్లు ప్రత్యక్షవిషయమే గావునను వారిసిద్ధాంతములకు భంగము వచ్చుటచే వా రొనరించుపరమాణుజగత్కారణవాదము దూష్య మగునని పూర్వసూత్రమందుఁ దోసి వేయఁబడినది.

వేఱొకహేతువువలనఁగూడ వారివాదము చెల్లనిదే యగునని యీసూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౧౬ సూ॥ ఉభయథా చ దోషాత్.

ప॥ వి॥ — ఉభయథా - చ - దోషాత్.

ప్ర॥ ప॥ అ॥ — ఉభయథా = రెండువిధములుగాఁ జెప్పినను; దోషాత్ = దోషము గలుగుటవలన— చ = మఱియును.

సూత్రతాత్పర్యము :— పృథివ్యప్తేజోవాయువు లనునాల్గుభూతములును నొకదానికంటె మఱియొకటి పెద్దసంఖ్య గలగుణములుగాని తక్కువసంఖ్యగలగుణములుగాని గలట్టివని వైశేషికులు చెప్పుదురు.అట్లే వానివాని వగునాల్గువిధము లైనపరమాణువులును నొకదానికున్నవానికంటె మఱియొకదానికున్నవి యెక్కువ తక్కువ గుణములే గల్గియుండవలెనని చెప్పుదురా—లేక యట్లు చెప్పరా!— (1) ఎక్కువగుణములు గల్గియుండునని చెప్పుచో నెక్కువగుణములు గలపరమాణువులు — పరమాణువులని చెప్పుటకు వీలుపడదు. (2) అట్లు చెప్పనిచో నన్నివిధము లైనపరమాణువులో కేవిధముగా నుండునని యొప్పుకొనవలసివచ్చును. అట్లగుచో వానివానివలన నగుపృథివ్యాదిభూతములకు భేదము రాఁజాలదు. ఇది ప్రత్యక్షవిరుద్ధము.

(ఉభయథా చ దోషాత్) రెండువిధములలో నెట్లుచెప్పినను దోషమే సంభవించునుగావున వైశేషికుల పరమాణుకారణవాదము యుక్తము గాదు.

భాష్యము — భాష్యార్థము

గంధరసరూపస్పర్శగుణా స్థూలా పృథివీ.

గంధరసరూపస్పర్శము లనెడినాల్గుగుణములు గలదియు, స్థూల మైనదియుఁ బృథివి యైయున్నది.

రూపరసస్పర్శగుణా స్సూక్ష్మ ఆపః

రూపరసస్పర్శము లనెడిమూఁడు గుణములు గలదియు, సూక్ష్మ మైనదియు జల మైయున్నది.

రూపస్పర్శగుణం సూక్ష్మతరం తేజః.

రూపస్పర్శము లనెడి రెండు గుణములు గలదియు, జలముకంటె సూక్ష్మ మైనదియు నగ్ని యైయున్నది.

స్పర్శగుణ స్సూక్ష్మతమో వాయుః

ఒక్కస్పర్శగుణమే గలదియు మిగిలినమూఁడుభూతములకంటె నెక్కువ సూక్ష్మ మైనదియు వాయు వైయున్నది.

ఇత్యేవ మేతాని చత్వారి భూతా న్యుపచితాపచితగుణాని స్థూలసూక్ష్మతారతమ్యోపేతాని చ లోకే లక్ష్యంతే.

(ఇత్యేవం=) ఈపైని జెప్పఁబడినవిధమున (చత్వారి ... గుణాని=) స్థూలములై పెద్ద వైనగుణములతోఁగాని, సూక్ష్మములై చిన్న వైనగుణములతోఁగాని (స్థూల...తానిచ=) గొప్పచిన్న భేదములతోఁ గూఁడుకొన్నవిగా (లోకే లక్ష్యంతే=) లోకమందుఁ జూడఁబడుచున్నవి.

తద్వ త్పరమాణవోఽప్యుపచితాపచితగుణాః కల్ప్యేర న్నవా.

(తద్వత్=) ఆభూతములవలెనే (పరమాణవోఽపి=) ఆభూతములకు సంబంధించినపరమాణువులున్నైతము (ఉప .... గుణాః=) స్థూలములై పెద్ద వైనగుణములు గాని, సూక్ష్మములై చిన్న వైనగుణములుగాని (కల్ప్యేరన్=)కలవని చెప్పవలయునా? (నవా=) లేనివని చెప్పవలయునా?

ఉభయథాపి చ దోషానుషంగోఽపరిహార్య ఏవ స్యాత్.

(ఉభ .... పిచ=) రెండువిధములలో నెట్లుచెప్పినను (అపరిహార్యః=) దప్పింపఁజాలని (దోషానుషంగః .... ఏవ స్యాత్=) దోషము వచ్చుటయే సంభవించును.

కల్ప్యమానే తావ దుపచితాపచితగుణత్వే. ఉపచితగుణానాం మూర్త్యుపచయా దపరమాణుత్వప్రసంగః

(కల్ప్యమానే తావత్ =) భూతగుణములే యాయాభూతములకు సంబంధించినపరమాణువులకుసైతము గలవని చెప్పెడిపక్షములో (ఉపచి .... గుణత్వే=) పెద్దగుణములు చిన్నగుణములు నుండవచ్చునని చెప్పవలసివచ్చును గావున (ఉపచితగుణానాం మూర్త్యుపచయాత్ =) కొన్నిపరమాణువులు పెద్దగుణములు గల్గినవ్వు డట్టివి (అపర ... సంగః) పరమాణువులే గాకపోవలసివచ్చును.

న చాంతరేణాపి మూర్త్యుపచయం గుణోపచయో భవతీ త్యుచ్యేత.

(అంతరేణాపి మూర్త్యుపచయం=)మూర్తి పెద్దదిగాకుండ నున్నచో (గుణోపచయః=) గుణములు పెద్దవగునని (నచ+ఉచ్యేత=) చెప్పుటకు వీలులేదుగదా!

కార్యేషు చైతేషు గుణోపచయే మూర్త్యుపచయదర్శనాత్.

(కార్యే...ఏతేషు=) కార్యములైన పెద్దభూతముల విషయములో (గుణోపచయే=) గుణములు పెద్దవైనప్పుడు (మూర్త్యుపచయః=) మూర్తియుఁ బెద్దదియగుటను (దర్శనాత్ =) జూచుచున్నాముగదా!

(2) అకల్ప్యమానే తూపచితాపచితగుణత్వే పరమాణుత్వసామ్యసిద్ధయే యది తావ త్సర్వే ఏకైకగుణా ఏవ కల్ప్యేరన్,

(2) (అకల్ప్యమానే తు యది తావత్ =) భూతగుణము లాయాభూతములకు సంబంధించినపరమాణువులకు నుండవని చెప్పెడిపక్షములో (ఉపచితా ....సిద్ధయే=) అన్నిభూతములకు సంబంధించినపరమాణువులు సమానములైపోవుటవలన (సర్వే ఏకైకగుణా ఏవ=) అన్నిభూతములును నొకేరకమగుపరమాణువులనే కలిగియుండునని (కల్ప్యేరన్=) చెప్పవలసివచ్చును.

తత స్తైజసి స్పర్శస్యోపలబ్ధి ర్న స్యాత్; అప్సు రూపస్పర్శయోః, పృథివ్యాం చ రసరూపస్పర్శానాం, కారణగుణపూర్వకత్వా త్కార్యగుణానామ్.

(తతః=) అప్పుడు (తేజసి .... లబ్ధిః =) అగ్నియందు స్పర్శగుణముగాని, (అప్సు .... స్పర్శయోః = ) జలమునందు రూపస్పర్శగుణములుగాని, (పృథి ... ర్శానాం=) పృథివియందు రూపరసస్పర్శగుణములుగాని (న స్యాత్ =) లేకపోవలసివచ్చును ఎందుచేతనఁగా (కారణ ... గుణానాం=) కారణగుణము లెట్లుండునో కార్యగుణములుసైత మట్లే యుండునుగదా!

అథ సర్వే చతుర్గుణా ఏవ కల్ప్యేరన్ తతోఽప్స్వపి గంధస్యోపలబ్ధి స్స్యాత్; తేజసి గంధరసయోః, వాయౌ చ గంధరూపరసానాం; న చైవం దృశ్యతే.

(3) (అథ ... కల్ప్యేరన్=) ఒకవేళ నన్నిపరమాణువులయందును నన్ని గుణము లుండునని చెప్పెడిపక్షములో (తతః+అప్స్వపి=) జలమందుసైతము (గంధ ... లబ్ధిః=) గంధము (=వాసన), అగ్నియందుఁగూడ గంధరసములును, వాయువునందుఁగూడ గంధరూపరసములును (స్యాత్ =) నుండవలసియుండును. (న చైవం .... దృశ్యతే=) ఆప్రకారము ప్రత్యక్షములోఁ గనుపించుట లేదుగదా.

తస్మా దనుపపన్నః పరమాణుకారణవాదః.

(తస్మాత్=) కాఁబట్టి (అనుప .... వాదః=) పరమాణువులవలన జగత్తు పుట్టిన దనువాదము పనికి రాదు.

17 సూత్రావతారిక:— పృథివ్యాదిచతుర్భూతములంబలె వానివానికి సంబంధించినగుణములు సైత మొకదానిగుణములకంటె మఱియొకదానిగుణములు పెద్దవిగానో చిన్నవిగానో యుండి, స్థూలత్వసూక్ష్మత్వభేదములతో నుండుటవలన, నవి విభాగము చెంద నేరనట్టివియు నాశనము చెందనేరనట్టివియు నణుత్వనిత్యత్వములు గలవి గాకపోవుట తటస్థించుటచేఁ బరమాణువులే కాకపోవలసివచ్చుటవలనను; అన్నింటి కొకేరకపుగుణము లున్న వన్నచోఁ బృథివ్యాదిభూతములకుఁ బ్రత్యక్షములై యుండుస్థూలత్వసూక్ష్మత్వభేదము లేకపోవలసివచ్చుటవలనను వైశేషికులయొక్క పరమాణుకారణవాదము భంగపడిపోవునని పూర్వసూత్రమందుఁ జూపఁబడినది. వేదజ్ఞులగుమన్వాదులచే నీపరమాణుకారణవాద మంగీకరింపఁబడనందువలనఁ గూడ నది యెంతమాత్ర మపేక్షింపఁదగినది గాదని యీసూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౧౭॥ అపరిగ్రహా చ్చాత్యంత మనపేక్షా.

ప॥ వి॥ — అపరిగ్రహాత్ – చ – అత్యంతం – అనపేక్షా

ప్ర॥ ప॥ అ — అపరిగ్రహాత్ = శిష్టులచేఁ బరిగ్రహింపఁబడకపోవుటవలన; చ = కూడ; అత్యంతం = కేవలముగా; అనపేక్షా = (ఈవైశేషికమతమందు) నిరాదరము చేయఁబడఁదగినది.

సూత్రభావము :— (అపరిగ్రహాత్ - చ) ఈపరమాణుకారణవాదము వేదజ్ఞులైనమన్వాదులచేతను, శిష్టులగువారిచేతను, నేయంశమందును బరిగ్ర

హింపఁబడకపోవుటవలనఁగూడ (అత్యంత మనపేక్షా-) (ఈవైశేషికసిద్ధాంతము ముముక్షువు లగువారిచేత) నెంతమాత్రమును నపేక్షింపఁబడఁదగినది గాదు.

భాష్యము — భాష్యార్థము

ఉపోద్ఘాతము :-

ఎ) సత్కార్యవాద మంగీకరించుటఁజేసి సాంఖ్యమతమును గొంతవఱకు వేదజ్ఞులు పరిగ్రహించినను,

> ప్రధానకారణవాదో వేదవిద్భిరపి కైశ్చి న్మన్వాదిభి స్సత్కార్యత్వాద్యంశోపజీవనాభిప్రాయే ణోపనిబద్ధః.

(సత్కార్య ... ప్రాయేణ=) సత్కార్యవాదము (అనఁగాఁ గార్యము పుట్టక పూర్వముగూడఁ గారణ మందుఁ గార్య ముండనే యున్నదనుట) నకు సంబంధించి నంతవఱకు అనఁగా - దానిచేఁ బోషింపఁబడినంతవఱకు (ప్రధాన .... వాదః=) సాంఖ్యులయొక్క ప్రధానకారణవాదమును (వేదవిద్భిః=) వేదార్థరహస్యమును గుర్తెఱింగిన (కైశ్చిన్మన్వాదిభిః=) మన్వాదిఋషులు కొందఱు (ఉపనిబద్ధః=) ఒప్పు కొన్నవారైనప్పటికి

(బి) ఏకొద్దియంశములోనైనను వైశేషికులపరమాణుకారణవాదముమాత్రము వేదజ్ఞులచే నంగీకరింపఁబడదు.

> అయం తు పరమాణుకారణవాదో న కైశ్చిదపి శిష్టైః కేనచిద ప్యంశేన పరిగృహీతః ఇత్యత్యంతమే వానాదరణీయో వేదవాదిభిః.

(అయం ... వాదః=) వైశేషికులయొక్క యీపరమాణుకారణవాదము మాత్రము (కైశ్చిత్ ... శిష్టైః=) పెద్ద లగువారియెవరివలనను (కేన ... శేన=) ఏకొద్దియంశములోనైనను (న పరిగృహీతః=) నంగీకరింపఁబడియుండలేదు. (ఇతి=) కాఁబట్టి యీపరమాణుకారణవాదము (వేదవాదిభిః=) వేదమును గుర్తెఱింగిన యెవరికిని (అత్యంతమేవ=) నెంతమాత్రమును (అనాదరణీయః=) ఆదరణీయము గాదు.

I. (1) వైశేషికులు తమకణాదశాస్త్రము ననుసరించి ద్రవ్యగుణకర్మసామాన్యవిశేష సమవాయము లనెడి వేఱువేఱగు నాఱుపదార్థముల నంగీకరించుచున్నవారైనను, ద్రవ్యముతో మిగిలిన యైదుపదార్థములు సంబంధించియుండునని చెప్పుచున్నారు.

> అపిచ వైశేషికా స్తంత్రార్థభూతాన్ షట్పదార్థాన్ ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయాఖ్యా నత్యంతభిన్నాన్ భిన్నలక్షణా నభ్యుపగచ్ఛంతి.

(అపిచ=) మఱియును వైశేషికులు (తంత్రార్థభూతాన్=) వారికణాదశాస్త్రములో ముఖ్యవిషయములైన (ద్రవ్య ... యాఖ్యాన్=) ద్రవ్య - గుణ - కర్మ - సామాన్య - విశేష - సమవాయము లనెడి (షట్పదార్థాన్=) యీయాఱుపదార్థములను (categories) (అత్యంతభిన్నాన్=) ఒకదానితో నొకటి యేవిధమైనసంబంధము లేనివానిగా ... (యథా ... శశ ఇతి=) అనఁగా మనుష్యుఁడు - గుఱ్ఱము - కుందేలు - అనువానివలె (భిన్నలక్షణాన్=) భిన్నము లైనవానినిగాఁ (అభ్యుపగచ్ఛంతి=) జెప్పుచున్నారు.

తథాత్వం చాభ్యుపగమ్య తద్విరుద్ధం ద్రవ్యాధీనత్వం శేషాణా మభ్యుపగచ్ఛంతి.

(తథాత్వంచ=) ఆ యీయాఱుపదార్థములకు నట్టియన్యోన్యభేదమును (అభ్యుపగమ్య=) జెప్పుచున్నవారైనను (ద్రవ్యాధీనత్వం శేషాణాం=) ద్రవ్య మను పదార్థముతో మిగిలిన యైదుపదార్థములు సంబంధించియే యుండునని (తద్విరుద్ధం=) పైని జెప్పినదానికి విరుద్ధముగాఁ (అభ్యుపగచ్ఛంతి=) జెప్పుచున్నారు.
(2) ఆయాఱును నిజముగా వేఱు వేఱు పదార్థములే యైనచో ద్రవ్యముతో మిగిలినయైదును సంబంధించియుండునని జెప్పుటయు విరుద్ధమే.

ధర్మాంతరం త న్నోపపద్యతే.

(ధర్మాం .... ద్యతే=) అది సరి గాదు. అంతమాత్రముచేత నవి వేఱుపదార్థములు గాకపోవు.

యథా హి లోకే శశ, కుశ, పలాశప్రభృతీనా మత్యంతభిన్నానాం సతాం నేతరేతరాధీనత్వం భవతి.

(యథాహి=) ఎట్లనఁగా లోకమందు (శశ .... తీనాం=) జంతువులు, గడ్డి, చెట్లు మొదలగు (అన్యో ... సతాం=) నన్యోన్య భిన్నవస్తువులు (ఇతరేతరాధీనత్వం=) ఒకదానితో నొకటి సంబంధించి యుండునవిమాత్రము (న భవతి=) కాఁజాలవుగదా!

ఏవం ద్రవ్యాదీనా మ ప్యత్యంతభిన్నత్వా న్నైవ ద్రవ్యాధీనత్వం గుణాదీనాం భవితు మర్హతి.

(ఏవం=) అట్లే (ద్రవ్య ... నామపి=) ద్రవ్యాదిపదార్థము లాఱును (అత్యంతభిన్నత్వాత్=) ఒకదానితో నొకటి పూర్తిగా భిన్నము లైనందున (గుణాదీనాం=) ద్రవ్యముగాక మిగిలినగుణాదు లైన యైదుపదార్థములును (ద్రవ్యముగాక మిగిలినవి)

(ద్రవ్యాధీనత్వం =) ద్రవ్యముతో సంబంధించియుండుటకుఁగూడ (భవితుం + న + అర్హతి + ఏవ=) నవకాశము లేనే లేదు.

(2) ఒక వేళ వైశేషికులు వాదించురీతిగా ద్రవ్యముతో మిగిలినవైదును దప్పని సరిగా సంబంధించియుండుట నిజమే యైనచో మిగిలినవైదును వానికి స్వతంత్ర స్వరూపము లేక ద్రవ్యముయొక్క యాకారవిశేషములే యని చెప్పవలసివచ్చి సాంఖ్యులపరిణామవాదమునకే దిగును.

అథ చ భవతి ద్రవ్యాధీనత్వం గుణాదీనామ్.

(అథ =) ఒక వేళ (గుణాదీనాం =) గుణాదిపదార్థపంచకము (ద్రవ్యాధీనత్వం + భవతి=) (ద్రవ్యముతో సంబంధించిమాత్ర) ముండు ననుకొందము !

తతో ద్రవ్యభావే భావాత్ ద్రవ్యాభావే చాభావాత్.

(తతః=) అట్టిపక్షములో (ద్రవ్య .... భావాత్) గుణాదిపదార్థపంచకము ద్రవ్య మున్నచో నుండుట (ద్రవ్యా... అభావాత్ =) ద్రవ్యము లేకున్నచో లేక పోవుట కలుగును.

ద్రవ్యమేవ సంస్థానాది భేదా దనేకశబ్దప్రత్యయభా గ్భవతి.

(ద్రవ్యమేవ=) అప్పు డొక్క ద్రవ్యమే (సంస్థానాదిభేదాత్ =) దానియునికి భేదమువలన నేర్పడుభిన్నాకారములతో (అనేకశబ్ద...భాక్=) నాయా రకములకు సంబంధించినపేర్లనెడివిశేషములు కలదియే (భవతి=) యగును.

(అనఁగా - ఒక్కద్రవ్యమే దాని యాకారభేదములనుబట్టి వేఱు వేఱు పేర్లతోఁ బిల్వఁబడుచుండునని భావము)

యథా దేవదత్త ఏకఏవ స న్నవస్థాంతరయోగా దనేకశబ్దప్రత్యయభా గ్భవతి తద్వత్.

(యథా=) ఎట్లనఁగా. (దేవ ... ఏవసన్=) దేవదత్తుఁ డనుపురుషుఁ డొక్కఁడే యయ్యును. (అవస్థా ... యోగాత్ =) అనేకవేషములను బొందినవాఁ డగుచో (అనేక ... భాక్=) ఆయావేషములకుఁ దగినపేర్లు కలిగి భిన్నభిన్న వ్యవహారములు గలవాఁడై (భవతి=) యుండును. (తద్వత్ =) ద్రవ్యమునైత మల్లే యగుననని చెప్పవలసియుండును.

తథాసతి సాంఖ్యసిద్ధాంతప్రసంగ స్స్వసిద్ధాంతవిరోధ శ్చాపద్యేయాతామ్.

(తథాసతి=) అపక్షములో (సాంఖ్య ... ప్రసంగః ) సాంఖ్యసిద్ధాంతాను

సారి యైనపరిణామవాదమే ప్రాప్తించుటే గాక (స్వసి ... ధర్మే=) వైశేషిక సిద్ధాంతానుసారి యైనయారంభవాదముగూడ (ఆపద్యేయాతాం=) భంగపడిపోక తప్పదు

వైశేషికపూర్వపక్షము :—

(4) ధూమ మగ్నికంటె వేఱైనదేయై యగ్నితో సంబంధించియున్నట్లే ద్రవ్యముతో మిగిలినవైదును సంబంధించియుండఁగూడదా యని వైశేషికుఁడు ప్రశ్నింపవచ్చును.

నన్వగ్నే రన్యస్యాపి సతో ధూమ స్యాగ్న్యధీనత్వం దృశ్యతే.

(భిన్నవస్తువుల విషయములో నొకదానిని మఱియొకటి యాశ్రయించియుండఁ జాల దనుచో)

(అగ్నేః+అన్యస్య+అపి+సతః=) అగ్నికంటె వేఱైయున్న (ధూమస్య=) ధూమముసైతము (అగ్న్యధీనత్వం=) అగ్నితో సంబంధించియున్నట్లే (దృశ్యతే=) కనఁబడుచున్నదిగదా!

(5) ఎ) ధూమము - అగ్ని భిన్నములు గావున భిన్నములుగా గ్రహింపఁబడుటలో విపరీత మేమియును లేదు.

సిద్ధాంతి :—

సత్యం దృశ్యతే. భేదప్రతీతేస్తు తత్రాగ్నిధూమయో రన్యత్వం నిశ్చీయతే.

నిజమే యట్లే కనఁబడుచున్నది. (భేద ... తేస్తు=) కాని అగ్నియు, ధూమమును భిన్నములుగా గ్రహింపఁబడుటవలననే (తత్ర+అగ్ని ... అన్యత్వం=) ఆరెండును వేఱువేఱైన పదార్థములైనట్లు (నిశ్చీయతే=) నిశ్చయింపఁబడుచున్నది.

(5) బి) ద్రవ్యముగాక మిగిలినవైదింటిలో గుణమును దీసికొని చూతము. ధూమము - అగ్నివలె ద్రవ్యము - గుణము వేఱువేఱుగా గ్రహింపఁబడఁగలవా - అనఁగా - తెల్లబట్ట విషయములోఁ దెలుపు - బట్ట వేఱువేఱుగా గ్రహింపఁబడఁగలవా?

ఇహ తు శుక్లః కంబలో రోహిణీ ధేను ర్నీల ముత్పలమితి ద్రవ్యస్యైవ తస్య తస్య తేన తేన విశేషేణ ప్రతీయమానత్వా న్నైవ ద్రవ్యగుణయో రగ్నిధూమయోరివ భేదప్రతీతి రస్తి.

(ఇహాతు ) అట్లయినను ద్రవ్యగుణవిషయములలో మాత్రము - అనఁగా - (శుక్లః కంబళః=) తెల్లబట్ట (రోహిణీ ధేనుః=) ఎఱ్ఱయావు (నీల ముత్పలమితి=) నల్లకమలము - అన్నవ్యవహారము (ద్రవ్య ... షేణ=) ఆయాద్రవ్యము దాని దాని విశేషములచేతనే (ప్రతీ ... నత్వాత్= గ్రహింపఁబడుటవలన (అనఁగాఁ దెలుపును వదలి బట్టగాని - యెఱుపును వదలి యావుగాని - నలుపును వదలి కమలము గాని గ్రహింపఁబడక పోవుటవలన), (అగ్నిధూమయోరివ=) అగ్నిధూమముల విషయములోఁ దోఁచినట్లు (ద్రవ్యగుణయోః=) ద్రవ్యగుణములవిషయములో (భేద ప్రతీతిః + నైవాస్తి=) భేద మెంతమాత్రమును స్ఫురించుటయే లేదు సుమీ !

(సి) కాఁబట్టి గుణము ద్రవ్యముకంటె వేఱైనది గాక ద్రవ్యస్వరూపమే యైనట్లు నిశ్చయింపవలసియుండును.

తస్మా ద్ద్రవ్యాత్మక గుణస్య.

కాఁబట్టి గుణ మనఁగా (వేఱైనది గాక) ద్రవ్యస్వరూపమే యైనట్లు నిశ్చయ మగుచున్నది.

డి) ఆకారణమునుబట్టియే గుణ మెట్లు ద్రవ్యస్వరూపమే యని చెప్పవచ్చునో కర్మ - సామాన్య - విశేష - సమవాయములుసైతము ద్రవ్యస్వరూపములే యని చెప్పనగును.

ఏతేన కర్మసామాన్యవిశేషసమవాయానాం ద్రవ్యాత్మకతా వ్యాఖ్యాతా.

(ఏతేన=) ఈపై హేతువులచేతనే (ద్రవ్యముతో సంబంధించియుండునని చెప్పెడి) (కర్మ ... యానాం=) కర్మసామాన్యవిశేషసమవాయములు సైతము (ద్రవ్యాత్మకతా=) ద్రవ్యస్వరూపములే యైనట్లు (వ్యాఖ్యాతా=) నిశ్చయింపఁబడ వచ్చును.

II. ద్రవ్యగుణము లయుతసిద్ధములు - అనఁగా - ఒకదానినొకటి విడిచియుండఁ జాలనివిగాన నన్యోన్యసంబంధము గలవని చెప్పవలసివచ్చినంతమాత్రముచేత నా రెండును భిన్నపదార్థములు గాకపోవని చేయువాదము సరిగాదు.

ఎ) గుణాదీనాం ద్రవ్యాధీనత్వం ద్రవ్యగుణయో రయుతసిద్ధత్వాదితి య దుచ్యేత తత్పున రయుతసిద్ధత్వ మపృథగ్దేశత్వం వా స్యాత్.

బి) అపృథక్కాలత్వం వా అపృథక్స్వభావత్వం వా సర్వథాపి నోపపద్యతే.

(గుణా ... సత్వాత్=) గుణములు ద్రవ్యముతో సంబంధించియుండు నను

విషయము ద్రవ్యగుణములు భిన్నపదార్థము లైనప్పటికి (ద్రవ్యగుణ ... అయుత సిద్ధత్వాత్=) ద్రవ్యగుణము లొకదాని నొకటి విడిచియుండఁజాలనివై (అనఁగా– అయుతసిద్ధములై) యున్నందున (యద్యుచ్యేత=) అట్లు చెప్పఁబడుచున్నది–అని సమాధానము నీవు చెప్పుచో (తత్పునః=) మే మడుగునది యేమనఁగా నట్టియయుతత్వ మనుసంబంధ (మనఁగా గుణములు ద్రవ్యములనుండి విడిపోఁజాలకుండ సంబంధించియుండుట) నూహించుట ద్రవ్యగుణములు రెండును నొకదానితో నొకటి–

ఎ) అయుత ... దేశత్వం వా స్యాత్=) విడిపోకుండ నొకేస్థలములో నుండుట వలననా?

బి) (అపృథక్కాలత్వం వా=) లేక విడిపోకుండ నొకేకాలములో నుండుట వలననా?

సి) అపృథక్ ... వత్వం వా=) లేక విడిపోకుండ నొకేస్వభావము గలవియై యున్నందువలననా? చెప్పుము. (సర్వథా ... పద్యతే=) నీ వెట్లు చెప్పినను అయుత సిద్ధత్వము (అనఁగా ద్రవ్యగుణములు రెండును నొకదాని నొకటి విడిచియుండక పోవుట) నీవైశేషికసిద్ధాంతముల కనుకూలముగాఁ గుదురదు.

(ఈ మూఁడు విషయములను వేఱువేఱుగాఁ బరిశీలించి చూతము)

(1) ద్రవ్యగుణములు రెండును నొకేస్థలమం దుండుసంబంధముచేత నయుతసిద్ధములు గానోపవు. అట్లగునన్నచో వైశేషికసిద్ధాంతసూత్రములకు విరోధము.

అపృథగ్దేశత్వే తావత్ స్వాభ్యుపగమో విరుధ్యేత!

ఎ) (అపృథక్ ... తావత్=) ద్రవ్యగుణములు రెండును నొకదానితో నొకటి విడిపోకుండ నొకేస్థలములో నుండుట యనునది (స్వాభ్యుప .... విరుధ్యేత=) నీ వంగీకరించు వైశేషికసిద్ధాంతములకు (వై. సూ I. - 1 - 10 చూడుఁడు) విరోధించును సుమా!

కథమ్? తంత్వారబ్ధో హి పటః తంతుదేశోఽభ్యుపగమ్యతే నతు పటదేశః.

ఎట్లనఁగా ... (తంత్వా .... పటః=) దారములచే నేర్పడుబట్ట (తంతుదే .... గమ్యతే=) దారములను విడిచిపోకుండ దారము లున్నస్థలమందే యుండుననియు (నతు పటదేశః=) వేఱే మఱియొకస్థలమందలిబట్ట గా నేర దనియు,

పటస్య తు గుణాః శుక్లత్వాదయః పటదేశా అభ్యుపగమ్యంతే; న తంతుదేశాః

(పట ... గుణాః=) బట్టయొక్క (శుక్లత్వాదయః, తెలుపు మొదలగు గుణ

ములు (పట .... గమ్యంతే=) బట్టను విడిచిపోకుండ బట్ట యున్నస్థలమందే యుండు ననియు (న తంతుదేశాః=) వేజే మఱియొక స్థలమందలి దారములయందు నుండ నేరవనియు నీయభిప్రాయముగదా !

మీావైశేషికసూత్ర మెట్లున్నదో చూడుడు

'ద్రవ్యా ... గుణాంతరమ్' ఇతి. వై. సూ. I. – 1 – 10 'ద్రవ్యాణి ద్రవ్యాంతర మారభంతే గుణాశ్చ గుణాంతరమ్'

ద్రవ్యములైనదారములు మఱియొకద్రవ్యమైనబట్టను బుట్టించును. దారములయొక్క రంగులు వేఱొక (బట్ట) రంగును బుట్టించును–అని యెఱుంగునది.

తంతవో హి కారణద్రవ్యాణి కారణద్రవ్యం పట మారభంతే.

అనఁగా మీా యీా సిద్ధాంతసూత్రమునకు భావ మేమనఁగా ?

తంతవో హి కారణద్రవ్యాణి కారణద్రవ్యం పట మారభంతే.

(తంతవో .... ద్రవ్యాణి=) కారణద్రవ్యములైనదారములు (కార్య .... పటం=) కార్యద్రవ్యమైన (వేఱొక) బట్టను (ఆరభంతే=) బుట్టించును.

తంతుగతాశ్చ గుణా శ్శుక్లత్వాదయః కార్యద్రవ్యే పటే శుక్లత్వాదిగుణాంతర మారభంత ఇతిహి తేఽభ్యుపగచ్ఛంతి.

(తంతు .... దయః=) దారములయొక్క తెలుపు మొదలగు గుణములు (కార్య ... పటే=) కార్యద్రవ్యమైనబట్టయందు (శుక్ల ... భంతే=) తెలుపు మొదలగు వేఱొకగుణమును బుట్టించును. (ఇతి ... గచ్ఛంతి=) అని యీాసూత్రమునకు మీావైశేషికు లర్థమును జెప్పుచున్నారుగదా !

(అనఁగా గుణములైనదారము లొకస్థలమందును ద్రవ్యమైనబట్ట మఱియొక స్థలమందును నుండునట్లును గుణములైనదారములయొక్క రంగు వేఱొకస్థలమందును ద్రవ్యమైనబట్టయొక్కరంగు మఱియొకస్థలమందును నుండునట్లును వైశేషికసిద్ధాంతసూత్రమువలనఁ దేలుచున్నది.

సోఽభ్యుపగమో ద్రవ్యగుణయో రపృథగ్దేశత్వే ఽభ్యుపగమ్యమానే బాధ్యేత.

(సోఽభ్యుపగమః=) నీ వంగీకరించిన యీాసిద్ధాంతము (ద్రవ్య గుణయోః–) ద్రవ్యగుణములకు (అపృథగ్దేశత్వే=) నేకదేశవిషయమైన అయుత సిద్ధత్వము — అనఁగా ద్రవ్యగుణములు రెండును నొకదానితో నొకటి విడిపోకుండ నొకేస్థలమందే యుండు ననువిషయము (బాధ్యేత=) మీా సిద్ధాంతసూత్రమువలననే భంగపడిపోవుచున్నది.

2) ద్రవ్యగుణములు రెండును నొకేకాలమం దుండుసంబంధముచేత నయుత సిద్ధములు గానోవవు. అట్లగునన్నచో నావుయొక్క రెండుకొమ్ములు నయుత సిద్ధములే గావలసివచ్చును.

బి) అథాపృథక్కాలత్వ మయుతసిద్ధత్వ ముచ్యేత

బి) (అథ .... అయుతసిద్ధత్వం=) (సమవాయమునకు) అయుతసిద్ధత్వము (అపృథ ... చ్యేత=) అపృథక్కాలత్వ మనుచో — అనగా గాలహేతువుచే విడిపోకుండ నుండునది యని చెప్పచో — అనగా ద్రవ్యగుణములు రెండును నొకే కాలమందు విడిపోకుండ నుండుటవలన నయుతసిద్ధములని చెప్పుదుమన్నచో.

సవ్యదక్షిణయోరపి గోవిషాణయో రయుతసిద్ధత్వం ప్రసజ్యేత.

(సవ్య ... ణయోః=) ఆవుయొక్క యెడమ కుడికొమ్ములు రెండును నొక కాలమం దుండి విడిపోకుండ నున్నవిగావున (అయుత...సజ్యేత=) అవియు నయుత సిద్ధములే యని చెప్పవలసియుండును. అనగా నారెంటికి సమవాయసంబంధము (ఒకదానినుండి మఱియొకటి విడిపోనిసంబంధము) ఉన్నదని చెప్పవలసియుండును.

సమవాయసంబంధముచే రెండుకొమ్ములును గలిసియున్న వనుట విరుద్ధము— హాస్యాస్పదము గదా. అనగా గొమ్ములయం దపృథక్కాలత్వము (ఒకేకాలమందు రెండును నుండుట) ఉన్నను నయుతసిద్ధత్వము (సమవాయసంబంధముచే రెండును గట్టబడియుండుట) మాత్రము బొత్తుగా లేదు. అనగా రెండుకొమ్ములు నొకేకాల మం దున్నను నొకదానిని విడిచి మఱియొకటి యుండజాల దనుట సంభవింపదు.)

(3) ద్రవ్యగుణములు రెండును నొకేస్వభావముగలవనుసంబంధమునుబట్టి యయుత సిద్ధములు గానోవవు. అట్లగునన్నచో రెంటికిని దాదాత్మ్యమే సంభవించును.

సి) అపృథక్స్వభావత్వే త్వయుతసిద్ధత్వేన ద్రవ్యగుణయో రాత్మభేద స్సంభవతి తస్య తాదాత్మ్యేనైవ ప్రతీయమానత్వాత్.

సి) ద్రవ్యగుణయోః=) ద్రవ్యగుణములమధ్యనుండు (అయుతసిద్ధత్వే=) అయుత సిద్ధత్వ మనునది (Non-Seperation = విడిపోకుండుట) (అపృథ ... వత్వేతు=) అపృథక్స్వభావ మనుచో (అనగా రెండును నొకేస్వభావము గలవి యనుచో) (ఆత్మభేదః న సంభవతి=) ఆ ద్రవ్యగుణములు రెండును నొకే స్వభావములు గలిగి యారెంటిస్వరూపములకు భేద ముండుట తటస్థించదు. ఎందుచేతననగా (తస్య=) అప్పుడా గుణము (తాదాత్మ్యేనైవ=) ద్రవ్యముగానే (ప్రతీయమానత్వాత్=)

తెలియఁబడుచుండును. (అప్పు డపృథక్స్వభావత్వమనఁగాఁ దాదాత్మ్యము — అనఁగా న దే యిదిగా తెలియఁబడుట).

III. ద్రవ్యగుణములమధ్యఁ గార్యకారణములమధ్యన లెనే సమవాయసంబంధ మును జెప్పి యీరెండును నయుతసిద్ధములే యగునని చేయఁబడు వైశేషికుల సిద్ధాంతమున్నైతము సరిగాదు.

యుతసిద్ధయో స్సంబంధ స్సంయోగోఽయుతసిద్ధయోస్తు సమవాయ ఇత్యయ మభ్యుపగమో మృషైవ తేషాం, ప్రాక్సిద్ధస్య కార్యా త్కారణ స్యాయుతసిద్ధత్వానుపపత్తేః.

(యుతసిద్ధములనఁగా - విడిపోయి యుండఁదగిన రెండువస్తువులు - (any two seperate things) అయుతసిద్ధము లనఁగా విడిపోయి వేఱువేఱుగా నుండఁ జాలని వస్తువులు; ద్రవ్యగుణములవంటివి)

(యుత ... సంయోగః=) యుతసిద్ధవస్తువులమధ్య నుండుసంబంధము సంయోగమనియు, (అయుత .... సమవాయః=) అయుతసిద్ధవస్తువులమధ్య నుండు సంబంధము సమవాయ మనియు (ఇత్యయ...మృషైవ) చెప్పెడి వీరిసిద్ధాంతమున్నైత మెంతమాత్రము సరియైనది గాదు.

1) కార్యకారణములుగూడ నయుతసిద్ధములు గానేరవు. రెండును విడిపోయి యుండఁజాలనివియే యగుచోఁ గార్యము పుట్టకపూర్వము కారణ ముండుట లేదా!

(తేషాం ప్రాక్సిద్ధస్య=) కార్యకారణముల (బట్టదారముల) మధ్య నుండెడి సంబంధము సమవాయమని చెప్పుచున్నావుగావున (కార్య .... పత్తేః=) అవి రెండును - అనఁగాఁ గార్యకారణములు రెండును నయుతసిద్ధములు గావలెనుగదా! కార్యము పుట్టకపూర్వము కారణ మొకటి యుండునుగాని యాకారణము (దారములు) నకుఁ గార్యముతో (బట్టతో) విడిపోయియుండఁ జాలకపోవుట యెట్టిది? కార్య కారణము లయుతసిద్ధములని చెప్పుట సరి గాదు.

వైశేషికపూర్వపక్షము:—

2) కారణ మయుతసిద్ధ మని చెప్పుటకు వీలు లేకపోవచ్చునుగాని కార్యముమాత్ర మయుతసిద్ధమే యని చెప్పకతప్పదని వైశేషికుఁడు సమాధానము చెప్పునేమో.

(అథ=) మఱి యింకను

అథాన్యతరాపేక్ష ఏవాయ మభ్యుపగమ స్స్యా దయుతసిద్ధస్య కార్యస్య కారణేన సంబంధ స్సమవాయ ఇతి.

(అయుతసిద్ధస్య=) కార్యము కారణమునుండి (అనఁగా... బట్ట నూలునుండి వలె, విడిపోయియుండఁజాలనివిషయములోనే (అయుత ... సంబంధః=) యాకార్య కారణముల రెంటియొక్క సంబంధము (సమవాయః+ఇతి) సమవాయమని చెప్పఁ బడునుగావున కారణము కార్యము నుండి — అనఁగా (నూలు బట్టనుండివలె) విడిగా నుండుట సాధ్య మైనప్పటికిని గార్యముమాత్రము కారణముకంటె (బట్ట నూలుకంటెవలెనే) విడిగా నుండఁజాలదుగాఁబట్టి (అయం+అభ్యుపగమః=) మే మంగీకరించు నీసమవాయవిషయము — అనఁగా సమవాయమునకు సంబంధించిన మాసిద్ధాంతసూత్రము (వై. సూ. (అన్యతరాపేక్ష ఏవ=) కార్యకారణముల రెంటిలో ముఖ్యముగా (one of the two) నొకదానినే- అనఁగాఁ గార్యమునే యపేక్షించును.

(అనఁగా విడిపోయియుండఁజాలనిది కార్యమేగాని కారణము గాదుగావున నయుతసిద్ధ మనఁగా — ఒక కార్య మనియే యభిప్రాయ మైనందున వైశేషిక సూత్రముగూడఁ గార్యమునకే వర్తించును; గాని కారణమునకు వర్తింపకపోవచ్చు నని భావము).

సిద్ధాంతిసమాధానము :—

కి) అట్లగుచోఁ గార్యము పుట్టినతరువాత నొకక్షణకాలమువఱ కాకార్యమందుఁ గారణగుణములు సంక్రమింపవని వైశేషికులు చెప్పుచున్నందున నా క్షణకాల ములోఁ గార్యముమాత్ర మయుతసిద్ధ మగునని యెట్లు చెప్పవచ్చును?

ఏవమపి ప్రాగసిద్ధ స్యాలబ్ధాత్మకస్య కార్యస్య కారణేన సంబంధో నోపపద్యేత; ద్వయాయత్తత్వా త్సంబంధస్య.

(ఏవమపి=) నీవట్లనుకొన్నను (ద్వయా ... సంబంధస్య=) సమవాయసంబంధ మనఁగా రెంటిమీఁద నాధారపడియుండునది గావున, (అలబ్ధాత్మకస్య=) స్వరూప మున్నదియె లేక (ప్రాగసిద్ధస్య కార్యస్య=) ఇదివఱకుఁ గార్యముగా నేర్పడియుండని దానికి (కారణేన సంబంధః=) కారణముతో సంబంధ మున్నదని చెప్పుటయే (న+ఉపపద్యేత=) కుదురదు గాఁబట్టి .... ఆసమవాయసంబంధము (కారణముతోఁ గూడుకొని యున్నయొక) కార్యముతోమాత్రము సంబంధించియుండునని — అనఁగా నట్టి కార్యమును మాత్రమే ముఖ్యముగా నపేక్షించి యుండునని యెట్లు చెప్పఁగలవు? ఎందుచేతననఁగాఁ గార్యమునది యేర్పడఁగానే, దానియందుఁ

గారణగుణములు సంక్రమించ వనియును నొకక్షణకాల మైనపిమ్మటనే యవి దాని యందు అనఁగాఁ గారణమందు సంక్రమించుననియు నైయాయికులు చెప్పుదురు. కావున నాక్షణకాలములోఁ గార్య మనునది కారణమునుండి విడిపోకుండఁజాలని యయుతసిద్ధ మెట్లగునని భావము).

పూర్వపక్షి :—

4) ఆ క్షణకాల మైనపిమ్మటనే కార్య మయుతసిద్ధ మగునని వైశేషికుఁడు సమాధానము చెప్పుచో,

సిద్ధం భూత్వా సంబధ్యత ఇతిచేత్.

(సిద్ధంభూత్వా=) కార్యము పూర్తిగా నేర్పడిన పిమ్మటనే (అనఁగా నైయాయికులు చెప్పుక్షణకాల మైనపిమ్మటనే) (సంబధ్యతే=) ఆకార్యమునకును గారణమునకును (సమవాయ) సంబంధ మేల యేర్పడఁగూడదు (అనఁగా — ఆక్షణకాల మైనపిమ్మటనే కార్య మయుతసిద్ధమని యేల చెప్పఁగూడదని భావము).

సిద్ధాంతి :—

5) అట్లు చెప్పుచోఁ గార్యకారణములు రెండును నెప్పుడును నయుతసిద్ధములే యని చెప్పువైశేషికసిద్ధాంతమునకు మొదలంట ముప్పు వాటిల్లదా!

ప్రాక్కారణసంబంధాత్కార్యస్య సిద్ధా వభ్యుపగమ్యమానాయా మయుతసిద్ధ్యభావాత్.

(ప్రాక్కా ... బంధాత్=) (కార్యముతో) కారణసంబంధము గలుగక పూర్వమే (కార్యస్య సిద్ధౌ) కార్యము సిద్ధించును — అనఁగా నేర్పడును — అని నీవు (అభ్యుప ... నాయాం=) సిద్ధాంతీకరించియుండఁగా (అయుత ... భావాత్=) అట్టికార్యకారణములు రెండును అయుతసిద్ధములు (అనఁగా నొకదానిని విడిచి మఱియొకటి యుండఁజాలనివి) గానేరవుగదా!

6) కార్యకారణము లయుతసిద్ధములు కాకపోయినను సంయోగసంబంధముచేతఁ గలిసియుండునన్నచో రెంటిమధ్య సమవాయమే యుండునని చెప్పువైశేషికసిద్ధాంతము భంగపడిపోయినట్లేగదా.

కార్యకారణయో స్సంయోగవిభాగౌ న విద్యేతే ఇతీద ముక్తం దురుక్తం స్యాత్.

అయుతసిద్ధములు గాని (కార్యకారణయోః=) అట్టికార్యకారణములు (సంయోగవిభాగౌ=) సంయోగమును బొందఁదగినవి — అనఁగా — ఒకదానితో

మఱియొకటి గలియఁదగినవి-విభాగమును జెందఁదగినవి- అనఁగా -ఒకదానినుండి మఱియొకటి (సంయోగము లేనప్పుడు) విడిపోఁదగినవి (నవిద్యేతే+ఇతి) కావని (ఇదమ్+ఉక్తం=) నీవు చెప్పినట్టిది (మరుక్తం స్యాత్=) అపసిద్ధాంత మైయున్నది. (అనఁగా న యుతసిద్ధములు గాని ద్రవ్యములమధ్య వైశేషికసిద్ధాంతానుసారముగా నుండవలసినసంబంధము సంయోగమేగాని సమవాయము గాదు - అని భావము)

7) కార్యకారణములు రెండు నొకదానితో నొకటి చేర్చెడిక్రియ యనుసంబంధముచేతఁ గలిసియుండుటయే సంయోగమని వైశేషికుఁడు చెప్పునేమో! క్రియాసంబంధము లేనప్పుడుకూడఁ గార్యమునుబట్టి యాకాశాదులతో సంయోగసంబంధముండుట లేదా!

యథా చోత్పన్నమాత్రస్యాక్రియస్య కార్యద్రవ్యస్య విభుభి రాకాశాదిభి ర్ద్రవ్యాంతరై స్సంబంధ స్సంయోగ ఏవాభ్యుపగమ్యతే; న సమవాయః.

(క్రియవలనఁ గల్గిన సంబంధమే - అనఁగా నొకదానితో నొకటి చేర్చినప్పుడు వచ్చెడిసంబంధమే సంయోగ మందువేమో! అట్లనఁబోకుము).

(ఉత్పన్నమాత్రస్య=) పుట్టుకమాత్రమే గలిగిన (కార్యద్రవ్యస్య=) యొక్క కార్యద్రవ్యము (అక్రియస్య) ఏవిధముగానైనను గదలింపఁబడకుండ నున్నప్పుడును- అనఁగా మఱియొకదానితోఁ జేర్చవలసినక్రియ లేనప్పుడును (విభుభిః=) అంతటను వ్యాపించియున్న (ఆకాశాదిభిః ద్రవ్యాంతరైః=) యాకాశాదిద్రవ్యాంతరములతో (సంబంధః=) నంటియుండఁగా నాకార్యద్రవ్యమునకు నాకాశాదులకు మధ్య నుండెడి సంబంధమును (సంయోగ ... గమ్యతే=) సంయోగమని నీవు చెప్పుచున్నావుగాని (న యథా చ సమవాయః.) సమవాయమని నీవు చెప్పుట లేదుగదా!

(అనఁగా - క్రియాసంబంధము లేనప్పుడుకూడ సంయోగమనునది యుండనే యుండునని చెప్పకతప్పదని భావము.

8) కాఁబట్టి కార్యకారణములమధ్య నేదోయొకసంబంధ మున్నదనియే వాదించుచో నది - అనఁగా నాసంబంధము సంయోగమే కావలయునుగాని వైశేషికులు చెప్పుచొప్పున సమవాయ మెప్పటికిని గాఁజాలదు.

ఏవం కారణద్రవ్యేణాపి సంబంధ స్సంయోగ ఏవ స్యాత్ న సమవాయః.

(ఏవం=) అట్లె (పైని జూపఁబడినప్రకారము) (కారణ ... బంధః=) కారణద్రవ్యముతోఁ గార్యమునకుఁ గల్గినసంబంధమును (సంయోగఏవ స్యాత్=) సంయోగమే యని చెప్పవలయునుగాని, (న సమవాయః=) సమవాయమని నీవు చెప్పరాదు.

IV. రెండువస్తువులమధ్య నున్న దనెడిసంబంధమున కేపేరు పెట్టినను, నస లాసంబంధ మావస్తువులకంటె భిన్నమైనది గాదు.

నాపి సంయోగస్య సమవాయస్య వా సంబంధస్య సంబంధివ్యతిరేకే ణాస్తిత్వే కించి త్ప్రమాణ మస్తి.

(సంబంధస్య=) రెండువస్తువులమధ్య నున్న దనెడిసంబంధమునకు (సంయో... స్య వా=) సంయోగమని నీవు పేరుపెట్టినను, సమవాయమనిపేరుపెట్టినను (సంబం.... స్తిత్వే=) అస లాసంబంధము కలిసినయారెండువస్తువులకంటె వ్యతిరేక మైనదిగా నున్నదని చెప్పుటకు (కించిత్ప్రమాణమ్=) నీ కేొద్దిప్రమాణమైనను (నాప్య స్తి=) గలదా! (లేనే లేదని భావము).

పూర్వపక్షి :—

1) సంబంధము వస్తువులకన్న భిన్నమైనది గానిచో వస్తువున కున్నపేరే సంబంధ మునకుసైతముండవలయునుగాని, సంయోగమని, సమవాయమని వేఱుపేర్లేల వాడుకలో నుండవలయును ?

సంబంధిశబ్దప్రత్యయవ్యతిరేకేణ సంయోగసమవాయశబ్దప్రత్యయదర్శనా త్తయో రస్తిత్వ మితిచేత్.

(సంబంధి=) కలుపఁబడు రెండువస్తువులను (శబ్దప్రత్యయ) దెలుపుశబ్దముల కంటె (వ్యతిరేకేణ=) వేఱుగా సంబంధమును దెలుపు (సంయోగ ... దర్శనాత్ =) సంయోగ సమవాయశబ్దము లుండుచున్నందున (తయోః ... మితిచేత్) సంయోగ సమవాయసంబంధము లున్నవని యెంచవలసి వచ్చుచున్నది (ఏల యెంచఁగూడదు?)

సిద్ధాంతి :—

2) వస్తు వొక్కటియే యైనను నది యప్పుడప్పుడు పూనుస్వరూపములనుబట్టియు, బాహ్యరూపములతో దాని కున్నసంబంధమునుబట్టియు నాయొక్కవస్తువున కే వేఱు వేఱు పేర్లు వ్యవహారములో నుండవచ్చును.

న. ఏకత్వేఽపి స్వరూపబాహ్యరూపాపేక్షయా నేకశబ్దప్రత్యయదర్శనాత్.

(న=) అట్లనుటకు వీలు లేదు. (ఏకత్వేఽపి=) వస్తు వొక్కటియే యైనప్పటికి (స్వరూప ... క్షయా=) దానిస్వరూపముతోడను మఱియు దానిబాహ్యరూపము తోడను సంబంధపఱచుచో (అనేక ... నాత్ =) ఆయొక్కవస్తువే యనేకశబ్ద

ములతోడను మఱియు ననేక భావములతోడను గ్రహింపఁబడుచున్నట్లు చూచుచున్నాము

ఏ) తా నొక్కఁడే యనేక వేషములను బూనుచు వేఱు వేఱు పేర్లతోఁ బిల్వఁబడునట్టియుఁ, దా నొక్కఁడే యితరులతో నున్నసంబంధములనుబట్టి వేఱు వేఱు పేర్లతోఁ బిల్వఁబడునట్టియు మనుష్యుని యొక్క దృష్టాంతము.

> యథైకోఽపి సన్ దేవదత్తో లోకే స్వరూపం సంబంధిరూపం చాపేక్ష్యానేకశబ్దప్రత్యయభాగ్భవతి మనుష్యో బ్రాహ్మణః శ్రోత్రియో, వదాన్యో, బాలో, యువా, స్థవిరః, పితా, పుత్రః, పౌత్రో, భ్రాతా, జామాతేతి.

(యథా=) ఎట్లనఁగా, (ఏకోఽపి ... లోకే=) లోకమందు దేవదత్తుఁ డను మనుష్యుఁ డొకఁడే యైయుండియు (స్వరూ ... చాపేక్ష్య=) అతని కుండెడి స్వరూపభేదములతోడను, నతనికి సంబంధించియుండు బాహ్యవస్తువులభేదములతోడను జేర్చి చూచుపక్షమున నాయొక్క దేవదత్తుఁ డనువాఁడే (మనుష్యో ... జామాతేతి=) భిన్నభిన్నావస్థలలో మనుష్యుఁడనియు, బ్రాహ్మణుఁడనియు, శ్రోత్రియుఁ డనియు, దాత (=వదాన్యః) యనియు, బాలుఁడనియు, యువకుఁడనియు (=యువా) ముసలివాఁడనియు (స్థవిరః, నట్లే తండ్రి, కొడుకు, మనుమఁడు, సోదరుఁడు, అల్లుఁ డనియు (అనేకశబ్దప్రత్యయభాగ్భవతి=) వేఱు వేఱు పేర్లతోఁ బిల్వఁబడుచున్నాఁడు గదా!

బి) అది నిల్చియుండు స్థానములనుబట్టి వేఱు వేఱు విలువలను గల్గి వేఱు వేఱు పేర్లను గల్గియుండు నొకటే యను నంకెయొక్క దృష్టాంతము.

> యథా చైకాపి సతీ రేఖా స్థానాన్యత్వేన నివిశమానా ఏకదశశతసహస్రాదిశబ్దప్రత్యయభేద మనుభవతి.

(యథాచ=) మఱియొక దృష్టాంత మేమనఁగా — (ఏకాపి సతీ రేఖా=) సామాన్యముగా (ఒకటి యని తెలిపెడి) గీత యొకతీరు (=రీతి, దే యైనప్పటికి, (స్థానాన్యత్వేన నివిశమానా=) అది యుంచఁబడు స్థానవిశేషములనుబట్టి (ఏక ... మనుభవతి=) ఒకట్లను పదులను, నూర్లను, వేలను దెల్పు శబ్దభేదములను గలిగి యుండుచున్నదిగదా!

సి) వస్తువులమధ్య నున్న దనుసంబంధము ప్రత్యక్షముగాఁ గనిపించని వేఱొక వస్తు వనుటకంటెఁ బ్రత్యక్షముగాఁ గనిపించునావస్తువులరూపమే యనుటయే యుక్తము.

తథా సంబంధినో రేవ సంబంధిశబ్దప్రత్యయవ్యతిరేకేణ సంయోగసమవాయశబ్దప్రత్యయార్హత్వం న వ్యతిరిక్తవస్త్వస్తిత్వేన ఇత్యుపలబ్ధిలక్షణప్రాప్తస్యానుపలబ్ధే రభావో వస్త్వంతరస్య.

(తథా=) ఆ ప్రకారమే, (సంబంధినోః .... ఏవ=) కలుపఁబడు రెండు వస్తువులను దెలుపుశబ్దములకంటె (సంబంధి ... వ్యతిరేకేణ=) సంబంధించునట్టిసంయోగసమవాయశబ్దములు వేఱుగాఁ దోఁచుచున్నను (సంయోగ .... ర్హాత్వం=) ఈ సంయోగసమవాయశబ్దము లావస్తువులను దెల్పునవియేగాని (నవ్యతి ... స్తిత్వేన=) భిన్నములైనవస్తువులను దెల్పునవి గావునుమా

(ఇతి=) కాఁబట్టి (ఉపలబ్ధి ... ప్రాప్తస్య=) అదేవస్తువా, భిన్నవస్తువా యనుప్రశ్న వచ్చినప్పుడు గ్రహింపఁబడవలసినవస్తువు (సంయోగ లేక సమవాయ) కనఁబడువస్తువుకంటె (అనుపలబ్ధేః=) భిన్నముగా వేఱొకటి కనుపడనప్పుడు గ్రహింపఁబడవలసినవస్తువు కనుపడునట్టిదిగానే తీసికొనవలెనుగాని (అభావో .... రస్య=) వేఱొకటి లేదనియే తెలిసికొనవలెను.

౪) రెండువస్తువులమధ్య నున్న దనుసంబంధ మావస్తువులనేగాక వేఱొకవిషయమును దెల్పునది గాదుగావున నావస్తుసంబంధ మట్టివస్తువులకంటె భిన్నమైనది గాదని చెప్పుటయే సమంజసము.

నాపి సంబంధివిషయత్వే సంబంధశబ్దప్రత్యయయోః సంతతభావప్రసంగః.

(అపి=) మఱియును (సంబంధశబ్దప్రత్యయయోః=) రెండువస్తువులమధ్యనుండు సంబంధమును (అనఁగా సంయోగమునుగాని సమవాయమునుగాని) దెల్పుశబ్దము గాని, భావముగాని (సంబంధివిషయత్వే=) ఆరెండువస్తువులే విషయముగాఁ గలవి గావున – అనఁగా – ఆరెండువస్తువులనుగూర్చి తెలుపునవియే గావున (న+సంతత భావప్రసంగః=) అవియు – అనఁగా – ఆసమవాయసంయోగసంబంధము లనునవియును నావస్తువులతోఁ బాటు నిత్యములే యని యనఁగా నెడతెగకుండఁ బ్రత్యేకముగా నుండునవియే యని వారించుటకు వలనుగాదు.

స్వరూపబాహ్యరూపాపేక్షయే త్యుక్తోత్తరత్వాత్.

ఎందుచేననఁగాఁ గలుపఁబడువస్తు వొక్కటియే యైనప్పటికి (స్వరూపబాహ్యరూపాపేక్షయా+ఇతి) ఆయొక్కవస్తువే దానిస్వరూపముతోడను మఱియు దాని బాహ్యరూపముతోడను సంబంధి పఁజేసి చూచుచో నాయొక్కవస్తువే యనేకశబ్ద

ములతోడను మఱియు ననేకభావములతోడను గ్రహింపఁబడుచున్నట్లు చూచుచున్నామని (ఉక్తోత్తరత్వాత్=) యిదివఱకే సమాధానమును జెప్పియున్నాము. (అనఁగా - సమవాయసంయోగసంబంధము లనునవి ప్రత్యేకపదార్థములని చెప్పఁదగ దని భావము.)

5) పరమాణువు లాత్మతో నాసంయోగమును జెందుచో వానికిఁ బ్రవృత్తియు, మనస్సుతోఁ గలియుచో వానికిఁ దెలియఁబడుటయు సంభవించు ననువైశేషికుల సిద్ధాంతము సరిగాదు - నిరవయవము లైన రెండుపరమాణువులమధ్య నేసంబంధమును నెట్లుండఁజాలదని నిశ్చయింపఁబడినదో, నిరవయవము లైనయాత్మతోఁగాని మనస్సుతోఁగాని సంబంధ మట్లే యుండఁజాలదని నిశ్చయింపవచ్చును.

తథాణ్వాత్మమనసా మప్రదేశత్వా న్న సంయోగ స్సంభవతి.

(తథా=) రెండుపరమాణువులమధ్య సంయోగసమవాయసంబంధములు లనునవి లేవని (=ఉండఁజాలవని) యెట్లు నిరూపింపఁబడినదో యట్లే (అణ్వాత్మమనసాం=) అణువులు - ఆత్మ - మనస్సు అనునవిగూడ (అప్రదేశత్వాత్) పరమాణువులై నిరవయవములై యున్నందున వానిలో వానికిఁ బరస్పరము (సంయోగః=) సంయోగము - అనఁగాఁ గలయిక (న సంభవతి=) సంభవింపఁజాలదు.

ప్రదేశవతో ద్రవ్యస్య ప్రదేశవతా ద్రవ్యాంతరేణ సంయోగదర్శనాత్.

ఎందుచేతననఁగా, (ప్రదేశవతో ద్రవ్యస్య=) ప్రదేశము - అనఁగా - అవయవములు - అనఁగా భాగములు గల్గినద్రవ్యమునకే (వస్తువునకే) (ప్రదేశవతా ... ద్రవ్యాంతరేణ=) భాగములు గలిగిన మఱియొకద్రవ్యముతో (=వస్తువుతో) (సంయోగదర్శనాత్=) సంయోగము సంభవింపఁగలదని ప్రత్యక్షముగాఁ జూచుచున్నాముగదా. (అణువు లాత్మతో సంయోగమును జెందినప్పు డణువులకుఁ బ్రవృత్తి (అనఁగాఁ గదలిక) యేర్పడుననియు నణువులు మనస్సుతో సంయోగమును జెందినప్పు డణువులు గ్రహింపఁబడుననియు వైశేషికులు చెప్పుదురు. అణువుల కాత్మతోఁగాని మనస్సుతోఁగాని సంయోగమే సంభవము గాదని నిశ్చయ మగుచుండఁగా, వైశేషికుల సిద్ధాంతము భంగపడిపోవుచున్నదని భావము.)

6) నిరవయవవస్తువు లొకదానితో నొకటి సంబంధపడుట యసంభవముగాఁ దోఁచినను వాస్తవమునకు బరమాణువులు-ఆత్మ - మనస్సు పరస్పరము సంయోగమును జెంది ప్రవృత్తిగ్రహణవ్యవహారములు జరుగుచున్నవి; గాన, వానివానిమధ్య

నేదో సంయోగసంబంధ మున్నదని యేల కల్పించఁగూడదని వైశేషికుఁ డెదుర్కొన వచ్చును.

వైశేషికవాది :—

కల్పితాః ప్రదేశా అణ్వాత్మమనసాం భవిష్యంతీతిచేత్.

(అణువులకుఁ గదలికయును- దెలిసికొనఁబడుటయు- అనఁగా గ్రహణమును (ఉన్నవని స్థాపించుటకుఁగాను) (అణ్వాత్మమనసాం=)ఆయణువులకు- ఆత్మకు-మనస్సునకు (ప్రదేశాః=) అవయవములు - అనఁగా భాగములు (కల్పితాః- భవిష్యంతీతి చేత్=) ఉన్నట్లుగానే యేల కల్పింపఁగూడదు ?

వేదాంతి :—

7) వాస్తవమునకు లేని వస్తువు నున్నట్లుగాఁ గల్పింపఁబూనుచో, లేనివస్తువన్నియు నెంతెంతగా- నెట్లెట్లు కల్పింపఁబడఁగూడదు ? కల్పనకు హద్దేమి ! ఎవనిబుద్ధి కవసరమైనట్లు - అంతంతగాఁ గల్పించవచ్చును. అట్టి కల్పనలు వాస్తవము లగునా ?

న. అవిద్యమానార్థకల్పనాయాం సర్వార్థసిద్ధిప్రసంగాత్.

(న=) అట్లు కల్పించుట సముచితము గాదు. ఏలయన, (అవిద్యమానార్థకల్పనాయాం =) వాస్తవమునకు లేనివస్తువులనే యున్నట్లుగాఁ గల్పింపఁబూనుచో, (సర్వార్థసిద్ధిప్రసంగాత్ =) ఏది యెట్లు సిద్ధాంతముచేయవలెనని యనుకొందుమో, యాసమస్త మట్లె సిద్ధాంతముచేయవచ్చును. (అపసిద్ధాంతములపోషణమునకై యవసరము లగుకల్పనములను జేసి సిద్ధాంతములుగాఁ జూపించవచ్చుననియు — అవి యంగీకరింపఁదగినవిగా నుండనోపవనియు భావము)

ఇయానేవావిద్యమానో విరుద్ధోఽవిరుద్ధో వాఽర్థః కల్పనీయో, నాతోఽధిక ఇతి నియమే హేత్వభావాత్,

(లేనివిషయములను గల్పించుటయే పనిగాఁ బెట్టుకొన్నచో)(అవిద్యమానః+ అర్థః=) వాస్తవమునకు లేనివిషయమును — (విరుద్ధోఽవిరుద్ధో వా) అది విరుద్ధమైనదిగానీ- అవిరుద్ధమైనదిగాని—అనఁగా నదిసముచితమైన దైననుసరే లేక కానిదైననుసరే - (ఇయాన్ + ఏవ + కల్పనీయః=) ఇంతవఱకుమాత్రమే కల్పించవలసియుండునని యు (అతః + అధికః + న + ఇతి= ఇంతకుఁబైన నెక్కువకల్పన గూడదని యు (నియమే హేత్వభావాత్ =) నియమ మేర్పఱచుటకుఁ గారణ ముండఁజాలదు.

కల్పనాయాశ్చ స్వాయత్తత్వాత్.

ఎందుచేతననఁగా (కల్పనాయాశ్చ=) కల్పనయనునది (స్వాయత్తత్వాత్=) తనబుద్ధివిశేషమునుబట్టి యుండునదియే. ఎట్లనఁగా

ప్రభూతత్వసంభవాచ్చ.

ఎంతగాఁ గావలయునని కోరుచో (ప్రభూ ... వాచ్చ=) నంతటిపెద్ద (మితిలేని) కల్పనచేయుటకే యవకాశ ముండకపోదు. (ఇంతకు మించి కల్పన చేయఁ గూడ దనుహద్దుగీత గీసియుండదని భావము )

8) అంతయు శాస్త్రమున కేదార్థమైనను వైశేషికుఁ డాఱుపదార్థము లున్నట్లుగాఁ గల్పించినట్లే – మఱియొకఁడు నూఱుపదార్థము లున్నట్లు గాను వేఱొకఁడు వేయిపదార్థము లున్నట్లుగాను నేల కల్పించఁగూడదు?

నచ వైశేషికైః కల్పితేభ్య షడ్భ్యః పదార్థేభ్యోఽన్యేఽధికాః శతం సహస్రం వాఽర్థా న కల్పయితవ్యా ఇతి నివారకో హేతు రస్తి?

(లేనివస్తువులను గల్పించుటకే యవకాశ మిచ్చుపక్షమున) (వైశే ... ర్థేభ్యః =) వైశేషికులచేతఁ గల్పించఁబడిన ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయము లనెడియాఱుపదార్థములనే గాదు, (అన్యేఽధికాః =) మఱియు నంతకు హెచ్చుగానే (శతం సహస్రంవా=) నూఱుపదార్థములు గలవనియో లేక వేయి పదార్థములు గలవనియో (న కల్పయితవ్యా+ఇతి =) కల్పింపఁగూడ దని– (నివారకో హేతుః+అస్తి=) అడ్డురాఁదగినకారణ మేమియు నుండఁజాలదు.

తస్మా ద్యస్మై యస్మై య ద్య ద్రోచతే, త త్త త్సిద్ధ్యేత్.

(తస్మాత్=) కాఁబట్టి (యస్మై ....రోచతే=) యెవనెవని కేదేది యెంతెంత రుచించునో (త త్తత్సిద్ధ్యేత్=) వానివాని కంతంత (కల్పనామూలమున) లభించుచునే యుండును.

(9) దుఃఖభూయిష్ఠమైనయీసంసారమునం దొకఁడు విసివివేసారి యది లేకపోవుఁగాక యని కల్పించవచ్చును. దానితోఁ బ్రయోజన మేమి?

కశ్చి త్కృపాలుః ప్రాణినాం దుఃఖబహుళ స్సంసారఏవ 'మాభూ' దితి కల్పయేత్.

(కశ్చిత్కృపాలుః=) ఎవఁడైన నొకజాలిగ్రేవులవాఁడు ('ప్రాణినాం) ప్రాణులకు (దుఃఖబహుళః) దుఃఖభూయిష్ఠమైన (సంసారః+ఏవ) యీరాకపోకలు గల

జన్మమరణాదిసంసారమే (మాభూదితి కల్పయేత్ =) లేకుండఁబోవుఁగాక - అనఁగా సంసార మన్నదియే లేదు- అని (వానిబుద్ధ్యనుసారము) కల్పించవచ్చును.

10) 'సంసారము పోనేపోదు- ఎప్పుడును దుఃఖమే యుండును' అని తలఁచు వాఁడు ముక్తి యన్నది లేనే లేదని కల్పించవచ్చును. దీనితోఁ బ్రయోజన మేమి! కల్పన లెప్పటికిని సరిగావు.

అన్యో వా వ్యసనీ ముక్తానామపి పునరుత్పత్తిం కల్పయేత్.

( అన్యోవా = ) మఱియొకఁడు (వ్యసనీ=) ఎప్పుడు నోగు లోడ్చువాఁడు (=దుఃఖమే శాశ్వత మనుకొనువాఁడు) (ముక్తానామపి=) జ్ఞానముచే ముక్తిని జెందినవారునైతము (పునరుత్పత్తిం=) మరల దుఃఖబహుళజన్మమరణాదిసంసార మును బొందకపోరని (కల్పయేత్ =) (తనబుద్ధ్యనుసారము) కల్పించవచ్చును.

క స్తయో ర్నివారక స్స్యాత్ ?

(తయోః=) వారిద్దఱిని (కః=) ఎవఁడు (నివారక స్స్యాత్ =) వారింపఁగలఁడు!

V రెండురెండుపరమాణువులు గలిసి మొదట ద్వ్యణుకములుగా నేర్పడి యాద్వ్యణుకములవలననే జగత్సృష్టి యగుచున్నదనెడి వైశేషికులసిద్ధాంతమునకు మొదటికే మోసమువచ్చినది చూడుఁడు - పరమాణువులు నిరవయవములని వా రంగీకరించుచుండఁగా నట్టిపరమాణువులు రెండు మొదలు ద్వ్యణుకముగ నేర్పడుట సంభవింపదు.

కించాన్య ద్ద్వాభ్యాం పరమాణుభ్యాం నిరవయవాభ్యాం సావయవస్య ద్వ్యణుక స్యాకాశేనేవ సంశ్లేషానుపపత్తిః.

(కించ + అన్యత్ =) వైశేషికమతసిద్ధాంతములో మఱియొకదోషమునైతము గలదు చూడుఁడు. (సావయ ... కస్య=) భాగములు గల్గినద్వ్యణుకమునకు (ఆకాశేన + ఇవ=) భాగములులేని యాకాశముతో నెట్లు కలయిక కుదురదో యట్లే (ద్వాభ్యాం ... వాభ్యాం =) భాగములు లేనిరెండు పరమాణువులతోనైతము (సంశ్లేషానుపప త్తిః= కలయిక కుదురదు.

సంశ్లేషమును = కలయికను జెందురెండుద్రవ్యములును సావయవములు- అనఁగా భాగములు గలవి యైనఁగాని యారెంటికిని సంశ్లేషము=కలయిక సంభవింప నేరదు_అనిభావము. ఈభావమునే దృష్టాంతముతోఁ జూపుచున్నాఁడు-చూడుఁడు.

1) అవయవములు గలవార్నీసునకును, గట్టకును సంశ్లేషము – అనఁగాఁ గలయిక గుదిరిన ట్లవయవములు లేనిపరమాణువులు రెంటికిఁ గలయిక యెప్పటికిని గుదురనేరదు.

న హ్యాకాశస్య పృథివ్యాదీనాం చ జతుకాష్ఠవ త్సంశ్లేషోఽస్తి.

(జతుకాష్ఠవత్ =) సావయవము లైన- అనఁగా భాగములతోఁగూడిన (జతు) లక్కకును (=కాష్ఠ) గట్టకును సంశ్లేషము గుదిరినట్లుగా, (ఆకాశస్య=) భాగములు అవయవములు లేనియాకాశమునకును (పృథివ్యాదీనాం =) భాగములు గల్గిన పృథివ్యాదులకును గలయిక గుదురనేరదు. పృథివ్యాప స్తేజోవాయువు లనెడినాల్గు భూతములకును (నహి+ సంశ్లేషోఽస్తి=) సంశ్లేష ( = కలయిక ) మెన్నటికిని గుదురదుగదా

(ఒక్కయాకాశమే నిరవయవమనియుఁ దక్కిననాల్గుభూతములును సావయవము లనియు వైశేషికులు చెప్పుదురు.

2) కారణపరమాణువులకును - గార్యద్వ్యణుకమునకును నడుమ నాశ్రితాశ్రయసంబంధము లేదని యెవఁడు త్రోసి వేయఁగలఁడు ? ఆసంబంధమునే సమవాయమని చెప్పుటలో దోష మేమి ? అని వైశేషికుఁడు ప్రశ్నించవచ్చును.

వైశేషికపూర్వపక్షి :—

కార్యకారణద్రవ్యయో రాశ్రితాశ్రయభావోఽన్యథా నోపపద్యత ఇత్యవశ్యం కల్ప్య స్సమవాయ ఇతిచేత్.

(కార్య ... వ్యయోః=) పరమాణువులయొక్క కలయికచేత నేర్పడినద్వ్యణుకాదికార్యమునకును, గారణము లైనయాపరమాణువులకును (ఆశ్రితాశ్రయభావః=) ఒకదాని నొకటి యాశ్రయించుకొనియున్న సంబంధము (అన్యథా నోపపద్యతే=) లేదని త్రోసివేయుట కెట్లును సాధ్యము గాదుగదా)- అట్టిసంబంధమునే సమవాయః+ ఇతి=) సమవాయమని (అవశ్యం కల్ప్యః=) మేము చెప్పుటలో దోషమేమి ? (అనఁగాఁ గార్యకారణములమధ్య సమవాయసంబంధ మొప్పుకొనితీరవలసినదే. అట్లుకానిచో వానిమధ్య ప్రత్యక్షముగాఁ గనుపడుచున్న యాశ్రితాశ్రయభావమును సమర్థించుట కవకాశమే లేదు — అని భావము.

3) రెండుభిన్నవస్తువులమధ్యనే యుండునాశ్రితాశ్రయసంబంధము కార్యకారణముల మధ్య నున్నట్లుగా వైశేషికుఁ డొప్పుకొన్నచో నన్యోన్యాశ్రయత్వ

దోషముచే వానిసిద్ధాంతము మొదటికే భంగము కల్గును కార్యకారణములు భిన్నములని మొదట స్పష్టపడినప్పుడుగదా వా రాసంబంధమును జెప్పనోప్పును

న - ఇతరేతరాశ్రియత్వాత్.

(న=) అట్లు చెప్పుట సాధ్యపడదు. (ఇత ... త్వాత్=) అట్లుచెప్పినచో నన్యోన్యాశ్రయదోషము పట్టి మీాసిద్ధాంతము భంగపడిపోవును. అది యెట్లనగా:—

కార్యకారణయోర్హి భేదసిద్ధా వాశ్రితాశ్రయభావసిద్ధిః రాశ్రితాశ్రియభావసిద్ధౌ చ తయో ర్భేద సిద్ధిః; కుండబదరవ దితీతరేతరాశ్రయతా స్యాత్.

(కార్య ... భావసిద్ధిః=)

కార్యకారణములు రెండును భిన్నములని నిర్ధారణ మైనప్పుడే యాశ్రితాశ్రియభావము నిర్ధారణ మగును. (ఆశ్రితా ... భేదసిద్ధిః=) ఆశ్రితాశ్రియభావము నిర్ధారణ మైనప్పుడే కార్యకారణములు రెండును భిన్నములని నిర్ధారణ మగును. (కుండ ... స్యాత్=) కార్యకారణములు రెండును భిన్నములగుచో నారెంటికిని గుండబదరములకువలె (=కుండకు రేగికాయకువలె) అన్యోన్యాశ్రియత్వము కలదని చెప్పవచ్చును. (కుండయు రేగికాయయు వేఱువేఱైన వైనప్పుడేగదా - కుండలోనున్న రేగికాయ - రేగికాయ యున్నకుండ యని యన్యోన్యాశ్రయముగాఁ జెప్పఁబడును. రెండును నొకటే యగుచో నన్యోన్యాశ్రియము చెప్పఁబడనేరదు.)

4) (ఎ) వేదాంతులన్ననో కార్యకారణములు భిన్నము లనియు నొప్పుకొనరు. వానిమధ్య నాశ్రితాశ్రియభావ మున్నదనియు నొప్పుకొనరు

న వా కార్యకారణయో ర్భేద ఆశ్రితాశ్రయభావో వేదాంతవాదిభి రభ్యుపగమ్యతే.

(కార్య .... భేదః) కార్యకారణములు భిన్నములనిగాని (ఆశ్రి ... భావః=) కార్యకారణములమధ్య నాశ్రితాశ్రియభావ మున్నదనిగాని (వేదాంతవాదిభిః=) వేదాంతవాదులు (నహి + అభ్యుపగమ్యతే=) ఒప్పుకొనరు.

బి) కార్య మనఁగాఁ గారణముయొక్క యాకారభేదమే యని వేదాంతులు చెప్పుదురు.

కారణస్యైవ సంస్థానమాత్రం కార్య మిత్యభ్యుపగమాత్.

వారు చెప్పునది యేమనఁగా (కార్యం=) కార్య మనునది (కారణస్య=) కారణముయొక్క (సంస్థానమాత్రం + ఏవ + ఇతి=) యాకారవిశేషమే యని (అభ్యుపగమాత్=) వేదాంతులు చెప్పుదురు.

(కార్యము కారణముయొక్క యాకారవిశేషమే యనఁగా రెండును భిన్నములు గాక యొక్కటే యగును. అవి రెండును నొక్కటే యగుచో వానిమధ్య సమవాయసంబంధ మున్నదనిగాని యాశ్రితాశ్రియభావ మున్నదనిగాని చెప్ప నవసరము లేదు. అట్టిసంబంధ మసంభవ మనియు భావము)

VI. పరిచ్ఛిన్నమే యని వైశేషికులొప్పుకొనుపరమాణువు కొంతప్రదేశములో నుండునదియేగావునను దిక్కు లెన్ని యున్నవందుమో యన్నిదిక్కులకును వ్యాపించి యన్నికోణములుగా నుండవలసియున్నందున నాకారణము లన్నియు ను నవయవము లే యగును కావున నవయవములు గలిగియున్నపరమాణువులే నిత్యమని చెప్పవలసి వచ్చి వారిసిద్ధాంతభంగము వాటిల్లును.

కిం చాన్యత్ పరమాణూనాం పరిచ్ఛిన్నత్వాత్ యావత్యో దిశః షడష్టౌ దశ వా తావద్భి రవయవైః స్సావయవా స్తే స్యుః.

(కించ + అన్యత్ =) మఱియింకొకవిధమునఁగూడ వైశేషికసిద్ధాంతము సరిగాదు. అది యెట్లన — (పరమా ... న్నత్వాత్ =) పరమాణువులు పరిచ్ఛిన్నములు (limited in space) గావున – అనఁగా – అవి యనంతపరిమాణములు గలవి కావు; గావున – అనఁగా నవి యెక్కడనైనను గొంతప్రదేశ మాక్రమింపఁ గలవియే గావున (యావత్యో దిశః =) ఎన్నిదిక్కులు గల వందుమో (షట్ + అష్టౌ + దశ వా) అనఁగా నాదిక్కు లాఱుగాని, యెన్మిదిగాని, లేక పదిగాని యెన్ని గల వందుమో (తావద్భిః + అవయవైః =) అన్నియవయవములతోఁగూడి (తే =) ఆపరమాణువులున్నైతము (సావయవాః + స్యుః =) అవయవములు గలవియే యగుచున్నవి (అనఁగా బరిచ్ఛిన్నమని యొప్పుకొనఁబడుపరమాణు వేప్రదేశమందైనను నున్నప్పు డెన్ని దిక్కులు గలవో యన్నిదిక్కులవైపునకును నాప్రదేశములో నది యాక్రమించి యన్నికోణములు గలదియే యగుచున్నదని - భావము).

సావయవత్వా దనిత్యాశ్చేతి నిత్యత్వనిరవయవత్వాభ్యుపగమో బాధ్యేత.

(సావయవత్వాత్ =) ఎన్నిదిక్కులు గలవో యన్నిదిక్కులకు వ్యాపించి యన్నికోణములు- అనఁగా నన్నియవయవములు పరమాణువులు గల వగుచుండఁగా (అనిత్యాశ్చ =) ఆపరమాణువు లనిత్యములనియే చెప్పవలసివచ్చును (ఇతి =) కాఁబట్టి యట్టిసందర్భములో (నిత్యత్వ .... పగమః =) పరమాణువులు నిత్యము లనియు, నిరవయవము లనియుఁ జెప్పెడి వైశేషికసిద్ధాంతము (బాధ్యేత =) భంగపడిపోవుచున్నది.

1) పరమాణువున కవయవము లేర్పడునని యాక్షేపించుచో నిఁకముందు నంత ర్భాగములుగాఁ జీలిపోఁజాలనియవయవములనే వైశేషికులు పరమాణువులని చెప్పుచు రన్నచో—

వైశేషికపూర్వపక్షి :—

యాం స్త్వం దిగ్భేదభేదినోఽవయవాన్ కల్పయసి తఏవ మమ పరమాణవ ఇతిచేత్.

(త్వం=) వేదాంతివైన నీవు (యాన్...దిగ్భే ... కల్పయసి=) ఎన్నిదిక్కుల వైపునకుఁ బరమాణువు వ్యాపింపఁగలదో యన్నికోణములు-అనఁగా నన్నియవయవములు పరమాణువునకుఁ గలవని (త్వం=) వేదాంతివైననీవు కల్పించు (ఆక్షేపించు) చున్నావో (ఇఁక నంతకంటె నంతర్భాగములుగా విడిపోఁజాలనియట్టి యవయవములనే (మమ పరమాణవః + ఇతి + చేత్=) మేము పరమాణువులని చెప్పుదుము సుమా — ఇఁక నీ వేమి చెప్పుదువు ?

2) అవయవములుగాఁ దేలుట యేహద్దున నాగిపోవునని వైశేషికుఁడు చెప్పఁగలఁడు ? అన్నివస్తువులకు నొకటియే యైనమూలకారణమునొద్దకుఁ బోయినప్పుడు గాని యంతర్భాగము లగుట యాగిపోఁజాలదనియు, నామూలకారణమే పరబ్రహ్మ మగునియు వేదాంతి సమాధానము చెప్పుచున్నాఁడు.

సిద్ధాంతి :—

న స్థూలసూక్ష్మతారతమ్యక్రమే ణాపరమకారణా ద్వినాశోపపత్తేః.

(న=) నీవు చెప్పినట్లు మే మొప్పుకొనము — అనఁగాఁ బరమాణువుయొక్క పరిమాణము నీవు చెప్పినహద్దున నాగిపోదు. (స్థూల ... క్రమేణ=) అన్నివస్తువులు — అనఁగా నేవస్తువైననుసరే యేయాకారములో నున్నదైననుసరే స్థూలము నుండి సూక్ష్మమునకుఁ బోవుచున్నకొలఁది (అపరమకారణమే) పోఁగాఁబోఁగాఁ దుట్టతుదకు దానియత్యంతసూక్ష్మతను (=పరమ) గారణమును జేరువఱకు — అనఁగా — అన్నింటికి మూలకారణ మైనపరబ్రహ్మమును జేరువఱకు నాయా వస్తువు (దానిదానియాకారము) వినాశమును జెందుట కవకాశ మున్నదని యెఱుంగునది. (అనఁగా నేవస్తువునకైనను మూలకారణము వైశేషికులు చెప్పుప్రకారము పరమాణువు గానేరదు. పరబ్రహ్మమే యగునని యెఱుంగునది.) (యథా) అది యెట్లో మఱింత వివరించి చెప్పెదము చూడుఁడు.

యథా పృథివీ ద్వ్యణుకాద్యపేక్షయా స్థూలతమా వస్తుభూతాపి వినశ్యతి తత స్సూక్ష్మం సూక్ష్మతరం చ పృథివ్యేకజాతీయకం వినశ్యతి; తతో ద్వ్యణుకం; తథా పరమాణవోఽపి పృథివ్యేక జాతీయకత్వా ద్వినశ్యేయుః.

(రెండు పరమాణువులు కలిసి ద్వ్యణుకముగా, ద్వ్యణుకము లనేకము లనేకములుగాఁ గలియుచుఁ దుదకుఁ బృథివిగా నేర్పడినదని వైశేషికులు చెప్పుచున్నారు గదా) (పృథివీ ... భూతాపి) ద్వ్యణుకముతోఁ బోల్చిచూచుకొన్నచోఁ బృథివి యనుభూతము మిక్కిలిస్థూలమైనదైనను నాపృథివీభూతమునకు సంబంధించిన యంతర్భాగములలోనికి నాపృథివీభూతము (వినశ్యతి=) నష్టమైపోవుననియు, (తతః=) పిమ్మట (సూక్ష్మం .... వినశ్యతి=) పృథివికి సంబంధించిన యాయాయంతర్భాగములొక్కొక్కటి యంతకంటెఁ జిన్నచిన్నయంతర్భాగములుగాను, బోను బోను నాపృథివికి సంబంధించిన మఱిమఱి చిన్నచిన్నయంతర్భాగములుగాను నష్టమైపోవుచుండుననియు (తతో ద్వ్యణుకం) ఆయొక్కొక్క చిన్నచిన్న యంతర్భాగముగూడఁ బృథివికి సంబంధించిన ద్వ్యణుకములుగాను నొక్కొక్కద్వ్యణుకము పృథివికి సంబంధించిన పరమాణువులుగాను వినాశము జెందుచుండుననియు జెప్పుచున్నారు గదా (తథా=) అట్లే (పరమాణవోఽపి=) ఆయొక్కొక్క పరమాణువునైతము (పృథి ... త్వాత్=) పృథివీభూతమునకు సంబంధించినది యగుటవలన (వినశ్యేయుః=) నశించియే పోవును. (పృథివికి సంబంధించినభాగము లన్నియుఁ జిన్నచిన్నవిగా నశించిపోవుచున్నప్పుడు, చిన్నభాగమైన పరమాణువునైతము నశించిపోవునదియే యని యేల చెప్పఁగూడదని భావము)

VII. పరమాణువులుగాఁ జీలిపోవుచుండుటవలనఁ బృథివ్యాదిభూతములు పూర్తిగా నశించిపోఁజాలవనియుఁ దుట్టతుదిగఁ జీలిపోయి యాభూతమునకు సంబంధించిన పరమాణువే నిత్యమై యుండుననియు వైశేషికుఁడు చెప్పుచో—

వైశేషికపూర్వపక్షి :—

వినశ్యంతోఽప్యవయవవిభాగేనైవ వినశ్యంతీతి చేత్.

(వినశ్యంతోఽపి=) పృథివీభూతభాగములు నశించిపోవుచున్నవైనను (అవయవ ... చేత్=) ఏయే చిన్నచిన్నభాగము లవయవములుగాఁ గలిసి పెద్దపెద్ద భాగములుగా నేర్పడుచున్నవో యాచిన్నచిన్న యవయవములుగాఁ జీలిపోవుట మూలముగా మాత్రమే నష్టమైపోవుచున్నదని యేల యనగాదు? (అనఁగా నంతెంతవఱకవయవవిభాగము గాఁగలదో యంతంతవఱకే నష్టమైపోఁగలదుగావున

నాశనష్టమైపోవుట తుట్టతుది చిన్నయవయవమైన పరమాణువుతో నిల్చిపోవును గాని పరమాణువుమాత్రి మంతర్భాగములుగా నష్టమైపోవుట కవకాశము లేదని భావము.

1) వస్తువునకు వినాశము గల్గుట పరమాణువులలోనికి జీలిపోవుటవంటిది గాదనియు, బేరిననేయి నిప్పుసెగచేత ద్రవరూప మగుటవంటిది - అనగా నాకారములో మార్పు చెందుటవంటిదేయని వేదాంతియొక్క సమాధానమని యెఱుంగునది.

నాయం దోషః యతో ఘృతకాఠిన్యవిలయనవదపి వినాశోపపత్తి మవోచామ.

సిద్ధాంతి :—

(నాయం దోషః=) ఇది యొకసమాధానము లేని గడ్డువిషయము గాదు. (యతః=) ఎందుచేననగా (వినాశోపపత్తిః=) ఎంతటివస్తువైనను నష్టమైపోవుచుండు విషయము (ఘృత ... దపి=) నేతియొక్క బిఱుసుదనము నష్టమై పోవుటవంటిదే యని (అవోచామ=) యిదివఱకే చెప్పియున్నాముగదా!

యథాహి ఘృతసువర్ణాదీనా మవిభజ్యమానావయవానా మప్యగ్నిసంయోగా ద్ద్రవభావాపత్త్యా కాఠిన్యవినాశో భవతి.

(యథాహి=) అది యెట్లనగా (ఘృత ... దీనాం=) నేయి, బంగారము మొదలగువస్తువులు (అవిభజ్య ... నామపి=) వానివాని యంతర్భాగములుగా నుండునవయవములలోనికి విడిపోనప్పటికి (అగ్నిసంయోగాత్ =) నిప్పుసెగయొక్క తాకుడుచేత (ద్రవభావాపత్త్యా=) ద్రవాకారమును (పల్చనిరూపమును) బొందుట మూలముగా (కాఠిన్య .... భవతి=) వానివాని కాఠిన్యయుతాకారమును (=గట్టితనము గలరూపమును) గోల్పోవుచున్నవి.

(అసలు వస్తుస్వరూపమునకు మొదలంట నాశనము లేకుండ మొదటి యాకారముమాత్రము భంగము జెందుచున్నదని భావము).

2) ఆతీరుగానే వైశేషికుడు పరమాణు వనుకొన్నదిగూడ దానియొక్క యత్యంతమైనమూలకారణము (పరబ్రహ్మము)లోనికి మాఱి దానిమొదటిమూర్తికి మాత్రమే భంగము గలుగునుగాని యస లెప్పటికిని జెడిపోదు.

ఏవం పరమాణూనామపి పరమకారణభావాపత్త్యా మూర్త్యాదివినాశో భవిష్యతి.

(ఏవం=) ఈతీరుగానే (పరమాణూనామపి=) వైశేషికులు పరమాణువు లను కొన్నవిగూడ (పరమకారణభావాపత్త్యా=) అత్యంతమైన వానియొక్క మొదటి

కారణముగాఁ (అనఁగాఁ బరబ్రహ్మముగా) బరిణమించుటమూలమున (మూర్త్యా ... భవిష్యతి=) వానివాని మొదటియాకారములను మాత్రము గోల్పోవుచున్నవి.

3) కార్యము భంగపడిపోవుచున్నదనఁగా వైశేషికులు చెప్పుప్రకారము కార్యము పరమాణువులలోనికి వినాశమైపోవుటగాక కార్యరూపము పోయి కారణరూపము వచ్చుట యెట్టిదో యట్లే కారణ మవయవ (పరమాణు) సంయోగముచేతఁ గార్యమును బుట్టించిన దనుటకంటెఁ గారణరూపముననే కార్యరూపము గల్గినదనుట యుక్తము. ఇట్లు చెప్పినచో నసలువస్తువునకు వినాశముగాని యసలువస్తువు మఱియొకవస్తువును బుట్టించుటగాని యెప్పటికిని గలుగదు. వైశేషికులసృష్టిప్రళయవాద మయుక్తమని స్పష్టమగును.

తథా కార్యారంభోఽపి నావయవసంయోగేనైవ కేవలేన భవతి.

(తథా=) అట్లే - అనఁగాఁ గార్యవస్తువు దానియవయవములలోనికిఁ జీలి చెడిపోకుండఁగానే కారణస్వరూపమును దాల్చినట్లుగానే-యనఁగాఁ జేరిననేయి కఱఁగిన నేయి యైనట్లుగానే (కార్యారంభోఽపి=) కారణవస్తువు కార్యరూపమును దాల్చుటయు (అనఁగాఁ బల్చనినేయి గడ్డకట్టినఁ జేరిననెయ్యి యగుటయు) (కేవలేన - అవయవసంయోగేన + ఏవ) చెదరియున్న దానియవయవములు కలిసికొనుటచేత మాత్రమే (నభవతి=) గానేరదు. అనఁగాఁ జేరిననేయి కఱఁగిననేయి యగుటకు నగ్ని మొదలగువానిసాయమును బొందినట్లుగానే కఱఁగిననేయి పేరిననేయి యగుటకుఁ జలి మొదలగువానియొక్క సాయమును బొందునుగాని - కేవలముగా నా యవయవవియోగముచేతఁ గార్యము గారణముగా మాఱుటయు నాయవయవ సంయోగముచేతఁ గారణము కార్యముగా మాఱుటయు సంభవింపదని భావము.

క్షీరజలాదీనా మంతరేణా ప్యవయవసంయోగాంతరం దధిహిమాదికార్యారంభదర్శనాత్.

(క్షీరజలాదీనాం=) పాలు నీరు మొదలగునవి (అంతరేణాపి + అవయవ సంయోగాంతరం=) వానివాని యవయవములయొక్క కలయికతో నవసరము లేకుండఁగనే) (దధి ... దర్శనాత్ =) పెరుగగుటయు, మంచుగడ్డ యగుటయుఁ జూచుచున్నాముగదా

(కాఁబట్టి జగదుత్పత్తికి జగత్ప్రళయమునకు వైశేషికులు జెప్పుపరమాణు సంయోగవియోగములే కారణములగుట యుక్తియుక్తము గాదని యెఱుంగునది)

VIII. కాఁబట్టి పైని జూపినప్రకారము జగత్సృష్టిప్రళయములకుఁ బరమాణు సంయోగవియోగములే కారణమని చెప్పు వైశేషికులసిద్ధాంతము నిస్సారమైన

యుక్తులతోఁ గూర్పఁబడిన దైనందున వేదజ్ఞులైనవారు పరమేశ్వరజగత్కారణవాద మగు వేదాంతమతమునందే విశ్వాస ముంచెదరుగాని వైశేషికమతమునం దాదరము వహింపఁజాలరు.

> త దేవ మసారతరతర్కసంద్బ్ధత్వా దీశ్వరకారణశ్రుతివిరుద్ధత్వా చ్ఛ్రుతిప్రవణైశ్చ శిష్టై ర్మన్వాదిభి రపరిగృహీతత్వా దత్యంత మేవానపేక్షాస్మిన్ పరమాణుకారణవాదే కార్యాఽఽర్యైః శ్రేయోఽర్థిభి రితి వాక్యశేషః.

(తత్ =) కాఁబట్టి (ఏవం=) ఈరీతిగా వైశేషికుల పరమాణు జగత్కారణవాదము (అసార .... బ్ధత్వాత్ =) మిక్కిలినిస్సారములైనయుక్తులచేతఁ గూర్పఁబడిన దగుటవలనను (ఈశ్వర ... విరుద్ధత్వాత్ =) ఈశ్వరుఁడే జగత్కారణమని స్పష్టముగాఁ జెప్పుశ్రుత్యర్థమునకు వ్యతిరేక మగుటవలనను (శ్రుతిప్రవ .... తత్వాత్ =) శ్రుత్యర్థములను బాగుగా గుర్తెఱింగినట్టియుఁ బెద్దలైనట్టియు మనువు మొదలగువారిచేత సంగీకరింపఁబడకపోవుటవలనను (అస్మిన్ పరమాణుకారణవాదే =) వైశేషికులయొక్క యీపరమాణుజగత్కారణవాదసిద్ధాంతమునందు (శ్రేయోర్థిభిః + ఆర్యైః=) మేలును గోరుసరసులచేత (అనపేక్షా=) నిరాదరణము (అత్యంత మేవ=) పూర్తిగానే (కార్యా) చేయఁదగియున్నదని (వాక్యశేషః=) సూత్రాభిప్రాయమని యెఱుఁగునది.

## సముదాయాధికరణము — [ సూ. 18 నుండి 27 వఱకు ]

4. అధికరణావతారిక :—

1) పూర్వాధికరణమందు వైశేషికులయొక్క పరమాణుజగత్కారణవాదము ఖండింపఁబడినది. ఈయధికరణమందును, రాఁబోవుమఱియొక యధికరణమునందును బౌద్ధమతము ఖండింపఁబడఁబోవుచున్నది. పరిణామభేదమూలమున దేహాదులు మిక్కిలిశీఘ్రముగా వినాశమును జెందునవియు, ఆత్మమాత్రము స్థాయిగా నుండు నవియు వైశేషికులు చెప్పుచుండుటచేత వారి నర్ధవైనాశికులని పిల్తురు. ఆ దేహాదులును ఆత్మయును క్షణికములై వినాశమును జెందునవియే యని బౌద్ధులు చెప్పుచుండుటచేత వీరిని బూర్ణవైనాశికులని పిల్తురు. అర్ధవైనాశికులమతమును ఖండించిన పిదపఁ బూర్ణవైనాశికులమత మిప్పుడు ఖండింపఁబడుచున్నది.

బి) బౌద్ధులలో 1) సౌత్రాంతికులనియు 2) వైభాషికులనియు 3) యోగాచారులనియు 4) మాధ్యమికులనియు నాల్గుతెఱఁగులవారు గలరు.

బౌద్ధసిద్ధాంతములు :—

బౌద్ధసిద్ధాంతములు రెండు. అవి 1) అణుహేతుకసముదాయసంబద్ధము; 2) స్కంధహేతుకసముదాయసంబద్ధము

1) ఈరెండు సముదాయములను జగత్తులోని క్షణికము లగుసమస్తచరాచర భూతములును నగుచున్నవి.

ఈ సిద్ధాంతమును 18, 19, 20 సూత్రములు ఖండించుచున్నది.

2) అక్షణికము లగుసర్వపదార్థములు (సంతాన=) ప్రవాహరూపమున నొకటి నశించినపిమ్మట మఱియొకటి వచ్చుచుండును. పూర్వక్షణపదార్థము నాశముఁజెందిన పిమ్మటనే యుత్తరక్షణపదార్థము పుట్టుచుండును. అనఁగాఁ గారణకార్యభావము లేదు. అనఁగా నుత్తరక్షణపదార్థము పుట్టునప్పటికిఁ బూర్వక్షణపదార్థ మభావమే.

ఈ సిద్ధాంతమును 21 సూత్రము ఖండించుచున్నవి.

3) వినాశము - అనఁగా నభావము ఇది మూడు విధములు.

ఎ) ప్రతిసంఖ్యానిరోధము (=వినాశము) (బుద్ధిపూర్వకముగాఁ జేయువినాశము) అవిద్యయు నిందులోని యంతర్భాగమే.

బి) అప్రతిసంఖ్యానిరోధము. బుద్ధిపూర్వకముగాఁగాక - అనఁగాఁ దెలియకుండ జరుగుచుండువినాశము.

ఈ సిద్ధాంతమును 22, 23 సూత్రములు ఖండించుచున్నవి.

సి) ఆకాశము — ఇది యొకభూతముగా నంగీకరింపఁబడదు. ఇది కేవల మభావ మనియే చెప్పఁబడును.

ఈ సిద్ధాంతమును 24 సూత్రము ఖండించుచున్నది.

4) "ఆత్మ" యను జీవుఁడుసైతము క్షణికమే

ఈ సిద్ధాంతమును 25 సూత్రము ఖండించుచున్నది.

5) క్షణికవస్తువులకుఁ గారణకార్యభావము లేనందున నభావమువలననే సర్వపదార్థములు పుట్టుచుండును.

ఈ సిద్ధాంతము 26, 27 సూత్రములు ఖండించుచున్నవి.

18. సూత్రావతారిక :—

బౌద్ధులలో నావైభాషికయోగాచారు లిర్వురును 1) బాహ్యపదార్థస్వరూపమైన యణుసముదాయము; 2) ఆంతరపదార్థస్వరూపమైనస్కంధసముదాయము —

అను నీరెండు సముదాయములును జగత్తగుచున్నదని వాదించెదరుగాని సముదాయము లేర్పడుటకు మఱియొక చేతనసాహాయ్య మున్నట్లు చెప్పకొనరు. అందుచే వారి జగత్సృష్టిసిద్ధాంతము సరిగాదని యీసూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౧౮ సూ॥ సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః.

వ. వి :- సముదాయే - ఉభయహేతుకే - అపి - తదప్రాప్తిః॥

అ. క్ర :- ఉభయహేతుకే - సముదాయే - అపి - తదప్రాప్తిః॥

ప్ర. వ. అ :- ఉభయహేతుకే= (అణువులు - స్కంధములు అనునీ) రెండును హేతువులుగాఁ (గలసముదాయేఽపి =) రెండుసముదాయములు జగత్తుగా నేర్పడునని యంగీకరించినను, తదప్రాప్తిః॥ తత్ =ఆసముదాయద్వయముయొక్క, అప్రాప్తిః=ప్రాప్తింపక పోవుట తటస్థించును.

సూత్రార్థము :—

అణువులు, స్కంధములు-అనునీరెండును హేతువులుగాఁగల రెండు సముదాయములును - జగత్తులోని బాహ్యాంతరపదార్థము లగుచున్నవని వాదించినను మొదలారెండు సముదాయము లేర్పడుట కవకాశము లేదు.

సూత్రతాత్పర్యము :—

(ఉభయహేతుకేఽపి) 1) అణువులు హేతువుగాఁ గలట్టియు 2) స్కంధములు హేతువుగాఁ గలట్టియు (సముదాయే=) రెండు సముదాయములు 1) బాహ్యపదార్థస్వరూపజగత్తుగా 2) ఆంతరపదార్థస్వరూపజగత్తుగా నగుచున్నవని యభిప్రాయపడినను (తదప్రాప్తిః=) మొదలట్టి సముదాయములే యగుట సంభవింపదు. ఎందుచేత ననఁగా—

1) అచేతనములైనపరమాణువులును, అచేతనములైనస్కంధములును దమకుఁ దామే సముదాయము లగుట తటస్థింపదు గావునను,

2) చిత్తముయొక్క ప్రకాశమే - అనఁగా నేను - నేను - అని తలఁచుచుండు నాలయవిజ్ఞానమే యీ సముదాయములను గూర్పఁగలదన్నచో. సముదాయము లేర్పడి సృష్టిలోని దేహము సంభవించినమీఁదట నాదేహములోఁ బ్రవేశించిన చిత్తమునకే ప్రకాశ మేర్పడునని చెప్పచున్నందున నట్టిచిత్తాభిజ్వలనము (=చిత్త ప్రకాశము) మొదటిసముదాయములను గూర్పఁగలదని చెప్పట యసంభవము గావునను,

3) పరమాణువులను, స్కంధములను సముదాయములుగాఁ గూర్పఁగల మఱి యేస్థిరమైన చేతనము వారిమతమందు లేదు గావున మొదలాసముదాయములే ప్రాప్తింపఁజాలవు. కాఁబట్టి వారిమతమందు జగత్సృష్టి యన్నదియే కలుగఁజాలదు.

భాష్యము - భాష్యార్థము.

వైశేషికరాద్ధాంతో దుర్యుక్తియోగా ద్వేదవిరుద్ధా చ్ఛిష్టాపరిగ్రహాచ్చ నాపేక్షితవ్య ఇత్యుక్తమ్.

(వైశే ... ద్ధాంతః=) వైశేషికసిద్ధాంతము (దుర్యు .... గాత్=) దుష్ట యుక్తులతోఁ గూడియుండుటవలనను, (వేదవిరుద్ధాత్=) వేదార్థమునకు విరోధ మగుటవలనను, (శిష్టా ... హాచ్చ=) శిష్టు లగువారిచే నంగీకరింపఁబడకపోవుటవల నను (నాపే ... క్తమ్=) అపేక్షింపఁబడఁదగినది గాదని చెప్పఁబడినదిగదా.

సోఽర్ధవైనాశిక ఇతి వైనాశికత్వసామ్యాత్ సర్వవైనాశికరాద్ధాంతో నతరా మపేక్షితవ్య ఇతీద మిదానీ ముపపాదయామః.

(సోఽర్ధ ... ఇతి=) వైశేషికుఁడు సగమువైనాశికుఁడు - అనఁగా దేహా దులు - ఆత్మ యీరెంటిలో సగమునొక్క - అనఁగా దేహాదులయొక్క వినాశమును మాత్రమే యంగీకరించువాఁడు. అట్టివాని మతమునుగూర్చి చెప్పి (వైనాశికత్వ సామ్యాత్=) వినాశము నంగీకరించువారే యగు (సర్వ ... రాద్ధాంతః=) బౌద్ధుల యొక్క - అనఁగా నంతటికిని వినాశమునే చెప్పుపూర్ణవైనాశికులయొక్క సిద్ధాంతము (నతరాం - తవ్యః - ఇతి=) ఎంతమాత్రము నపేక్షింపఁదగినది గాదని (ఇదానీం=) యిప్పుడు (ఉపపాదయామః=) చెప్పఁబోవుచున్నాము.

న చ బహుప్రకారః ప్రతిపత్తిభేదా ద్వినేయభేదాద్వా.

(నచ=) ఆబౌద్ధసిద్ధాంతము (ప్రతిపత్తిభేదాత్=) శుశ్రూష చేయించిన భిన్న విధములనుబట్టిగాని - అనఁగా మతస్థాపకుఁ డొకప్పు డొకరీతిగను, మఱియొకప్పు డింకొకరీతిగాను నుపదేశించుచువచ్చిన వైఖరినిబట్టిగాని, లేక (వినేయభేదాత్=) శిష్యులలో నుండు భేదములనుబట్టిగాని - అనఁగా నొకే యుపదేశమును భిన్న భిన్నరీతులుగా నర్థముచేసికొను శిష్యులయొక్క తెలివితేటల భేదమునుబట్టిగాని (బహుప్రకారః=) అనేకవిధములుగాఁ బ్రచారముచేయఁబడుచున్నది. (అనఁగా బౌద్ధమతము పరస్పరవిరుద్ధము లైనభిన్నభిన్నసిద్ధాంతములు గల్గినలు తెఱంగులుగా నున్నది.)

తత్రైతే త్రయో వాదినో భవంతి.

(తత్ర=) ఆవిషయములో (ఏతే ... భవంతి=) మూఁడువిధము లైనసిద్ధాంతములతో వాదించువారు గలరు; చూడుఁడు.

(ఎ) కేచి త్సర్వాస్తిత్వవాదినః.

(ఎ) కొందఱు సర్వము వాస్తవముగా నున్న దనియే చెప్పుచున్నారు. వీరు (Realists) సర్వాస్తిత్వవాదులని పిల్వఁబడుదురు. (వీరే సౌత్రాంతికవైభాషికులు)

(బి) కేచి ద్విజ్ఞానాస్తిత్వమాత్రవాదినః.

(బి) మఱికొందఱు విజ్ఞానముమాత్ర మున్నదని చెప్పుదురు. (విజ్ఞాన మనఁగాఁ దెలివి. వీరు (Idealists) విజ్ఞానవాదులని పిల్వఁబడుదురు. (వీరే యోగాచారులు.)

(సి) అన్యే పున స్సర్వశూన్యత్వవాదిన ఇతి.

(సి) ఇంకఁగొందఱు సర్వము శూన్యమనియే చెప్పుదురు. వీరు (Nihilists) శూన్యవాదులని పిల్వఁబడుదురు) వీరే మాధ్యమికులు.

(ఎ) తత్ర యే సర్వాస్తిత్వవాదినో బాహ్య మాభ్యంతరం చ వస్త్వభ్యుపగచ్ఛంతి, భూతం భౌతికం చిత్తం చైత్తం చ.

(తత్ర=) ఆముమ్వురిలో (యే ... చైత్తంచ) సర్వాస్తిత్వవాదులు - అనఁగా భూతము - భౌతికము — చిత్తము — చైత్తము — అని చెప్పఁబడుబాహ్యాభ్యంతర వస్తువు లన్నియు వాస్తవములే యని యెవ రంగీకరింతురో—

తాం స్తావత్ ప్రతి బ్రూమః.

వారిని (అనఁగా సౌత్రాంతికవైభాషికులను) గూర్చి ప్రప్రథమమునఁ జెప్పుచున్నాము వినుఁడు.

తత్ర భూతం పృథివీధాత్వాదయః, భౌతికం రూపాదయ శ్చక్షురాదయశ్చ.

(తత్ర=) బాహ్యపదార్థములని చెప్పఁబడువానిలో భూతము లనఁగాఁ బృథివ్యప్తేజోవాయువు లనునవి - భౌతికములనఁగా రూపాదులు - వీనిని గ్రహించు చక్షురాదీంద్రియములు అనునవి.

చతుష్టయే చ పృథివ్యాదిపరమాణవః ఖరస్నేహోష్ణేరణస్వభావాః,

పృథివి మొదలగు నాల్గుభూతములయొక్క పరమాణువులు (ఖర .... భావాః=)

గట్టితనము (=ఖర) - ద్రవత్వము (=స్నేహ)- ఉష్ణత్వము (=ఉష్ణ) - చలనత్వము (ఈరణం=) అని నాల్గువిధము లైనస్వభావములు గలవై యున్నవి.

తే పృథివ్యాదిభావేన సంహన్యంత ఇతి మన్యంతే

(తే=) ఆనాల్గువిధము లైనస్వభావములు గలపరమాణువులు (పృథివ్యాది భావేన=) పృథివి - జలము - అగ్ని - వాయువు అను వేఱువేఱు నాల్గుభూతములుగా (సంహన్యంతే ఇతి=) కలిసికొనుచున్నవని (మన్యంతే=) సర్వాస్తిత్వవాదులు తలంచుచున్నారు.

తథా రూపవిజ్ఞానవేదనాసంజ్ఞాసంస్కారసంజ్ఞకాః పంచ స్కంధాః.

(తథా=) ఆంతరపదార్థములైన - అనఁగా దేహములోపల నుండుచిత్తము - చైత్తము ననునవి (విజ్ఞాన ... సంజ్ఞకాః=) 1) రూపస్కంధము (=sensation) 2) విజ్ఞానస్కంధము (=knowledge 3) వేదనాస్కంధము (=Feeling) 4) సంజ్ఞాస్కంధము (=Names; 5) సంస్కారస్కంధము (=Impression) అను పేర్లు గలిగి (పంచస్కంధాః=) అయిదు స్కంధములు - అనఁగా సమూహములుగా నేర్పడియున్నవి.

తేఽప్యధ్యాత్మం సర్వవ్యవహారాస్పదభావేన సంహన్యంత ఇతి మన్యంతే.

(తేఽపి=) ఈయైదు స్కంధములు (అధ్యాత్మం=) దేహముతో సంబంధించినవై (సర్వ ... భావేన=) సర్వవ్యవహారములు జరుపుటకు నాధారములుగా నుండులాగున (సంహన్యంత + ఇతి) కలిసికొనుచున్నవని (మన్యంతే=) యీ సర్వాస్తిత్వవాదులు చెప్పుదురు.

తత్రేద మభిధీయతే.

(తత్ర=) పైని జూపఁబడిన సర్వాస్తిత్వవాదుల సిద్ధాంతము విషయమై (ఇదం=) ఈక్రింది పూర్వపక్షము (అభిధీయతే=) చెప్పఁబడుచున్నది.

యోఽయ ముభయహేతుక ఉభయప్రకారః సముదాయః పరేషా మభిప్రేతోఽణుహేతుకశ్చ భూతభౌతికసంహతిరూపః స్కంధహేతుకశ్చ పంచస్కంధీరూపః.

(ఉభయహేతుకః=) రెండువిధము లైనకారణములతో నేర్పడి (ఉభయప్రకారః=) రెండువిధములై యుండి (పరేషా మభిప్రేతః=) బాహ్యాంతర జగత్సృష్టి చేయుచున్నదని సర్వాస్తిత్వవాదులచేఁ జెప్పఁబడు (యః - అయం ... సముదాయః=) యీరెండు సముదాయము లెవ్వియన :—

1) (అణు ... సంహతిరూపః=) అణువులే కారణముగాఁ గలిగి భూతభౌతిక పదార్థసమావేశస్వరూప మైనసముదాయ మొకటి.

2) (స్కంధ ... స్కంధీరూపః=) స్కంధములే కారణముగాఁ గలిగి పంచ స్కంధ సమావేశస్వరూప మైనసముదాయము మఱియొకటి—

తస్మిన్నుభయహేతుకేఽపి సముదాయేఽభిప్రేయమాణే తదప్రాప్తిః స్యాత్సముదాయాప్రాప్తిః

(తస్మిన్ .... మాణే) అణువులచేతను స్కంధములచేతను నేర్పడిన యీరెండు సముదాయములు జగత్సృష్టిలోని బాహ్యాంతరపదార్థము లగుచున్నవని సర్వాస్తిత్వ వాదు లైనసౌత్రాంతికవైభాషికు లనెడిబౌద్ధులచేతఁ దలంపఁబడుచున్నను (తద... స్యాత్=) వానియొక్క ప్రాప్తియే లేదు. అనఁగా (సముదాయాప్రాప్తిః=) ఆసముదాయములకు సంభవము లేదు.

సముదాయభావానుపపత్తి రిత్యర్థః.

అనఁగా (సముదాయాప్రాప్తిః=) భూతభౌతికస్వరూప మైన పరమాణువుల యొక్క సముదాయముగాని చిత్తచైత్తస్వరూప మైనపంచస్కంధములయొక్క సముదాయముగాని సంభవింపవని యర్థము.

కుతః ?

ఎందుచే సముదాయములు సంభవింపఁజాలవని యందురేమో ?

1) సముదాయినా మచేతనత్వాత్.

1) (సముదాయినాం=) ఒకసముదాయమును గల్గించుచున్న పరమాణువులుగాని మఱియొకసముదాయమును గల్గించుచున్న పంచస్కంధములుగాని (అచేతన త్వాత్=) చేతనములు గానందున సముదాయములు గల్గింపఁబడఁజాలవు.

2) చిత్తాభిజ్వలనస్య సముదాయసిద్ధ్యధీనత్వాత్.

2) (పోనీ - చిత్తముయొక్క ప్రకాశము - అనఁగా 'నేను - నేను' అనుకొను 'ఆలయవిజ్ఞాన' ముండునుగదా. అది రెండుసముదాయముల నేల గల్గింపఁజాల దందు రేమో) (చిత్తాభిజ్వలనస్య=) చిత్తమునకుఁ గలుగుప్రకాశము (దీని నేయాలయవిజ్ఞాన మందురు) (సముదాయసిద్ధ్యధీనత్వాత్=) ఆరెండుసముదాయము లేర్పడినతరువాతనే చిత్తప్రకాశము పుట్టునుగాని యంతకు ముందే పుట్టియుండఁజాలదు- కావునఁ జిత్త ప్రకాశము సముదాయ మేర్పడుటకు సహకారి గా నేరదు (చిత్తముయొక్కపని దేహ మేర్పడినతరువాతనే యారంభించునని బౌద్ధులు చెప్పుదురు).

3) అన్యస్య చ కస్యచి చ్చేతనస్య భోక్తుః ప్రశాసితుర్వా స్థిరస్య సంహంతు రనభ్యుపగమాత్.

3) మఱియును రెండు సముదాయము లేర్పడుటకు ముందు (సంహంతుః=) ఆరెండు సముదాయములకుఁ గారణము లైనయణువులను, స్కంధములను గల్పుటకుఁగాని (లేదా విడఁగొట్టుటకుఁగాని) (భోక్తుః ... తుర్వా=) జగత్పదార్థములను భోగించుజీవునివంటి వాఁడో, శాసించునీశ్వరునివంటి వాఁడో (అన్యస్యచ కస్యచిత్=) జగత్పదార్థములకంటె వేఱగు నెవరో మఱియొక (స్థిరస్య చేతనస్య=) స్థిరమైన చేతనముగా నుండియున్న వాఁడు (అనభ్యుపగమాత్=) కలఁడని యీబౌద్ధు లంగీకరించుట లేదు

4) నిరపేక్షప్రవృత్త్యభ్యుపగమే చ ప్రవృత్త్యనుపరమప్రసంగాత్.

4) నిరపే .... మేచ=) ఇతరసాహాయ్యము లేకుండఁగనే (=నిరపేక్ష) పరమాణువులును, స్కంధములును బరస్పరము గలియుఁగల చుఱుకుఁదనము (=ప్రవృత్తి—activity) ఉన్నదని యొప్పుకొనుపక్షములో (=అభ్యుపగమే చ) (ప్రవృత్తి ... సంగాత్=) ఆరెంటికిని గలప్రవృత్తి యెప్పటికిని నిరంతరముగా విరమించనిప్రవృత్తిగావే యుండునని చెప్పవలసివచ్చును (సముదాయ మేర్పడుటవలనఁ గలుగు దేహాది సృష్టి సృష్టిగానే యుండునుగాని నిర్వాణ (మోక్ష) మెన్నటికిని గలుగదని భావము).

5) ఆశయస్యా ప్యన్యత్వానన్యత్వాభ్యా మనిరూప్యత్వాత్, క్షణికత్వాభ్యుపగమాచ్చ నిర్వ్యాపారత్వా త్తత్ప్రవృత్త్యనుపపత్తేః.

5) (ఆశయస్య ఆ 'ఆలయవిజ్ఞానము' — అనఁగాఁ జిత్తప్రకాశము అన్యత్వ+అనన్యత్వాభ్యాం+అపి) పంచస్కంధములకంటె వేఱైనదా — లేక యీ పంచస్కంధములలోఁ జేరినదా యనియైనను (అనిరూప్యత్వాత్=) నిరూపించుట కవకాశము లేదు ఎందుచేతననఁగా — ఆయాలయవిజ్ఞానము (క్షణి .... మాచ్చ=) పుట్టిన క్షణమందే నశించిపోవుచుండునని బౌద్ధు లంగీకరించుచున్నారుగావునను (నిర్వ్యాపారత్వాత్=) ఆయాలయవిజ్ఞానము జడమై యెట్టిపని చేయునది గాదుగావునను, (తత్ప్ర ... పపత్తేః) ఆయాలయవిజ్ఞానమునకుఁ (తత్=) బ్రవృత్తి (సముదాయ మేర్పఱచెడి వ్యాపారము) గలుగునని చెప్పుట యెంతమాత్రము వీలుపడదు.

(ఆలయవిజ్ఞానము-అనఁగాఁ జిత్తప్రకాశము పంచస్కంధములలోఁ జేరనిదే యగుచో, నిత్యమైనదిగా నుండవలసివచ్చును. నిత్యమైన దైనచో నది వేదాంతులు చెప్పు నిత్యమైన యాత్మయే యైపోవును. దీనిని బౌద్ధు లంగీకరింపరు. పంచస్కంధ

ములలోఁ జేరినదే యగుచో దానికి క్షణికత్వమును నిర్వ్యాపారత్వమును అంగీకరించుట చేతఁ బ్రవృత్తియే యుండఁజాలదు - అని భావము)

తస్మాత్సముదాయానుపపత్తిః

(తస్మాత్ =) కాఁబట్టి (సముదాయానుపపత్తిః -) యేవిధమునను జూచినను బరమాణువులకును బాహ్యస్కంధములకును సముదాయములు గల్గుననిచెప్పుట కవకాశము లేదు.

సముదాయానుపపత్తౌ చ తదాశ్రయా లోకయాత్రా లుప్యేత.

(సము ... పత్తౌ చ=) సృష్టికవసరము లైనట్టిసముదాయము లేర్పడుటకవకాశము లేకున్నచో (తదాశ్రయా=) అట్టిసముదాయములనే యనుసరించుకొనియున్న (లోకయాత్రా=) లోకవ్యవహారము (లుప్యేత=) లేకపోవలసివచ్చును.

19 సూత్రావతారిక :—

మఱి యేయితరస్థిరచేతనసాహాయ్యము లేనందున దేహాదిప్రపంచసృష్టి కవసరమగు నచేతనము లైనపరమాణువులయొక్కయు, స్కంధములయొక్కయు సముదాయము లేర్పడఁజాలనందునను జిత్తప్రకాశ మట్టిసముదాయమును గూర్పఁగలదనుట యసంభవమైనందునను బౌద్ధులలో సౌత్రాంతికులు వైభాషికులు చెప్పుచొప్పున సృష్టి కలుగనేరదని పైసూత్రమందుఁ జెప్పఁబడినది. విజ్ఞానస్కంధ మైన చిత్తమునందు స్వభావముగాఁ గలయవిద్యాదికములే (అవిద్య-రాగ ద్వేష మోహ సంస్కారములే) అనఁగా క్షణికము లగువదార్థము లనిత్యములని భ్రాంతిపడుట యనెడియవిద్య మొదలగునవియే సముదాయమును గూర్పఁగలవని యేల చెప్ప రాదనుపూర్వపక్ష మీసూత్రమందు ఖండింపఁబడనున్నది.

## ౧౯ సూ॥ ఇతరేతరప్రత్యయత్వాదితి చేన్నోత్పత్తిమాత్రనిమిత్తత్వాత్.

ప. వి :- ఇతరేతరప్రత్యయత్వాత్ - ఇతి - చేత్ - న - ఉత్పత్తిమాత్రనిమిత్తత్వాత్.

ప్ర. ప. అ:- (ఇత ... త్వాత్ =) ఒకదాని కొకటి ప్రత్యయము (=కారణకార్యభావము పొందియుండుటవలన; (ఇతిచేత్ =) సముదాయము సిద్ధించునని చెప్పుచో; న = అట్లు చెప్పుటకు వీలు లేదు. (ఉత్పత్తి ... త్వాత్) పుట్టుకకు హేతువులగుచుండుటవలన

సూత్రార్థము :— (ఇతరేతరప్రత్యయత్వాత్ =) అవిద్యాదు లొకదాని కొకటి కారణకార్య భావమును జెందుచుండుటవలన (ఇతిచేత్) సముదాయము సిద్ధించునని చెప్పినను (న) సముదాయ మట్లు సిద్ధింపనేరదు — ఎందుచేననఁగా — (ఉత్పత్తిమాత్రనిమిత్తత్వాత్) ఆయవిద్యాదులు(బౌద్ధసిద్ధాంతముననుసరించి)పూర్వ పదార్థము లుత్తరపదార్థములను బుట్టించుటకుమాత్రమే యోగ్యమైనవిగాని పరమాణువులకును స్కంధములకును సముదాయమును గూర్చుటకు సమర్థములు గావు.

భాష్యము — భాష్యార్థము

యద్యపి భోక్తా ప్రశాసితా వా కశ్చిచ్చేతనః సంహంతా స్థిరో నాభ్యుపగమ్యతే.

(భోక్తా ప్రశాసితా వా) భోక్త యగుజీవుఁడుగాని శాసించునీశ్వరుఁడుగాని (కశ్చిత్ =) యెవఁడో యొకఁడు (సంహంతా) సముదాయమును సమకూర్పఁగల (స్థిరః చేతనః=) స్థిరుఁడైన చేతనుఁడు (=పురుషుఁడు) (యద్యపి నాభ్యుపగమ్యతే=) లేకున్నప్పటికి

తథా వ్యవిద్యాదీనా మితరేతరకారణత్వా దుపపద్యతే లోకయాత్రా తస్యాం చోపపద్యమానాయాం, న కించి దపర మపేక్షితవ్య మస్తి.

(తథాపి=) అనఁగా నట్టిస్థితిలోనైనను (అవిద్యాదీనాం=) విజ్ఞానస్కంధమగుచిత్తమునకు సంబంధించినయవిద్య (=క్షణికము లగుపదార్థములు నిత్యము లని భ్రాంతిపడుట) గాని సంస్కారాదిస్కంధము లగుచైత్తములకు సంబంధించిన రాగ ద్వేష మోహసంస్కారాదులుగాని (ఇతరేత కారణత్వాత్ =) పరస్పర మొకదాని కొకటి కార్యకారణభావమును జెందుచున్నందువలన — అనఁగా నవిద్యాదులచే దేహాదిజగత్సృష్టి గలుగుచున్నదనియు, దేహాదిజగత్సృష్టిచే నవిద్యాదులు గలుగుచున్నవనియు నూహించుటకుఁ దగియున్నందువలన (లోకయాత్రా + ఉపపద్యతే=) ఈప్రపంచవ్యవహారము సంభవించుచుండవచ్చును.

(తస్యాం ... నాయాం=) అట్లు ప్రపంచవ్యవహారము సంభవించుచుండుటకవకాశ మున్నప్పుడు (కించిత్ + అపరమ్=) మఱియేదియో చేతన మొకటి (న + అపేక్షితవ్యమ్=) యుండవలసియున్నట్లు కల్పింప నవసరము లేదు.

తే చావిద్యాదయః. అవిద్యాసంస్కారో విజ్ఞానం నామరూపం షడాయతనం స్పర్శో వేదనా తృష్ణోపాదానం భవో జాతి ర్జరా మరణం శోకః పరిదేవనా దుఃఖం దుర్మనస్తే త్యేవం జాతీయకా ఇతరేతరహేతుకాః సౌగతే సమయే క్వచి త్సంక్షిప్తా వినిర్దిష్టాః క్వచిత్ప్రపంచితాః

(తేచా .... దయః=) అవిద్యాదులనఁగా నేవనఁగా:— (అవిద్యా ... జాతీయకాః=) 1) అవిద్యా (=క్షణికములు నిత్యములని తోఁచునట్లుచేయు భ్రాంతి) 2) సంస్కారము 3) విజ్ఞానము 4) నామరూపము 5) షడాయతనము 6) స్పర్శము 7) వేదన 8) తృష్ణ 9) ఉపాదానము 10) భవము=పుట్టుక 11) జాతి 12) జర =క్షీణించుట 13) మరణము=చావు 14) శోకము 15) పరిదేవనము 16) దుఃఖము 17) దుర్మనస్తా; ఇట్టివే మఱికొన్నియు — (ఇతరేతరహేతుకాః=) ఇవి యన్నియుఁ బరస్పర మొకదానిని మఱియొకటి పుట్టించునవియై యున్నవి. అనఁగా వానిలో నొకటి కారణమై మఱియొకటి దానికార్య మగుచుండును.

ఇవియన్నియు (సౌగతే సమయే=) బౌద్ధమతసిద్ధాంతములందు (క్వచిత్సం క్షిప్తాః=) నొకొక్కచోట సంక్షేపముగాఁ జెప్పఁబడియు (క్వచి త్ప్రపంచితాః= మఱియొకచోట విపులముగా వివరింపఁబడియు నున్నవి.

సర్వేషామ ప్యయ మవిద్యాదికలాపో న ప్రత్యాఖ్యేయః.

(అయం+అవిద్యాదికలాపః=) ఇట్టివన్నియు నవిద్యలోఁ జేరినట్లుగా (సర్వే షాం=) అందఱును- అనఁగా నొకబౌద్ధులేగాక యన్నిమతములవారును నొప్పుకొను నంశ మేగావున (న ప్రత్యాఖ్యేయః=) త్రోసివేయఁబడువిషయము గాదు.

బౌద్ధ పూర్వపక్షి :—

తదేవ మవిద్యాదికలాపే పరస్పరం నిమిత్తనైమిత్తికభావేన ఘటీయంత్రవ దనిశ మావర్త మానేఽర్థాక్షిప్త ఉపపన్న స్సంఘాత ఇతిచేత్.

(తదేవం+అవిద్యాదికలాపే=) ఈయవిద్యాదు లన్నియు (పరస్పరం=) నొకదానికొకటి (నిమిత్త...భావేన=) కారణము కార్యము నగుచు (ఘటీయంత్ర వత్=) ఘటీయంత్రము (బావిలోనుండి నీళ్ళను లాగుటకు నొకదానివెంట నొకటి వచ్చిపోవుచుండు బొక్కెనలతో నమర్పఁబడిన పెద్దగొలుసువలె) (అనిశ మావర్త మానే=) నిరంతర ముండునవియేగావున (సంఘాతః=) అందుచే బట్టినే సంఘాతము సైతము — అనఁగా దేహముసైతము (=పరమాణువుల కలయికచేత నేర్పడిన దేహముసైతము) (అర్థాక్షిప్తః=) అర్థాక్షిప్తముగా (అర్థాత్+ఆక్షిప్తః=) సంగతి సందర్భములనుబట్టి వచ్చునదిగా=స్వాభావముగా (ఉపపన్నః+ఇతి .... చేత్) నేర్పడునని యేల యెంచఁగూడదు ?

సిద్ధాంతి :—

తన్న: కస్మాత్?

ఎందుచే నందువేమో! (తత్ + న) అట్లు కాదు.

ఉత్పత్తిమాత్రనిమిత్తత్వాత్.

(ఉత్ప ... త్వాత్ =) అయవిద్యాదికలాపము – అనఁగాఁ బైని దెలిపిన యవిద్య మొదలగునవి – ఒకటి మఱియొకదానిని బుట్టించఁగలవిమాత్రమే యని నీబౌద్ధసిద్ధాంతము చెప్పుచున్నదిగదా! (వానిలో నేదియు సంఘాతమును గలుగఁ జేయనేరదని నీసిద్ధాంతముగదా - యనిభావము).

భవే దుపపన్న స్సంఘాతో యది సంఘాతస్య కించి న్నిమిత్త మవగమ్యేత:

అట్టి పక్షములోనే (యది ... గమ్యేత=) అనఁగా సంఘాత మేర్పడుటకు మఱియొకనిమిత్త మపేక్షించిన పక్షములోనే-అనఁగా మఱియొకనిమిత్త మున్నదని యొప్పుకొన్నప్పుడే (భవేత్ .... సంఘాతః=) సంఘాత మేర్పడుట కవకాశ మున్నది సుమా!

న త్వవగమ్యతే.

(నతు + అవగమ్యతే=) అట్టి మఱియొక నిమిత్త మేదియు నీసిద్ధాంతమందు లేదుగదా!

యత ఇతరేతరప్రత్యయత్వేఽప్యవిద్యాదీనాం పూర్వపూర్వ ముత్తరోత్తర స్యోత్పత్తిమాత్రం నిమిత్తం భవ ద్భవేత్.

(యతః=) ఎందుచేననఁగా (ఇతరేతర ... దీనాం=) అవిద్య మొదలగునవి (=అవిద్యాదీనాం) పరస్పరముగా నొకదాని కొకటి (=ఇతరేతర) కారణ మగుచుండునని నీవు చెప్పుచున్నసందర్భములో (పూర్వ ... త్తరస్య=) వానిలో మొట్టమొదటిది దానితరువాతిదానిని, ఆతరువాతిది దానితరువాతిదానిని, ఆతరువాతిది దాని తరువాతిదానిని – ఈవిధముగా నవి (ఉత్పత్తిమాత్రం=) పుట్టింపఁగలవనిని మాత్రముచేయు (నిమిత్తం భవత్=) కారణముమాత్రమే యగుచు (భవేత్=) నుండునవియేగదా!

నతు సంఘాతాసత్తేః కించి న్నిమిత్తం సంభవతి.

(సంఘాతాసత్తేః=) ఇఁక దేహాదిసృష్టి కవసర మగుసంఘాత మేర్పడఁజేయఁ

గల (కించిన్నిమిత్తం=) యితర కారణ మెట్టిదియు (నతు+సంభవతి=) మీసిద్ధాంత మందు లేనేలేదుగదా!

బౌద్ధపూర్వపక్షి :—

నన్వవిద్యాదిభి రర్థా దాక్షిప్యతే సంఘాత ఇత్యుక్తం.

(అవిద్యాదిభిః=) అవిద్య మొదలగు వానిచేతనే (సంఘాతః=) సంఘాత మేర్పడుచున్నట్లు (అర్థాత్ + ఆక్షిప్యతే + ఇతి) స్వభావముగా నూహింపఁ జాలిన విషయమే యని (నను+ఉక్తం=) మే మిదివఱకే చెప్పియున్నాముగదా! మఱేమి కాఁలయును? (అనఁగా నవిద్యాదులు సంఘాతమును కేవలముగాఁ బుట్టించునవి కాకపోయినను నవియే సంఘాతమునకుఁ గారణములు గావచ్చునని యూహింపఁజేయునవి-అనఁగా గమకములుమాత్రమైయుండవచ్చు నని భావము.

సిద్ధాంతి :—

అత్రోచ్యతే యది తావ దయ మభిప్రాయః,

(యది ... ప్రాయః=) నీయభిప్రాయ మట్టిదైనచో (అత్ర+ఉచ్యతే=) సమాధానమును జెప్పుచున్నాము వినుఁడు.

అవిద్యాదయ స్సంఘాతమంతరే ణాత్మాన మలభమానా, అపేక్షంతే సంఘాతమితి తత స్తస్య సంఘాతస్య కించి న్నిమిత్తం వక్తవ్యం.

(అవిద్యాదయః=) అవిద్య మొదలగునవి (సంఘా ... రేణ) త[illegible] ముందు సంఘాత (=దేహము) మనునది యేర్పడియున్నఁగాని (ఆత్మా ... మానాః=) తమ స్వరూపమును బొందఁజాలనివై - అనఁగాఁ దాము పుట్టఁజాలనివై (అపే ... మితి) తమపుట్టుకకు నాధారముగా సంఘాత (=దేహము) మొకటి యుండితీరవలయునని తెలుపుచున్నవిగదా! (తతః=) కాఁబట్టి (సంఘా ... నిమిత్తం=) యాసంఘాతమును (=దేహమును) బుట్టించునది యేదియో యొకటి యుండునని (వక్తవ్యం=) చూపవలసియున్నది.

తచ్చ నిత్యేష్వ ప్యణు ష్వభ్యుపగమ్యమానే ష్వాశ్రయాశ్రయిభూతేషు చ భోక్తృషు సత్సు న సంభవ తీత్యుక్తం వైశేషికపరీక్షాయాం.

(వైశేషి .... క్షాయాం=) ఇంతకుముందు వైశేషికమతసృష్టి విధానమును ఖండించుసమయమందు (నిత్యే ... మానేషు) పరమాణువులు నిత్యములని యొప్పుకొన్నప్పటికి, (ఆశ్రయా ... సత్సు=) అదృష్టము నాశ్రయించ కొనియున్న

(=ఆశ్రయాశ్రయిభూతేషు) భోక్తలగుజీవు లున్నారని యొప్పుకొన్నప్పటికి నితర స్వతంత్ర చేతనపరిమేయము లేకుండఁగా (తచ్చ=) సంయోగోత్పత్తి — అనఁగాఁ బరమాణువులు కలిసికొనుటకుఁ గావలసినసంయోగముయొక్క పుట్టుక (న+సంభవతి+ఇతి) సంభవింప నేరదని (ఉక్తం=) చెప్పఁబడియే యున్నదిగదా!

కి మంగ! పునః క్షణికేష్వ ప్యణుషు భోక్తృరహితే ష్వాశ్రయాశ్రయిశూన్యేషు చాభ్యుపగమ్యమానేషు సంభవేత్.

(అంగ !=) ఓయి యన్నయ్యా! (పునః=) ఇప్పుడు నీబౌద్ధసిద్ధాంతమందు (భోక్తృరహితేషు=) భోక్తలగు జీవులతో సంబంధము లేకుండఁగను, (ఆశ్రయాశ్రయిశూన్యేషు=)సంఘాతమును(=సమూహములను) జేయఁగలకర్త మఱియెవ్వరును లేకుండఁగను నున్నట్టు (అభ్యుపగమ్యమానేషు=) లొప్పుకొనఁబడుచున్న (క్షణికేష్వపి...అణుషు=) క్షణికములైన (=అనిత్యములైన పరమాణువుల విషయములో మాత్ర మాసంయోగము (సంఘాతము) (కిం సంభవేత్=) ఎట్లు సంభవింపఁగలదు? అట్టి వైశేషికమతమందే సంయోగము సంభవింపదని చెప్పినప్పు డిట్టినీబౌద్ధమతమందు సంభవింపఁజాలదని వేఱే చెప్పవలయునా!)

బౌద్ధపూర్వపక్షి :—

అథాయ మభిప్రాయః అవిద్యాదయ ఏవ సంఘాతస్య నిమిత్తమితి.

(అథ ) పోనీ! (అవిద్యా .... నిమిత్తమితి=) అవిద్య మొదలగునవి సాక్షాత్తుగా సంఘాతమును బుట్టించుచున్నవనియే (అయ మభిప్రాయః=) నావాదమని తలంపుఁడు!

సిద్ధాంతి :—

కథం తమే వాశ్రిత్యాత్మానం లభమానా స్తస్యైవ నిమిత్తం స్యుః?

(తం+ఏవ+ఆశ్రిత్య=) సంఘాతము (=దేహము) ముందుగా నేర్పడి యున్నప్పుడే (ఆత్మానం లభమానాః=) తమస్వరూపమును దాము పొందఁగల యవిద్యాదులు — అనఁగా సంఘాతము (=దేహము) పుట్టినతరువాతనే పుట్టఁగల యవిద్యాదులు(తస్య+ఏవ+నిమిత్తం=)ఆసంఘాతమునుబుట్టించునవి (కథంస్యుః=) ఎట్లు కాఁగలవు? (సంఘాత మున్ననేగాని యవిద్యాదు లుండవు అవిద్యాదు లున్ననేగాని సంఘాతము పుట్టదు. ఇట్లు చెప్పినచో నన్యోన్యాశ్రయదోషము సంభవించునుగాన నట్లు చెప్పఁదగదు) అని యిదివఱకే చెప్పియుంటిమిగదా!

అథ మన్యసే సంఘాతా ఏవానాదౌ సంసారే సంతత్యాఽనువర్తంతే తదాశ్రయా శ్చావిద్యాదయ ఇతి.

అందులకు (అనాదౌ సంసారే=) అనాదిగా వచ్చుచుండు నీలోకవ్యవహారమందు (సంఘాతాః+ఏవ) క్రొత్తగాఁ బుట్టవలసినయవసరము లేకయే సంఘాతములే (=దేహములే) (సంతత్యా=) ప్రవాహరూపమున నొకదానివెంట నొకటి యెడ తెగకుండ (అనువర్తంతే=) నంటివచ్చుచునేయుండును. (అవిద్యాదయః=) అవిద్యాదు లనునవి (తత్+ఆశ్రయాః+చ=) యాసంఘాతముల నాశ్రయించుకొని యుండునవియేగాని సంఘాతములచేతఁ గ్రొత్తగాఁ బుట్టింపఁబడునవి కావు) (ఇతి ... అథ మన్యసే=) అని (బౌద్ధపూర్వపక్షివైన) నీవు సమాధాన మూహించుకొందువేమో!

(ఈసంఘాతములు=దేహములు) (క్రొత్తగాఁ బుట్టింపఁబడవలసిన యవసరము లేకయే యొకదానికి మఱియొకటి హేతువై ప్రవాహరూపమున ననాదినుండి వచ్చుచున్నవనియు, అవిద్యాదులన్నో యాసంఘాతముల నంటియేయుండి ప్రవర్తించుచుండునవియు - అనఁగాఁ బూర్వసంఘాతము నాశ్రయించుకొనియున్న యవిద్యాదులే యుత్తరసంఘాతమును బ్రవర్తింపఁజేయుచుండునవియుఁ జెప్పి యన్యోన్యాశ్రయదోషము లేదని నీవు సమాధానము చెప్పుకొందువేమో యని భావము).

తదాపి సంఘాతా త్సంఘాతాంతర ముత్పద్యమానం నియమేన సదృశమే వోత్పద్యేత? అనియమేన వా సదృశం విసదృశం చోత్పద్యేత?

(తదాపి=) నీ వట్లు చెప్పినపక్షములోనైనను నీవు కొన్ని ప్రశ్నములకు సమాధానము చెప్పవలసి వచ్చును.

(సంఘా ... మానం=) మఱియొకదాని ప్రమేయము లేకుండఁగనే యొక సంఘాతము (=దేహము) మఱియొకసంఘాతమును బుట్టించుచుండునని చెప్పి నీవు సరిపుచ్చినవిషయములో—

1) (నియ ... ద్యేత=) పూర్వసంఘాతము (=దేహము) నియమముగాఁ దనవంటి యుత్తరసంఘాతమునే పుట్టించునా?

2) (అనియ ... త్పద్యేత=) లేక నియమమును దప్పి తనవంటియుత్తర సంఘాతమునుగాని తనకంటె భిన్నముగా నుండుసంఘాతమునుగాని బుట్టించునా? చెప్పుము—

నియమాభ్యుపగమే మనుష్యపుద్గలస్య దేవతిర్యగ్యోనినారకప్రాప్త్యభావః ప్రాప్నుయాత్.

(నియమాభ్యుపగమే=) పూర్వసంఘాతము నియమముగాఁ దనవంటి యుత్తర సంఘాతమునే పుట్టించుఁ నని నీవు సమాధానము చెప్పినచో, (మనుష్యపుద్గలస్య=) మనుష్యదేహమునకు (దేవ ... భావః) దేవతాదేహముగాని, పశ్వాది దేహము గాని, శారీరక దేహముగాని యెప్పటికిని రాకపోవుటయే (ప్రాప్నుయాత్=) సంభవించును.

అనియమాభ్యుపగమేఽపి మనుష్యపుద్గలః కదాచిత్ క్షణేన హస్తీ భూత్వా దేవో వా పునర్మనుష్యో వా భవే దితి ప్రాప్నుయాత్.

2) (అనియ .... మేపి=) నియమము దప్పి భిన్నదేహములను బుట్టించు నన్నచో (మను .... ప్రాప్నుయాత్=) మనుష్యశరీర మొకప్పుడు క్షణకాలములో నేనుఁగుశరీర మగుటయు నప్పుడే దేవతాశరీర మగుటయు మరల నప్పుడే మనుష్య శరీరములోనికి దిగుటయుఁ సంభవించును.

ఉభయమ ప్యభ్యుపగమవిరుద్ధమ్.

(ఉభ .... రుద్ధమ్=) రెండుపద్ధతులలో నెట్లు చెప్పినను నీబౌద్ధసిద్ధాంతమునకు విరుద్ధమే యగునుజుమా !

అపిచ యద్భోగార్థ స్సంఘాత స్స్యాత్ స జీవో నాస్తి స్థిరో భోక్తేతి తవాభ్యుపగమః.

(భోక్త యైనజీవుఁడను బౌద్ధసిద్ధాంతానుసారము క్షణమాత్రి ముండువాఁడే యనుచో భోగాపవర్గవ్యవహారమే దుర్ఘటమని చెప్పుచున్నాఁడు).

(అపిచ=) మఱియు (యద్భోగా ... స్స్యాత్) సంఘాత (=దేహము) మెవనియొక్క భోగమునిమిత్త మేర్పడునో (స జీవః=) యాజీవుఁడు (నాస్తి .... క్తేతి=) స్థిర మైనభోక్త గాఁడనిగదా నీసిద్ధాంతము !

తతశ్చ భోగో భోగార్థ ఏవ స నాన్యేన ప్రార్థనీయః.

(తతశ్చ=) అట్టిపక్షమందు (భోగో .... ఏవ=) భోగము భోగముకొఱకే యగునుగాని (సః=) ఆభోగము (న+అన్యేన...నీయః=) కావలెనని యెవనివల నను గోరఁబడదు.

తథా మోక్షో మోక్షార్థ ఏవేతి ముముక్షుణా నాన్యేన భవితవ్యమ్.

(తథా=) అప్రకారమే మోక్షము మోక్షముకొఱకే యగునుగాని మోక్ష మును గోరువాఁడు మఱియొకఁ డుండఁబోఁడు.

(ఏవఁ జేది గోరునో యది యాకాలము దుండనిచోఁ గోరిక యనునది వ్యర్థమేగదా. ఉండు నన్నచో బౌద్ధాదులక్షణికత్వవాదమునకు భంగమువచ్చును గదా యనిభావము.)

అన్యేన చేత్ ప్రార్థ్యేతోభయం భోగమోక్షకాలావస్థాయినా తేన భవితవ్యమ్.

(ఉభయం=) భోగమోక్షముల రెంటిని (అన్యేన ప్రార్థ్యేతచేత్=) ననుభవించువాఁ డెవఁడైనను మఱియొకఁ డుండునన్నచో (భోగమో ... భవితవ్యం=) వాఁడు భోగమోక్షకాలములవఱకు నిత్యముగా నుండవలసినవాఁడై యుండునుగదా!

అవస్థాయిత్వే క్షణికత్వాభ్యుపగమవిరోధః.

(అవస్థాయిత్వే=) ఆప్రకార ముండు నన్నపక్షములో (క్షణి ... విరోధః=) నీక్షణికత్వవాదమునకు భంగము తటస్థించును.

తస్మా దితరేతరోత్పత్తిమాత్రనిమిత్తత్వ మవిద్యాదీనాం యది భవే ద్భవతునామ నతు సంఘాత స్సిద్ధ్యేత్ భోక్త్రభావా దిత్యభిప్రాయః.

(తస్మాత్=) కాఁబట్టి (అవిద్యాదీనాం=) అవిద్యాదులు (ఇతరే ... త్తత్వం=) ఒకదాని నొకటి పుట్టించుటకుమాత్రము హేతువులైనవి (యది భవే ద్భవతు నామ=) యగునన్నచో నగుఁగాక!

(భోక్త్రభావాత్=) నిత్యుఁడైనభోక్త యొకఁ డున్నట్టు లొప్పుకొననియెడల (నతు సంఘాతస్సిద్ధ్యేత్=) (పాంచభౌతిక – పరమాణు – పంచస్కంధీ) సంఘాత మనునది) యేర్పడుటకు వీలు లేదు.

౬౦ సూత్రావతారిక :— చిత్తచైత్తములకు సంబంధించిన యవిద్యాదులు తమలోఁ దా మన్యోన్యోత్పత్తికి నిమిత్తములైనను సముదాయములను (=జగత్తును గల్పించుటకు) నిమిత్తములు (=కారణములు=పుట్టించునవి) గాఁజాలవని పూర్వసూత్రమందు నిరూపింపఁబడినది. ఆయవిద్యాదు లన్యోన్యోత్పత్తికి నిమిత్తములు సైతము గాఁజాలవని యీసూత్రమందుఁ జూపింపఁబడుచున్నది.

## ౨౦ సూ॥ ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్.

వ. వి :— ఉత్తరోత్పాదే – చ – పూర్వనిరోధాత్.

ప్ర. వ. అ :— ఉత్తరోత్పాదే – చ; ఉత్తర=ఉత్తరపదార్థముయొక్క, ఉత్పాదే చ=పుట్టుకసమయమందు, పూర్వనిరోధాత్ = పూర్వపదార్థము యొక్క లేఃపోవుటవలన,

29. సూత్రార్థము :— ఉత్తరపదార్థము పుట్టుసమయమునకుఁ బూర్వపదార్థము లేకపోవుటవలనఁ, బూర్వపదార్థ ముత్తరపదార్థమును బుట్టింపఁజాలదు.

30. సూత్రభాష్యభావసంగ్రహము :— అవిద్యాదు లుత్తరోత్పత్తి మాత్రమునకైనను నిమిత్తములు కాఁజాలవు. ఎందుచేననఁగా – (ఉత్తరోత్పాదే చ) అవిద్యాదులు సంస్కారాదులయొక్క పుట్టుకసమయమునకుఁ బూర్వమందే నశించి పోయి యాపుట్టుకసమయమునకు లేకపోవుటవలననే – నష్టమైపోవువస్తు వేదియుఁ దరువాతఁ బుట్టువస్తువునకుఁ గారణము గాఁజాలదుకదా!

భాష్యము – భాష్యార్థము

ఉక్త మేత దవిద్యాదీనా ముత్పత్తిమాత్రనిమిత్తత్వా న్న సంఘాతసిద్ధి రస్తీతి.

(అవిద్యా .... త్వాత్ =) అవిద్యాదులు (వానివిమ్మటివానిని) పుట్టించుటకు మాత్రమే కారణము లగుటవలన (న సంఘాతసిద్ధిః =) సంఘాత (= దేహము) మేర్పడుటకు మఱియేకారణమును లేదు (ఏతత్ =) అనువిషయము (ఉక్తం=) లోఁగడి సూత్రమందుఁ జెప్పఁబడినది.

తదపి తూత్పత్తిమాత్రనిమిత్తత్వం న సంభవతీ తీద మిదానీ ముపపాద్యతే.

(తదపి ... తీదం=) ఆయవిద్యాదులును గారణములు గాఁజాల వనువిషయము (ఇదానీం=) ఈసూత్రమందుఁ (ఉపపాద్యతే=) జెప్పఁబడుచున్నది.

క్షణభంగవాదినోఽయ మభ్యుపగమః.

(క్షణ .... దినః=) క్షణభంగవాదు లైనబౌద్ధులయొక్క (అభ్యుపగమః=) సిద్ధాంతము (అయం=) ఇదిగో చూడుఁడు.

ఉత్తరస్మిన్ క్షణ ఉత్పద్యమానే పూర్వః క్షణో నిరుధ్యత ఇతి.

(ఉత్తరస్మిన్ క్షణే=) ఉత్తరకాలమందలి క్షణికార్థము – అనఁగాఁ బిమ్మటి పదార్థము (ఉత్పాద్యమానే=) పుట్టుచున్నదియగుచుండఁగా – అనఁగాఁ బుట్టియుఁ బుట్టకపూర్వమే (పూర్వక్షణః=) పూర్వకాలమందలి క్షణికార్థము – అనఁగా లోఁగడిపదార్థము (నిరుధ్యతే) అతీతమై పోవును – అనఁగా నశించిపోవును. (ఇతి=) ఇదియే వారిసిద్ధాంతము.

న చైవ మభ్యుపగచ్ఛతా పూర్వోత్తరయోః క్షణయో ర్హేతుఫలభావ శ్శక్యతే సంపాదయితుం.

(ఏవం=) ఈతీరుగా (అభ్యుపగచ్ఛతా) సిద్ధాంతముచేయువారు (పూర్వో ... క్షణయోః=) పూర్వోత్తరక్షణికార్థములు – అనఁగాఁ (అవిద్యాదులలోని) బూర్వా

(ఎ) వస్తున ... స్యాతాం=) ఆవస్తువుయొక్క వేఱు వేఱు స్వరూపము లందువా (=స్వరూపభేదము లందువా?)

(బి) (అవస్థాంతరం వా=) లేక యావస్తువుయొక్క వేఱువే అవస్థ లందువా?

(సి) వస్త్వంతరమేవ వా=) లేక భిన్నవస్తువు లందువా?

(సర్వ ... పద్యతే=) ఎట్లుచెప్పినను నీబౌద్ధసిద్ధాంతమునకు భంగమే వాటిల్లును.

(ఎ) యది తావ ద్వస్తున స్స్వరూపమే వోత్పాదనిరోధౌ స్యాతాం తతో వస్తుశబ్ద ఉత్పాద నిరోధశబ్దౌ చ పర్యాయాః ప్రాప్నుయుః.

(యది ... స్యాతాం=) ఉత్పత్తివినాశములు రెండును నొకవస్తువుయొక్క స్వరూపములే యనుకొందము (తతః=) అప్పుడు (వస్తుశబ్దః=) ఆవస్తువును దెల్పు శబ్దమును (ఉత్పాద ... శబ్దౌచ=) ఉత్పత్తివినాశము లనెడిశబ్దములును (పర్యా.... ప్రాప్నుయుః=) పర్యాయపదములే యైపోవును.

(బి) అథాస్తి కశ్చిద్విశేష ఇతి మన్యేత ఉత్పాదనిరోధశబ్దాభ్యాం మధ్యవర్తినో వస్తున ఆద్యంతాఖ్యే అవస్థే అభిలప్యేతే ఇతి.

(బి) (అథ=) ఉత్పత్తివినాశములు రెండును వస్తువుయొక్క స్వరూపములే యగుననుటకంటె (కశ్చిద్విశేషః-|-ఇతి) మఱియొకవిశేష మున్నదని (మన్యేత=) బౌద్ధులు తలఁపవచ్చును - అదేమన :— (ఉత్పాద .... శబ్దాభ్యాం=) ఉత్పత్తి వినాశశబ్దములచేత (మధ్య ... వస్తునః=) ఆయుత్పత్తి వినాశములయొక్క మధ్య కాలమం దుండువస్తువుయొక్క (ఆద్యం ... వస్థే=) మొదటియవస్థయుఁ, గడపటి యవస్థయు మాత్రము (అభిలప్యేతే-|-ఇతి) దెలుపఁబడును. అనఁగా నారెండవస్థలు వస్తువుయొక్క స్వరూపమని చెప్పుటకు వీలు లేదని బౌద్ధులు వాదించవచ్చునని భావము.

ఏవమ ప్యాద్యంతమధ్యక్షణత్రయసంబంధిత్వా ద్వస్తునః క్షణికత్వాభ్యుపగమహానిః.

(ఏవమపి=) అట్లు చెప్పినను (వస్తునః=) వస్తువనునది (ఆద్యంత ... బంధిత్వాత్=) దానియొక్క మొదటి — నడిమి — కడపటి యవస్థల మూఁటితోడను సంబంధించియుండునని యెంచవలసివచ్చును గావున (క్షణి ... హానిః=) వస్తు వేదైనను నొకక్షణకాలములోనే పుట్టి నశించిపోవు ననెడిబౌద్ధసిద్ధాంతమునకు భంగము వాటిల్లక తప్పదు.)

(సి) అథాత్యంతవ్యతిరిక్తావే వోత్పాదనిరోధౌ వస్తున స్స్యాతా మశ్వమహిషవత్.

(అథ=) అట్లుగాక (వస్తునః=) వస్తువుయొక్క (ఉత్పాదనిరోధౌ=) యుత్పత్తి వినాశములనునవి (అశ్వమహిషవత్=) గుఱ్ఱము — దున్న యనుశబ్దములు వేఱు వేఱు వస్తువుల కెట్లన్వయ మగునో యట్లే(అత్యంతవ్యతిరిక్తౌ+ఏవ+స్యాతాం=) ఆవస్తువుకంటె మిక్కిలి భిన్నమైనవస్తువులనే తెలుపు ననుకొందము.

తతో వస్తూత్పాదవిరోధాభ్యా మసంస్పృష్టమితి వస్తున శ్శాశ్వతప్రసంగః.

(తతః=) అట్టిపక్షములో (వస్తూ .... స్పృష్టమితి=) వస్తు వనునది దాని యొక్క యుత్పత్తివినాశములకంటెఁగూడ — అనఁగా వానితో నట్టిసంబంధము లేకుండ నుండునదియేగావున (వస్తు ... సంగః=) అది — అనఁగా నావస్తువు నిత్య మనియే చెప్పవలసివచ్చును. (చావుపుట్టుకలు లేనివస్తువు నిత్యమైనదే యగు ననియుఁ బ్రతివస్తువు నిత్యమే యగుచో బౌద్ధులవస్తుక్షణికత్వవాదమునకు భంగము వచ్చుననియు భావము.)

(డి) యదిచ దర్శనాదర్శనే వస్తున ఉత్పాదనిరోధౌ స్యాతాం ఏవమపి ద్రష్టృధర్మౌ తౌ న వస్తుధర్మావితి వస్తున శ్శాశ్వతత్వప్రసంగ ఏవ.

(డి) పైవిధముగాక (వస్తునః ... రోధౌ=) వస్తువుయొక్క యుత్పత్తి వినాశము లనఁగా (దర్శనాదర్శనే=) ఆవస్తువు గోచరించుట, గోచరింపక పోవుట మాత్రమే (యది స్యాతాం=) యగునన్నచో (ఏవమపి=) అట్లయినను (తే=) గోచ రించుట — గోచరింపకపోవుట యనెడివస్తువుయొక్క యుత్పత్తివినాశములు రెండును (ద్రష్టృధర్మౌ=) చూచువానియొక్క భిన్నధర్మములే యగునుగాని (న వస్తు ధర్మౌ+ఇతి) వస్తువుయొక్క ధర్మములు గానేరవుగాన — అనఁగా వస్తువున కుత్పత్తి వినాశరూప మైనచలన మేదియు లేదనియే చెప్పవలసివచ్చును గాన (వస్తు .... సంగఏవ=) వస్తు వనునది నిత్యమనియే చెప్పవలసివచ్చును.

తస్మాద ప్యసంగతం సౌగతం మతమ్.

(తస్మాత్+అపి=) ఈకారణములనుబట్టిగూడ (సౌగతం మతమ్=) బౌద్ధుల మతము (అసంగతం=) అసంబద్ధమైనది.

21 సూత్రావతారిక :— అవిద్యాదులు సంఘాతోత్పత్తికి (=దేహోత్పత్తికి) నిమిత్తములు (=కారణములు) గాఁజాలవని 19 సూత్రమందును, దమలోఁదా మొక దాని పుట్టుకకు మఱియొకటి నిమిత్తము (=కారణము) సైతము గాఁజాలవనియుఁ

పరపదార్థములు (హేతుఫలభావః=) ఒకటి కారణము మఱియొకటి కార్యవ బుట్టింపఁగలది — నగునని (సంపాదయితుం=) వాదించుటకు (నశక్యతే=) సమః గాఁజాలరు.

నిరుధ్యమానస్య నిరుద్ధస్య వా పూర్వక్షణ స్యాభావగ్రస్తత్వా దుత్తరక్షణహేః నుపపత్తేః.

(నిరుధ్యమానస్య=) వినాశోన్ముఖమైనవస్తువుగాని (నిరుద్ధస్యవా=) విః స్టమై పోయినవస్తువుగాని (పూర్వ ... స్తత్వాత్=) పూర్వక్షణికార్థముయొక్క లే పోవు టలోనే చేరినదైనందున (ఉత్తర ... పత్తేః=) అది (=ఆపూర్వవస్తువు) త్తర క్షణికార్థమునకు హేతు వగుట కవకాశము లేదు.

బౌద్ధపూర్వపక్షి :—

అథ భావభూతః పరినిష్పన్నావస్థః పూర్వక్షణ

(అథ=) మీరు చెప్పినట్లు మే మనః న్నట్టియు (పరినిష్పన్నావస్థః=) పరిపక్వస్థితిః క్షణికార్థము (=పూర్వవస్తువు) (ఉత్తర . హేతువగును. (ఇత్యభిప్రాయః=) అని మా

సిద్ధాంతి :—

తథాపి నోపపద్యతే భావభూతస్య పున ప్రసంగాత్.

అట్లు విఱిచి చెప్పినను సరిపోదు. ఏఁ పక్వస్థితిని) బొందిన యొకవస్తువునకు (ప్ర మారోపించుటచే (క్షణాంతర .... గాత్) గాక తరువాతిక్షణముతోఁగూడ దానికి స అఁగా బౌద్ధసిద్ధాంతానుసారము పుట్టినః గావున నుత్తరక్షణమందుఁ బుట్టువస్తువు నుండఁజాలదని భావము.)

అథ భావ ఏ వాస్య వ్యాపార ఇత్యభిప్రాయ

(అథ భావః + ఏవ=) పూర్వవస్తుః తరువాతివస్తువును బుట్టింపఁగల దానివ్యా పారియమునుమా !

సిద్ధాంతి :—

తథాపి నైవోపపద్యతే హేతుస్వభావానుపరక్తస్య ఫలస్యోత్పత్త్యసంభవాత్.

ఇట్లు చెప్పినను నీవాదము నిలువనేరదు (హేతు ... రక్తస్య=) కారణ స్వభావముతో నంటువడని (ఫలస్య=) కార్యముయొక్క (ఉత్ప ... సంభవాత్=) పుట్టుక యెన్నటికిని సంభవింపదనియే యెఱుంగుము. (అనఁగాఁ బూర్వవస్తువు కారణము-ఉత్తరవస్తువు కార్యము-అని చెప్పినప్పుడు కారణస్వభావము కార్యమందు రాకుండఁబోదుగావునఁ బూర్వక్షణమందలి పూర్వవస్తువునకు నుత్తరక్షణమందలి యుత్తరవస్తువుతో సంబంధ ముండియే తీరును – అనఁగాఁ బూర్వవస్తువు క్షణకాలములో నశించిపోక యుత్తరక్షణమునకు మిగిలియే యుండునని చెప్పవలసివచ్చును. అట్లు చెప్పుచో వస్తువులు క్షణికములని చెప్పుబౌద్ధసిద్ధాంతము భంగపడిపోవునని భావము.)

స్వభావోపరాగాభ్యుపగమే చ హేతుస్వభావస్య ఫలకాలావస్థాయిత్వే సతి క్షణభంగాభ్యుపగమత్యాగప్రసంగః.

(స్వభావో ... మేచ=) కారణస్వభావము కార్యమందఁటియుండుట (=ఉపరాగము) నంగీకరించుచో (హేతుస్వభావస్య=) కారణస్వభావము (ఫల ... సతి=) కార్యము పుట్టుసరికి సైతముండునని చెప్పినట్లే యగును కావునఁ (క్షణ ... ప్రసంగః=) బ్రతివస్తువు క్షణకాలముకంటె నెక్కువగా నుండదని చేయఁబడిన సిద్ధాంతమును వదలుకొన్నట్లే చెప్పవలసివచ్చును.

వినైవ వా స్వభావోపరాగేణ హేతుఫలభావ మభ్యుపగచ్ఛతః సర్వత్ర తత్ప్రాప్తే రతిప్రసంగః.

(వినైవ .... రాగేణ: ) కారణస్వభావము కార్యమందంటియుండునని యొప్పుకొనకుండఁగనే (హేతుఫలభావం=) కారణకార్యభావము నొప్పుకొను వారికి (సర్వత్ర ... ప్రసంగః=) నన్నితావుల నట్లు చెప్పవలసియే వచ్చును గావున నతిప్రసంగదోషము సంభవించును.

అపి చోత్పాదనిరోధౌ నామ (ఎ) వస్తునస్స్వరూపమేవ వా స్యాతాం (బి) మవస్థాంతరం వా (సి) వస్త్వంతరమేవ వా సర్వథాపి నోపపద్యతే.

(అపిచ=) మఱియును, (ఉత్పాదనిరోధౌ నామ=) ఒకవస్తువుయొక్క యుత్పత్తినాశములు – అనఁగా—

గ్రిందటి 20 సూత్రమందును జెప్పఁబడినది. ఇఁకఁ గార్యము (=సంఘాతము=దేహము) పుట్టుటకు బౌద్ధసిద్ధాంతానుసారము కారణము లేదందుమా లేక యున్న దందుమా యనువిషయ మీసూత్రమందు వివరింపఁబడుచున్నది.

## ౨౧ సూ॥ అసతి ప్రతిజ్ఞోపరోధః; యౌగపద్య మన్యథా.

ప. వి :– అసతి – ప్రతిజ్ఞోపరోధః; యౌగపద్యం – అన్యథా

ప్ర. ప. అ :– అసతి= (కారణము) లేదన్నచో, ప్రతిజ్ఞోపరోధః=ప్రతిజ్ఞ=(బౌద్ధ) సిద్ధాంతమునకు, ఉపరోధః= విరోధము (తటస్థించును); అన్యథా=మఱియొక తీరుగాఁ జెప్పుచో (కార్యోత్పత్తికిఁ గారణ మున్నదని చెప్పుచో) యౌగపద్యం=(కారణకార్యములు) రెండును నొకసారిగా నున్న ట్లగుట (సంభవించును).

భాష్యము – భాష్యార్థము.

క్షణభంగవాదే పూర్వక్షణో నిరోధగ్రస్తత్వా న్నోత్తరస్య క్షణస్య హేతు ర్భవతీత్యుక్తమ్.

(క్షణభంగవాదే=) వస్తువు లెల్లను క్షణమాత్ర ముండి నశించిపోవుననువాదమందు (పూర్వ ... గ్రస్తత్వాత్=) పూర్వక్షణమందుఁ బుట్టినవస్తువు నాశనము నొందుచుండుటవలన నావస్తువు (ఉత్తర .... హేతుః=) ఉత్తరక్షణమందుఁ బుట్టువస్తువునకుఁ గారణము (న భవతీతి=) కాఁజాలదని (ఉక్తం=) పూర్వసూత్రమందుఁ జెప్పఁబడినది.

అథాఽసత్యేవ హేతౌ ఫలోత్పత్తిం బ్రూయాత్ తతః ప్రతిజ్ఞోపరోధ స్స్యాత్.

(అథ=) అట్లుగాక (అసత్యేవ హేతౌ=) కారణము లేకుండఁగనే (ఫలో ... యాత్=) కార్యము పుట్టునని చెప్పుచో (తతః=) అప్పుడు (ప్రతి .... స్స్యాత్=) బౌద్ధప్రతిజ్ఞకు విరోధము వచ్చును. (విషయ – కరణ – సహకారి – సంస్కారము లనెడినాల్గువిధము లైనకారణములవలన రూపాదివిజ్ఞాన మైనచిత్తము సుఖాదు లైనచైత్తములును బుట్టు ననునదియే బౌద్ధులప్రతిజ్ఞ (సిద్ధాంతము) యని యెఱుంగునది).

చతుర్విధాన్ హేతూన్ ప్రతీత్య చిత్తచైత్తా ఉత్పద్యన్త ఇతీయం ప్రతిజ్ఞా హీయేత.

(చతు ... హేతూన్=) నాల్గువిధము లైన కారణములను (ప్రతీత్య=) అంగీకరించి (చిత్త ... ఇతి=) చిత్తచైత్తములు పుట్టుచున్నవని చెప్పెడి (ఇయం ప్రతిజ్ఞా=) బౌద్ధులయీప్రతిజ్ఞ (హీయేత=) భంగపడిపోవును.

(అనఁగా – 1) విషయ 2) కరణ 3) సహకారి 4) సంస్కారము లను హేతువులవలనఁ జిత్తము లగురూపాదివిజ్ఞానములును జైత్తము లగుసుఖాదులును బుట్టుచున్నవన్న బౌద్ధులసిద్ధాంతము భంగపడిపోవునని భావము.)

నిర్హేతుకాయాం చోత్పత్తా వప్రతిబంధా త్సర్వం సర్వత్రోత్పద్యేత.

(నిర్హే .... త్పత్తౌ=) హేతు వేమియును లేకుండఁగనే కార్యము పుట్టుచున్నదని యంగీకరించుపక్షమున (అప్రతిబంధాత్= వస్తువు పుట్టుట కాటంక మేమియు లేనందున (సర్వం ... ద్యేత=) ఏవస్తువైన నెప్పుడైనఁ (నిష్కారణముగా) బుట్టుచుండునని చెప్పవలసి వచ్చును.

బౌద్ధపూర్వపక్షి :—

అథోత్తరక్షణోత్పత్తి ర్యావ త్తావ దవతిష్ఠతే పూర్వక్షణ ఇతి బ్రూయాత్.

(అథ=) అట్లుకానిచో (ఉత్త .... ర్యావత్=) ఉత్తరక్షణవస్తు వెప్పుడు పుట్టునో (తావత్=) అంతవఱకుఁ (పూర్వక్షణః+ఇతి, బూర్వక్షణవస్తువు (అవతిష్ఠతే) నిల్చియుండునని (బ్రూయాత్=) ఏల చెప్పఁగూడదు ?

సిద్ధాంతి :—

తతో యౌగపద్యం హేతుఫలయో స్స్యాత్.

(తతః) అట్లు చెప్పుచో, హేతుఫలములకు – అనఁగాఁ గారణకార్యములకు యౌగపద్యము తటస్థించును.

తథాపి ప్రతిజ్ఞోపరోధ ఏవ స్యాత్.

(తథాపి=) అట్లయినచో, (ప్రతిజ్ఞో – స్యాత్=) ప్రతిజ్ఞకు (సిద్ధాంతమునకు) విరోధము గలుగును.

క్షణికస్య సర్వే సంస్కారా ఇతీయం ప్రతిజ్ఞోపరుధ్యేత.

(సర్వే సంస్కారాః) సర్వసంస్కారములు (ఆద్యంతములు గలపదార్థములు) (క్షణికాః=) క్షణకాలముమాత్రముండునవి (ఇతి=) అనియున్న (ఇయం ప్రతిజ్ఞా=) యీ బౌద్ధుల ప్రతిజ్ఞ (ఉపరుధ్యేత=) భంగపడిపోవును.

22. సూత్రావతారిక :—

కార్యము (సంఘాతము= దేహము) పుట్టుటకుఁ గారణము లేదన్నను, ఉన్నదన్నను బౌద్ధమతప్రతిజ్ఞలకు భంగమువచ్చునని పూర్వ సూత్రమందుఁ జెప్పఁ

బడినది. బౌద్ధు లంగీకరించు (1) ప్రతిసంఖ్యానిరోధము 2) అప్రతిసంఖ్యానిరోధము - అను రెండువిధము లైనవినాశము లసంభవములని యీసూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౨౨ సూ॥ ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాప్రాప్తి రవిచ్ఛేదాత్.

ప. వి :- ప్రతి .... ప్రాప్తిః - అవిచ్ఛేదాత్.

ప్ర. ప. అ : - అవిచ్ఛేదాత్ = (భావములు=పదార్థములు) ఎడతెగకుండ నుండుటవలన, (ప్రతిసం... ప్రాప్తిః=) తెలిసి జరుగుచుండు వినాశముయొక్కయు, తెలియక జరుగు నుండువినాశముయొక్కయుఁ బ్రాప్తింపక పోవుటయే (సంభవించుచున్నది.)

సూత్రార్థము :— భావములయొక్క యవిచ్ఛేదము నంగీకరించుటవలనఁ ప్రతిసంఖ్యానిరోధమునకును, అప్రతిసంఖ్యానిరోధమునకును బ్రాప్తి లేదు.

22 సూత్రభాష్యభావము :—

(ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాప్రాప్తిః)

వైనాశిక లనెడిబౌద్ధులు 1) ప్రతిసంఖ్యానిరోధము 2) అప్రతిసంఖ్యానిరోధమను రెండువిధము లైనవినాశముల నంగీకరించుచున్నారు. ఆరెండు వినాశములను వారు 'అభావము' (వాస్తవము గానివి) లని పిలుచుచున్నారు.

1) ప్రతిసంఖ్యానిరోధమన నేమనఁగా :— 'దీనిని నేను నాశనముచేయుచున్నాను' అని చెప్పుచు, రోఁకలి మొదలగునాయుధములదెబ్బచేత బుద్ధిపూర్వకముగాఁ గల్పింపఁబడి సర్వలోకప్రసిద్ధమైన స్థూలవినాశన మేది గలదో యది. ఇది బుద్ధిపూర్వకముగా జరుపుచుండు నభావరూప వినాశము.

2) అప్రతిసంఖ్యానిరోధమన నేమనఁగా :- కుండ - గోడ మొదలగు ప్రతిపదార్థమందును బ్రతిక్షణమును గలుగుచుండునని యుక్తిచేత సాధింపఁబడఁగల్గి సూక్ష్మదృష్టి లేనివారు గ్రహింపఁజాలనిసూక్ష్మమగువినాశన మేది గలదో యది ఇది తెలియక జరుగుచుండువినాశము అనఁగా బుద్ధిపూర్వకముగాఁ గాకుండ జరుగుచుండు నభావరూప వినాశము. అభావరూపము లైనయీరెండు వినాశములు ప్రాప్తించుట యసంభవము - ఎందుచేతననఁగా (అవిచ్ఛేదాత్ =) ప్రతిపదార్థము నొకటివెంట మఱియొకటి యెడతెగకుండ వచ్చుచు క్షణకాల ముండునదియని యంగీ

కరించుటవలనఁ బదార్థములయునికియొక్క జాలునకుఁ దెంపు (=విచ్ఛేదము) ఎప్పుడును గలుగకపోవుటచే వినాశమన్నదియే(అనఁగా నభావమన్నదియే) ప్రాప్తింపదు-పదార్థములయునికియొక్క జాలునకుఁ దెంపు గలదని చెప్పుచో అనఁగా - నాజాలులో నెప్పుడేయొకపదార్థము లేదనుకొన్నను "బదార్థములు క్షణికములై ప్రవాహ (=జాలు) రూపమున నెడతెగకుండ నుండు"నని చెప్పఁబడు క్షణికత్వవాదమునకు భంగము గల్గును.

భాష్యము – భాష్యార్థము

అపిచ వైనాశికాః కల్పయంతి 'బుద్ధిబోధ్యం త్రయా దన్యత్ సంస్కృతం క్షణికం చ' ఇతి

(అపిచ=) ఇఁకఁ జెప్పఁబోవువిషయములో (వైనాశికాః=) వైనాశికులని పిల్వఁబడు బౌద్ధులు తమమతమునందు (బుద్ధిబోధ్యం=) బుద్ధివలన బోధచేసికొనఁదగినదియు - అనఁగాఁ బ్రమేయ (విషయ) మాత్రమైనట్టియు (త్రయా దన్యత్ =) మూఁటికంటె వేఱైనట్టియు-నైనవస్తువైనను (సంస్కృతం=) పుట్టింపఁబడినట్టి క్రియ-అనఁగా నొకక్రియచేతఁ జేయఁబడునట్టియు (క్షణికంచ=) క్షణకాలమాత్రము ండఁగట్టిదియు నగును.

'బుద్ధిబోధ్యం త్రయాదన్యత్ - సంస్కృతం క్షణికం చ'.

(తాత్పర్యము :– మూఁటికంటె వేఱైనదై బుద్ధిగ్రాహ్యమగు ప్రతివిషయము నొకక్రియచేత నగునదియు క్షణకాలములో బుట్టి నశించునదియునై యున్నది). అనఁగా నామూఁడును నభావములనియుఁ దక్కినవి భావములనియు నెఱుంగునది.)

అనునొకసిద్ధాంతమును జేసియున్నారు

తదపి చ త్రయం ప్రతిసంఖ్యాऽప్రతిసంఖ్యానిరోధా వాకాశం చేత్యాచక్షతే.

(తదపి చ త్రయం=) ఆమూఁడును నెవ్వియనఁగా (ప్రతి ... చక్షతే=) 1) ప్రతిసంఖ్యానిరోధము (బుద్ధిపూర్వకముగఁ జేయఁబడు వినాశము - అభావరూపము) (2) అప్రతిసంఖ్యానిరోధము (=దానియంతట నది యగుచుండువినాశము - ఇదియు నభావరూపము) (3) ఆకాశము (=అవకాశము=space) ఇదియభావమే యని చెప్పఁబడును.

త్రయమపి చైత దవ స్త్వభావమాత్రం నిరుపాఖ్యమితి మన్యంతే.

(త్రయం .... తత్ =) ఈమూఁడును (అవస్త్వభావమాత్రం=) అభావమాత్రములే యైనవస్తువులు. వాస్తవమునకు లేనివస్తువులు. (నిరుపా...మన్యంతే=) అవి నిఃస్వరూపములు - అనఁగా స్వరూపము లేనివి యని బౌద్ధులచే ననఁబడును.

1) బుద్ధిపూర్వకః కిల వినాశో భావానాం ప్రతిసంఖ్యానిరోధోనామ భాష్యతే.

1) (భావానాం=) భావములకు (బుద్ధిపూర్వకఃవినాశః=) బుద్ధిపూర్వక మైన వినాశము - అనఁగాఁ గావలయునను నాలోచనముతో జరుగుచుండువినాశము (ప్రతి ... నామ=) ప్రతిసంఖ్యానిరోధ మనుపేరుతోఁ (భాష్యతేకిల=) చెప్పఁబడును. (అనఁగా - నే నీకుండను బగులఁగొట్టుదును - అని చెప్పి చేయువినాశము అని భావము)

2) తద్విపరీతోఽప్రతిసంఖ్యానిరోధః.

2) ప్రతిసంఖ్యానిరోధమునకు వ్యతిరేక మైనదెల్లను అప్రతి .... నిరోధః=) అప్రతిసంఖ్యానిరోధమని చెప్పఁబడును. (అనఁగా - 'కుండ' యనునది దినదినక్రమమున దాని కదియే చెందుచుండు వినాశము - అనిభావము.)

3, ఆవరణాభావమాత్ర మాకాశమితి.

(ఆవ ... కాశమితి=) ఆవరణము లేకపోవుటయే - అనఁగా దేనిచేతను నాక్రమింపఁబడనిప్రదేశమే 'ఆకాశ' మని చెప్పఁబడును.

తేషా మాకాశం పరస్తాత్ ప్రత్యాఖ్యాస్యతే.

(తేషా మాకాశం=) బౌద్ధులభావమాత్రములని చెప్పునామూఁడువినాశములలో మూఁడవది యగునాకాశము (పరస్తాత్=) రాఁబోవు 24వ సూత్రమందు (ప్రత్యాఖ్యాస్యతి=) అభావమాత్రము గాదని నిరాకరింపఁబడును - అనఁగా నభావమాత్రమె యగుననువిషయము పూర్వపక్షము చేయఁబడును

నిరోధద్వయ మిదానీం ప్రత్యాచష్టే.

(నిరోధద్వయం=) అభావమాత్రములని చెప్పఁబడు మిగిలినరెండు వినాశములు (ఇదానీం=) యీసూత్రమందు (ప్రత్యాచష్టే=) అభావమాత్రములు గావని నిరాకరింపఁబడుచున్నవి.

ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధయో రప్రాప్తి రసంభవ ఇత్యర్థః.

అనఁగా (ప్రతి సం ... యోః=) ప్రతిసంఖ్యానిరోధాప్రతిసంఖ్యానిరోధము (అప్రాప్తిః=) లభావములగుట - అనఁగా వాస్తవమునకు లేనివే యగుట (అసంభ .... త్యర్థః=) యసంభవమని యర్థము.

కస్మా దవిచ్ఛేదాత్.

(కస్మాత్ =) ఎందుచే ననఁగా (అవిచ్ఛేదాత్ =) బౌద్ధులు సర్వవస్తువుల కవిచ్ఛేదము (విచ్ఛేదము లేకపోవుట) నంగీకరించుటవలననే వానియభావ మసంభవమని చెప్పుచున్నాము. అనఁగా సర్వవస్తువులు క్షణికములై సంతానరూపమున - అనఁగాఁ బ్రవాహరూపమున - ఒకటితరువాత నొకటిగా నెడ తెగకుండ వచ్చిపోవు చుండునని బౌద్ధులు చెప్పుదురు.)

(ఏ) ఏతౌ హి ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధౌ (ఎ) సంతానగోచరౌ వా స్యాతాం.

(బి) భావగోచరౌ వా.

(ఎ) (ఏతౌ...నిరోధౌ =) అభావమాత్రవినాశములు రెండు (ఎ) (సంతాన... స్యాతాం=) ధర్మము (సంతానము=వస్తుప్రవాహము) నకు సంబంధించినవియా (బి) (భావగోచరౌ వా=) లేక ధర్మముగల (=సంతానులను=ప్రవాహరూపమున వచ్చిపోవుచుండు) వస్తువులను దెలుపునవియా;

(అనగా - బౌద్ధులు చెప్పిన భావమాత్రములైన వినాశములు రెండును క్షణిక వస్తుప్రవాహములో (=సంతానములో) ప్రవాహమునకు సంబంధించినవా లేక వస్తువులకు సంబంధించినవా ? అనఁగా నసలు లేకుండఁబోవునది ప్రవాహమా - లేక వస్తువా యని భావము - ప్రవాహమే సంతానమనియు ప్రవాహమున వచ్చుచుండు వస్తువే సంతానియనియుఁ జెప్పఁబడును.)

(ఎ) న తావ త్సంతానగోచరౌ సంభవతః.

(ఎ) ఆరెండభావమాత్రవినాశములును (న తావ ... వతః=) ప్రవాహరూపధర్మమునకు సంబంధించినవి కాఁజాలవు.

సర్వేష్వపి సంతానేషు సంతానినా మవిచ్ఛిన్నేన హేతుఫలభావేన సంతానవిచ్ఛేద స్యాసంభవాత్.

(సర్వేష్వపి సంతానేషు=) ప్రతిపదార్థము (=భావము) క్షణపర్యంతమే యుండిపోవుచుండును - అనఁగా క్షణికత్వధర్మముతోఁ బదార్థము లెడ తెగని సంతానముగా (ప్రవాహముగా) నేర్పడియుండునని చెప్పుట కర్థమేమనఁగా - అట్లేర్పడు చుండు సర్వసంతానము (=క్షణికపదార్థప్రవాహము) లందు (సంతానినాం=) క్షణికములగు నాపదార్థములు ( సంతానులు=సంతాన మనుప్రవాహమునకుఁ జెందినవి) (అవిచ్ఛిన్నేన=) నిరంతరముగా (=ఎడ తెగకుండ) (హేతుఫలభావేన=) మొదటిది హేతువు - తరువాతిది ఫలముగా - అనఁగా మొదటిది కారణము తరువాతిది

కార్యముగా వచ్చుచుండునుగావున (సంతానవిచ్ఛేదస్య=) ఆప్రవాహ మాగిపోవుట యనునది (అసంభవాత్=) యెప్పటికిని సంభవింపదనియేగదా.

(బి) నాపి భావగోచరౌ సంభవతః

బి (అపి=) మఱియు నారెండభావములును (భావగోచరౌ=) సంతానముగా (=ప్రవాహరూపమున) వచ్చుసంతానులకు (సంతానమందలి వస్తువులకు) (నసంభవతః=) సంబంధించినవియుంగాంజాలవు.

నహి - భావానాం నిరన్వయో నిరుపాఖ్యో వినాశ స్సంభవతి.

ఎందు చేతననంగా (భావానాం=) క్షణికవస్తువులకైనను (నిరన్వయః=)వ్యవహారాతీతమైనట్టియు (నిరుపాఖ్యః=)నిట్టిదని చెప్పుట కశక్యమైనట్టియు (వినాశః=)సంపూర్ణ వినాశరూప మైనయభావ మెప్పటికిని (నహి .... సంభవతి=) గలుగంజాలదు. (అనంగా వస్తువునకుం బ్రతిక్షణము నవస్థాభేదములు గలుగవచ్చునుగాని యసలు వస్తువునకు స్వరూపవినాశ మెన్నటికిని గలుగదని భావము.)

సర్వాస్వ వ్యవస్థాసు ప్రత్యభిజ్ఞానబలే నాన్వయ్యవిచ్ఛేదదర్శనాత్.

(సర్వా ... వస్థాసు=) ఒకవస్తు వెన్నియవస్థారూపములుగా మాఱుచున్నను (ప్రత్య .... బలేన=) ప్రత్యభిజ్ఞానబలమునేతి – అనంగా – 'ఆవస్తువే యిది' యని జరుపుచున్న ప్రత్యక్షలోకవ్యవహారమునుబట్టి (అన్వ .... దర్శనాత్=) యన్వయిః – అనంగాం – గార్యముతో సంబంధము నంగీకరించు కారణవస్తువునకు అవిచ్ఛేదము– అనంగా విచ్ఛేదము లేకపోవుట – అనంగా సంపూర్ణవినాశము చెందకపోవుట వ్యవహారములోం గన్పించుచున్నది.

(అనంగా – మృత్తు కుండరూపమును దాల్చినను– ఈకుండ పెంకులరూపము దాల్చినను – ఈ పెంకులు మట్టిపొడిరూపము దాల్చినను మృత్తే కుండ యనియుం గుండయే పెంకులనియుం బెంకులే మట్టిపొడియనియుం బ్రత్యభిజ్ఞ (=అదే యిది యని చెప్పుకొనుట) తో వ్యవహరించుట కనుకూలముగా నుండునుగాని కార్యములైన కుండకుం – బెంకులకు – మట్టిపొడికిని గారణము లైనమృత్తు – కుండ – పెంకులు పూర్తిగా వినాశము చెందుట సంభవింపదు. అనంగాం గారణవస్తువునకు భిన్నములగు నవస్థారూపములు వచ్చినను స్వరూపనాశన మెన్నటికిని గలుగంబోదు- అని భావము. అనంగా బౌద్ధులు చెప్పుక్షణికవస్తుప్రవాహములోం బూర్వవస్తువు కారణమనియు దరువాతివస్తువు కార్యమనియు నెంచవలయునేగాని పూర్వవస్తువు పూర్తిగా

నష్టమైపోవుచున్నదనియుఁ దరువాతివస్తువు మఱియొకటి పుట్టుచున్నదనియు నెంచఁ దగదని భావము.

అస్పష్టప్రత్యభిజ్ఞానాస్వ వ్యవస్థాసుక్వచి ద్దృష్టేనాన్వయ్యవిచ్ఛేదేనాన్యత్రాపి తదనురూపమ్.

(అస్పష్ట ... వస్థాసు=) స్పష్టమైనప్రత్యభిజ్ఞ కనిపించనివస్తువులయొక్క కొన్ని యవస్థలయందు– (అనఁగా నదే యిది యని గుర్తింపఁజాలనికొన్నియవస్థలయందు) (క్వచిత్=) కొన్నిచోట్ల (దృష్టే ... దేన=) అన్వయికి - అనఁగా వస్తువునకు నవిచ్ఛేదమే – అనఁగా సంపూర్ణవినాశము లేకపోవుటయే (దృష్టేన=) దూరదృష్టితోఁగూడిన హేతుజ్ఞానముచేతఁ గనఁగొనఁబడుచుండుటవలన (అన్యత్రాపి=) స్పష్టమైన ప్రత్యభిజ్ఞ లేనిస్థలములయందుసైతము (తదనురూపం=) అట్టి యవిచ్ఛేదమే యున్నట్లూహింపఁదగియున్నది.

(కాలినపెనము మీఁద వేసిననీటిబొట్టు స్థూలదృష్టికిఁ గనుపడకుండఁబోయి నను స్పష్టమైనప్రత్యభిజ్ఞ లేనిమఱియొకయవస్థ నీటిబొట్టునకుఁ బ్రాప్తింపఁగా నాలోచనమీఁదనీటిబొట్టే యావిరిరూపమును దాల్చినట్లు కనుఁగొనుటకు సాధ్యమై యుండును. ఏకార్యమునకైనను గారణ మిదియని స్పష్టముగాఁ దెలియఁబడనిచోట్లఁ గూడఁ గార్యమునకొక కారణ ముండియే తీరుననియుఁ గారణవస్తువే కార్యరూపముఁనఁ బరిణమించినదనియు నూహింపఁదగియుండునుగాని కారణ మభావమని సంపూర్ణవినాశముఁ జెందినదని నిశ్చయింపఁదగదు – అని భావము).

తస్మాత్ పరపరికల్పితస్య నిరోధద్వయ స్యానుపపత్తిః.

(తస్మాత్=) కాఁబట్టి (పర .... ద్వయస్య=) బౌద్ధులచేఁ (=పర) గల్పింపఁబడిన యభావరూపమైనవినాశద్వయము (అనుపపత్తిః=) ఏవస్తువునకైనను వాస్తవముగా సంభవింపఁజాలవని యెఱుంగునది.

సూ॥ 23 అవతారిక :—

పూర్వసూత్రమందు బౌద్ధులు చెప్పు నభావరూపవినాశములు రెండును — అనఁగా (1) ప్రతిసంఖ్యానిరోధము – అనఁగా బుద్ధిపూర్వకముగా జరుగుచుండు వినాశము. (2) అప్రతిసంఖ్యానిరోధము – అనఁగా బుద్ధిపూర్వకముగాఁ గాకుండ జరుగుచుండు వినాశము నను నీరెండును నసంభవములని చెప్పఁబడినది. ఆ బౌద్ధుల సిద్ధాంతముప్రకారము మొదటిదైన ప్రతిసంఖ్యానిరోధములోని యంతర్భాగమగు అవిద్యానిరోధము (=అవిద్యావినాశము) సైత మసంభవమేయని యీసూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౨౩ సూ॥ ఉభయథా చ దోషాత్.

వ. వి : ఉభయథా - చ - దోషాత్.

ప్ర. ప అ : ఉభయథా చ=రెండువిధములుగాఁగూడ; దోషాత్ =దోషమే వచ్చునుగావున;

సూత్రార్థము :- (బౌద్ధులు చెప్పునవిద్యావినాశము) వారిసిద్ధాంతాను సారము రెండువిధములలో నెటు చెప్పినను దోషమే వచ్చునుగావున (వారిమత మసమంజసము.)

భాష్యభావము :- క్షణికములగువస్తువులు నిత్యములని చెందుభ్రాంతియే 'అవిద్య' యనియు, ఈ యవిద్య (ఎ) సమ్యగ్జ్ఞానమువలనఁగాని (బి) దానియంతట నదియేగాని వినాశముఁ జెందునని బౌద్ధులు చెప్పుదురు.

(ఎ) ఆయవిద్య యమనియమాదులతోఁ గూడినసమ్యగ్జ్ఞానమువలననే వినాశముచెందునని నిశ్చయించుచో, నిర్హేతుకముగానే యది నశించునని చెప్పు బౌద్ధులసిద్ధాంతము భంగపడిపోవును.

(బి) లేక యాయవిద్య స్వయముగానే నశించిపోవునని నిశ్చయించుచో (సర్వం క్షణికమితి భావయేత్ (=సర్వము క్షణకాలములో నశించిపోవునదియే యని చింతనచేయవలసినది) - అను నీమొదలగు బౌద్ధసాధనోపదేశములు వ్యర్థములై పోవును. (ఉభయథా చ దోషాత్) రెండువిధములలో నెట్లు చెప్పినను బౌద్ధసిద్ధాంతమునకు హానియే వచ్చును గావున వారిమత మసమంజసము.

భాష్యము - భాష్యార్థము.

యో ఽయ మవిద్యాదినిరోధః ప్రతిసంఖ్యానిరోధాంతఃపాతీ పరపరికల్పితః స (1) సమ్యగ్ జ్ఞానాద్వా సపరికరా త్స్యాత్ (2) స్వయమేవ వా.

(పర ... కల్పితః=) బౌద్ధులచేఁ గల్పింపఁబడినట్టియు (ప్రతిసం ... పాతీ=) లోఁగడినూత్రమందుఁ జెప్పఁబడిన ప్రతిసంఖ్యానిరోధములో (బుద్ధిపూర్వకముగా జరుగువినాశములో) నిమిడియున్నట్టియు, (అవిద్యాదినిరోధః=) అవిద్య మొదలగు వానియొక్క వినాశ (యః+అయం+సః=) మేది గలదో యయ్యది (1) (సమ్య.... త్స్యాత్ =) దానిజట్టుతోఁగూడ (సంస్కారాదులతోఁగూడ) సమ్యగ్జ్ఞానము (=సంపూర్ణజ్ఞానము) వలన సంభవించునా లేక (2) (స్వయమేవ వా=) యద్ది స్వయముగానే సంభవించునా (యని పరీక్షింపవలసి యున్నది.)

(1) పూర్వస్మిన్ వికల్పే. నిర్హేతుకవినాశాభ్యుపగమహానిప్రసంగః.

(1) పూర్వస్మిన్ వికల్పే) మొదటిపక్షమే – అనఁగా సమ్యగ్జ్ఞానమువలననే యవిద్యకు వినాశము గల్గునని యనుకొందము. అట్లగుచో (నిర్హే ... సం: =) ఎట్టిహేతువు లేకుండఁగనే యవిద్య వినాశము జెందఁగల దనుబౌద్ధసిద్ధాంతమునకు హాని వచ్చునని చెప్పవలసివచ్చును.

(2) ఉత్తరస్మింస్తు మార్గోపదేశానర్థక్యప్రసంగః.

(ఉత్తరస్మింస్తు=) రెండవపక్షమే – అనఁగా నవిద్యావినాశము స్వయము గానే సంభవించు ననుకొందము – అట్లగుచో (మార్గో ... ప్రసంగః=) బౌద్ధులు నిర్వాణమునకై యుపదేశించుసాధనములు మార్గోపదేశములు వ్యర్థములే యని చెప్పవలసివచ్చును.

(వా రుపదేశించుసాధనము లేవియనఁగా– యమనియమాదులు – మార్గోపదేశము లేవి యనఁగా నాల్గుభావనలు – (1) సర్వం దుఃఖం దుఃఖం (2) క్షణికం క్షణికం (3) స్వలక్షణం స్వలక్షణం (4) శూన్యం శూన్యం - అని యిట్లు భావనచేసికొనుచుండఁగా మహోదయ మనుసమ్యగ్జ్ఞానము గలుగునని బౌద్ధుల (=సౌగతుల) సిద్ధాంతము.)

ఏవ ముభయథాపి దోషప్రసంగా దసమంజస మిదం దర్శనమ్.

(ఏవం=) పైని జూపఁబడినవిధముగా (ఉభయథాపి=) రెండువిధములలో నేవిధముగా) జెప్పినను (దోషప్రసంగాత్=) బౌద్ధసిద్ధాంతములకు హానియే వచ్చునుగావున (ఇదం దర్శనమ్ + అసమంజసమ్=) బౌద్ధులసిద్ధాంత మంగీకరింపఁదగినది కాదు.

24 సూత్రావతారిక :—

లోఁగడి రెండుసూత్రములలో నభావరూపములైన (1) ప్రతిసంఖ్యావినాశము (2) అప్రతిసంఖ్యావినాశము, మొదటిదానిలోని యంతర్భాగమైన 'అవిద్యాది వినాశము' బౌద్ధసిద్ధాంతములప్రకారము సంభవించుట కవకాశము లేదని నిరూపింపఁబడినది. అభావరూపవినాశములని బౌద్ధులు చెప్పుమూఁటిలో మూఁడవది యగు 'ఆకాశము' సైత మభావ మగుట (=వాస్తవమునకు లేనిదే యగుట) సంభవింపదని యీ 24 సూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౨౪ సూ॥ ఆకాశే చావిశేషాత్.

ప. వి:– ఆకాశే - చ - అవిశేషాత్.

ప్ర. అ:– (ఆకాశే చ=) ఆకాశమందును (అవిశేషాత్=) విశేష మేమియు అనఁగా - మిగిలిననాల్గుభూతములయందుకంటె భిన్నత్వ మేమియు లేకపోవుటవలన—

సూత్రార్థము:— (మిగిలిన నాల్గుభూతములయందుకంటె) ఆకాశమందు విశేష మేమియు (భిన్నత్వ మేమియు) లేకపోవుటవలన (ఆకాశముసైతము వదార్థమే యగునుగాని యభావము (=శూన్యము) గానేరదు.

భాష్యము - భాష్యార్థము.

యచ్చ తేషామే వాభిప్రేతం నిరోధద్వయ మాకాశం చ నిరుపాఖ్యమితి.

(నిరోధద్వయం=) (1) ప్రతిసంఖ్యానిరోధ (2) అప్రతిసంఖ్యానిరోధము లను నీరెండు వినాశములును (ఆకాశం చ=) ఆకాశ మను మూఁడవదియు (నిరుపాఖ్యం+ఇతి=) స్వరూపము లేని - అనఁగా నిట్టివని చెప్పుటకు వీలులేనియభావమాత్రములే యని (తేషామేవ – యచ్చ=) బౌద్ధులు చెప్పువిషయములో—

తత్ర నిరోధద్వయస్య నిరుపాఖ్యత్వం పురస్తా న్నిరాకృతం;

(నిరోధద్వయస్య=) మొదటివినాశములును (నిరుపాఖ్యత్వం=) స్వరూపము లేఁయభావమాత్రములు గానేరవని (పురస్తాత్=) లోఁగడి 22–23 సూత్రములందుఁ ద్రోసి వేయఁబడినది.

ఆకాశ స్యేదానీం నిరాక్రియతే.

(ఇదానీం=) ఇప్పుడీ 24వ సూత్రమందు (ఆకాశస్య - నిరుపాఖ్యత్వం=) ఆకాశముసైతము స్వరూపము లేనియభావము గానేరదని (నిరాక్రియతే=) త్రోసి వేయఁబడుచున్నది.

ఆకాశే చాయుక్తో నిరుపాఖ్యత్వాభ్యుపగమః.

(ఆకాశే చ=) ఆకాశవిషయములోఁగూడ (నిరు ... గమః=) స్వరూపము లేనియభావమే యనెడి బౌద్ధులసిద్ధాంతము(అయుక్తః=)యుక్తియుక్తము గానిదియే-

ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధయోరివ వస్తుత్వప్రతిపత్తే రవిశేషాత్.

(ప్రతి ... రివ=) ప్రతిసంఖ్యావినాశము - అప్రతిసంఖ్యావినాశము - అను నీరెండభావములయందెట్లో యట్లు (వస్తు .... వత్తేః=) ఆకాశముగూడ నొక పదార్థమే యగునని విశ్వసించువిషయమందు (అవిశేషాత్=) భేద మేమియును లేదుసుమా!

ఆగమప్రామాణ్యాత్తావత్ 'ఆత్మన ఆకాశ స్సంభూతః' తై-II ఇత్యాదిశ్రుతిభ్య ఆకాశస్య చ వస్తుత్వసిద్ధిః.

(తావత్ =) ఆరంభమందు (ఆగమప్రామాణ్యాత్ =) శ్రుతిప్రమాణము ననుసరింతము :—

'ఆత్మన ఆకాశ స్సంభూతః' 'ఆత్మనుండి యాకాశము పుట్టినది' (ఇత్యాది శ్రుతిభ్యః=) ఈమొదలగు శ్రుతిప్రమాణములవలన (ఆకాశ ... సిద్ధిః=) ఆకాశము సైత మొకపదార్థమే యని నిశ్చయ మగుచున్నది.

(పుట్టినది యెల్లఁ బదార్థమే యగును — అభావ మైనచోఁ బుట్టునని చెప్పఁబడ నేరదు - అని భావము.

విప్రతిపన్నాన్ప్రతి తు శబ్దగుణానుమేయత్వం వక్తవ్యమ్.

(విప్రతిపన్నాన్ ప్రతి=) కేవలశ్రుతివాక్యమును విశ్వసించనివారికి (హేతువు గూడఁ జెప్పవలసియున్నందున) (శబ్ద ... యత్వం=) 'ఆకాశము' శబ్దగుణము గల్గియున్నందున నది యొకవస్తువే యగునని యనుమానింపవచ్చునని (వక్తవ్యం=) చెప్పవలసియున్నది.

గంధాదీనాం గుణానాం పృథివ్యాదివస్త్వాశ్రయత్వదర్శనాత్.

(గంధా ... గుణానాం=) గంధరసరూపస్పర్శము లనెడిగుణములు వరుసగా (పృథి .... ర్శనాత్ =) పృథివిని - జలమును - అగ్నిని - వాయువును నాశ్రయించుకొనియున్నట్లు స్పష్ట మైనవిషయమే గదా! (ఇట్టిగుణముల కాశ్రయ మైన హేతువుచేతఁ బృథివ్యప్తేజోవాయువులను వస్తువులనుగా నంగీకరించినప్పుడు శబ్దగుణమున కాశ్రయ మైనయాకాశముమాత్రము వస్తువని యేల యంగీకరింపఁగూడదని భావము)

అపి చావరణాభావమాత్ర మాకాశ మిచ్ఛత స్తవైకస్మిన్ సుపర్ణే పత, త్యావరణస్య విద్యమానత్వాత్. సుపర్ణాంతర స్యోత్పిత్సతోఽనవకాశత్వప్రసంగః.

(అపిచ ... స్తవ=) మఱియు నాకాశమనఁగా 'ఆవరణము' (ఆక్రమణము = Covering) లేకపోవుటమాత్రమే యని వాదింపఁదలఁచుకొన్న బౌద్ధపూర్వపక్షి (వైనాశికు) సమాధానము లేకపోలేకు చూడుఁడు.

(ఏకస్మిన్ ... పతతి ) ఒకపక్షి (ఆకాశములోని కెగురఁగా) (ఆవర ... నత్వాత్ =) ఆవరణము లేదని నీవు చెప్పు నాకాశమున కావరణ మేర్పడినట్లు స్పష్టమగుచున్నందున (అనఁగా - ఆవరణము లేని దేదియో యది యొకపక్షిచేత నాక్రమింపఁబడినందున) (ఉత్పిత్సతః సుపర్ణాంతరస్య =) పై కెగురఁదలఁచుకొన్న మఱి యొకపక్షికి (అనవ ... సంగః_) నం దవకాశము లేదనియే చెప్పవలసివచ్చును.

(ఆవరణము లేనిదానికి మొదటిపక్షియే యావరణముగా నేర్పడినప్పుడు మఱియొకపక్షి యందుఁ జొచ్చుట కవకాశ ముండదని భావము )

యత్రావరణాభావ స్తత్ర పతిష్యతీతిచేత్. యేనావరణాభావో విశేష్యతే తత్తర్హి వస్తుభూతమే వాకాశం స్యా న్నావరణాభావమాత్రమ్.

(మొదటిపక్షి యెగిరినచో నాపక్షిచే నాక్రమింపఁబడి యందు మఱియొకపక్షి ప్రవేశించుట కవకాశము లేకపోయినఁ బోనిండు) (యత్రా ... భావః=) ఏచోటు మొదటిపక్షిచే నాక్రమింపఁబడకుండునో (తత్ర .... చేత్ =) అందు రెండవపక్షి యేల యెగురఁగూడ దందువేమో (యేనా ... విశేష్యతే=) (ఆక్రమింపఁబడిన ప్రదేశ మనియు) ఆక్రమింపఁబడనిప్రదేశ మనియు వేఱుపఱచి నీ వెట్లు చెప్పఁ గల్గితివో (తత్తర్హి -) యాహేతువుచేతనే (వస్తు ... స్యాత్ =) ఆకాశమనఁగా నొకప్రత్యేకవస్తువే యగునుగాని (న + ఆవరణాభావమాత్రం=) ఆవరణము లేనిది మాత్రమే యగుటకు వీలులేదు.

అపి చావరణాభావమాత్ర మాకాశం మన్యమానస్య సౌగతస్య స్వాభ్యుపగమవిరోధః ప్రసజ్యేత సౌగతే సమయే.

(అపిచ=) అంతియేగాకుండ (ఆవర ... సౌగతస్య=) ఆకాశమనఁగా నావరణము లేకపోవుటయేగాని యొకప్రత్యేకవస్తువు గాదని బౌద్ధుఁడు (- సౌగతుఁడు) వాదించుచో, (స్వాభ్యు ... ప్రసజ్యేత=) అది తన (బౌద్ధ) సిద్ధాంతమునకు ముప్పు దెచ్చిపెట్టినట్లే యగునుజుమా! ఎట్లనఁగా— సౌగతుల (= బౌద్ధుల) సిద్ధాంతమందు ప్రశ్నప్రతివచనరూప మైనయీక్రిందిసంభాషణమును జూడుఁడు !

'పృథివీ హి భగవన్ కింసన్నిశ్రయా?' (ప్రశ్నః)

(భగవన్ =) స్వామీ! (పృథివీ =) పృథివి యనుభూతము (కింసన్నిశ్రయా =) దేః మీఁద నాధారపడియున్నది?'

ఇత్యస్మిన్ ప్రశ్నప్రతివచనప్రవాహే పృథివ్యాదీనా మంతే.

(ఇత్య ... దీనాం =) ఈవిధముగాఁ బృథివి మొదలు మూఁడుభూతములు (పృథివ్యప్తేజములు)ఒక్కొక్కటి దేనిమీఁదనాధారపడి యున్నవో చెప్పుమని ప్రశ్నలును, బృథివిజలముమీఁదను, జలమగ్నిమీఁదను, అగ్ని వాయువుమీఁదను నాధారపడియున్నవని చెప్పఁబడినసమాధానములును నయినతరువాత (అంతే =) కడపట

'వాయుః కింసన్నిశ్రయః?' (ప్రశ్నః) —

'వాయువు దేనిమీఁద నాధారపడియున్నడి?'

ఇత్యస్య ప్రశ్నస్య ప్రతివచనం భవతి

(ఇత్యస్య ..భవతి) అని వేయఁబడినప్రశ్నమున కీక్రిందిసమాధాన మీయఁబడినది చూడుఁడు.

'వాయు రాకాశసన్నిశ్రయః' ఇతి.

'వాయు వాకాశముమీఁద నాధారపడియున్నది.' (సమాధానము)

తదాకాశ స్యావస్తుత్వే న సమంజసం స్యాత్.

తత్ =) ఈకడపటి ప్రత్యుత్తరము (ఆకాశస్య + అవస్తుత్వే =) ఆకాశమనునదిగూడ (మిగిలిననాల్గుభూతములవలె, వస్తువు గానిచో, (సమంజసమ్ + న స్యాత్ =) సరియైనది గాకపోవలసివచ్చునుగదా!

తస్మా దప్యయుక్త మాకాశ స్యావస్తుత్వమ్.

(తస్మాదపి =) ఈహేతువువలనఁగూడ (ఆకాశ ... స్తుత్వం =) 'ఆకాశమనునది వస్తువు గాదు' అని వాదించుట (అయుక్తః =) యుక్తమైనవాదము గాదు.

అపిచ నిరోధద్వయ, మాకాశం చ త్రయమ ప్యేత న్నిరుపాఖ్య మవస్తు నిత్యంచేతి విప్రతిషిద్ధమ్.

(అపిచ =) మఱియును (నిరోధ ... మవస్తు =) ప్రతిసంఖ్యావినాశము-అప్రతిసంఖ్యావినాశము నను నీరెంటను, నాకాశ మనునదియు మొత్తము మూఁడుగూడ నిట్టివని చెప్పుటకు వీలు లేని స్వరూపరహితములైన యభావములని యొక

చోటను (నిత్యంచ) అవి నిత్యములని మఱియొకచోటను బౌద్ధులు చేసినసిద్ధాంత మంతయు (విప్రతిషిద్ధం=) పరస్పరవిరుద్ధము.

న హ్యవస్తునో నిత్యత్వ మనిత్యత్వం వా సంభవతి.

(అవస్తునః=) వస్తువు గానియభావమగునది (నిత్య ... త్వంవా) నిత్యము, అనిత్యము నగుట (నహి సంభవతి=) యెన్నటికిని సంభవింపదు. ఎందుచేతననఁగా-

వస్త్వాశ్రయత్వా ద్ధర్మధర్మివ్యవహారస్య. ధర్మధర్మిభావే హి ఘటాదివ ద్వస్తుత్వమేవ స్యా న్న నిరుపాఖ్యత్వమ్.

(ధర్మ .... రస్య=) వస్తువుయొక్క ధర్మము (ఆకాశధర్మమైనశబ్దము వంటిది) ధర్మముగలవస్తువు (శబ్దధర్మము గలయాకాశమువంటిది) అని చేయఁబడువ్యవహారము (వస్త్వాశ్రయత్వాత్=) యథార్థమైనవస్తువునాఁడ నాధారపడియే యుండును (అనఁగా వస్తువే యభావమైనచో నట్టివ్యవహార ముండఁజాలదని భావము) (ధర్మధర్మిభావేహి=) అట్టిధర్మధర్మివ్యవహార మున్నచో (ఘటాదివత్=) కుండమొదలగు వస్తువులున్నవియే యని యెట్లు నిశ్చయమో (వస్తుత్వమేవ స్యాత్=) అట్లె యథార్థమైనవస్తు వొకటి యున్నదనియే నిశ్చయింపవలెనుగాని (న-నిరుపాఖ్యత్వం=) యిట్టిదని చెప్పుటకు వీలులేనియభావమని యెంచ వలనుపడదు.

25 సూత్రావతారిక :—

క్రిందటిమూఁడుసూత్రములలోఁ బ్రతిసంఖ్యావినాశము - అప్రతిసంఖ్యావినాశము, ప్రతిసంఖ్యావినాశములో నంతర్భాగమైనయవిద్యావినాశము - ఆకాశము ననునవి యభావరూపములే యనెడిబౌద్ధులవాదము నిరాకరింపఁబడినది. భూతభౌతికములతోఁబాటాత్మయు (=జీవుఁడును) క్షణికమే యని— అనఁగా క్షణకాలములో నశించిపోవువాఁడే యని చేయుబౌద్ధులవాద మీసూత్రమందు నిరాకరింపఁబడు చున్నది.

## ౨౫ సూ॥ అనుస్మృతేశ్చ.

ప॥ వి॥ — అనుస్మృతేః + చ

ప్ర॥ప॥అ :— అనుస్మృతేః + చ= అనుభవానుగతమైనస్మృతి యుండుట వలన.

సూత్రార్థము — అనుభవానుగత మైనస్మృతి యుండుటవలన (స్మృతిగల జీవుఁడు క్షణికుఁ డని చెప్పుటకు వీలు లేదు.)

భాష్యము — భాష్యార్థము

అపిచ వైనాశిక స్సర్వస్య వస్తునః క్షణికతా మభ్యుపయ, న్నుపలబ్ధురపి క్షణికతా మభ్యుపేయాత్; నచ సా సంభవతి.

(అపిచ=) మఱియింకేమనఁగా, (వైనాశికః=) వైనాశికులగు బౌద్ధులు (సర్వస్య వస్తునః=) సమస్త వస్తువులును (క్షణికతాం=) క్షణకాలములో నశించిపోవునవియే యని (అభ్యుపయన్=) సిద్ధాంతముచేసినప్పుడు, (ఉపలబ్ధుః + అపి=) గ్రహించువాఁడుగూడ (=జీవుఁడుగూడ) (క్షణికతాం=) క్షణకాలములో నశించిపోవువాఁడే యని (అభ్యుపేయాత్=) యంగీకరించినట్లు యగునుగదా! (సా=) జీవునికిఁ జెప్పు క్షణికత్వము - అనఁగా జీవుఁడును క్షణములో నశించిపోవువాఁడే యనుట (నచ సంభవతి=) ఎన్నటికిని సంభవింపదు. ఏదుచే ననఁగా.

అనుస్మృతేః.

జీవుని కనుస్మృతి కనిపించుచుండుటవలన.

అనుభవ ముపలబ్ధి మనూత్పద్యమానం స్మరణ మేవానుస్మృతిః.

అనుస్మృతి యనఁగా నేమనఁగా— (అనుభవ ముపలబ్ధిం=) ఉపలబ్ధి యనెడి పూర్వానుభవమును (అను + ఉత్పద్యమానం=) ననుసరించి (తరువాత) పుట్టునట్టి (స్మరణమేవ=) స్మరణమే యనఁగా జ్ఞప్తియే (అనుస్మృతిః=) అనుస్మృతియని చెప్పఁబడును.

సా చోపలబ్ధ్యేకకర్తృకా సతీ సంభవతి.

(సా-చ=) ఆయనుస్మృతి (జ్ఞప్తి) (ఉపల ... సతీ=) ఉపలబ్ధితోఁ బాటు (పూర్వానుభవముతోఁ బాటు) కర్త యొకఁడుగానే గల్గియున్నప్పుడే- అనఁగాఁ బూర్వవిషయము ననుభవించినవాఁడును, దరువాత నాపూర్వవిషయమును జ్ఞప్తికిఁ దెచ్చుకొన్నవాఁడును నొకఁడుగా నున్నప్పుడే (అది- అనఁగా- ఆయనుస్మృతి (సంభవతి=) సంభవింపఁగలదు.

పురుషాంతరోపలబ్ధే విషయే పురుషాంతరస్య స్మృత్యదర్శనాత్.

(పురుషాం .... విషయే =) ఒకపురుషునిచేత ననుభవింపఁబడినవిషయము

(పురుషా ... దర్శనాత్ =) మఱియొకపురుషుని యొక్క జ్ఞప్తిలోనికి వచ్చుట యెక్కడను గనఁబడదు (=అదర్శనాత్)

కథం హ్యహ మదో౽ద్రాక్ష మిద మిదానీం పశ్యామీతి చ పూర్వోత్తరదర్శి న్యేకస్మి న్నసతి ప్రత్యయ స్స్యాత్.

(అహ మదో .... పశ్యామి=) నే నిదివఱకు దానిని జూచితిని, దానినే యిప్పుడు చూచుచున్నాను. (ఇతి చ =) అనివల్కుట (పూర్వో ... న్నసతి =) పూర్వము చూచినవాఁడును, ఇప్పుడు చూచుచున్నవాఁడును నొకఁడే గానిచో (ప్రత్యయః కథం స్యాత్ =) అట్టియనుస్మృతి (జ్ఞప్తి) గల్గుట యెట్లు ?

అపిచ దర్శనస్మరణయోః కర్త ర్యేకస్మిన్ ప్రత్యక్షః ప్రత్యభిజ్ఞాప్రత్యయ స్సర్వస్య లోకస్య ప్రసిద్ధో౽హ మదో౽ద్రాక్ష మిదం పశ్యామీతి.

('అహ మదో...పశ్యామి' ఇతి) 'నే నింతకు ముందు దానిని జూచితిని; దానినే యిప్పుడు చూచుచున్నాను' అని (ప్రత్య ... ప్రత్యయః=) ప్రత్యక్షముగా – అనఁగా సర్వసాధారణముగా జ్ఞప్తికిఁ దెచ్చుకొనువిషయము(దర్శనస్మరణయోః=) పూర్వము చూచుటకు – ఆచూచినదానినే యిప్పుడు స్మరించుటకు (ఏకస్మిన్ కర్తరి=) కర్త యొకఁడై యున్నప్పుడే సంభవించుట (సర్వస్య ... ప్రసిద్ధః=) యందఱకుఁ దెలిసిన విషయమే.

యది హి తయో ర్భిన్నః కర్తా స్యాత్, తతో౽హం స్మరా మ్యద్రాక్షీ దన్య ఇతి ప్రతీయాత్.

(తయోః=) ఆపూర్వానుభవ ప్రస్తుతస్మరణములకు (భిన్నః కర్తా=) వేఱు వేఱుకర్తలు – అనఁగాఁ బూర్వము చూచినవాఁ డొకఁడు, ఇపుడు స్మరించువాఁడు మఱియొకఁడు (యది స్యాత్ =) అగుచో (తతః=) అట్టిసందర్భమందు ('అహం స్మరా మ్యద్రాక్షీ దన్యః'=) 'నేనిప్పుడు స్మరించుచున్నాను; మఱియొకఁ డిదివఱకు దానిని జూచెను' – అనఁగా 'మఱియొకఁ డిదివఱకు దానిని జూచుట నా కిప్పుడు జ్ఞప్తికి వచ్చినది' (ఇతి ప్రతీయాత్ =) అని తోఁచుట సంభవించెడిది.

న త్వేవం ప్రత్యేతి కశ్చిత్.

(ఏవం=) ఈతీరుగా (కశ్చిత్ =) ఎవఁడును (నప్రత్యేతి=) గ్రహించుట సంభవింపదు (అనఁగా- బూర్వ మొకఁడు చూచినవిషయమును మఱియొకఁ డిప్పుడు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుట యెన్నటికిని సంభవింపదని భావము.)

యత్త్రైవం ప్రత్యయ స్తత్ర దర్శనస్మరణయో ర్భిన్నమేవ కర్తారం సర్వో లోకోఽవగచ్ఛతి. స్మరా మ్యహ మసా వదోఽద్రాక్షీదితి.

(యత్ర + ఏవంప్రత్యయః =) ఇట్టిస్మరణవ్యవహార మెక్కడ నుండునో (తత్ర=) యక్కడ- అనఁగా 'వాఁడు చూచెను, నాకు జ్ఞప్తికి వచ్చుచున్నది' అను వ్యవహార మున్నచోట (దర్శన .... కర్తారం=) పూర్వము చూచుట- యిప్పుడు స్మరించుట యనెడిక్రియలకు (భిన్నమేవ కర్తారం=) వేఱువేఱు కర్తలై యుందురని (సర్వో ... గచ్ఛతి=) సర్వసామాన్యజనులును దెలిసికొనఁగల్గియేయుందురు- అట్టి సందర్భములో-అనఁగాఁ కర్తలు వేఱువేఱుగా నున్నప్పుడు (స్మరా...ద్రాక్షీదితి=) 'నా కిప్పుడు జ్ఞప్తికి వచ్చుచున్నది; వాఁడిదిఁ జూచెను'- అనునట్టివ్యవహారమే యుండవలసియుండును.

ఇహ త్వహ మదోఽద్రాక్ష మితి దర్శనస్మరణయో ర్వైనాశికోఽ ప్యాత్మానమే వైకం కర్తార మవగచ్ఛతి.

(ఇహతు=) ప్రస్తుతాంశమం దన్ననో- (దర్శనస్మరణయోః=) పూర్వము చూచుట, యిప్పుడు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుట యనుక్రియలకు (ఆత్మా ...కర్తారం=) దానైనవాఁడొకఁడే కర్త యని (వైనాశికోపి + అవగచ్ఛతి =) వైనాశికుఁడైన బౌద్ధుఁడుసైత మెఱిఁగియే యుండును; గాని

న నాహ మిత్యాత్మనో దర్శనం నిర్వృత్తం నిహ్నుతే యథాఽగ్ని రనుష్ణోఽప్రకాశ ఇతి వా.

(అగ్ని ....ఇతివా=) 'నిప్పు గాలదు వెలుఁగదు' అని చెప్పుటమూలముగాఁ బ్రత్యక్షానుభవసిద్ధ మగువిషయమును (యథా న నిహ్నుతే=)గప్పివేయుట యెట్లసాధ్యమో యట్లే నే నిదివఱకుఁ జూచితి ననుచోట ('నాహ'మితి=) 'పూర్వము చూచినవాఁడను నేను గా' నని చెప్పుటమూలముగా (నిర్వృత్తం )స్పష్టముగా జరిగిన విషయమును - అనఁగా (ఆత్మనః దర్శనం=) చూచినవాఁ డీతానే యనువిషయమును (న నిహ్నుతే=) గప్పి వేయుట యసంభవము.

తత్రైవం స త్యేకస్య దర్శనస్మరణక్షణద్వయసంబంధే క్షణికత్వాభ్యుపగమహాని రపరిహార్యా వైనాశికస్య స్యాత్.

(తత్ర + ఏవఁసతి=) ఈవిషయ మిట్లుండుటను బట్టి (ఏకస్య=) ఒక్కయాత్మయే- అనఁగా- ఈతానే (దర్శన .... సంబంధే) పూర్వము చూచిన కాల

ముతో నిప్పు డావిషయమును జ్ఞప్తికిఁ దెచ్చుకొన్న కాలముతోడను సంబంధపడియుండుటవలన (వైనాశికస్య క్షణిక ... హానిః=) ఆత్మయు, (అనఁగా జీవుఁడును) క్షణకాలమాత్రములోనే నశించిపోవువాఁడే యని వైనాశికుఁడు (=బౌద్ధుఁడు) చేయు సిద్ధాంతమునకు భంగపాటు (అపరిహార్యా స్యాత్=) తప్పక వచ్చియే తీరును.

(ఆత్మకు- అనఁగా జీవునకు క్షణికత్వము చెప్పుబౌద్ధసిద్ధాంత మెంతయు నిల్వఁదగినది కాదని భావము.)

తథాఽనంతరా మనంతరా మాత్మనఏవ ప్రతిపత్తిం ప్రత్యభిజానన్నేకకర్తృకా మోత్తమాదుచ్ఛ్వాసా దతీతాశ్చ ప్రతిపత్తీ రాజన్మన ఆత్మైకకర్తృకాః ప్రతిసందధానః కథం క్షణభంగవాదీ వైనాశికో నాపత్రపేత ?

(తథా=) అట్లే (ఆ+ఉత్తమాత్+ఉచ్ఛ్వాసాత్=) ఇప్పటినుండి కొనయూపిరివఱకు (అనంతరాం+అనంతరాం=) ఒకటితరువాత నొకటిగా (ఆత్మనః+ఏవ=)తననుండియే జరుగనున్న ప్రతిపత్తిం=) వ్యవహారము లన్నిఁటికిఁ (ఏకకర్తృకాం=) కర్త తానొకఁడే యని (ప్రత్యభిజానన్=) గుర్తించువాఁ డగుచో, (ఆజన్మనః=) పుట్టినప్పటినుండి యిప్పటివఱకుఁ దననుండి (అతీతాశ్చ ప్రతిపత్తీః=) జరిగినవ్యవహారము లన్నింటికిఁ (ఆత్మైకకర్తృకాః=) దానొకఁడే కర్తయని (ప్రతిసందధానః=) అనుసంధానము చేయువాఁడగుచో (క్షణభంగవాదీ=) తా ననునాత్మ (=జీవుఁడు) క్షణకాలములో నశించిపోవునదియేయని వాదించు (వైనాశికః=) వైనాశికుఁ డగుబౌద్ధుఁడు (కథం - న+అపత్రపేత=) ఎట్లు సిగ్గుపడకుండును !?

(అనఁగా– తాను బుట్టినప్పటినుండి చచ్చువఱకుఁ బ్రతిక్షణము వ్యవహరించుచుండుట తనకుఁ బ్రత్యక్షసిద్ధవిషయమై యుండఁగాఁ దా ననునాత్మ యొకక్షణకాలములో నశించిపోవునదియే యని వైనాశికుఁడు వాదించుట కెట్లు సిగ్గుపడకుండునో! యని భావము.)

స యది బ్రూయాత్ సాదృశ్యా దేత త్సంపద్యతఇతి తం ప్రతి బ్రూయాత్.

(సాదృశ్యాత్=) ప్రత్యయము లన్నింటికిఁ– అనఁగా- అనుక్షణవ్యవహారము లన్నింటికిఁ కర్త యొకఁడే గాకపోయినప్పటికి - క్షణికము లగునాప్రత్యయము లన్నియు నొకదానిబోలి మఱియొకటి యుండుటవలన (ఏతత్=) ఆప్రత్యయము లన్నిఁటి'ని కర్త యొకఁడే యని భ్రాంతిపడుట (సంపద్యతే+ఇతి=) సంభవించుచున్నదని (సః- యది బ్రూయాత్=) వైనాశికుఁడు సమాధానము చెప్పునేమో (తం ప్రతి బ్రూయాత్ –, అట్టివానిఁగూర్చి యిదిగో ప్రత్యుత్తరము.

"తే నేదం సదృశ" మితి ద్వయాయత్తత్వా త్సాదృశ్యస్య క్షణభంగవాదినః సదృశయో ర్ద్వయో ర్వస్తునో ర్గ్రహీతు రేకస్యాభావాత్ సాదృశ్యనిమిత్తం ప్రతిసంధానమితి మిథ్యాప్రలాపఏవ స్యాత్.

'(తేన + ఇదం సదృశం =) 'దానితో నిది సమానమగును' (ఇతి =) అని (సాదృశ్యస్య=) పోల్చిచెప్పెడివిషయము (ద్వయాయత్తత్వాత్ =) రెంటిమీఁద– అనఁగా వెనుకటిప్రత్యయము (వస్తువు) వలెఁ దరువాతిప్రత్యయ మున్నదని చెప్పఁగల్గుట రెండుప్రత్యయములను జూచుటమీఁద నాధారపడియుండుటవలనను– (క్షణభంగవాదినః=) ఆత్మ యను జీవుఁడు క్షణకాలములో నశించిపోవువాఁడే యని వాదించు వైనాశికబౌద్ధునకు (సదృశ ... వస్తు ః=) సమానము లగు రెండు (భిన్న క్షణములయందలి) ప్రత్యయములను– (అనఁగా రెండువస్తువులను) (గ్రహీతుః + ఏకస్య) గ్రహింపఁగలయొక జీవుఁడు (అభావాత్ = బౌద్ధమతమున లేకపోవుట వలన– (అనఁగా ప్రతివస్తువు– ప్రతిజీవుఁడు నొక్కక్షణకాలములోనే నశించిపోవువారు గావునను, (సాదృశ్యనిమిత్తంప్రతి సంధాన + ఇతి =) అన్నిప్రత్యయములకుఁ గర్త యొకఁడే యనుకొనుట– ఒకప్రత్యయమును బోలి మఱియొకప్రత్యయ ముండుటవలన సంభవించుచున్నదని సమాధానముచెప్పుట (మిథ్యాప్రలాపఏవ స్యాత్ =) పరస్పరాసంబద్ధసంభాషణము లొనర్చుపిచ్చివాని లేక మోసగాని యఱువులవంటివిగాక మఱేమి !

స్యాచ్చే త్పూర్వోత్తరయోః క్షణయో స్సాదృశ్యస్య గ్రహీ తైక స్తథాస త్యేకస్య క్షణద్వయావస్థానాత్ క్షణికత్వప్రతిజ్ఞా పీడ్యేత

(పూర్వోత్త ... క్షణయోః=) పూర్వోత్తరక్షణములయం దుండెడివస్తువులకుఁ జూపట్టు (సాదృశ్యస్య=) సాదృశ్యమును (=పోలికను) (గ్రహీతా=) గ్రహింపఁగలది ఏకః=) (ఆత్మ కాకపోయినను) మనస్సువంటి దేదియో యొకటి (స్యాత్ + చేత్ =) యున్నదని వైనాశికుఁడు చెప్పచో (తథాసతి=) అట్లు చెప్పినను (ఏకస్య=) ఏదియో యాయొకటియే (క్షణద్వయావస్థానాత్ =) పూర్వోత్తరక్షణముల రెంటి యందును నున్నట్లె యొప్పుకొనవలసియున్నందున నప్పుడు గూడ (క్షణికత్వప్రతిజ్ఞా=) సమస్తము నొకక్షణకాలముమాత్రమే యుండు ననెడిబౌద్ధసిద్ధాంతము (పీడ్యేత=) భంగపడియే పోవును.

తేనేదం సదృశమితి ప్రత్యయాంతర మేవేదం న పూర్వోత్తరక్షణద్వయగ్రహణనిమిత్త మితి చే న్న.

('తేనేదం సదృశం'- ఇతి) 'ఇది దానిని బోలియున్నది' యని (ఇదం=) తలఁచుట యేది గలదో యది (ప్రత్య ... మేవ=) ప్రత్యేకమైనక్రొత్తతలంపే (గ్రహణవిషయమే) గాని (న-పూర్వో .... నిమిత్తం=) పూర్వోత్తరక్షణములయం దుండెడివస్తువులను గ్రహింపఁగల్గుటచే నేర్పడినది గాదు. (ఇతిచేత్=) అని వాదించుచో (న=) అట్లు వాదించుటకును వీలు లేదు. ఎందుచేననఁగా-

తే నేదం సదృశ మితి భిన్నపదార్థోపాదానాత్.

(తే నేదం సదృశం- ఇతి) 'దానిని బోలి యిది యున్నది' యని చెప్పుటలో (భిన్న .... దానాత్=) (పోలిక నిమిత్తమై మనస్సు గ్రహించిన) రెండుభిన్నవస్తువులను (అనఁగా రెండుభిన్నక్షణములయం దుండుపదార్థములను దెలుపు 'అది'- 'ఇది' యనుశబ్దములు పేర్కొనఁబడియున్నవిగదా! ఇది దానిని బోలియున్నది యని కల్గిన తలంపు (=ప్రత్యయము) పూర్వోత్తరకాలములయందలి వస్తువుల యనుభవముతో సంబంధము లేనియొకక్రొత్తవిషయమనియు చెప్ప వలనుగాదు- అని భావము.)

ప్రత్యయాంతర మేవచేత్ సాదృశ్యవిషయం స్యాత్. తేనేదం సదృశ మితి వాక్య ప్రయోగోఽనర్థక స్స్యాత్.

(సాదృశ్యవిషయం=) 'ఇది దానింబోలియున్నది' యని పోలికను జేసినమనో వృత్తి (ప్రత్యయాంతర మేవ=) (పూర్వోత్తరక్షణములయందలి వస్తువుల బొత్తుగా నెఱుఁగని) మనస్సుయొక్క క్రొత్తవృత్తియే (స్యాత్ చేత్=) యగునన్నచో, అట్టి సందర్భములో ('తేనేదం సదృశ' మితి) ఇది దానింబోలియున్నది యను (వాక్య ప్రయోగః=) మాటలపొందిక (అనర్థకః స్యాత్=) వ్యర్థమని యెంచవలసినదే-

సాదృశ్య మిత్యేవ ప్రయోగః ప్రాప్నుయాత్.

(సాదృశ్యం' + ఇత్యేవ) ('దానితో' — 'ఇది' యని భిన్నక్షణములయందలి విషయములను దెలుపుమాటల నుపయోగింపకుండఁ గేవలముగా) 'పోలిక' యని మాత్రమే (ప్రయోగః ప్రాప్నుయాత్) మనుష్యునకు దోచవలసియుండెడిది.

యదా హి లోకప్రసిద్ధః పదార్థః పరీక్షకై ర్న పరిగృహ్యతే. తదా స్వపక్షసిద్ధిః పరపక్షదోషో వా ఉభయమ ప్యుచ్యమానం పరీక్షకాణా మాత్మనశ్చ యథార్థత్వేన న బుద్ధిసంతాన మారోహతి.

(యదా హి=) ఎప్పుడైనను (పరీక్షకైః=) తత్త్వపరిశోధకుల మనుపేరుతో వాదమునకుఁ బూనుకొన్నవారు తమవాదపోషణమునకై (లోకప్ర ... దార్థః=)

లోక మెల్లరకుఁ బ్రత్యక్షానుభవసిద్ధ మైనవిషయమును-అనఁగా- 'నిప్పు గాలును- వెలుఁగును' అనునట్టివిషయమునే (న పరిగృహ్యతే=) యంగీకరింపరో - అనఁగా- అంగీకరింపక యే వాదమును జేయుదురో (తదా=) అప్పుడు (స్వపక్షసిద్ధిః=) తమ వాదము నెగ్గినదనిగాని, (పరపక్షదోషో వా=) పరవాదము దూషితమై యోడినదని గాని (తలఁచినఁ దలఁతురుగాక) అట్లయినను (ఉభయమపి+ఉచ్యమానం=) తమ వాదపోషణమునకుఁ బరవాదదూషణమునకు రెంటికిని బ్రయోగించిన తమవాద వచోధోరణి (యథార్థత్వేన=) యథార్థమునకు (పరీక్షకాణాం=) తత్త్వవేత్తల యొక్కయేగాక (ఆత్మనశ్చ=) దనయొక్కయుఁగూడ (బుద్ధిసంతానం=) బుద్ధిపరంపరలకు - అనఁగా- అంతరాత్మలకు (న+ఆరోహతి=) నెక్కఁజాలదు.

ఏవమేవైషోఽర్థ ఇతి నిశ్చితం యత్తదేవ వక్తవ్యమ్. తతోఽన్య దుచ్యమానం బహుప్రలాపిత్వ మాత్మనః కేవలం ప్రఖ్యాపయేత్.

('ఏవమేవ - ఏషః - అర్థః'=) 'ఈవిషయ మిట్టిదే' (ఇతి=) యని (యత్ - నిశ్చితం=) యేది యనుభవానుసారము నిశ్చయింపఁబడునో (తత్+ఏవ - వక్తవ్యం=) దాని నట్లే చెప్పుట యుక్తము.

(తతః=) అట్టినిశ్చితాభిప్రాయముకంటె (అన్యత్=) మఱియొకటి (ఉచ్యమానం=) చెప్పఁబడినచో నది, (ఆత్మనః=) అట్లు చెప్పువానియొక్క (బహుప్రలాపిత్వం=) పిచ్చివ్రేలుడుగానే (ప్రఖ్యాపయేత్=) లోకమునకుఁ దెలియఁగలదు.

న చాయం సాదృశ్యా త్సంవ్యవహారో యుక్తః. తద్భావావగమా, త్తత్సదృశభావానవగమాచ్చ.

(అయం సంవ్యవహారః=) 'నే నిదివఱకు దీనిని జూచితిని' అను నీమొదలగు ప్రయోగము లున్నచోట స్ఫురించు ప్రత్యభిజ్ఞావ్యవహారము- అనఁగా- పూర్వమనుభవించినవిషయము తరువాత జ్ఞప్తికి వచ్చుట యనునది (సాదృశ్యాత్=) పూర్వప్రత్యయమును- అనఁగాఁ బూర్వానుభవమును నిప్పటియనుభవము పోలి యుండుటవలనఁ గల్గుచున్నదిగాని పూర్వ మావిషయము ననుభవించినవాఁడును నిప్పు డావిషయము ననుభవించినవాఁడును నొకఁడే యగుటవలనఁ గాదుసుమా యని వాదించుట (న యుక్తః=) యుక్తము గాదు. ఎందుచేతననఁగాఁ- (తద్భావావగమాత్=) బూర్వవిషయ మపు డెట్లున్నదో యిపు డట్లే కనిపించుచున్నదిగాని (తత్సదృ ... గమాచ్చ=) ఇప్పటివిషయము పూర్వవిషయమువలె నున్నట్లు గనిపించుట లేదు.

భవేదపి కదాచి ద్బాహ్యవస్తుని విప్రలంభసంభవాత్ తదే వేదం స్యా త్తత్సదృశం వేతి సందేహః,

(కదాచిత్=) కొన్ని వేళల- అనఁగాఁ గొన్నిసందర్భములయందుఁ (బాహ్యా స్తుని=) దనకు వెలుపల నుండు నేదోయొక వస్తువువిషయములో (విప్రలంభ ంభవాత్=) భ్రాంతిరూప మైనవ్యత్యాసము దోఁచుట కవకాశ మున్నందున తదేవ+ఇదం స్యాత్=) 'అదియే యిది యగునా' లేక (తత్స - వా+ఇతి=) యిది దానిని బోలిన మఱియొకటి యగునా' యని (భవేత్+అపి - సందేహః=) ందేహము గల్గిఁ గలుగవచ్చును.

ఉపలబ్ధరి తు సందేహోఽపి న కదాచి ద్భవతి సఏవాహం స్యాం తత్సదృశో వేతి.

(ఉపలబ్ధరి తు=) పూర్వోత్తరవిషయముల ననుభవించినవాని విషయములో న్ననో ('స ఏవాహం స్యాం'=) పూర్వవిషయము ననుభవించినవాఁడను నేనేనా- క (తత్సదృశః- వా' + ఇతి) వానిఁ బోలిన మఱియొకఁడనా యని (సందేహః=) ందేహము (కదాచిత్=) ఒకప్పుడేనియుఁ (నభవతి=) గలుగఁబోదుగదా!

ఎందుచేత ననఁగా —

యఏ వాహం పూర్వేద్యు రద్రాక్షం సఏవాహ మద్య స్మరామీతి నిశ్చితా త్తద్భావోపలంభాత్

(యః+ఏవ+అహం=) ఏనేనే (పూర్వేద్యుః) నిన్న (అద్రాక్షం=) దీనిని జూచితినో (సః+ఏవ+అహం=) ఆనేనే (అద్య=) యీదినము (స్మరామి- ఇతి=) దానిని జ్ఞప్తికి దెచ్చుకొనుచున్నాను-అని (నిశ్చితాత్=) నిశ్చయమగుట లననే (తద్భావోపలంభాత్=) యట్టిభావము- అనఁగా నిన్నఁజూచినవాఁడును, నేఁడు చూచినవాఁడును నొకఁడే యనుభావము స్ఫురించుట గల్గుచున్నది.

తస్మాద ప్యనుపపన్నో వైనాశికసమయః,

(తస్మాత్+అపి=) కాఁబట్టి యీహేతువువలననుగూడ (వైనాశికసమయః= జీవుఁడును క్షణకాలములో నశించిపోవువాఁడే యనువైనాశికబౌద్ధుల సిద్ధాంతము అనుపపన్నః=) యుక్తమైనది గాదు.

26 సూత్రావతారిక :—

వైనాశికు లైనబౌద్ధులు వాదించుచుఁజెప్పిన 'ఆత్మ' యనుజీవుఁడు క్షణికుఁడు- అనఁగా క్షణకాలములో నశించిపోవువాఁడు- అనిచెప్పుట సాధ్యము గాదని క్రిందటి

25 సూత్రమందు నిర్ధారణము చేయఁబడినది. బౌద్ధులవాదానుసారము సర్వపదార్థములు క్షణికములే యగుచో, నట్టిక్షణికపదార్థములనుండి కార్యోత్పత్తి కాఁజాలదని లోఁగడి 21 సూత్రమందు వివరింపఁబడియున్నది. ఆసూత్రమే యిపుడు మఱింత విపులీకరింపఁబడుచున్నది. ఎట్లనఁగా సర్వపదార్థములు క్షణికములే యగుచో, నొక పదార్థము క్షణకాల ముండి నశించినది — అనఁగా — దానినాశముతో నభావ మేర్పడినది యని చెప్పినట్లె యగును. ఇఁక నుత్తరపదార్థము పుట్టుట కాధారము 'అభావమే' యని చెప్పవలయునుగాని నాశన మైనపూర్వపదార్థమని చెప్పుటకు వీలులేదు. కాని యొకక్షణికపదార్థము నశించిపోయినతరువాత మఱియొకక్షణిక పదార్థము పుట్టుచున్నదని బౌద్ధులు చెప్పుచున్నందున నభావమునుండి పదార్థము పుట్టుచున్నట్లుగా వారిసిద్ధాంత మనుట స్పష్టము ఇట్టివారిసిద్ధాంతమున్నైతము చెల్లఁ దగినది గాదని యీ 26 సూత్రమందు నిరూపింపఁబడుచున్నది.

## ౨౬ సూ॥ నాసతోఽదృష్టత్వాత్.

ప॥ వి॥ — న – అసతః – అదృష్టత్వాత్.

అన్వయక్రమము :— అసతః – న – అదృష్టత్వాత్.

ప్ర॥ ప॥ అ॥ — అసతః = లేనిదానినుండి. న = లేదు; అదృష్టత్వాత్ = కనఁబడకుండుటవలన.

సూత్రార్థము :— (అసతః =) అసత్తునుండి - అనఁగా లేనిదానినుండి — అభావమునుండి (న=) కార్యోత్పత్తి లేదు ఎందుచేతనఁగా (అదృష్టత్వాత్ =) అట్టి విషయము లోకమం దెన్నఁడును గనిపించనందున—

భాష్యసంగ్రహభావము :—

(అసతః=) అభావమునుండి భావోత్పత్తియగుట— అనఁగా - 'నానుపమృద్య ప్రాదుర్భావాత్ = అభావమును జెందినకారణమునుండియే కార్యము పుట్టును— అను వైనాశికుల సిద్ధాంతానుసార మగుచుండుట.

(న) ఎప్పటికిని సంభవింపదు ఎందుచేతనఁగా

(అదృష్టత్వాత్ =) అభావము లగుకుందేటికొమ్ము మొదలగువానినుండి మొలకలు మొదలగునవి పుట్టుట కనిపింపనందున.

భాష్యము — భాష్యార్థము

ఇత శ్చానుపపన్నో వైనాశికసమయః,

(వైనాశికసమయః=) వైనాశికబౌద్ధమతము (ఇతశ్చ=) మఱి యీక్రిందికార ణమువలననుగూడ (అనుపపన్నః=) సమంజసము గానిదియే.

యతః స్థిర మనుయాయికారణ మనభ్యుపగచ్ఛతా మభావా ద్భావోత్పత్తి రిత్యేత దాపద్యేత.

(యతః=) ఎందుచేతననఁగా, (స్థిర .... రణం =) స్థిరమైన కార్యముతో ననుసరించిపచ్చు- అనఁగాఁ - గార్యము పుట్టఁగానే నశించిపోక కార్యమందే కార్య రూపమున నుండుకారణపదార్థమును (అనభ్యుపగచ్ఛతాం =) అంగీకరింపనివారు (అభావాత్ =) అభావమునుండి (భావోత్పత్తిః=) భావము (=పదార్థము) పుట్టు చున్నది, (ఇత్యేత దాపద్యేత=) అనునీవిషయము నొప్పుకొన్నట్లు యగుచున్నది.

(అత్ర=) ఈ విషయమందు 'నానుపమృద్య ప్రాదుర్భావాత్'

దర్శయంతి చాత్రాభావా ద్భావోత్పత్తిం నానుపమృద్య ప్రాదుర్భావాత్ ఇతి.

'న + అనుపమృద్య=) తుడిచివేయఁబోవుట లేక- అనఁగాఁ గారణమును దుడిచివేసి (కార్యము) పుట్టును. అనఁగాఁ గారణము పోయి, కార్యము పుట్టును.- అనఁగాఁ గారణము లేకుండఁగనే కార్యము పుట్టును- అను నీబౌద్ధశాస్త్రప్రమాణ మునుబట్టిగూడ (అభా .... త్పత్తిం=) అభావమునుండి భావపదార్థము పుట్టు చున్నది యనువిషయమును (దర్శయంతి చ=) బౌద్ధులు ప్రకటించుచున్నారు. అనఁగా - వారియీసిద్ధాంతమునకు వారిశాస్త్రమునుండి ప్రమాణవాక్యమును గూడఁ జూపుచున్నారని భావము.)

వినష్టాద్ధి కిల బీజా దంకుర ఉత్పద్యతే. తథా వినష్టాత్ క్షీరా ద్దధి. మృత్పిండాచ్చ ఘటః. కూటస్థాచ్చే త్కారణా త్కార్య ముత్పద్యేత, అవిశేషా త్సర్వం సర్వత ఉత్పద్యేత.

(వినష్టాత్ + హి - బీజాత్ =) కనఁబడకుండఁబోయిన విత్తునుండియే (అంకురః=) మొలక (ఉత్పద్యతే - కిల=) పుట్టుచున్నదిగదా!

(తథా=) ఆప్రకారమే (వినష్టాత్ క్షీరాత్ దధి=) కనఁబడకుండఁ బోయిన పాలనుండి పెరుగును, (వినష్టాత్ మృ ... ఘటః=) కనఁబడకుండఁబోయిన మంటి ముద్దనుండి కుండయుఁ బుట్టుచున్నవిగదా!

(అనఁగాఁ- గారణరూపము కనఁబడకుండఁ బోయిననఁగాని కార్యము పుట్టు చున్నట్టు కనిపించుట లేదు- అని భావము.)

(కూటస్థాత్ కారణాత్ =) కారణ మున్నట్లే యుండి- అనఁగాఁ గారణమం దెట్టిమార్పును గలుగకుండఁగనే (కార్యం=) కార్య మనునది (ఉత్పద్యేతచేత్ =)

కార్యము పుట్టునని చెప్పుచో, (సర్వతః=) సర్వమునుండి (సర్వం=) సర్వము (అవిశేషాత్=) హఠాత్తుగా (ఉత్పద్యేత=) బుట్టుననియే చెప్పవలసివచ్చును.

తస్మా దభావగ్రస్తేభ్యో బీజాదిభ్యోఽంకురాదీనా ముత్పద్యమానత్వా దభావా ద్భావోత్పత్తి రితి మన్యంతే.

(తస్మాత్=) కాఁబట్టి (అభావ...జాదిభ్యః=) అభావమును బొందిన- అనఁగా నశించిపోయిన విత్తులు మొదలగు వానినుండి (అంకురా ... నత్వాత్=) మొలకలు మొదలగునవి పుట్టుచున్నట్లు కనిపించుచున్నందున. (అభావాత్=) అభావమునుండి అనఁగా- ఎట్టికారణము లేకుండఁగనే (కార్యోత్పత్తిః ఇతి=) కార్యము పుట్టుచున్నట్లు (మన్యంతే=) వైనాశికు లగుబౌద్ధులు సిద్ధాంతపఱచియున్నారు.

తత్రేద ముచ్యతే. నాసతోఽదృష్టత్వాదితి.

(తత్ర=) వారిసిద్ధాంత మిట్లున్నందుననే 'నాసతోఽదృష్టత్వాత్' (అసతః=) లేనిదానినుండి- అనఁగా అభావము నుండి (న-) కార్యము పుట్టదు. ఎందుచేత నఁగా నట్టివిషయము లోకమం దెచ్చటను (అదృష్టత్వాత్=) కనిపింపకుండుటవలన (ఇతి=) అని (ఇదం=) ఈసూత్రము (ఉచ్యతే=) వేదాంతసూత్రకారుని చేత రచియింపఁబడినది.

నాభావా ద్భావ ఉత్పద్యతే.

(అభావాత్=) అభావమునుండి (భావః=) భావపదార్థ మేదియును (న+ ఉత్పద్యతే=) బుట్టఁజాలదు.

యద్యభావా ద్భావ ఉత్పద్యేత అభావత్వావిశేషా త్కారణవిశేషాభ్యుపగమోఽనర్థకస్స్యాత్.

(అభావాత్=) లేనిదానినుండి (భావః=) యున్న దేదైనను (యది+ ఉత్పద్యేత=) బుట్టునన్నచో, (అభావత్వావిశేషాత్=) అభావ మన్నది యెల్లప్పుడును నెట్టిభేదములు లేకుండ నొకటిగానే యుండుటవలన, (కారణ ... గమః=) ఒక్కొక్కవిధమైనకార్యమునకుఁ దదనురూపమైనయొక్కొక్క ప్రత్యేక కారణ ముండునని యెంచుట (అనర్థక స్స్యాత్=) నిరర్థకమే యగును.

నహి బీజాదీనా ముపమృదితానాం యోఽభావ స్తస్య (అభావస్య) చ శశవిషాణాదీనాం చ నిస్స్వభావత్వావిశేషా దభావత్వే కశ్చి ద్విశేషోఽస్తి; యేన బీజాదే వాంకురో జాయతే క్షీరాదేవ దధీత్యేవంజాతీయకః కారణవిశేషాభ్యుపగమోఽర్థవాన్ స్యాత్.

(ఉపమృదితానాం బీజాదీనాం =) నశించినబీజములయొక్క (యః - అభావః=) యభావ మేది గలదో (తస్యచ=) యట్టియభావముగూడ (శశ ... నాంచ- అభావస్య=) కుందేటికొమ్ము మొదలగువానియొక్క యభావముతోఁ బాటుగ (నిస్స్వభావత్వావిశేషాత్ =) నెట్టిస్వభావభేదము లేనిదే యగుటలో సమానమే యగుచున్నది. కాని (యేన=) యభావమం దెట్టివిశేష (=భేదము) ముండుటచేత (బీజా ... జాయతే=) విత్తునుండియే మొలక పుట్టుచున్నది, (క్షీరా ... దధి=) పాలనుండియే పెరుగు పుట్టుచున్నది. (ఇత్యేవంజాతీయః=) అనునీవిధ మగు (కారణ ...గమః) నొక్కొక్క కార్యమునకు నొక్కొక్కప్రత్యేక (అన్నిఁటి కొకేతీరగునభావమే యని చెప్పుటకు వీలు లేకుండ) విశేషము (=భేదము) తోఁ గూడినకారణమే యుండు నను (లోకాయతికులయొక్క) సిద్ధాంతము (అర్థవాన్ స్యాత్ =) అర్థవంతమైనది (=అర్థముగలది - నమ్మఁదగినది) గాఁగలదో, (అభావత్వే కశ్చిద్విశేషః=) అన్నింటి కొకేకారణ మైనయభావమునందు నట్టివిశేష (=భేద) మేదియును (నహి + అస్తి=) లేదుగదా !

(అనఁగా - అన్నికార్యములకు భేదములు లేని యొక్క యభావమే కారణ మగునన్నచో, విత్తునుండియే మొలకయును పాలనుండియే పెరుగును బుట్టఁగల వనెడి వారిసిద్ధాంతము సరియైయుండనోపదు. ఇట్టిసిద్ధాంతము సరియైనదేయని చెప్పఁ దలఁచుకొన్నచో, నన్నికార్యములకుఁ గారణ మైయుండునభావమునందు విశేష ములు (=భేదములు) అనఁగా– ఈవిధమగు నభావమునుండియే యిట్టికార్యము పుట్టును; ఈతీరునభావమునం దిట్టికార్యము పుట్టును. –అని చెప్పఁదగినవిశేషము లుండితీరవలయును. కాని యభావమునం దెట్టివిశేషము (=భేదములు) లైనను గలవని బౌద్ధు లంగీకరించుట లేదని భావము)

నిర్విశేషస్య త్వభావస్య కారణత్వాభ్యుపగమే శశవిషాణాదిభ్యోఽ ప్యంకురోదయో జాయేరన్. నచైవం దృశ్యతే.

(నిర్వి... పగమే=) ఎట్టిస్వభావభేదములు లేనియభావమే కార్యములు పుట్టుటకుఁ గారణముగా నుండఁగలదని యంగీకరించువఎడమున (నశించిన బీజములు మొదలగువానినుండియే మొలకలు మొదలగునవి పుట్టునని చెప్పనేల!) (శశ ... దిభ్యః + అపి=) కుందేటికొమ్ములు మొదలగువానినుండిగూడ (అంకురోదయః=) మొలకలు పుట్టుట (జాయేరన్ =) గలుగవచ్చును. కాని (ఏవం=) యట్లు (నచదృశ్యతే=) కనిపించుట లేదు.

యది పున రభావస్యాపి విశేషో౽భ్యుపగమ్యేత ఉత్పలాదీనామివ నీలత్వాదిః, తతో విశేషవత్త్వాదేవ వాభావస్య భావత్వ ముత్పలాదివత్ ప్రసజ్యేత.

(పునః=) ఒక వేళ- (ఉత్ప ... త్వాదిః=) కమలములకు నలుపురంగు - కలువలకుఁ దెలుపురంగు నను నీ మొదలుగాఁగల భేదములనెట్లు చెప్పుచున్నామో యట్లే (అభావస్యాపి=) అభావమునకుఁగూడ (యది విశేషో ... మ్యేత= భేదము లున్నవని యంగీకరించవలెనని వాదించు (తతః=) పక్షమున (ఉత్పలాదివత్=) భేదములు గలకమలము మొదలగునవి భావపదార్థములని యంగీకరించినట్లే (విశేష .... వాభావస్య=) అభావమునకుఁగూడ భేదము లున్నందువలన నదే యది యభావము గాక (భావత్వం ప్రసజ్యేత=) యొకభావపదార్థమే యైపోవు నని యొప్పుకొనవలసి వచ్చును.

నాప్యభావః కస్యచి దుత్పత్తిహేతు స్స్యాత్: అభావత్వాదేవ శశవిషాణాదివత్.

(అపి=) మఱియును అభావః ) కేవల మభావ మనునది (కస్యచిత్=) ఎట్టి కార్యమును (ఉత్పత్తిహేతుః బుట్టించఁగలకారణము (న స్యాత్=) గానేరదు. ఎందువలన ననఁగా (శశ ... వత్=) కుందేటికొమ్ము మొదలగువానివలె నభావము కేవల మభావమే యైయుండును. (లేనిదానినుండి యున్నదని చెప్పుకొనఁగలవస్తు వేదియుఁ బుట్టఁజాలదని భావము.)

అభావాచ్చ భావోత్పత్తా వభావాన్వితమేవ సర్వం కార్యం స్యాత్. నైవం దృశ్యతే

(అభావాచ్చ=) మఱియు నభావమునుండి భావ మేదైనను బుట్టునని యంగీకరించుపక్షమున (సర్వం కార్యం=) అట్లు పుట్టెడిసర్వకార్యములనందును (అభావాన్వితమేవ=) గారణమైనయభావ మంటివచ్చుటయే (స్యాత్=) సంభవించును. కాని యట్లు కన్పించుట లేదు ఎట్లనఁగా—

సర్వస్య వస్తునః స్వేన స్వేన రూపేణ భావాత్మనై వోపలభ్యమానత్వాత్.

( సర్వస్య వస్తునః = ) లోకమం దీపుట్టినసర్వవస్తువులును (అనఁగా - వస్త్రము, కుండ మొదలగునవి) (స్వేన .... రూపేణ=) తమతమ ప్రత్యేకస్వరూపములతో (భావాత్మనా+ఏవ=) భావపదార్థములుగానే (ఉపలభ్యమానత్వాత్=) గ్రహింపఁబడుచున్నవిగదా !

నచ మృదన్వితాః శరావాదయో భావా స్తంత్వాదివికారాః కేనచి దభ్యుపగమ్యంతే.

మఱియును (మృద ... భావాః=) మట్టితోఁగూడుకొనిన (అనఁగా - మట్టి

నుండిపుట్టిన) మూకుడు మొదలగు కార్యవస్తువులు (తంత్వా ... కారాః=) దారములు మొదలగు భిన్నస్వభావములు గలకారణములనుండి పుట్టినట్లు (కేనచిత్=) ఎవరిచేతనైనను (నచ ... గమ్యంతే=) గ్రహింపఁబడుట లేదు సుమా!

మృద్వికారానేవ తు మృదన్వితాన్ భావాన్ లోకః ప్రత్యేతి.

(మృదన్వితాన్ భావాన్=)మట్టితోఁగూడుకొనిన కార్యవస్తువులు (మూకుడు మొదలగునవి) (మృద్వి ... నేవ తు=) వానికిఁ గారణమైనమట్టినుండి పుట్టినట్లే (లోకః=) లోకము (ప్రత్యేతి=) గ్రహించుచున్నది

యత్తూక్తం స్వరూపోపమర్ద మంతరేణ కస్యచి త్కూటస్య వస్తునః కారణత్వానుపపత్తే రభావా ద్భావోత్పత్తి ర్భవితు మర్హతీతి, త ద్దురుక్తమ్.

(స్వరూపో ... తరేణ=) తమస్వరూపము చెడిపోవుట యనునది లేకుండ (కస్యచి .... వస్తునః=) ఉన్నది యున్నట్లుగానే యుండునేవస్తువైనను (కారణ .... పత్తేః=) గారణ మగుట సంభవింపనందున- అనఁగాఁ జెడిపోకుండ యథాపూర్వముగా నుండునని చెప్పనేకారణవస్తువునుండియైనను గార్యము పుట్టుట యసంభవమైనందున - (అభా ... త్పత్తిః=) అభావమునుండి యేభావపదార్థము పుట్టుట (భవితు మర్హతీతి=) సంభవింపఁగలదని (యత్తూక్తం=) వైనాశికపూర్వపక్షి వాదించుచున్నాఁడుగాని యది దుష్టవాదమే యగును.

స్థిరస్వభావానామేవ సువర్ణాదీనాం ప్రత్యభిజ్ఞాయమానానాం రుచకాదికారణభావదర్శనాత్'

(స్థిరస్వభావానాం=) తమస్థిరమైనస్వభావముఁ దెట్టిమార్పును జెందకుండ నుండునట్టియు, (ప్రత్యభిజ్ఞాయమానానాం=) ఏరూపముతో నున్నను నిది యదియే యని గుర్తింపఁబడఁగలట్టియు (సువర్ణాదీనాం =) బంగారు మొదలగుపదార్థములు (రుచకాది ... దర్శనాత్=) తమస్వరూపము (=స్వభావము) చెడకుండ నాభరణములు మొదలగు కార్యవస్తువులకుఁ గారణము లగుచుండుట చూచుచునే యున్నారముగదా (అనఁగా- బంగారమాభరణముగా మాఱినను, ఆభరణమునైతము బంగారముగానే యుండునుగాని యాభరణము గాకముం దున్నబంగారము చెడిపోవుట సంభవింపదని- భావము.)

యేష్వపి బీజాదిషు స్వరూపోపమర్దో లక్ష్యతే, తేష్వపి నాసావుపమృద్యమానా పూర్వావస్థా ఉత్తరావస్థాయాః కారణ మభ్యుపగమ్యతే.

(యేష్వపి బీజాదిషు=) మొలకలను బుట్టించు బీజములందు (స్వరూపో ...

లక్ష్యతే=) వానిస్వరూపము చెడిపోవుట కనిపించుచున్నదని నీవు తలంచుచున్నావో (తేషు+అపి=) అట్టిబీజములవిషయమందు స్థైర్యము (ఉపమృ ... వస్థా=) బీజము యొక్క చెడిపోయినపూర్వావస్థ — అనఁగా బీజము నేలలోఁ బాతిపెట్టఁబడినపిమ్మట కుళ్ళి చెడిపోయిన భాగము ఉత్తరావస్థాయాః=) బీజముయొక్క తరువాతియవస్థకు-అనఁగా- మొలచినమొక్కకుఁ (అసౌ+ కారణం=) గార్యమని- అనఁగాఁ- కుళ్ళి చెడిపోయినబీజభాగమునుండియే మొక్క పుట్టినట్లు (న+అభ్యుపగమ్యతే=) ఎవరి వలనను దలఁచఁబడదు. మఱేమనఁగా—

అనుపమృద్యమానానామే వానుయాయినాం బీజాద్యవయవానా మంకురాదికారణభావా భ్యుపగమాత్.

(అనుప ... మానానాం=) కుళ్ళి చెడిపోకుండ నుండునట్టియు (అనుయాయినాం=) మొలకరూపమును దాల్చునట్టియు, (బీజాద్యవయవానాం=) బీజములోని సూక్ష్మాంశములే (అంకు ... గమాత్=) మొలకలుమొదలగు (వికార) కార్యములను బుట్టించుచున్నట్టు సర్వజను లెఱిఁగినవిషయమే.

తస్మా దసద్భ్యః శశవిషాణాదిభ్యః సదుత్పత్త్యదర్శనాత్. సద్భ్యశ్చ సువర్ణాదిభ్య స్సదుత్పత్తిదర్శనాత్. అనుపపన్నో௨ య మభావా ద్భావోత్పత్త్యభ్యుపగమః.

(తస్మాత్=) కాఁబట్టి (అసద్భ్యః=) సత్పదార్థములుగాని- అనఁగా శూన్యములై (=అభావములై) యుండు (శశ .... దిభ్యః=) కుందేటికొమ్ము మొదలగు వస్తువులనుండి (సదు ... నాత్=) సత్పదార్థములు- అనఁగా స్వరూపముగల భావపదార్థములు పుట్టుట యెక్కడను గనిపించనందువలనను, (సద్భ్యశ్చ=) వాస్తవమున నున్నపదార్థములే యగు (సువర్ణాదిభ్యః=) బంగారము మొదలగువానినుండి (సదు ... ర్శనాత్ =) వాస్తవమున నున్నపదార్థములే యగునాభరణములు మొదలగుకొన్నివస్తువులు పుట్టుచుండుట గనిపించుచున్నందువలనను (అభావా ... +అయం గమః=) అభావమునుండి- అనఁగా శూన్యమునుండి భావపదార్థములు పుట్టునని చెప్పువైనాశికులయొక్క యీసిద్ధాంతము (అనుపపన్నః =) యుక్తియుక్తము గాదు.

అపిచ చతుర్భ్యశ్చిత్తచైత్తా ఉత్పద్యంతే; పరమాణుభ్యశ్చ భూతభౌతికలక్షణ స్సముదాయ ఉత్పద్యత ఇత్యభ్యుపగమ్య పున రభావా ద్భావోత్పత్తిం కల్పయద్భి రభ్యుపగమ మపహ్నువానై ర్వైనాశికైః స్సర్వో లోక ఆకులీక్రియతే.

(అపిచ=) మఱియు (=ఇంతేగాక) (చతుర్భ్య .... ద్యంతే=) విషయ, కరణ, సహకారి, సంస్కారము లనెడి (21 సూత్రభాష్యమును జూడుఁడు) నాలుగువిధము లైన హేతువులనుండి చిత్తచైత్తములు పుట్టుచున్నవనియును, (పరమాణు...ద్యత=) పరమాణువులనుండి భూతభౌతికపదార్థము లనెడిసముదాయ మేర్పడుచున్నదనియు (ఇత్యభ్యుపగమ్య=) సిద్ధాంతీకరించి పునః=) మరల నిప్పుడు (అభావా...యద్భిః=) అభావమునుండియే పదార్థము లన్నియుఁ బుట్టుచున్నవని కల్పించుచుఁ (అభ్యుప ... వానైః=) దమసిద్ధాంతమును దామే భంగపఱచువారగు (వైనాశికైః=) ఈవైనాశిక బౌద్ధులచేత- (సర్వలోకః=) పామరలోక మంతయుఁ (ఆకులీక్రియతే=) చీకాకు పఱుపఁబడుచున్నదిగదా! (అందోళనపెట్టఁబడుచున్నదిగదా) (అనఁగా— అర్థము లేనియపసిద్ధాంతములచేతఁ దెలియనిపామరజనులను వైనాశికులు భ్రమపెట్టుచున్నారని— భావము.)

27. సూత్రావతారిక :—

అభావము (=శూన్యము) నుండి భావము (=పదార్థము)పుట్టఁజాలదని పూర్వసూత్రమందు నిరూపింపఁబడినది. అభావమునుండి భావోత్పత్తి యగుననెడివైనాశిక సిద్ధాంతమునందు మఱియొకదోష మీసూత్రమందుఁ జూపఁబడుచున్నది.

## ౨౭ సూ॥ ఉదాసీనానా మపి చైవం సిద్ధిః.

ప॥ వి॥ — ఉదాసీనానాం - అపి — చ - ఏవం — సిద్ధిః.

అ॥ క్రి॥ — ఏవం - చ - ఉదాసీనానాం - అపి - సిద్ధిః.

ప్ర॥ ప॥ అ॥ — ఏవం చ= ఇట్లగుచున్నచో, ఉదాసీనానాం = ప్రయత్నము లేక యూరకుండువారికి; అపి = కూడ; సిద్ధిః = ఫలప్రాప్తి.

సూత్రార్థము :— (అభావమునుండి భావము) పుట్టునన్నచోఁ బ్రయత్నము లేక యూరకుండువారికిఁగూడ, ఫలప్రాప్తి గావలసియుండును.

భాష్యభావము :— (ఏవంచ=) అభావమునుండి భావోత్పత్తి యగునని యంగీకరించుపక్షమున (ఉదాసీనానామపి ) ఎట్టిప్రయత్నము లేనిజనులకుఁగూడ (సిద్ధిః=) అభిమతార్థసిద్ధి గావలసినదేగదా. అభావము సులభముగావున నందఱును దానినేయవలంబింతురు. కాఁబట్టి స్వాతంత్రికవైశేషికులసిద్ధాంతము సరియైనదిగాదు.

భాష్యము — భాష్యార్థము

యది చాభావా ద్భావోత్పత్తి రభ్యుపగమ్యేత ఏవం స త్యుదాసీనానా మసీహమా నానామపి జనానా మభిమతసిద్ధి స్స్యాత్.

(అభావాత్ =) అభావమునుండి (భావోత్పత్తిః=) వస్తుజాలము పుట్టఁగలదని (యది + అభ్యుపగమ్యేత=) యంగీకరించువక్షమున— (ఏవంసతి=) అనఁగా నట్టి సందర్భమే యగుచున్నచో (ఉదా .... నానాం=) నుదాసీనులగు-అనఁగాఁ గావలె ననుకోర్కెయే పెట్టుకొనని (జనానామపి=) జనులకుఁగూడ (అభిమత ....స్యాత్ =) గావలసినఫలములు వచ్చుచునే యుండును ఎందుచేతననఁగా—

అభావస్య సులభత్వాత్ కృషీవలస్య క్షేత్రకర్మ ణ్యప్రయతమానస్యాపి సస్యనిష్పత్తి స్స్యాత్; కులాలస్యచ మృత్సంస్క్రియాయా మప్రయతమానస్యా ప్యమత్రోత్పత్తిః.

(అభా ... త్వాత్ =) (పని చేయుటయన్నఁ గష్టముగాని) ఊరకుండుట యెవ్వడును మిక్కిలిసుళభమైనదిగదా! (క్షేత్ర ... సస్య=) భూమి దున్నుట మొదలగుపనులు చేయక యూరకయుండు (కృషీవలస్య + అపి=) వ్యావసాయికునకుఁ గూడఁ (సస్య...స్యాత్ =) పైరులు చక్కఁగా ఫలించుట గలుగవచ్చును. (మృత్సం .... యాయాం=) మన్నుమున్నగువానిని దెచ్చి కాల్చుట మొదలగు (అప్రయతమా నస్య-) పనులు చేయని (కులాలస్య + అపి=) కుమ్మరివానికిఁగూడఁ (అమత్ర + ఉత్పత్తిః =)గుండలు మొదలగునవి పుట్టి సిద్ధములగుచునే యుండును.

తంతువాయస్యాపి తంతూ నతన్వానస్యాపి తన్వానస్యేవ వస్త్రలాభః,

తంతూన్ + అతన్వానస్య=) దారమును దెచ్చి మగ్గము మీఁద వేసి నేయని (తంతువాయస్యాపి=) సాలెవానికిఁగూడ (తన్వానస్య + ఇవ ) మగ్గపునేత నేయు వాని కెట్లో యట్లే (వస్త్రలాభః =) నేఁతబట్టలు సిద్ధముగనే యుండును.

స్వర్గాపవర్గయోశ్చ న కశ్చి త్కథంచి త్సమీహేత.

(స్వర్గాపవర్గయోః + చ=) స్వర్గమునకుఁగాని మోక్షమునకుఁగాని (కశ్చిత్ =) యెవఁడును (కథంచిత్ =) నేవిధముననైనను (న సమీహేత=) గోరవలసినపని లేదయేపోవును (అనఁగాఁ గోరకుండ- ప్రయత్నము చేయకుండ - స్వర్గమోక్షములు రానే వచ్చునని భావము )

న చైత ద్యుజ్యతేఽభ్యుపగమ్యతే వా కేనచిత్.

(ఏతత్ =) ఇట్టిసిద్ధాంతము (న చ యుజ్యతే=) అసంగతమగాక (కేనచిత్ =) ఎవనిచేతను (నచ+అభ్యుపగమ్యతే=) అంగీకరింపఁబడుటకు సాధ్యము ను గాదు.

తస్మా దనుపపన్నోఽయ మభావా ద్భావోత్పత్త్యభ్యుపగమః.

(తస్మాత్ –) కాఁబట్టి (అభావా .... గమః+ అయం=) యభావమునుండి భావపదార్థము పుట్టు వనువైనాశికులయొక్క యీసిద్ధాంతము (అనుపపన్నః=) సరియైనది గాదు.

## అ భా వా ధి క ర ణ ము (సూ ౨౮ నుండి ౩౨ వఱకు)

5. అధికరణావతారిక :—

లోఁగడి సముదాయాధికరణమందు బౌద్ధులలోఁ జేరిన సౌత్రాంతికవైభాషికులను వారియొక్క మతసిద్ధాంతములు ఖండింపఁబడినవి. ఈయధికరణమం దాబౌద్ధులలో మఱియొక తెగవారై యెట్టివిబట్టలు ధరించుచు విజ్ఞానవాదులని చెప్పఁబడు యోగాచారులయొక్క మతము ఖండింపఁబడుచున్నది. వారిసిద్ధాంతము లేవి యనఁగా :— లోఁగడ నీసముదాయాధికరణావతారికలోఁ జూపఁబడినపదార్థవిభాగవివరణమును జూడుఁడు. వీరి సిద్ధాంతానుసార మావట్టికలోని బాహ్యపదార్థము లేవియును లేవు– మఱియు నాంతరపదార్థములలోఁ జేరినచిత్త మనెడి యొక్క విజ్ఞానస్కంధము దక్క చైత్తము లనెడితక్కనాల్గుస్కంధములు సైతమును లేవు.

వీరిమతమున నున్నదని చెప్పఁబడునది చిత్తము (అచేతనము)
(అనఁగా – విజ్ఞానస్కంధము)

| | |
|---|---|
| ఆలయవిజ్ఞానము ('నేను – నేను' అనునాకారముతోఁ గూడినది) | ప్రవృత్తివిజ్ఞానము ('ఇది కుండ – ఇది గోడ' యని కలుగుచుండు వస్తుజ్ఞానము ) |

వీరిసిద్ధాంతము లేవి యనఁగా —

(1) బాహ్యవస్తువు లేవియును లేనివియే – అనఁగా– అభావములే. ఉన్నవని చెప్పఁబడు నాలయవిజ్ఞాన – ప్రవృత్తివిజ్ఞానములుసైతము క్షణికములే.
(28 సూత్రము దీనిని ఖండించుచున్నది )

(2) జాగరిత వస్తుజ్ఞానము స్వప్న వస్తుజ్ఞానమువంటిది. అనఁగా- అసలువస్తువు లేక పోయినను వస్తుజ్ఞానము గల్గుచుండును. (29 సూత్రము దీనిని ఖండించుచున్నది)

(3) వస్తుజ్ఞానము (పూర్వమందలి) వస్తువాసనలవలనమాత్రము గల్గుచుండును. (30 సూత్రము దీనిని ఖండించుచున్నది)

(4) వస్తువాసనల కాలయవిజ్ఞాన మాశ్రయముగా నుండును (31 సూత్రము దీనిని ఖండించుచున్నది.)

28. సూత్రావతారిక :—

బాహ్యపదార్థము లన్నియు నభావములే యను యోగాచార బౌద్ధులయొక్క సిద్ధాంత మీసూత్రమందు ఖండింపఁబడుచున్నది.

## ౨౮ సూ॥ నాభావ ఉపలబ్ధేః.

ప॥ వి॥ — న – అభావః – ఉపలబ్ధేః

అ॥ క్ర॥ — ఉపలబ్ధేః – అభావః – న

ప్ర॥ ప॥ అ॥ — ఉపలబ్ధేః = కనఁబడుచుండుటవలన; అభావః = లేకపోవుట; (శూన్యత్వము); న = సరిగాదు.

సూత్రార్థము :— (బాహ్యపదార్థములు) ప్రత్యక్షముగాఁ గనఁబడుచుండుటవలన, నవి లేవని చెప్పుట- అనఁగా- వానికి నభావము చెప్పుట- సరిగాదు.

భాష్యభావము :—

(అభావః) బాహ్యపదార్థములయొక్క యభావము (=శూన్యత్వము) నిశ్చయించుటకు (న) శక్యము గాదు- ఎందుచేననఁగా (ఉపలబ్ధేః) ఇది కుండ - ఇది వస్త్రము- అని ప్రత్యక్షముగా బాహ్యపదార్థములు గ్రహింపఁబడుచున్నవి. గోచరించు వస్తు వేదైనను 'లేనిది' యని చెప్పుటకు సాధ్యము గాదు.

భాష్యము — భాష్యార్థము

ఏవం బాహ్యార్థవాద మాశ్రిత్య సముదాయప్రాప్త్యాదిషు దూషణే షూద్భావితేషు.

విజ్ఞానవాదీ బౌద్ధ ఇదానీం ప్రత్యవతిష్ఠతే.

(ఏవం=) ఈపై విధమున- అనఁగా లోఁగడియధికరణమందుఁ జెప్పఁబడినవిధమున (బాహ్య ... శ్రిత్య=) బాహ్యపదార్థములు గలవని చెప్పెడిసౌత్రాంతిక వైభాషిక లనెడిబౌద్ధులయొక్క వాదవిషయములోఁ (సము.... దిషు=) బాహ్యాము

లైన పరమాణువులకు నాంతరము లైనపంచస్కంధములకు సముదాయ మేర్పడఁజాలదను నీమొదలగు (దూష ... తేషు=) దోషములను జూపించి, వారిమతమును ఖండించివైచినంతలో, (విజ్ఞా....బౌద్ధాః=) ఆబౌద్ధులలో యోగాచారు లనిచెప్పఁబడు విజ్ఞానవాదులు- అనఁగా నాంతరపదార్థములలోఁ జిత్తమని చెప్పఁబడువిజ్ఞానస్కంధము ('అహం - అహం' అని యనుకొను నాలయవిజ్ఞానము) ఒక్కటిమాత్రమే గలదు గాని మిగిలిన బాహ్యాంతరపదార్థము లెవ్వియు లేవని వాదించెడివారు (ఇదానీం=) ఇప్పుడు తమవాదముతో (ప్రత్యవతిష్ఠతే=) నెదుర్కొనుచున్నారు.

కేషాం చి త్కిల వినేయానాం బాహ్యవస్తు న్యభినివేశ మాలక్ష్య తదనురోధేన బాహ్యార్థవాద ప్రక్రియేయం విరచితా; నాసౌ సుగతాభిప్రాయః.

(కేషాంచిత్-వినేయానాం=) బుద్ధునిశిష్యు లైనకొందఱకు (బాహ్యవస్తుని=) బాహ్యపదార్థములు యథార్థములే యని చెప్పుటయందుఁ గల (అభినివేశం=) మనోభీష్టమును (=పట్టుదలను) (ఆలక్ష్య=) గనిపెట్టి (తదనురోధేన=) వారిబుద్ధ్యనుసారముగా (బాహ్య ... ప్రక్రియా+ఇయం=) బాహ్యపదార్థములు సైతము యథార్థములే యని చెప్పు నీవాదపద్ధతిని (విరచితా=) గల్పించియుండవచ్చునుగాని (అసౌ=) యీవాదపద్ధతి వాస్తవమునకు (న-సుగతాభిప్రాయః+కిల) బుద్ధుని యభిప్రాయము గాదుసుమా !

తస్య తు విజ్ఞానైకస్కంధవాద ఏవాభిప్రేతః.

(తస్య తు=) సుగతుఁ డనెడియాబుద్ధునికి (విజ్ఞా... ప్రేతః=) విజ్ఞానస్కంధ మొక్కటిమాత్రమే వాస్తవమున నున్నదని చెప్పెడివాదమే యంగీకారమైనది.

I బౌద్ధయోగాచారి మతప్రతిపాదనము :

తస్మింశ్చ విజ్ఞానవాదే బుద్ధ్యనురూఢేన రూపేణాంతస్థఏవ ప్రమాణప్రమేయఫల వ్యవహార స్సర్వ ఉపపద్యతే.

(తస్మింశ్చ .... వాదే=) ఈవిజ్ఞానవాదమందు (బుద్ధ్యాను ... రూపేణ=) బుద్ధియందెక్కియున్నయాకారముచేత (అంతస్థ ... సర్వః=) శరీరములోపలనే యున్నట్టి వస్తుసంబంధ మైనప్రమాణప్రమేయఫలవ్యవహార మంతయు (ఉపపద్యతే=) గల్పింపఁబడుచున్నయది. (అనఁగా- బుద్ధిలోఁ జొచ్చియున్న 'నలుపు' మొదలగునట్టి యాకారవిజ్ఞానమే ప్రమేయము. (=విషయము) - ఆయాకారవిజ్ఞానము- అనఁగా నాకారమును దెలిసికొన్న తెల్వియొక్క సామర్థ్యమే ప్రమాణము

(=తెలిసికొనుట కాధారమైనది)- ఆయాకారవిజ్ఞానము వస్తురూపమునఁ బ్రకాశించుటయే ఫలము (=లోపలనున్న యాకారము వెలుపలివస్తువుగాఁ దోఁచుట) ఆయాకారవిజ్ఞానసామర్థ్యము దేనియం దుండునో యదియే ప్రమాత (=తెలిసికొనునది) అని విజ్ఞానవాదులు చెప్పుదురు. దీనిని సర్వము లోపల— ననఁగా విజ్ఞానములో నుండునదియేగాని బాహ్యమం దుండునది యేదియు లేదని యావిజ్ఞానవాదులమతము )

సత్యపి బాహ్యార్థే బుద్ధ్యారోహమంతరేణ ప్రమాణాదివ్యవహారానవతారాత్.

(సత్యపి బాహ్యార్థే =) ఒకవేళ బాహ్యపదార్థము వాస్తవమున నున్నదే యైనను, (బుద్ధ్యా.... రేణ=) అది బుద్ధి కెక్కుట యనునది లేకుండఁగ (ప్రమా... తారాత్=) ఆవస్తువును గ్రహించుశక్తిగాని (=ప్రమాణము) ఆవస్తువును గ్రహించుటగాని (=ప్రమేయము) ఆవస్తువును గ్రహింపఁగల్గునదిగాని (=ప్రమాత) వస్తురూపము గోచరించుటగాని (=ఫలము) ఇట్టివ్యవహారము గల్గుట కవకాశ మేర్పడును.

(అట్టివిజ్ఞానవ్యవహారమే లేనిచో బాహ్యవస్తువనునది యొకటి యున్నను వస్తువుగా భాసించుట యనుప్రయోజనము లేదని భావము.)

కథం పున రవగమ్యతే అంతస్థ ఏవాయం సర్వవ్యవహారో న విజ్ఞానవ్యతిరిక్తో బాహ్యోఽర్థోఽస్తీతి తదసంభవా దిత్యాహ.

(అయం సర్వవ్యవహారః=) బాహ్యవస్తుగోచరవిషయికవ్యవహార మంతయు (అంతస్థః ఏవ=) లోపల నున్నవిజ్ఞానమునకుఁ జెందినదే గాని (విజ్ఞానవ్యతిరిక్తః=) విజ్ఞానమునకు వ్యతిరిక్తమైన (బాహ్యః + అర్థః=) బాహ్యపదార్థ మేదియును (న + అస్తి + ఇతి=) లేనేలేదని (కథం పునః- అవగమ్యతే + ఇతి=) యెట్లు తెలిసికొనఁబడఁగలదన్నచో (తత్ + అసంభవాత్ + ఇతి + ఆహ.) బాహ్యవస్తు వనునది యొకటి యుండుట యసంభవ మగుటవలననే (యట్లు లేదని చెప్పఁబడుచున్నదని) పూర్వపక్షి యైనబౌద్ధయోగాచారి చెప్పుచున్నాఁడు.

సహి బాహ్యోఽర్థోఽభ్యుపగమ్యమానః (1)పరమాణవో వా స్యుః (2) స్తత్సమూహా వా స్తంభాదయః.

(బాహ్యః + అభ్యుపగమ్యమానః=) బాహ్యమం దున్నట్లుగాఁ దెలిసికొనఁబడు (సః=హి-అర్థః=) నావస్తు వనఁగా (పర ... స్యుః=) (1) కేవలపరమాణువులే యగునా? లేక (2) (తత్స .... దయః=) పరమాణుసమూహమైన స్తంభములు

మొదలగుస్థూలవస్తువు లగునా ! (అని బౌద్ధుఁడు వేదాంతిని బ్రశ్నించి తానే సమాధానము చెప్పుచున్నాఁడు)

(1) తత్ర న తావత్పరమాణవః స్తంభాదిప్రత్యయపరిచ్ఛేద్యా భవితు మర్హంతి. పరమాణ్వాభాసజ్ఞానానుత్పత్తేః.

(తత్ర తావత్ =) అది యగునా- ఇది యగునా యని నిశ్చయించవలసిన సందర్భములో (1) (స్తంభా ... చ్ఛేద్యాః=) స్తంభములు మొదలగుస్థూలవస్తువు లనెడిజ్ఞానము (=ప్రత్యయము) చేతఁ గూడుకొన్నవి (=పరిచ్ఛేద్యాః) అనఁగా స్తంభములని తెలిసికొనఁబడునవి (పరమాణవః భవితుం=) పరమాణువులగుట (న+అర్హంతి=) సంభవింపదు- ఎందుచేతననఁగా, (పరమా ... త్పత్తేః=) పరమాణువులుగాఁ దెలుపుజ్ఞానమే యుదయించలేదుగదా !

(అనఁగా - స్తంభాదులు వాస్తవమునకుఁ బరమాణువులే యయ్యెనేని స్తంభ మనెడిజ్ఞానమే యుదయింపదని భావము.)

(2) నాపి తత్సమూహాః స్తంభాదయ స్తేషాం పరమాణుభ్యోఽన్యత్వానన్యత్వాభ్యాం నిరూపయితు మశక్యత్వాత్.

(2) (తత్సమూహాః స్తంభాదయః=) పరమాణువులయొక్క సమూహములైన స్తంభాదిస్థూలవస్తువులు సైతము (న+అపి) గానేరవు ఎందుచేతననఁగా (తేషాం=) ఆస్థూలపదార్థములు (పరమా ... న్యత్వాభ్యాం=) పరమాణువులకంటె నన్యములా లేక పరమాణువులేనా యని (నిరూపయితుం=) నిశ్చయించుటకు (అశక్యత్వాత్ =) సాధ్యము గాదు. (ఎట్లనఁగా- స్తంభాదివస్తువులు పరమాణువులకంటె నన్యములే యగుచో నాస్థూలవస్తువులలోఁ బరమాణువు లుండఁగలవని యెంచుటకే వీలుండదు. లేక పరమాణువులే యగుచో, స్థూలవస్తువులు పరమాణువు లనెడిజ్ఞానమే బుద్ధికి గోచరింపదు.)

ఏవం జాత్యాదీనపి ప్రత్యాచక్షీత.

(ఏవం=) ఈతీరుగానే బాహ్యములైన స్థూలవస్తువులు (జాత్యా...చక్షీత=) జాతులుసైతము గానేరవని త్రోసివేయఁబడఁ దగియుండును.

అపి చానుభవమాత్రేణ సాధారణాత్మనో జ్ఞానస్య జాయమానస్య యోఽయం ప్రతివిషయం పక్షపాతః స్తంభజ్ఞానం కుడ్యజ్ఞానం ఘటజ్ఞానం పటజ్ఞానమితి.

(అపిచ=) మఱియును (అనుభవమాత్రేణ=) ఇంద్రియానుభవమాత్రముచేతఁ

(జాయమానస్య=) బుట్టినట్టి (జ్ఞానస్య=) జ్ఞానము (సాధారణాత్మనః=) ఒకటే స్వరూపము గలదైనను, (యః+అయం=) అట్టిజ్ఞానము (ప్రతివిషయం=) వేఱు వేఱువిషయములనుగూర్చి— అనఁగా వేఱువేఱువిషయములకు సంబంధించినప్పుడు (స్తంభ .... పటజ్ఞానమితి=) ఇది స్తంభ మనియు, ఇది గోడ యనియు, ఇది కుండ యనియు, ఇది వస్త్ర మనియు (పక్షపాతః=) ఆయావిషయానుసారముగా మార్పులు చెందు చుండును.

నాసౌ జ్ఞానగతం విశేషమంతరే ణోపపద్యత ఇత్యవశ్యం విషయసారూప్యం జ్ఞానస్యాంగీక ర్తవ్యమ్.

(అసౌ=) ఈమార్పులు (జ్ఞానగ ... రేణ=) జ్ఞానమునకు సంబంధించిన భేదములు (=విశేష) లేకుండఁ (=అంతరేణ) (న+ఉపపద్యతే+ఇతి=) గలుగనేరవు గావున, (జ్ఞానస్య=) జ్ఞాన మనునది యొకటిగానే యుండి యదియే (విషయస్య సారూప్యం=) విషయములతో— అనఁగా బాహ్యవస్తువులతో సమానరూపమైనదిగా నేర్పడునని (అవశ్యం =) తప్పనిసరిగా (అంగీక ర్తవ్యం =) నంగీకరించవలసి యుండును.

అంగీకృతే చ తస్మిన్, విషయాకారస్య జ్ఞానేనై వావరుద్ధత్వా. దపార్థికార్థసద్భావకల్పనా.

(అంగీ ... తస్మిన్=) అట్లంగీకరింపఁబడుచో (జ్ఞానేన+ఏవ=) జ్ఞానము చేతనే (విషయాకారస్య=) బాహ్యవస్త్వాకారము (అవరుద్ధత్వాత్= నిరూపింపఁబడినది యగుచుండఁగా — అనఁగా జ్ఞానమన్నదియే బాహ్యవస్త్వాకారము తాల్చుచుండఁగా-అనఁగా జ్ఞానము లేకయే బాహ్యవస్తువులు గోచరింపనివి యగుచుండఁగా (అర్థసద్భావకల్పనా=) (జ్ఞానముకంటె వేఱుగా) బాహ్యవస్తువు లున్నవని కల్పించుట (అపార్థికా=) నిరర్థకమే యగును.

అపిచ సహోపలంభనియమా దభేదో విషయవిజ్ఞానయో రాపతతి.

(అపిచ=) మఱియును (సహో ...నియమాత్=) అంతరవిజ్ఞానము - బాహ్యవస్తువు— అనునీరెంటను నేకకాలమందే తోఁచుచుండు ననెడినియమము ముండుట వలన (విషయా ... నయోః=) అవిజ్ఞానవస్తువులు రెంటికిని (అభేదః=) అభేదమే; (ఆపతతి=) సంభవించును (అనఁగా— విజ్ఞానముకంటె వేఱుగా బాహ్యవస్తు వుండ నేరదని భావము.)

న హ్యనయో రేక స్యానుపలంభేఽన్య స్యోపలంభోఽస్తి.

(ఎందుచేతననఁగా, (అనయోః+ఏకస్య=) ఆరెంటిలో నొకటి (అనుపలంభే=) తోఁచనప్పుడు, (అన్యస్య=) మఱియొకటి (అనుపలంభః+న+అస్తి=) తోఁచుట సంభవింపదు.

న చైతత్ స్వభావవివేకే యుక్తం ప్రతిబంధకారణాభావాత్.

(స్వభావవివేకే=) ఉన్న వాస్తవము గ్రహించినప్పుడు- అనఁగా వస్తు-విజ్ఞానములు రెండును భిన్నములే యగుచో, (ఏతత్=)పైనిఁజెప్పఁబడిన సహోపలంభము-అనఁగా నొకదానితోఁబాటు రెండవదియు నేకకాలమందే తోఁచుట (నయుక్తం=) సంభవింపదు. ఎందుచేననఁగా, (ప్రతిబం... భావాత్=) భిన్నములు భిన్నములుగాఁ దోఁచకుండుటకు నవసర మగుప్రతిబంధ (ఆటంకకారణము) మేమియు లేదుగదా!

తస్మాద ప్యర్థాభావః.

(తస్మాత్+అపి=) కాఁబట్టి- అనఁగా నీహేతువువలనఁగూడ (అర్థాభావః=) బాహ్యవస్తువనునది ప్రత్యేకముగా లేకపోవుటయే నిశ్చయము.

స్వప్నాదివ చ్చేదం ద్రష్టవ్యం. యథా హి స్వప్నమాయామరీచ్యుదకగంధర్వనగరాది ప్రత్యయా వినైవ బాహ్యే నార్థేన గ్రాహ్యగ్రాహకాకారా భవంతి, ఏవం జాగరితగోచరా అపి స్తంభాదిప్రత్యయా భవితు మర్హంతీ త్యవగమ్యతే ప్రత్యయత్వావిశేషాత్.

(ఇదం=) విజ్ఞానస్వరూపమేగాని బాహ్యవస్తు వనునది ప్రత్యేకముగా లేకపోవుట (స్వప్నాదివత్=) స్వప్నాదులవంటిదని (ద్రష్టవ్యం=) గ్రహింఁచవలెను. (యథాహి=) ఎట్లు (స్వప్న ... ప్రత్యయాః=) స్వప్నములు- ఐంద్రజాలికములు (=మాయా) - ఎండమావులనీరు (=మరీచ్యుదక) - గంధర్వనగరములు మొదలైన జ్ఞానములు (=ప్రత్యయాః) (వినైవ బాహ్యేనార్థేన=) బాహ్యవస్తువులు వాస్తవమునకు లేకుండఁగనే (గ్రాహ్య ... కారాః=) గ్రహింపఁబడువస్తువులు-గ్రహించువస్తువు ను- అనెడిభిన్నరూపములతోఁ (భవంతి=) దోఁచుచున్నవో, (ఏవం=) అట్లే (జాగ ... చరాః=) జాగ్రదవస్థలో గోచరించుచుండు (స్తంభా .... త్యయాః-అపి) స్తంభాదిబాహ్యవస్తువుల జ్ఞానములుసైతము (భవి...గమ్యతే=) తోఁచుచున్నట్లు చెప్పవచ్చును. ఎందుచేతననఁగా (ప్రత్య ... షాత్=) అవియు నివియు సమానరూప (=జ్ఞానములు) ప్రత్యయములగుటలో భేదమేమియును గన్పింపదు- అనఁగా- ఏవిధమైనభేదమును లేకుండఁగనే స్వప్నాదివస్తువులును జ్ఞానములే- మఱియు, బాహ్యవస్తువులును జ్ఞానములే యగుటచే నట్లు తోఁచును.

కథం పున-రసతి బాహ్యేర్థే ప్రత్యయవైచిత్ర్య ముపపద్యేత, వాసనావైచిత్ర్యా దిత్యాహ.

(జ్ఞాన మొకటియే యని చెప్పుచున్నావే) (అసతి బాహ్యే- అర్థే=) భిన్నము లైన బాహ్యవస్తువులు లేవనెడిపక్షములో, (ప్రత్యయవైచిత్ర్యం=) వస్తువిషయకము లైనభిన్నభిన్నజ్ఞానములు (కథంపునః+ఉపపద్యేత =) ఎట్లు గల్గుచున్నవో చెప్పుమని ప్రశ్నించుచో, (వాసనా- వైచిత్ర్యాత్ + ఇతి=) అంతఃకరణవాసనలు (mental impressions) భిన్నములుగా నున్నందున, జ్ఞానములును భిన్నములుగాఁ దోఁచుచున్నవని (ఆహ=) సమాధానము చెప్పుచున్నాము సుమీ !

అనాదౌ హి సంసారే బీజాంకురవ ద్విజ్ఞానానాం వాసనానాం చాన్యోన్యనిమిత్తనైమిత్తిక భావేన వైచిత్ర్యం న విప్రతిషిధ్యతే

(అనాదౌహి సంసారే=) సంసార మనాదియై యున్నందున- అనఁగా (బీజాంకురవత్ =) విత్తునుండి చెట్టు- చెట్టునుండి విత్తు ఎట్లు కలుగుచున్నవో యట్లే (విజ్ఞానానాంచ=) వాసనలవలన విజ్ఞానములు, విజ్ఞానములవలన వాసనలు (అన్యోన్య ... భావేన =) ఒకదాని కొకటి హేతువులై యనాదిగా వచ్చుచున్నందున (వైచిత్ర్యం=) వాసనాభేదములు తద్ద్వారమున విజ్ఞానభేదములు తోఁచుట (న విప్రతిషిధ్యతే=) విరుద్ధము గాదు.

అపి చాన్వయవ్యతిరేకాభ్యాం వాసనానిమిత్తమేవ జ్ఞానవైచిత్ర్య మిత్యవగమ్యతే.

(అపిచ=) మఱియును, (వాసనా ... వైచిత్ర్యం + ఇతి=) 'వాసనాభేదము లున్నచో విజ్ఞానభేదము లుండును, వాసనాభేదములు లేకపోవుచో విజ్ఞానభేదము లుండవు'- అని (అన్వయవ్యతిరేకాభ్యాం=) ముందుఁజెప్పఁబోవు నన్వయవ్యతిరేకములవలనఁగూడ వాసనాభేదములవలననే విజ్ఞానభేదములు గల్గుచున్నవని (అవగమ్యతే=) యేర్పడుచున్నది.

స్వప్నాదిష్వంతరేణాపి బాహ్యమర్థం వాసనానిమిత్తస్య జ్ఞానవైచిత్ర్య స్యోభాభ్యామ ప్యావాభ్యా మభ్యుపగమ్యమానత్వాత్.

(స్వప్నాదిషు=) స్వప్నాదులయందు (అంతరేణాపి+అర్థం=) బాహ్యవస్తువులు లేకుండఁగనే (వాసనా .... వైచిత్ర్యస్య=) వివిధవస్తుజ్ఞానములు- (గ్రాహ్యగ్రాహక (=గ్రహింపఁబడునది- గ్రహించునది) భేదము - లంతఃకరణవాసనలవలననే వని (ఉభాభ్యాం+ఆవాభ్యాం=) మన ముభయులము- అనఁగా- బౌద్ధులము, వేదాంతు లైనమీరును (అభ్యుపగమ్యమానత్వాత్ =) ఒప్పుకొనుచుఁగదా !

అంతరేణ తు వాసనా మర్థనిమిత్తస్య జ్ఞానవైచిత్ర్యస్య మయ్యాభ్యుపగమ్యమానత్వాత్.

అట్లు (అంత .... మిత్తస్య=) యంతఃకరణవాసనలు లేకుండఁ గేవల బాహ్యా వస్తువులవలననే (జ్ఞానవైచిత్ర్యస్య=) జ్ఞానభేదములు గల్గుచున్నవని (మయా౽నభ్యుపగమ్యమానత్వాత్ ) బౌద్ధవిజ్ఞానవాదినైననే నొప్పుకొనుట లేదు.

('స్వప్నాదులలో- అంతఃకరణవాసన లున్ననే జ్ఞానభేదములు గల్గుచున్నవి' అని యుభయులొప్పుకొనెడి యన్వయము—

'జాగ్రదవస్థలోఁగూడ- అంతఃకరణవాసనలు లేకపోవుచో జ్ఞానభేదములు గలుగవు' అని బౌద్ధులు చెప్పువ్యతిరేకము )

తస్మాద ప్యభావో బాహ్యస్యార్థస్యే త్యేవం ప్రాప్తే బ్రూమః

(తస్మాదపి=) కాఁబట్టి యీహేతువువలనను గూడ (అభావో .... స్యార్థస్య=) బాహ్యవస్తువులు లేవు. (ఇత్యేవం ప్రాప్తే=) అని బౌద్ధవిజ్ఞానవాది చేసినపూర్వపక్షమునకు (బ్రూమః=) వేదాంతసిద్ధాంతి యీక్రిందఁజెప్పఁబోవురీతిగా ఖండనము చేయఁబోవుచున్నాఁడు.

నాభావ ఉపలబ్ధే రితి.

( నాభావ.... లబ్ధేః - ఇతి=) బాహ్యవస్తువులు లేకపోవుట యనునది లేదు— ఎందుచేతననఁగా, ఉన్నట్లు తెలిసికొనుచున్నాము గావుననే.

న ఖ ల్వభావో బాహ్య స్యార్థస్యాధ్యవసాతుం శక్యతే; కస్మాత్ ? ఉపలబ్ధేః.

(బాహ్య .... ర్థస్య + అభావః=) బాహ్యవస్తువు లేదని (అధ్యవసాతుం=) నిశ్చయించుటకు (శక్యతే న ఖలు=) శక్యము గాదుసుమీ! (కస్మాత్ =) ఎందువలన? (ఉపలబ్ధేః=) ఉన్నట్లు తెలిసికొనుచున్నాముగావున.

ఉపలభ్యతే హి ప్రతిప్రత్యయం బాహ్యోర్థః స్తంభః కుడ్యం ఘటః పట ఇతి.

(ప్రతిప్రత్యయం=) ప్రతిబుద్ధివృత్తియందును- అనఁగా నొక్కొక్కజ్ఞానము గలిగినప్పుడెల్ల నందులకుఁ దగిన (స్తంభః ... ఇతి =) స్తంభమో, గోడయో, కుండయో, వస్త్రమో (బాహ్యః + అర్థః=) యేదియో యొక బాహ్యవస్తువు (ఉపలభ్యతే హి=) తెలిసికొనఁబడుచున్నదిగదా !

న చోపలభ్యమానస్యై వాభావో భవితు మర్హతి.

(ఉపలభ్యమానస్య=) తెలిసికొనఁబడువస్తువు (అభావః=) లేదనుటకు (నచ + భవితుం + అర్హతి + ఏవ=) నెతమాత్రమును వీలు లేదు.

యథాహి కశ్చి ద్భుంజానో భుజిసాధ్యాయాం తృప్తౌ స్వయ మనుభూయమానాయా మేవం బ్రూయాత్, నాహం భుంజే. నవా తృప్యామీతి. తద్వ దింద్రియసన్నికర్షేణ స్వయ ముపలభమానఏవ బాహ్య మర్థం 'నాహ ముపలభే, నచ సోఽస్తీతి' బ్రువ న్కథ ముపాదేయవచన స్స్యాత్ ?

(కశ్చిత్=) ఒకానొకఁడు (భుంజానః=) సాక్షాత్తుగా భుజించినవాఁడై, (భుజి సాధ్యాయాం .... మానాయాం=) భుజించుట యనుక్రియవలనఁ గలిగినతృప్తిని స్వయముగా ననుభవించినవాఁడై ('నాహం భుంజే'=) 'నేను భుజించుట లేదు'— ('నవా తృప్యామి'=) నేను దృప్తిని బొందుటయును లేదు' (ఇతి=) అని (యథాహి తద్వత్=) యన్నట్లుగానే, (ఇంద్రియ – ర్షేణ=) ఇంద్రియములకుఁ దాఁకి (స్వయం ...సఏవ=) ప్రత్యక్షముగా గోచరించుచున్నప్పటికి ( బాహ్య ... లభే'=) 'బాహ్య వస్తు వేదియును నాకు గోచరించుట లేదు' ('న చ సః+అస్తి–ఇతి'=) 'బాహ్య వస్తు వేదియును లేనేలేదు' (ఇతి=) అని (బ్రువన్=) చెప్పుచో, ఉపా...నచనః=) వాఁడు నమ్మఁదగినమాటలవాఁడు (కథం+స్యాత్=) ఎట్లగును! అనఁగా వాని మాటల నెవఁడు స్వీకరించును ?

బౌద్ధపూర్వపక్షి యెదురుప్రశ్న :—

నను నాహ మేవం బ్రవీమి న కంచి దర్థ ముపలభ ఇతి. కిం తూపలబ్ధివ్యతిరిక్తం నోపలభ ఇతి బ్రవీమి.

( నాహం ... బ్రవీమి'=) 'అప్రకారము నేను జెప్పలేదు. (నకంచి ... లభే+ఇతి=) 'ఏవస్తువు స్ఫురింపలేదని చెప్పుట లేదు'– (కింతు=) మఱేమనఁగా (ఉప ... రిక్తం=) గ్రహణజ్ఞానమునకు భిన్నమైనదేనిని, (న+ఉపలభే. ఇతి=) గ్రహించుట లేదని మాత్రము (నను+బ్రవీమి=) చెప్పుచున్నానుసుమీ!

అద్వైతసిద్ధాంతి : —

బాఢ మేవం బ్రవీషి నిరంకుశత్వాత్ తే తుండస్య; నతు యుక్త్యుపేతం బ్రవీషి.

(బాఢం=) భేష్ (నిరం .... తుండస్య=) నీవు మాట్లాడుదానికి హద్దేమియు లేకపోవుటవలన, (ఏవంబ్రవీషి=) అట్లు పల్కుచున్నావు. కాని (నతు...బ్రవీషి=) యుక్తితోఁ గూడుకొన్న దానినిమాత్రము పల్కుట లేదు

యత ఉపలబ్ధివ్యతిరేకోఽపి బలా దర్థ స్యాభ్యుపగంతవ్యః ఉపలబ్ధేరేవ.

(యతః=ఎందుచేత నట్లనుచున్నాననఁగా— (ఉపల .... కో౽పి=) జ్ఞాన మాత్రము కంటె భిన్న మైనదియొక బాహ్యావస్తువు- (అర్థస్య బలాత్=) ఆవస్తు వున్నట్లు నీవు తెలిసికొనుటవలననే (అభ్యుప ... రేవ=) అది యున్నట్లు నీ వొప్పు కొనితీరవలయు నుగదా!

నహి కశ్చి దుపలబ్ధి మేవ స్తంభః కుడ్యం చే త్యుపలభతే.

(కశ్చిత్=) ఎవఁడును (ఉపలబ్ధిం+ఏవ=) కేవలజ్ఞానమాత్రమునే, (స్తంభః ... చేతి=) స్తంభమని- గోడ యని (నహి+ఉపలభతే=) తలఁచుట లేదునుమీ!

ఉపలబ్ధివిషయత్వేనైవ తు స్తంభకుడ్యాదీన్ సర్వే లౌకికా ఉపలభంతే.

(స్తంభకుడ్యాదీన్=) స్తంభము- గోడ మొదలగు బాహ్యావస్తువులను (ఉపల ... నైవ=) జ్ఞానమువలనఁ దెలిసికొనఁబడువిషయమాత్రములుగా (లౌకికా ఉపలభంతే=) సర్వజనులును గ్రహించుచున్నారు.

అత శ్చైవమేవ సర్వే లౌకికా ఉపలభంతే యత్ప్రత్యాచక్షాణా అపి బాహ్య మర్థమేవ మాచక్షతే యదంతర్జ్ఞేయరూపం త ద్బహిర్వ దవభాసత ఇతి.

(అతః=) కాఁబట్టి (బాహ్యం+అర్థం=) బాహ్యావస్తు వేదియును (యత్ప్రత్యాచక్షాణాః+అపి=) లేనే లేదని చెప్పువారుగూడ (అంతర్ .... రూపం=) జ్ఞానమువలనఁ దెలిసికొనఁబడునాంతర (= ఆంతరంగిక) రూపమే (బహిర్... భాసతే+ఇతి=) బాహ్యము నున్నదానివలె భాసించుచుండునని (యత్+ఆచక్షతే+తత్=) చెప్పుటనుబట్టిగూడ (సర్వే లౌకికాః=) సర్వజనులును (ఏవం+ఏవ=) ఆవిధముగానే- అనఁగాఁ— పైనిఁజెప్పినవిధముగానే- అనఁగా బాహ్యావస్తువులను జ్ఞానమువలనఁ దెలిసికొనఁబడువిషయమాత్రములుగా (ఉపలభంతే=) గ్రహించుచున్నారనుట ఏవం=) స్పష్టము.

తేఽపి హి సర్వలోకప్రసిద్ధాం బహి రవభాసమానాం సంవిదం ప్రతిలభమానాః ప్రత్యాఖ్యాతుకామాశ్చ బాహ్య మర్థం బహిర్వదితి వత్కారణం కుర్వంతి; ఇతరథా హి కస్మా ద్బహిర్వ దితి బ్రూయుః ?

(తే+అపి=) బాహ్యావస్తువులు లేనే లేవని వాదించువారుగూడ (బహిరవభాసమానాం=) బాహ్యమందుఁ బ్రకాశించువస్తువులయొక్క (సర్వ .... సిద్ధాం=) సర్వజనప్రసిద్ధమైన (సంవిదం=) జ్ఞానమును (ప్రతిలభమానాః=) బొందుచున్నవారైనను- అనఁగా లోకముతోఁబాటు తామును బాహ్యావస్తువు లున్నవనియే

మనస్సులో విశ్వసించుచున్నవారై నను, (బాహ్యమర్థం=) బాహ్యవస్తువులు(ప్రత్యా ... కామాః=) లేవని చెప్పుటనే (వాదమునకు) యిచ్ఛయించినవారై (బహిర్వత్ + ఇతి=) 'బాహ్యముం దున్నవానివలె' అని చెప్పుటమూలమున ('వత్' కరణం=) 'వలె' యనుమాటయొక్క ప్రయోగమును (కుర్వంతి= జేయుచున్నారు

(ఇతరథా=)అట్లు కాకపోయినచో-అనఁగా బాహ్యవస్తువులు వాస్తవమునకు లేనే లేవని విశ్వసించువారగుచో (బహిర్వత్ - ఇతి) బాహ్యముం దున్నవానివలె అని (కస్మాత్ + బ్రూయుః=) ఏకారణముచేఁ జెప్పుచున్నారు ? (ఆలోచింపుము) (బాహ్యవస్తువులయొక్క యభావమును వాదించువారు గూడ బాహ్యవస్తువులున్నవనియే యథార్థమున కందఱితోఁబాటు నమ్ముచునే యున్నారని భావము.)

నహి వసుమిత్రో వంధ్యాపుత్రవ దవభాసత ఇతి కశ్చి దాచక్షీత.

(ప్రత్యక్షముగాఁ గనులకు గోచరించు (వసుమిత్రః=) 'వసుమిత్రుఁ' డను పురుషుఁడు (వంధ్యా ... సతే + ఇతి =) 'గొడ్రాలిబిడ్డనివలె నున్నాఁడు'— అని (కశ్చిత్ =) యెవఁడును (నహి + ఆచక్షీత =) జెప్పఁడుగదా !

తస్మా ద్యథానుభవం తత్త్వ మభ్యుపగచ్ఛద్భి ర్బహిరే వావభాసత ఇతి యుక్త మభ్యుపగంతుం. నతు బహిర్వ దవభాసత ఇతి.

(తస్మాత్ =) కాఁబట్టి (యథానుభవం=) వారివారి ప్రత్యక్షానుభవము ప్రకారము (తత్త్వ ... చ్ఛద్భిః=) వాస్తవమును గ్రహించువా రందఱును ('బహిర్ సతే' + ఇతి) 'బాహ్యముందున్నవే' యని (యుక్తం ... గంతుం ) చెప్పుదురుగాని ('బహిర్వ దవభాసతే' + ఇతి =) బాహ్యముం దున్నవానివలె నున్నవని (నతు — కశ్చిత్ =) యెవఁడును జెప్పఁడు.

బౌద్ధపూర్వపక్షి :—

నను బాహ్య స్యార్థ స్యాసంభవా ద్బహిర్వ దవభాసత ఇత్యధ్యవసితమ్.

(బాహ్య ... భవాత్ =) బాహ్యవస్తు వుండుటయే యసంభవముగావున (బహి ... సతే + ఇతి బాహ్యముం దున్నవానివలె నని (నను + అధ్యవసితం=) బౌద్ధులు నిశ్చయించుటలోఁ దప్పేమున్నది ?

అద్వైతసిద్ధాంతి :—

నాయం సాధు రధ్యవసాయో, యతః ప్రమాణప్రవృత్త్యప్రవృత్తిపూర్వకౌ సంభవాసంభవా వవధార్యేతే, న పున స్సంభవాసంభవపూర్వికే ప్రమాణప్రవృత్త్యప్రవృత్తీ.

(అయం + అధ్యవసాయః=) బౌద్ధులయొక్క యీనిశ్చయము (న సాధుః=) సరియైనది గాదు. (యతః=) ఎందుచేతననఁగా, (ప్రమాణ ... ధార్యతే=) ప్రత్యక్షాదిప్రమాణములకు గోచరించుట (ప్రవృత్తి)- గోచరింపకపోవుట (- అప్రవృత్తి) లనుబట్టి బాహ్యవస్తువుయొక్క సంభవమును నసంభవమును నిశ్చయింపవలెను గాని (న పునః...ప్రవృత్తీ=) బాహ్యవస్తువు లనునవి 'ఉన్నవి-లేవు' అని ముందుగా నిశ్చయించుకొని, దానిఁబట్టి ప్రత్యక్షాదిప్రమాణములకు గోచరించును- గోచరింపవు- అని చెప్పుట సరిగాదు =న పునః,-

యద్ధి ప్రత్యక్షాదీనా మన్యతమేనాపి ప్రమాణే నోపలభ్యతే తత్సంభవతి; యత్తు న కేనచిదపి ప్రమాణే నోపలభ్యతే త న్న సంభవతి.

(ప్రత్యక్షాదీనాం =) ప్రత్యక్షాదిప్రమాణములలో (అన్య .... ణేన =) నేదియో యొకప్రమాణమునకుమాత్రమే (యత్ + హి + ఉపలభ్యతే=) యేది గోచరించునో (తత్ =) యదిమాత్రమే (సంభవతి=) యున్నది- అనఁగా సంభవమగునది— అనియును (కేనచి ... ణేన=) ఏవిధమైన ప్రమాణమునకును - అనఁగా ప్రత్యక్షాదిప్రమాణములలో దేనికిని (యత్తు న- ఉపలభ్యతే=) నేది గోచరింపదో (తత్ =) యదియే (న సంభవతి=) లేనిది- అనఁగా సంభవము గానిది — అనియును నిశ్చయించుటయే క్రమమైన పద్ధతి.

ఇహ తు యథా స్వం సర్వైరేవ ప్రమాణై ర్బాహ్యోఽర్థ ఉపలభ్యమానః కథం వ్యతిరేకావ్యతిరేకాదివికల్పై ర్న సంభవతీ త్యుచ్యేత ? ఉపలబ్ధేరేవ.

(ఇహ తు=) ఇప్పుడో, (బాహ్యః-అర్థః=) బాహ్యవస్తువు (యథా స్వం=) తానెట్లున్నదో యట్లు (=అనఁగా- ఉన్నదున్నట్లు) (సర్వై ... మాణైః=) ప్రత్యక్షాదిసర్వప్రమాణములకు (ఉపలభ్యమానః=) గోచరించుచుండఁగా (వ్యతిరే .... వికల్పైః ) ఏదియో యొకదాని కనుకూలముగా లేదని, యనుకూలముగా నుండవలెనని తాముమాటు సిద్ధాంతములతో (న సంభవతి - ఇతి=) బాహ్యవస్తువనునది యసలే యుండఁజాలదు- అని (కథం ... ఉచ్యేత=) యెట్లు చెప్పవచ్చును ?

ఎట్లనుకొన్నను (ఉపలబ్ధేః + ఏవ=) బాహ్యవస్తువునకు నుపలబ్ధి- అనఁగా గ్రహింపఁబడుట- అనఁగా స్థితి (=ఉండుట) యుండనే యుండును.

నచ జ్ఞానస్య విషయసారూప్యా ద్విషయనాశో భవతి.

(జ్ఞానస్య= జ్ఞాన మను ది (విష .... రూప్యాత్ =) విషయముతో సమాన

రూపము గలదిగావున- అనఁగా- జ్ఞానము - బాహ్యవస్తువు - అను నీ రెండును నొకేరూపములుఁగ నుండనుగావున (విషయనాశః=) బాహ్యవస్తువు లేకపోవుట (నచ భవతి=) సంభవింపదు. అనఁగా బాహ్యవస్తు వసలే లేకుండఁబోఁజాలదు.

అసతి విషయే విషయసారూప్యానుపత్తేః. బహి రుపలబ్ధేశ్చ విషయస్య ।

ఎందుచేతననఁగా (అసతి విషయే=) బాహ్యవస్తు వనునది లేకపోవుచో (విషయ ... వత్తేః=) జ్ఞానము బాహ్యవస్తువుతో సమానరూపము గలది యని చెప్పుటయే గలుగదు. అనఁగా వస్తు' వనెడిజ్ఞానమే గలుగదు (అనఁగా- 'వస్తు' వనునది యసలే లేనిచో 'ఇది యొకవస్తువు' అని గ్రహించుటయే సంభవించదని భావము.) అట్లు చెప్పనప్పటికి- అనఁగా- జ్ఞానము బాహ్యవస్తువుతో సమాన రూపమును దాల్చుచున్నది యని యంగీకరింపనప్పటికి (బహి ...విషయస్య=) బాహ్యవస్తువు బాహ్యమందుండియే యున్నది- అనుదాని కెట్టివ్యత్యాసమును రాదు. అనఁగా- జ్ఞానము బాహ్యవస్తువుతో సమానరూపమును దాల్చనిగాని మఱియొకవిధమునఁగాని యెట్లు చెప్పినను బాహ్యవస్తువు ప్రత్యక్షముగా బాహ్యమందు గోచరించుటను నీవు నిరాకరింపలేవుగదా యని భావము)

అతఏవ సహోపలంభనియమోఽపి ప్రత్యయవిషయయో, రుపాయోపేయభావహేతుకో నాభేదహేతుక ఇత్యవగంతవ్యమ్.

(అతః + ఏవ=) కాఁబట్టియే (ప్రత్యయవిషయయోః=) బుద్ధివృత్తియు (ప్రత్యయః=) అనఁగా జ్ఞానము బాహ్యవస్తువు (విషయః=) అనునీరెంటియొక్క- అనఁగా నీరెండును (సహోపలంభనియమోఽపి=) ఒకసారిగా గోచరించుచుండుటకు సైతము (ఉపాయో .... హేతుకః=) ఒకటి గ్రహించుసాధనము (ఉపాయము)- రెండవది గ్రహింపఁబడువస్తువు, (ఉపేయము) అగుటయే హేతువుగాని (అభేద హేతుకః=) రెండను- అనఁగా జ్ఞానబాహ్యవస్తువులు రెండును భేదము లేకుండ నొకటియే యైనందునఁ (న )గాదు- (ఇతి=) అని (అవగంతవ్యం=) తెలిసికొనవలసిన విషయమై యున్నది.

(అనఁగా ) జ్ఞానము - బాహ్యవస్తువు - అనునీరెండును నొకసారిగా నే తోచుచుండుటనుబట్టి - ఆరెండును భిన్నములు గావు - ఒకటే యగు ననుటకంటె 'ఒకటి గ్రహించుసాధనము రెండవది యాసాధనముచేత గ్రహింపఁబడువస్తువు అని నిశ్చయించుటయే భావ్యము— అని భావము.

అపిచ ఘటజ్ఞానం పటజ్ఞానమితి విశేషణయోరేవ ఘటపటయో ర్భేదో, న విశేష్యస్య జ్ఞానస్య

(అపిచ=) మఱియును (ఘటజ్ఞాన ... మితి =) కుండ'ను దెలిసికొనుట, 'వస్త్రము'ను దెలిసికొనుట యనునవి యొకదానితరువాత మఱియొకటి జరిగిన వనుకొనుఁడు- (విశేష .... ర్భేదః=) వానిలోఁ 'దెలిసికొనుట' యనుననుభవజ్ఞానము ముఖ్యమైనది (=విశేష్యము); 'కుండను- వస్త్రమును' అనునీరెండును ముఖ్యముగా నున్న 'జ్ఞానము' దేనిదో తెలుపువిశేషణములు- రెండుచోట్లను 'జ్ఞాన' మొకటిగానే యున్నదిగాని విశేషణవస్తువులుమాత్రము మాఱినవి.

యథా శుక్లో గౌః కృష్ణో గౌరితి శౌక్ల్యకార్ష్ణ్యయోరేవ భేదో, న గోత్వస్య.

(యథా=) ఈపై విషయ మొకదృష్టాంతములోఁ జెప్పుచున్నాము చూడుఁడు. (శుక్లో .... గౌరితి=) 'తెల్లనియావు- నల్లనియావు' అని తెలిసికొన్నప్పుడు (శౌక్ల్య ... గోత్వస్య=) విశేషణము లైన తెలుపునలుపులలోనే భేదము గల్గినదిగాని రెండుచోట్లను ముఖ్యవిషయముగా నున్న 'ఆవుజాతి'లో భేద మేమియును గలుగలేదు గదా! అట్లే జ్ఞానవస్తువులలో సైతము-

ద్వాభ్యాం చ భేద ఏకస్య సిద్ధో భవతి, ఏకస్మాచ్చ ద్వయోః.

(ద్వాభ్యాంచ=) రెండైన కుండ- వస్త్రములకంటె (ఏకస్య=) ఒకటిగానే నిల్చియున్న 'తెలిసికొనుట' యనుజ్ఞానమునకు- అనఁగా (ఏకస్మాత్ =) ఒకటిగానే యున్నజ్ఞానముకంటె (ద్వయోః=) మాఱిన 'కుండ వస్త్రము లనురెంటికి (భేదః సిద్ధః భవతి= భేదము స్థిరపడుచున్నది.

తస్మా దర్థజ్ఞానయో ర్భేదః.

(తస్మాత్ =) కాఁబట్టి (అర్థజ్ఞానయోః=) బాహ్యవస్తువునకు జ్ఞానమునకు భేదమును జెప్పవలయునుగాని బాహ్యవస్తు వనఁగా జ్ఞానమేగాని వేఱు గాదని చెప్పఁదగదు.

తథా ఘటదర్శనం ఘటస్మరణ మిత్యత్రాపి ప్రతిపత్తవ్యమ్.

జ్ఞాన మొకటిగా నుండి బాహ్యవస్తువులే మాఱుచున్నవని తలఁచవలదు. (తథా=) బాహ్యవస్తు వొకటిగానే యుండి జ్ఞానవృత్తులుసైతము మాఱుట గలదు. (ఘట ... రణమితి=) 'కుండయొక్క రూపమును దెలిసికొనుట'- కుండయొక్క

జ్ఞప్తిని దెలిసికొనుట (అనగా కుండ యున్నట్లు జ్ఞప్తిలోనికి దెచ్చుకొనుట- అను జ్ఞానములు వేఱువేఱుకాలములయందు జరిగిన వనుకొనుడు. (అత్రాపి) ఇట్టి చోటగూడ (ప్రతిపత్తవ్యం=) జ్ఞానబాహ్యావస్తువులకు భేదమునే గ్రహింపవలసి యున్నది.

అత్రాపి హి విశేష్యయో రేవ దర్శనస్మరణయో ర్భేదో, న విశేషణస్య ఘటస్య.

(అత్రాపిహి=) భిన్నజ్ఞానము లేర్పడినయిట్టిచోట (విశేష్య .... ర్భేదః=) ముఖ్యములుగా (=విశేష్యములుగా) నున్న 'రూపమును దెలిసికొనట' 'జ్ఞప్తిని దెలిసికొనట' యను జ్ఞానములందే భేదము గలదుగాని (న విశే ... ఘటస్య=) రెంటియందును నొకటిగానే సల్పియుండి రెండు జ్ఞానములకును విశేషణముగా నున్న 'కుండ' యను బాహ్యవస్తువులో భేద మెంతయును లేదు.

యథా క్షీరగంధః క్షీరరస ఇతి విశేష్యయో రేవ గంధరసయో ర్భేదో, న విశేషణస్య క్షీరస్య; తద్వత్.

(యథా=) దీనికిస్సైత మొకదృష్టాంతమును జెప్పెదము చూడుడు— (క్షీర ... రసఇతి=) 'పాలయొక్క వాసన'— 'పాలయొక్క రుచి' యనురెండనుభవ జ్ఞానము లేర్పడినచోట్ల (విశేష్య ... ర్భేదః=) ముఖ్యములుగా (=విశేష్యములుగా నున్న 'వాసన— రుచి' యనువానిలో మాత్రమే భేదము గలదు (నవిశే...క్షీరస్య= ఈరెండ జ్ఞానములకును సంబంధించియున్న (=విశేష్యముగానున్న) 'పాలు' అను బాహ్యావస్తువునకు భేదము గలుగలేదు (తద్వత్=) ఇట్లె బాహ్యావస్తుతదజ్ఞానముల యందన్నిటను భేదమును గ్రహింపవచ్చును.

అపిచ ద్వయో ర్విజ్ఞానయోః పూర్వోత్తరకాలయోః స్వసంవేదనేనై వోపక్షీణయో రితరేతరగ్రాహ్యగ్రాహకత్వానుపపత్తిః,

(అపిచ =) మఱియును (పూర్వో ... లయోః=) పూర్వోత్తరకాలముల యందు సంభవించిన (ద్వయో ... నయోః=) రెండుజ్ఞానములును అందొక్కొ క్కటి (బౌద్ధసిద్ధాంతము ననుసరించి) (స్వసంవే ... ణయోః=) దాని నది తెలిసి కొన్నంతమాత్రముననే (అనగా రెండవజ్ఞానము పుట్టకపూర్వమే) నశించిపోవుచు న్నందున (ఇతరే ... పత్తిః) ఒకటి గ్రహింపబడునదియు (గ్రాహ్యః=) అనగా బుట్టింపబడునదియు— మఱియొకటి గ్రహించునదియు (=గ్రాహకః) అనగా బుట్టిం చునదియు నని చెప్పుట కవకాశము లేదు. (అనగా రెండవది పుట్టకపూర్వమే

మొదటిది నశించిపోవుచున్నందున- 'మొదటిదానివలన రెండవది గల్గినది' అని చెప్పుట కవకాశము లేదని భావము.

తతశ్చ విజ్ఞానభేదప్రతిజ్ఞా. క్షణికత్వాదిధర్మప్రతిజ్ఞా. స్వలక్షణ సామాన్యలక్షణ వాస్యవాసకత్వావిద్యోపప్లవ సదసద్ధర్మ బంధమోక్షాదిప్రతిజ్ఞాశ్చ స్వశాస్త్రగతా స్తే హీయేరన్.

(తతశ్చ=) ఈపై హేతువువలన (స్వశాస్త్రగతాః- తే) బౌద్ధశాస్త్రమందు జెప్పఁబడునట్టి యీ (1) విజ్ఞాన ... ప్రతిజ్ఞాశ్చ=) (1) విజ్ఞానభేద (2) క్షణికత్వాది ధర్మ (3) స్వలక్షణ సామాన్యలక్షణ (4) వాస్య (=గ్రాహ్య) వాసకత్వ (గ్రాహకత్వ) (5) అవిద్యోపప్లవ (=అవిద్యాసంసర్గ) (6) సదసద్ధర్మ (7) బంధమోక్షాది — సిద్ధాంతము లన్నియును (హీయేరన్=) భంగపడిపోవునవియేగాని యొక్కటియు నిల్వఁదగినదిగా నుండదు.

కించాన్యత్; విజ్ఞానం విజ్ఞానమి త్యభ్యుపగచ్ఛతా బాహ్యోఽర్థ స్స్తంభః కుడ్య మిత్యేవంజాతీయకః కస్మా న్నాభ్యుపగమ్యత ఇతి వక్తవ్యమ్.

(కించ+అన్యత్=) మఱియొకప్రశ్న మేమనఁగా— (విజ్ఞానం ... నమితి= భిన్నవిజ్ఞానములను (అభ్యుపగచ్ఛతా=) అంగీకరించునీవు (బాహ్యో ... యకః=) బాహ్యపదార్థము లైన స్తంభము- గోడ మొదలగునట్టి వివిధవస్తువులనుమాత్రము (కస్మా ... గమ్యతే+ఇతి=) ఏల యంగీకరింపవో (వక్తవ్యం=) చెప్పుము; చూతము.

బౌద్ధపూర్వపక్షి :—

విజ్ఞాన మనుభూయత ఇతిచేత్,

(విజ్ఞా ... చేత్=) ఆంతరవిజ్ఞానము- అనఁగాఁ- దెలిసికొనుట యనునది స్వయముగా ననుభవింపఁబడుచున్నందున దానిని దెలిసికొనుట గల్గినది.

అద్వైతసిద్ధాంతి :—

బాహ్యోఽప్యర్థోఽనుభూయత ఏవేతి యుక్త మభ్యుపగంతుమ్.

అట్లగుచో (బాహ్యోఽప్యర్థః=) బాహ్యపదార్థముగూడ స్వయముగా (అను ... ఏవ - ఇతి) ననుభవింపఁబడుచునే యున్నదని (యుక్త...గంతుం=) యంగీకరించుటయే (= తెలిసికొనుటయే) యుక్తముగదా!

బౌద్ధపూర్వపక్షి :—

అథ విజ్ఞానం ప్రకాశాత్మకత్వాత్ ప్రదీపవ త్త త్స్వయమే వానుభూయతే, న తథా బాహ్యోఽర్థ ఇతిచేత్.

(అథ=) అట్లు చెప్పుటకు వీలు లేదు (ప్రదీపవత్ =) దీపమువలెఁ (విజ్ఞానం=) దెలిసికొనుట యనునది (ప్రకా .... కత్వాత్=) ప్రకాశస్వరూప మగుటవలన— అనఁగా— అది యొకవెలుఁగు గావున (స్వయ ... యతే=) దానియంతట నదియే యనుభవింపఁబడుచుండును (అనఁగా— దాని నదియే తెలిసికొనుచుండును (తథా=) ఆప్రకారముగా (బాహ్యోఽర్థః=) బాహ్యపదార్థము— అనఁగ స్తంభము— గోడ మొదలగునవి (న— ఇతి చేత్ =) తమకుఁ దామే యనుభవింపఁబడుటకు— అనఁగాఁ దమ్ముఁ దామే తెలిసికొనుటకు నవకాశము లేదు.

అద్వైతసిద్ధాంతి :—

అత్యంతవిరుద్ధాం స్వాత్మని క్రియా మభ్యుపగచ్ఛసి— అగ్ని రాత్మానం దహతీతివత్.

(అగ్ని ... తీతివత్ =) 'నిప్పు తనకుఁ దానే కాల్చుకొనుచున్నది' యని చెప్పినట్లుగా (అత్యం .... క్రియాం=) 'తెలిసికొనుట యనునది తన్నుఁదాను దెలిసికొనుచున్నది' యని మిక్కిలివిరుద్ధమైన క్రియ యొకటి యున్నట్టు లంగీకరించుచున్నావు ఇది యెంతయు నసంభవము— హాస్యాస్పదము.

అవిరుద్ధం తు లోకప్రసిద్ధం స్వాత్మవ్యతిరిక్తేన విజ్ఞానేన బాహ్యోఽర్థోఽనుభూయత ఇతి నేచ్ఛ స్యహో పాండిత్యం మహ ద్దర్శితమ్

"(స్వాత్మవ్యతిరిక్తే =) దానికంటె భిన్నమైన— అనఁగా ఘటపటాదివిషయముకంటె (=స్వాత్మ) భిన్నమైన (విజ్ఞానేన =) విజ్ఞానముచేత (= తెల్విచేత) (బాహ్యోఽర్థః :) బాహ్యవస్తువు (అనుభూయతే =) అనుభవింపఁబడుచున్నది— అనఁగాఁ దెలిసికొనఁబడుచున్నది"— (ఇతి - అవిరు ... సిద్ధం=) అనుస్వభావసిద్ధమైనట్టియు, నందఱకుఁ దేటతెల్లముగాఁ దెలియునట్టియు నీవిషయమును (న+ఇచ్ఛసి=) నీ వంగీకరింపకున్నావు— (అహో !=) ఓహో బౌద్ధుఁడా ! (పాండి ... దర్శితం=) నీపాండిత్యవిశేషము నెంతగాఁ బ్రదర్శించుచున్నావు !

న చార్థవ్యతిరిక్తమపి విజ్ఞానం స్వయమే వానుభూయతే, స్వాత్మని క్రియావిరోధాదేవ,

(అర్థవ్యతిరిక్తం =) బాహ్యవస్తువుకంటె వ్యతిరేకముగా (= భిన్నముగా) నుండు (విజ్ఞానం+అపి=) జ్ఞానమైనను (స్వయమేవ=) తన్నుఁదానే (నచ+అను

భూయతే=) తెలిసికొనుట యనునది సంభవింపదు. ఎందుచేత ననఁగా, (స్వాత్మని .... దేః=)తనక్రియ తనయందుఁ బారుట కనుకూలింపదుగదా.

బౌద్ధపూర్వపక్షి :—

ననువిజ్ఞానస్య స్వరూపవ్యతిరిక్తగ్రాహ్యత్వే, తద ప్యన్యేన గ్రాహ్యం తద ప్యన్యేనే త్యనవస్థా ప్రాప్నోతి.

(విజ్ఞానస్య=) విజ్ఞానమనునది (స్వ .... హ్యత్వే=) తనకంటె వ్యతిరేక మైన మఱియొకదానిచేత గ్రహింపఁబడు నన్నపక్షములో (1) (తదపి=) ఆమఱియొకటి గూడ (అన్యేన గ్రాహ్యం=) వేఱొకదానిచేత గ్రహింపఁబడు ననవలసివచ్చును- (తదపి =) ఆయింకొకటిగూడ (అన్యేన =) వేఱొకదానిచేత గ్రహింపఁబడవలసి వచ్చును. (ఇత్య ... ప్నోతి నను=) ఇట్లంతము లేకుండఁ బోవుచునేయుండును గాని నిలుకడ యుండదుగదా! (అనఁగా- జ్ఞాన మన్నది తన్నుఁదానే తెలిసికొను చున్నది యని చెప్పరో నేదోషమును రాదు. అని భావము.)

అపిచ ప్రదీపవ దవభాసాత్మకత్వాత్ జ్ఞానస్య, జ్ఞానాంతరం కల్పయితుం సమత్వా దవభాస్యావభాసకభావానుపపత్తేః కల్పనానర్థక్య మితి.

(2) (అపిచ =) మఱియును (జ్ఞానస్య=) జ్ఞానమనునది (ప్రదీపవత్ =) దీపము వలెఁ (అవ ... త్వాత్ =) ప్రకాశస్వరూపమే యగునుగావున, (జ్ఞానాం .... యితుః=) జ్ఞానమును బ్రకాశింపఁజేయుటకు (= తెలుపుటకు) మఱియొకజ్ఞానమును గల్పించు మీ వేదాంతులకుఁ జెప్పునది యేమనఁగా :—

(సమత్వాత్ =) రెండుజ్ఞానములు సమముగాఁ బ్రకాశస్వరూపములే యగును గావున (అభావ ... పత్తేః=) ఒకజ్ఞానము ప్రకాశింపఁజేయఁబడునది- మఱియొకటి ప్రకాశింపఁజేయునది యని చెప్పుట కవకాశము లేదు. అందుచేత (కల్ప .... క్యమితి + నను=) నొకజ్ఞానమును దెలిసికొనుటకు మఱియొకజ్ఞాన మున్నది- యని మీ వేదాంతులు చేయుకల్పనము వ్యర్థముగదా!

అద్వైతసిద్ధాంతి :—

తదుభయమ ప్యసత్,

(తదు ... మపి=) నీవు చెప్పినయాక్షేపహేతువులు రెండును (అసత్ =) గానివే- అనఁగా సారము లేనివే-

విజ్ఞానగ్రహణమాత్రఏవ విజ్ఞానసాక్షిణో గ్రహణాకాంక్షానుత్పాదా దనవస్థాశంకానుపపత్తేః

(1) విజ్ఞాన .... ఏవ=) విజ్ఞానము గ్రహింపఁబడినంతమాత్రమందే (అనఁగా నీక్షణికవిజ్ఞానము మఱియొకదానిచేత గ్రహింపఁబడునది యని నీ వంగీకరించుచో, (విజ్ఞానసాక్షిణః=) ఆవిజ్ఞానమును గ్రహించునట్టి సాక్షివిజ్ఞానమును (గ్రహ ... దాత్ =) గ్రహింపఁగలది మఱియొకటి యుండవలసిన యవసరము లేకపోవుటవలన (అనఁగా— ఈసాక్షివిజ్ఞాన మన్నదియే వాస్తవమునకుఁ బ్రకాశస్వరూపమైనందున)- (అనవ .... పత్తేః=) ఒకజ్ఞానమును గ్రహించుటకు వఱియొక జ్ఞానమును దానిని గ్రహించుటకు సింకొకజ్ఞానమును నీతీరుగా నంతము లేకుండఁ గల్పించవలసివచ్చు ననుదోషము సంభవింపదు.

సాక్షిప్రత్యయయోశ్చ స్వభావవైషమ్యా దుపలబ్ధ్రుపలభ్యభావోపపత్తేః,

(2) మఱియును (సాక్షి ... త్యయయోశ్చ) అన్నిఁటిని గ్రహింపఁగల మేము చెప్పుసాక్షివిజ్ఞానమునకును (=సాక్షి) గ్రహింపఁబడునది యని నీ వంగీకరించిన క్షణిక (వృత్తి) విజ్ఞానమునకును (ప్రత్యయ) (స్వభా .... మ్యాత్ =) స్వభావములోనే భేద మున్నందున. (అనఁగా— మేము చెప్పుసాక్షివిజ్ఞానము చిదూపము; నీవు చెప్పుక్షణికవిజ్ఞానము జడస్వరూపము నైనందున (ఉపల ... పత్తేః=) ఒకటి గ్రహించునది (-ఉపలబ్ధృ) మఱియొకటి గ్రహింపఁబడునది (=ఉపలభ్య) యగునని చెప్పుటలో నిబ్బంది యేమియును లేదు — ఎందుచేత ననఁగా

స్వయంసిద్ధస్య సాక్షిణోऽప్రత్యాఖ్యేయత్వాత్.

(స్వయంసిద్ధస్య=) నిత్యస్వయంప్రకాశ మైన (సాక్షిణః=) సాక్షి జ్ఞానము (అనఁగా నన్నింటిని గ్రహింపఁగల 'నేను' అను జ్ఞానము (అప్ర ... త్వాత్ =) లేదని త్రోసివేయఁబడుట కవకాశము లేదు. (కావున నీవు చేసినరెండవయాక్షేపము సైతము నరిగాదు.)

కించాన్య త్ప్రదీపవ ద్విజ్ఞాన మవభాసకాంతరనిరపేక్షం స్వయమేవ ప్రథత ఇతి బ్రువతా ప్రమాణాగమ్యం విజ్ఞాన మనవగంతృక మిత్యుక్తం స్యాత్ శిలాఘనమధ్యస్థ ప్రదీపసహస్రప్రథనవత్.

(కించ + అన్యత్ =) మఱియొకవిశేష మేమనఁగా- (విజ్ఞానం=) నీవు చెప్పు క్షణికవిజ్ఞానము (ప్రదీపవత్ =) దీపమువలె (అవభా .... పేక్షం=) దానినిఁ బ్రకా

శింపఁజేయు మఱియొకజ్ఞానముయొక్క సాహాయ్యము లేకుండఁగనే (స్వయమేవ=) తనకుఁదానే (ప్రథతే + ఇతి) ప్రకాశించుచున్నది- అని (బ్రువతా=) వాదించునీవు (శిలాఘన ... ప్రథనవత్ =) పెద్దచట్రాతిమధ్యమందు (ఎవరికిని దెలియకుండ) వెలుఁగుచున్న దనెడి వేయిదీపముల ప్రకాశమువలె(ప్రమాణాగమ్యం=) నేప్రమాణమునకుఁగాని యెవనికిఁగాని (=అనవగంతృకం) గోచరముగానట్టి (విజ్ఞానం+ఇతి) విజ్ఞానమే యని (ఉక్తంస్యాత్=) చెప్పినట్లగునుసుమా ! (అనఁగా నీవు చెప్పువిజ్ఞానమున కర్థ మేమియు లేదని భావము.

బౌద్ధపూర్వపక్షి :—

బాఢ మేవ మనుభవరూపత్వాత్తు విజ్ఞానస్యేష్టో నః పక్ష స్త్వయాఽనుజ్ఞాయత ఇతిచేత్.

(ఏవం=) ఇది- అనఁగా నీవు చెప్పినది (బాఢం=) బాగుగనున్నది (అనఁగా మాకనుకూలమే) (విజ్ఞానస్య=)మేము చెప్పుక్షణికవిజ్ఞానము (అనుభ.... త్వాత్తు=) (మఱియొకసాహాయ్యము లేకుండ) తనకుఁదానే దెలిసికొనునది యగుటవలననే (నః ఇష్టః పక్షః=) మా కనుకూలమైనసిద్ధాంతమే (త్వయా=) అద్వైతివైననీచేత (అను ... ఇతి చేత్=) ననువదింపఁబడినట్లైనది.

అద్వైతసిద్ధాంతి :—

న- అన్య స్యావగంతు శ్చక్షురాదిసాధనస్య ప్రదీపాదిప్రథనదర్శనాత్.

(న=) అట్లు గాదు- అనఁగా నీసిద్ధాంతమునే మే మనువదించితి మనుట సరి గాదు. ఏలనుచేతననఁగా (చక్షురాది .... సాధనస్య=) నేత్రములు మొదలగు సాధనములు గలిగి (అవగంతుః =) చూచునట్టి (అన్యస్యచ =) మఱియొకనికి మాత్రమే. (ప్రదీ ... దర్శనాత్ =) దీపాదులయొక్క ప్రకాశము గోచరించుచున్నదిసుమా !

అతో విజ్ఞానస్యా ప్యవభాస్యత్వావిశేషాత్ సత్యే వాన్యస్మి న్నవగంతరి ప్రథనం ప్రదీపవ దిత్యవగమ్యతే.

(అతః=) కాఁబట్టి (విజ్ఞానస్యాపి =) నీక్షణికవిజ్ఞానముఁగూడ (అవభా ... విశేషాత్ =) ప్రకాశింపఁజేయఁబడునది యనిచెప్పుటలో భేద మేమియును లేనందున అనఁగా నిస్సందేహముగాఁ బ్రకాశింపఁజేయఁబడునదియే యగుటవలన (సత్యే ... గంతరి=) తెలిసికొనునట్టిమఱియొకఁ డున్నప్పుడే (అనఁగా సాక్షి యున్నప్పుడే,

(ప్రదీపవత్ =) మఱియొకని చేతఁ దెలిసికొనఁబడు దీపమువలె (ప్రధనం+ఇతి=) నీ క్షణికవిజ్ఞానమునకుఁ బ్రకాశము గల్గునని (అవగమ్యతే =) నిశ్చయ మగుచున్నది.

బౌద్ధపూర్వపక్షి :—

సాక్షిణోఽవగంతు స్స్వయంసిద్ధతా ముపక్షిపతా స్వయం ప్రథతే విజ్ఞాన మిత్యేషఏవ మమ పక్ష స్త్వయా వాచోయుక్త్యంతరే ణాశ్రిత ఇతిచేత్.

(అవగంతుః=) (సర్వమును) గ్రహించువాఁడైన (as subject only) (సాక్షిణః =) సాక్షియొక్క (స్వయంసిద్ధతాం =) స్వయంప్రకాశస్వరూపమును (ఉపక్షిపతా త్వయా=) బ్రతిపాదించు(= చెప్పు) నద్వైతి వైననీవు (స్వయం ప్రథతే విజ్ఞానమ్- ఇతి=) విజ్ఞానమున్నది (మఱియొక దానిసాయము లేకుండ) దాని కదియే ప్రకాశించును' అను (ఏషః మమ పక్షః - ఏవ=) నిట్టి (బౌద్ధులమైన) మావాదమే (వాచోయుక్త్యంతరేణ=) వాక్కునుండి వచ్చుయుక్తి భేదముల చేత- అనఁగా వేఱు వేఱుమాటల చేతను, యుక్తుల చేతను (ఆశ్రితః - ఇతి- చేత్ =) (నీవు) స్వీకరించినట్లైనదిగదా !

(అనఁగా- బౌద్ధుల మైన మేము 'క్షణికవిజ్ఞాన' మన్నది 'దాని కదియే యనుభవింపఁగలదు' — అనఁగా 'దాని కదియే తెలిసికొనును' అని చెప్పుచున్నాము- అద్వైతులైన మీరో సర్వమును గ్రహించుసాక్షి యైః స్వయంప్రకాశస్వరూపుఁ డున్నాఁడని చెప్పుచున్నారు. మాటలభేదమేగాని మావిజ్ఞానమునే మీరు సాక్షిగాఁ జెప్పుచున్నారు- అని భావము)

అద్వైతసిద్ధాంతి :—

న-విజ్ఞానస్యోత్పత్తిప్రధ్వంసానేకత్వాదివిశేషవత్త్వాభ్యుపగమాత్.

(న=) అట్లు గాదు- అనఁగా మీ 'విజ్ఞానము' వేఱు మా 'సాక్షి' వేఱు— ఎందుచేత ననఁగా (విజ్ఞానస్య=) మీ 'విజ్ఞాన' మన్నది (ఉత్ప ... గమాత్ =) (1) పుట్టుట (2) క్షణములో నశించిపోవుట (3) ఒకటిగాఁగాక పరంపరలుగా ననేకములై యుండుట యీమొదలగులక్షణములు గలదియని మీ రంగీకరించుచున్నారు. (మా సాక్షియన్ననో- నిత్యమైయుండు స్వయంప్రకాశరూపముగావున రెండవదాని సాహాయ్యము లేకుండఁగనే ప్రకాశించుస్వభావముగలది. మీవిజ్ఞానము జడముగావున సాక్షియొక్క సాయ మపేక్షించును. మీ విజ్ఞాన మన్నది మా 'సాక్షి' యే యని మే మొప్పుకొనుచున్నా మనుట హాస్యాస్పదము- అని భావము)

అతః ప్రదీపవ ద్విజ్ఞానస్యాపి వ్యతిరిక్తావగమ్యత్వ మస్మాభిః ప్రసా॰

(అతః=) కాఁబట్టి (ప్రదీపవత్=) దీప మున్నట్లు గ్రహించు సాధన మెట్లుండవలయునో యట్లే (విజ్ఞానస్యాపి=) బౌద్ధుల క్షణికవిజ్ఞ (వ్యతి .... మ్యత్వం=) ఆవిజ్ఞానముకంటె వేఱైనమఱియొక సాధనముచేతనే తెలియఁబడఁగల దనువిషయము (అనఁగా నావిజ్ఞానము సాక్షివలె స్వయంప్రకాశస్వరూపము గాఁజాలనివిషయము) (అస్మాభిః=) మాచేత (ప్రసాధితమ్=) నిందు సిద్ధాంతీకరింపఁబడినది.

29 సూత్రావతారిక :—

విజ్ఞానముకంటె బాహ్యపదార్థములు వేఱుగ లే వనెడిబౌద్ధయోగాచారుల సిద్ధాంతము లోఁగడిసూత్రమందు ఖండింపఁబడినది. బాహ్యవస్తువులయభావమునకు స్వప్నాదిదృష్టాంతములను జెప్పునాయోగాచారులమత మీసూత్రమందు ఖండింపఁబడఁబోవుచున్నది.

## ౨౯ సూ॥ వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్.

ప॥ వి॥ — వైధర్మ్యాత్ - చ - న - స్వప్నాదివత్.

అ॥ క్ర॥ — స్వప్నాదివత్ - న - వైధర్మ్యాత్ - చ.

ప్ర॥ ప॥ అ॥ — స్వప్నాదివత్ = స్వప్నాదివస్తుదృష్టాంతము, న= సరి గాదు; వైధర్మ్యాత్-చ = స్వప్నజాగ్రదవస్థలలోనివస్తువులకు భేద ముండుటవలన.

సూత్రార్థము :— (బాహ్యవస్తువులు లే వనుటకు) స్వప్నాదులలోని వస్తువులదృష్టాంతము పనికి రాదు. ఏలయనఁ— స్వప్నజాగ్రదవస్థలలోని వస్తువులకుఁ బోలికయే కుదురదు.

భాష్యసంగ్రహము :—

(స్వప్నాదివత్=) స్వప్నాదులలోఁ దోఁచుప్రత్యయముల (- భావముల) వలె జాగ్రదవస్థలోఁ దోఁచుప్రత్యయములుగూడ బాహ్యవస్త్వాలంబనము లేనివే యని చెప్పుట (న) యుక్తము గాదు. ఎందుచేతననఁగా (వైధర్మ్యాత్-చ=) స్వప్నజాగ్రదవస్థలలోఁ దోఁచువస్తువులకు భేదము గలదు. స్వప్నములోఁ దోఁచువస్తువు మరలఁ గనిపింపదు. జాగ్రదవస్థలోఁ దోఁచువస్తు వట్లు గాదు. మఱియొకనాఁడుగాని మఱి

యొకని చేతఁగాని జాగ్రదవస్థలోనివస్తువు గ్రహింపఁబడుచునే యుండును. ఇదియే స్వప్నజాగ్రదవస్థావస్తువుల కున్న భేదము.

భాష్యము — భాష్యార్థము

బౌద్ధపూర్వపక్షి :—

యదుక్తం బాహ్యార్థాపలాపినా స్వప్నాదిప్రత్యయవ జ్జాగరితగోచరా అపి స్తంభాది ప్రత్యయా వినైవ బాహ్యేనార్థేన భవేయుః ప్రత్యయత్వావిశేషాదితి త త్ప్రతివక్తవ్యమ్,

(వినైవ ... ర్థేన=) బాహ్యవస్తు వనునది లేకుండఁగనే (స్వప్నాది ... త్యయవత్=) స్వప్నాదులయందలి వస్తుభావము (ideas) లెట్లేర్పడునో యట్లే (జాగ ... చరాః=) జాగ్రదవస్థలోఁ దోఁచుచుండు (స్తంభాదిప్రత్యయాః+అపి=) స్తంభము మొదలగువస్తుభావములుగూడ (భవేయుః=) నేర్పడును. ఎందుచేత ననఁగా (ప్రత్యయత్వావిశేషాత్=) వస్తుభావములు స్వప్నములో నెట్లుండునో జాగ్రదవస్థలోఁగూడ నట్లే యుండునుగాని భేద మేమియును లేదు (ఇతి బాహ్యార్థాపలాపినా=) అని బాహ్యవస్తువు లేనే లేదని త్రోసివేయు బౌద్ధయోగాచారి (యదుక్తం తత్=) వాదించువిషయ మేది గలదో యది యిప్పుడు (ప్రతివక్తవ్యం= సమాధానము చెప్పఁబడవలసియున్నది.

అద్వైతసిద్ధాంతి :—

అత్రోచ్యతే—

(అత్రోచ్యతే=) సమాధానము చెప్పఁబడుచున్నది వినుఁడు.

న స్వప్నాదిప్రత్యయవ జ్జాగ్రత్ప్రత్యయా భవితు మర్హంతి.

(జాగ్ర... త్యయాః=) జాగ్రదవస్థలోఁ దోఁచువస్తుభావములు (స్వప్న.... వత్=) స్వప్నాదులలోని వస్తుభావములవంటివి (భవితుం + న + అర్హంతి =) గానేరవు.

కస్మాత్ ? వైధర్మ్యాత్.

ఎందువలన నందురేమో భేదము గలదుగాన.

వైధర్మ్యం హి భవతి స్వప్నజాగరితయోః,

అనఁగా (స్వప్న .... తయోః=) స్వప్నమునందలి వస్తుభావములకును జాగ్రదవస్థలోని వస్తుభావములకును, (వైధ ... భవతి=) భేదము గలదు.

కింపున ర్వైధర్మ్యమ్?

(కిం .... ధర్మ్యం=) అట్లగుచో నాభేద మేమిటి యని ప్రశ్నింపవచ్చును.

బాధాబాధావితి బ్రూమః. బాధ్యతే హి స్వప్నోపలబ్ధం వస్తు ప్రతిబుద్ధస్య; మిథ్యా మయోపలబ్ధో మహాజనసమాగమ ఇతి.

(బాధా ... బ్రూమః=) ఒకదానివిషయములో బాధ యుండుట మఱియొక దానివిషయములో బాధ లేకపోవుట అనునదియే భేద మని చెప్పుచున్నారము.

(స్వప్నో ... వస్తు=) స్వప్నమందు గోచరించిన వస్తువు (ప్రతిబుద్ధస్య=) మేలుకొన్నతరువాత వాఁడు ('మయా ... గమః+మిథ్యా+ఇతి=' స్వప్నములో నాకుఁ గల్గినమహాజనసమావేశము మిథ్య; (=అసత్యము) యని చెప్పుటచేతను

న హ్యస్తి మహాజనసమాగమో, నిద్రాగ్లానం తు మే మనో బభూవ, తే నైషా భ్రాంతి రుద్బభూవేతి.

'(మహా .... సమాగమః=) మహాజనసమావేశము (న హ్యస్తి=) వాస్తవమైనది గాదు, (మే మనః=) నా మనస్సు (నిద్రాగ్లానం తు=) నిద్రచేతఁ జెదరి పోయినది (బభూవ=) యైనది. (తేన=) నిద్రచేఁ గలిన యావరణముచేత (ఏషా భ్రాంతిః=) మహాజనసమావేశ మనెడునీభ్రాంతి

అనుటచేతను (బాధ్యతేహి =) స్వప్నవిషయ

(అనఁగా స్వప్నములోఁ జూచినది మేలుకొన్నపి

ఏవం మాయాదిష్వపి భవతి యథాయథం బాధః

(ఏవం=) ఈతీరుగానే (మాయాదిషు+

కార్యములందును (యథాయథం=) న్యాయనుభ

నవి యెల్లను నసత్యములై లేకుండఁ బోవుచునే

న చైవం జాగరితోపలబ్ధం వస్తు స్తంభాదికం క

(ఏవం=) ఇట్లు (జాగ... బ్ధం=) జాగ్రద

స్తంభము మొదలగు (వస్తు) వస్తువు లేవియును

నేయవస్థయందును (నచ బాధ్యతే=) లేకుండఁ

అపిచ స్మృతి రేషా య త్స్వప్నదర్శనం, ఉ

(అపిచ=) అంతేకాకుండ - అనఁగా జా

జెప్పిన భేదమే గాకుండ—మఱి విశేష మేమనఁగా (యత్స్వప్నదర్శనం=) స్వప్నములోఁ జూచిన దేది గలదో (ఏషా=) యది (స్మృతిః=) స్మృతిసమానమైనది— అనఁగా జ్ఞప్తికి రాఁగలవిషయముమాత్రమై యున్నది. (జాగరితదర్శనం=) జాగ్రదవస్థలోఁ జూచినది (ఉపలబ్ధిః-తు=) ప్రత్యక్షానుభవసిద్ధము.

స్మృత్యుపలబ్ధ్యోశ్చ ప్రత్యక్ష మంతరం స్వయ మనుభూయతే.

(స్మృత్యు ... బ్ధ్యోశ్చ—) స్మృతికిని ననుభవమునకు నుగల (అంతరం=) భేదము (ప్రత్యక్షం=) ప్రత్యక్షమై (స్వయం=) స్వయముగా (అనుభూయతే) ననుభవింపఁబడుచున్నది.

అర్థవిప్రయోగ సంప్రయోగాత్మక మిష్టం పుత్రం స్మరామి. నోపలభే ఉపలబ్ధు మిచ్ఛామీతి.

(అర్థ ... త్మకం=) ప్రత్యక్షవస్తువుయొక్క యుపలబ్ధి- అప్రత్యక్షవస్తువుయొక్క స్మృతి-ఈరెంటిలో నప్రత్యక్షవస్తువుయొక్క స్మృతి యెట్లుండు ననఁగా - (ఇష్టం పుత్రం స్మరామి=) దూరమం దున్నప్రియుఁడగుపుత్రుని స్మరించుచున్నాను. (న+ఉపలభే) చూచుట గలుగ లేదు (ఉపలబ్ధుం+ఇచ్ఛామి=) చూడవలయునని కోరుచున్నాను (ఇతి=) స్మృతి యిట్లుండును

తత్రైవంసతి న శక్యతే వక్తుం మిథ్యాజాగరితోపలబ్ధి రుపలబ్ధిత్వాత్ స్వప్నోపలబ్ధివ దిత్యుభయో రంతరం స్వయ మనుభవతా.

(తత్ర ఏవంసతి=) ప్రత్యక్షానుభవస్మృతు లిట్టివై యుండఁగా (ఉభయోః+అంతరం=) ఈరెంటియొక్క భేదమును (స్వయం+అనుభవతా=) స్వయముగా ననుభవము దెలిసిగినవాఁడు (జాగరితోపలబ్ధిః=) జాగ్రదవస్థయందలి బాహ్యవస్తుప్రత్యక్షానుభవము (ఉపలబ్ధిత్వాత్=) ఇదియు ననుభవమాత్రమే యగుటవలన (స్వప్నో ... వత్+ఇతి=) స్వప్నమందలివస్త్వనుభవమువంటిదే యని (వక్తుం న శక్యతే=) చెప్పఁజాలఁడనుసుమీ !

నచ స్వానుభవాపలాపః ప్రాజ్ఞమానిభి ర్యుక్తః కర్తుం.

(ప్రాజ్ఞమానిభిః=) ఇఁకఁ బ్రాజ్ఞుఁడనని యనుకొనువాఁ డెవఁడైనను (స్వాను ... భవాపలాపః= తనప్రత్యక్షానుభవమునే తుడిచివేయుటకు— అనఁగాఁ గప్పిపుచ్చుటకుఁ (కర్తుం=) బూనుట (నచ యుక్తః=) యుక్తమైనది గాదు. (అనఁగాఁ— గన్నులకుఁ గట్టుదానిని బుద్ధిపూర్వకముగా లే దన్నచో, దాని నెవఁడంగీకరించునని భావము.)

అపి చానుభవవిరోధప్రసంగా జ్జాగరితప్రత్యయానాం స్వతో నిరాలంబనతాం వక్తు మశక్నువతా స్వప్నప్రత్యయసాధర్మ్య ద్వక్తు మిష్యతే.

(అపిచ=) మఱియును (అనుభవ .... గాత్=) ప్రత్యక్షానుభవమునకు విరుద్ధముగా నుండుననుభయముచేతను (జాగరి ... యానాం=) జాగ్రదవస్థయందు (గోడ స్తంభము- అని) గోచరించువస్తుభావములు (స్వతః=) వానికిఁ బ్రత్యక్షముగా నుండుస్థితినిబట్టి (నిరాలంబనతాం=) నిరాధారములే యని- అనఁగా బాహ్యవస్తుస్థితిమీఁద నాధారపడియున్నవి గావని (వక్తుం ... వతా=) వాదించుటకు సాహసింపలేనివాఁడు (=శక్తిలేనివాఁడు) (సాధర్మ్యాత్ వక్తుం=) కొన్నిపోలికలమీఁద నాధారపడి యితరదృష్టాంతము లిచ్చుటకుఁ (ఇష్యతే=) బూనుచుండుట సహజము.

నచ యో యస్య స్వతో ధర్మో న సంభవతి. సోఽన్యసాధర్మ్యా త్తస్య సంభవిష్యతి.

(యస్య=) దేనికి (యః ధర్మః=) ఏధర్మము- (=లక్షణము) (స్వతః=) దానికున్నవాస్తవస్థితినిబట్టి (న సంభవతి=) సంభవింపదో- అనఁగా నట్టిలక్షణము దానియందు లేదని చెప్పుటకు సాధ్యపడదో (సః= అట్టిధర్మము (=లక్షణము) (తస్య=) దానియం దున్నదని (అన్యసాధర్మ్యాత్ =) కొన్నిపోలికలు గలమఱియొకవస్తు దృష్టాంతమును జూపి చెప్పుట (నచ సంభవిష్యతి=) యెన్నటికిని సంభవింపదు- అది యెట్లనఁగా—

న హ్యగ్ని రుష్ణోఽనుభూయమాన ఉదకసాధర్మ్యా చ్ఛీతో భవిష్యతి.

(అగ్ని .... మానః=) నిప్పు స్వభావముగ గాలునది యని యనుభవసిద్ధవిషయమైనను (ఉదకసాధర్మ్యాత్ =) నిప్పునకు నీటితోఁ గలకొన్నిపోలికలనుబట్టి నీటివలె నిప్పుసైతము (నహి+శీతో భవిష్యతి=) చల్లనిది యెన్నఁటికిని గానేరదు గదా! (=చల్లనిదని వాదించుట కవకాశము లేదుగదా!) (నిప్పు స్వభావముగఁ గాలునది యను ప్రత్యక్షానుభవ విషయమును గప్పిపుచ్చి 'నిప్పు భూతమే- నీరును భూతమే- నిప్పు నశించునదియే- నీరును నశించునదియే-' అనునీమొదలగు కొన్ని పోలికల నాధారపఱచుకొని నిప్పుసైతము నీటివలెఁ జల్లనిది- యని వాదించుటకు సాధ్యపడదని భావము)

దర్శితం తు వైధర్మ్యం స్వప్నజాగరితయోః.

కాఁబట్టి పైనిఁజెప్పఁబడిన విధముగా (స్వప్నజాగరితయోః=) స్వప్నమందు దోఁచువస్తుభావములకును జాగ్రదవస్థయందు గోచరించు వస్తుభావములకును (వైధర్మ్యం=) విలక్షణత్వము- భేదము (దర్శితం తు=) ప్రదర్శింపఁబడినదినుమీ!

30 సూత్రావతారిక :— బాహ్యవస్తుజ్ఞానము స్వప్నవస్తుజ్ఞానమువంటిది గాదని లోఁగడిసూత్రమందుఁ జూపఁబడినది. వివిధవస్తుజ్ఞానము లేర్పడుటకు వివిధ బాహ్యవస్తువు లుండవలసినయవసరము లేదు. వివిధవాసనలవలననే యట్టివివిధవస్తు జ్ఞానములు గలుగుచుండు ననుబౌద్ధయోగాచారులసిద్ధాంత మీసూత్రమందుఁ ఖండింపఁబడుచున్నది.

## 30 సూ॥ న భావోఽనుపలబ్ధేః.

ప॥ వి॥ — న - భావః - అనుపలబ్ధేః.

అ॥ క్ర॥— అనుపలబ్ధేః - భావః — న.

ప్ర॥ వ॥ అ॥ — అనుపలబ్ధేః= ఉపలబ్ధి (=బాహ్యవస్తుగోచరత) లేకపోవుట వలన; భావః = వివిధ (వస్తు)వాసనలు; న = కలుగఁజాలవు.

సూత్రార్థము :— బాహ్యవస్తుగోచరతయే లేకపోవుటవలన — ఆబాహ్య వస్తువులయొక్క వాసనలు— కలుగఁజాలవు.

సూత్రతాత్పర్యము :— ఇది కుండ- ఇది వస్త్రము- అను నీమొదలగు వివిధవ్యవహారములకు బాహ్యవస్తువు లుండవలయు ననునిర్బంధము లేదు. అట్టి వివిధవ్యవహారములకు జ్ఞానభేదము లున్నఁజాలును. 'వాసనా (Impressions) భేద ములవలన జ్ఞానభేదములు గలుగుచుండును' అని బౌద్ధయోగాచారులు చెప్పుదురు (న భావః=) వారిమతమునందు 'వాసనలు' అనునవి యేర్పడుటకే యవకాశము లేదు. ఎందుచేతననఁగా

(అనుపలబ్ధేః=) వారిమతమందు బాహ్యవస్తువు లనునవియే లేవు- బాహ్య వస్తువు లసలే లేనప్పుడు, వానియొక్క వాసన లేర్పడుటకుఁగాని యవి యనుభ వింపఁబడుటకుఁగాని యవకాశము లేదు. అట్టివాసన లేర్పడుటకవకాశమే లేనప్పుడు వాసనలమీఁద నాధారపడియుండు వివిధవస్తుజ్ఞానమే గలుగదు.

భాష్యము — భాష్యార్థము

బౌద్ధ (యోగాచారి) పూర్వపక్షము—

యదప్యుక్తం వినాప్యర్థేన జ్ఞానవైచిత్ర్యం వాసనావైచిత్ర్యాదే వావకల్పత ఇతి తత్ప్రతివక్తవ్యమ్.

"(వినా + అపి + అర్థే=) బాహ్యవస్తువులన్నవి లేకుండ నున్నప్పుడుగూడ (వాసనావైచిత్ర్యాత్ + ఏవ=) వాసనలయొక్క భేదములవలననే (జ్ఞానవైచిత్ర్యం)

వివిధవస్తుజ్ఞానభేదములు (అవకల్ప తే + ఇతి=) గలుగవచ్చును"- అని (యదప్యుక్తం -తత్ =) బౌద్ధయోగాచారులు చేయువాద మేది గలదో యది యిప్పుడు (ప్రతి వక్తవ్యం=) సమాధానము చెప్పఁబడవలసియున్నది.

అద్వైతసిద్ధాంతి :—

అత్రోచ్యతే.

సమాధానము చెప్పఁబడును- వినుఁడు.

న భావో వాసనానా ముపపద్యతే త్వత్పక్షేనుపలబ్ధే ర్బాహ్యానా మర్థానామ్.

(త్వత్పక్షే =) నీబౌద్ధయోగాచారిమతమునందు (బాహ్య .... ర్థానాం=) బాహ్యపదార్థము లన్నవియే (అనుపలబ్ధేః=) గోచరింపఁబడనందున- (వాసనానాం భావః- న=) వాసన లేర్పడుటయే సంభవింపదు.

అర్థోపలబ్ధినిమిత్తా హి ప్రత్యర్థం నానారూపా వాసనా భవంతి.

(ప్రత్యర్థం=) వివిధవిషయములను గూర్చిన (నానా ... వాసనాః=) వివిధ రూపములైన వాసనలు (=Impressions) (అర్థో ... నిమిత్తాః=) వివిధవస్తువుల ననుభవించుటవలననే (భవంతి హి=) కలుగును;

అనుపలభ్యమానేషు త్వర్థేషు కింనిమిత్తా విచిత్రా

(అనుప ... ర్థేషు=) బాహ్యవస్తువులు నికే రానప్పుడు (విచిత్రాః వాసనాః=) వివి భ వేయుః=) ఏహేతువులవలన నేర్పడఁగలవు ? బాహ్యవస్తువులే లేవుగదా యని భావము.)

అనాదిత్వేఽప్యంధపరంపరాన్యాయే నాప్రతిష్ఠై న్యాభిప్రాయసిద్ధిః.

(అనాదిత్వేఽపి=) అనాదిగా వచ్చుచున్న నుండి వస్తుజ్ఞాన మేర్పడుచున్నదని వాదించిన జ్ఞానము- వస్తుజ్ఞానమునుంటి వాసనలు గల్గు (= అనఁగ, బ్రిమాణము లేనికార్యకార యేన=) అంధపరంపరాన్యాయము చేత- అన వెంబడి నింకొక గ్రుడ్డివాఁడు, వాని వెంట మఱి

గుడ్డివాఁడు నున్నారని చెప్పినవానివలె (అప్రతిష్ఠా + ఏవ=) పునాది లేనిదియేయై (వ్యవహారవిలోపినీ- స్యాత్=) ప్రత్యక్షముగా వస్తుసముదాయ (=గోచర) మును జూపెట్టులోకవ్యవహారమును దుడిచివేయుటకు యత్నించునదియై యుండఁగలదుగాని (న + అభిప్రాయసిద్ధిః) బాహ్యావస్తువు లన్నవి యసలే లేకుండ వాసన లేర్పడునని సిద్ధాంతముచేయుటకుఁ బెట్టుకొన్ననీ (బౌద్ధ) యుద్దేశ్యముమాత్ర మెన్నటికిని నెర వేఱునది గాదు.

(విత్తునుండి చెట్టు- చెట్టునుండి విత్తు వచ్చుచున్న వనెడియనవస్థ- ప్రమాణ సిద్ధమైనది-అనఁగాఁ- బ్రత్యక్షముగాఁ గనిపించుచున్నదియే- వాసనలనుండి వస్తు జ్ఞానము- వస్తుజ్ఞానము నుండి వాసన లేర్పడుచున్నవనెడి 'అనవస్థ' ప్రమాణసిద్ధము గానిది- అనఁగాఁ బ్రత్యక్షాదిప్రమాణములకు సరిపోనిది.)

యావ ప్యన్వయవ్యతిరేకా వర్థాపలాపి నోపన్యస్తౌ వాసనానిమిత్తమే వేదం జ్ఞానజాతం నార్థనిమిత్తమితి తావ ప్యేవంసతి ప్రత్యుక్తౌ ద్రష్టవ్యౌ.

(ఇదం జ్ఞానజాతం=) 'ఇది కుండ- ఇది గోడ' అను నిట్టివస్తుజ్ఞానము లన్నియు (న + అర్థనిమిత్తం=) వస్తువులయొక్క ప్రత్యక్షగోచరతవలనఁ గల్గుచున్నవి గావు- (ఇతి=) అని (అర్థాపలాపినా=) బాహ్యావస్తువు లసలే లేవని తుడిచివేయునట్టి బౌద్ధ యోగాచారునిచేత (ఉపన్యస్తౌ=) నుపన్యసింపఁబడు (యౌ + అన్వయవ్యతిరేకౌ + అపి=) నే యన్వయవ్యతిరేకవాదము లున్నవో (తౌ + అపి=) యవిసైతము (ఏవం సతి=) అవి యట్లు వాదములుగాఁ గనిపించుచున్నను (అనఁగా- స్వప్నమందువలె వస్తువాసనలచేతనే వస్తుజ్ఞానములు గల్గుచున్నవి యనునన్వయము- సుషుప్తియందు వలె వస్తువాసనలు లేకపోవుటచే వస్తుజ్ఞానములు గల్గుట లేదు- అనువ్యతిరేకము- బౌద్ధపూర్వపక్షి చెప్పునన్వయ వ్యతిరేకవాదము లిట్లున్నను- అని భావము)

(ప్రత్యుక్తౌ ద్రష్టవ్యౌ=) ఖండింపఁబడిపోవునవియేయని గ్రహింతురుగాక. (అనఁగా బౌద్ధపూర్వపక్షి చూపునన్వయవ్యతిరేకములు నిల్వఁదగినవి కావు- అని భావము.) ఎట్లనఁగా—

వినాఽర్థోపలబ్ధ్యా వాసనానుత్పత్తేః.

(వినా + అర్థోపలబ్ధ్యా =) వస్తువులయొక్క ప్రత్యక్షగోచరత లేకుండ (వాస ... త్పత్తేః) వస్తువాసనలు సంభవించుట కవకాశము లేదు

అపిచ వినాపి వాసనాభి రర్థోపలబ్ధ్యుపగమాత్.

(అపిచ=) మఱియును (వినాపి వాసనాభిః=) లోఁగడివస్తువాసనలు లేకుండఁగనే- అనఁగా లేనప్పటికి- అర్థో .... గమాత్=) వస్తువులయొక్క ప్రత్యక్షగోచరత నంగీకరింతుముగదా. లోఁగడివాసనలు లేనప్పటికి మనము ప్రత్యక్షముగ వస్తువులను జూచుచుండుటలేదా యని భావము.)

వినా త్వర్థోపలబ్ధ్యా వాసనోత్పత్త్యనభ్యుపగమాత్.

(వినా ... లబ్ధ్యా=) వస్తుగోచరత యన్నది లేకుండ (వాస... గమాత్=) వాసనలు సంభవించునని యంగీకరించుట కవకాశము లేదు. (అనఁగా- అసంభవమైనందుననే యని భావము.)

అర్థసద్భావమే వాన్వయవ్యతిరేకావపి ప్రతిష్ఠాపయతః.

కాఁబట్టి (అన్వయవ్యతిరేకా+అపి=) అన్వయవ్యతిరేకములుసైతము (అర్థసద్భావమేవ=) బాహ్యవస్తువులు వాస్తవమున కున్నవనువిషయమునే (ప్రతిష్ఠాపయతః=) స్థాపించుచున్నయవి.

అపిచ వాసనా నామ సంస్కారవిశేషాః.

(అపిచ=) అంతేగాక మఱియును, (వాసనాః-నామ=) వస్తువాసన లనఁగా (సంస్కారవిశేషాః=) స్థూలవస్తురూపములయొక్క యొకవిధమగు సూక్ష్మభావరూపములుఁగదా- (అనఁగా నింద్రియములకుఁ దాఁకినవస్తుస్థూలరూపములే మాఱి మనసునందు సూక్ష్మభావములుగా నిల్చినవే సంస్కారములని చెప్పఁబడు నని భావము.)

సంస్కారాశ్చ నాశ్రయమంతరే ణావకల్పంతే: ఏవం లోకే దృష్టత్వాత్. నచ తవ వాసనాశ్రయః కశ్చి దస్తి ప్రమాణతోఽనుపలబ్ధేః.

(సంస్కారాః- చ) అట్టి వస్తుసంస్కారము లన్ననో (ఆశ్రయమంతరేణ=) దేనినో యొకదాని నాశ్రయింపకయే (అనఁగా నిరాధారముగా) (న+అవకల్పంతే=) యుండఁజాలవు. వస్తువులచేతనే వస్తుసంస్కారము లేర్పడుట లోకమునకుఁ బ్రత్యక్షసిద్ధవిషయమే. (తవ=) నీబౌద్ధసిద్ధాంతములో (వాసనాశ్రయః+కశ్చిత్=) వాసన లేర్పడుట కాధారమైనయసలువస్తు వేదియును (న+అస్తి=) లేనే లేదుగదా. ఎందుచేతననఁగా నీమతసిద్ధాంతమందుఁ బ్రత్యక్షాదిప్రమాణములకు (అనుపలబ్ధేః=) గోచరింపఁగలవస్తు వేదియును లేదుగదా !

31 సూత్రావతారిక :— అసలువస్తువులు లేకపోయినను వస్తువాసనల వలన వస్తువిజ్ఞానము— వస్తువిజ్ఞానమువలన వస్తువాసనలు గలుగుచుండు నను యోగాచారసిద్ధాంతములో, వస్తువులు లేకుండఁగ వాసన లేర్పడఁజాల వను విషయము లోఁగడిసూత్రమందుఁ జూపఁబడినది. విజ్ఞా ము క్షణిక మే యగుటచేత విజ్ఞానమునుండి వాసనలుసైత మేర్పడఁజాలవని యీసూత్రమందుఁ జూపఁబడు చున్నది.

## ౩౧ సూ॥ క్షణికత్వాచ్చ

ప॥ వి॥ — క్షణికత్వాత్ - చ

ప్ర॥ వ॥ అ॥ — క్షణికత్వాత్ = క్షణిక మగుటవలన; చ = కూడ.

సూత్రార్థము :— (ఆలయవిజ్ఞానము) క్షణిక మగుటవలనఁగూడ, (నది సంభవింపదు)

సూత్రతాత్పర్యము :— వస్తుజ్ఞానములను బుట్టించువాసనలను దనయందు నేకరించియుంచఁగలదని చెప్పఁబడునట్టి యాలయవిజ్ఞానముగూడ (క్షణికత్వాచ్చ) క్షణిక మే యని బౌద్ధులచే నంగీకరింపఁబడు చున్నందున, నది యట్టిశక్తి గలిగియుండు ననుట సంభవింప నేరదు.

(పుట్టినంతమాత్రముననే నశించిపోవు నాలయవిజ్ఞానము (= నేను— నేను—అని యనుకొనుచుండుజ్ఞానము) మఱియొక వస్తుజ్ఞానమును బుట్టింపఁగలవాసనలను దన యందు నిల్పియుంచఁగలుగుననుట సంభవి పదని భావము)

భాష్యము — భాష్యార్థము

యద ప్యాలయవిజ్ఞానంనామ వాసనాశ్రయత్వేన పరికల్పితం తదపి క్షణికత్వాభ్యుపగమా దనవస్థితస్వరూపం స, ప్రవృత్తివిజ్ఞానవ న్న వాసనానా మధికరణం భవితు మర్హతి.

(ఆలయవిజ్ఞానంనామ=) విజ్ఞానస్కంధములోఁ జేరి 'నేను—నేను' అను నాకార ముతోఁ గూడినయాలయవిజ్ఞానమన్నదియే (వాసనాశ్రయత్వేన =) వాసనల కాధారమైనదిగాఁ (యదపి పరికల్పితం=) కల్పింపఁబడినను, (తదపి=) ఆయాలయ విజ్ఞానముగూడ (క్షణిక .... గమాత్ =) క్షణిక మే— (అనఁగా క్షణకాలములో నశించిపోవునదియే) యని బౌద్ధయోగాచారు లంగీకరించుటవలన (అనవ ... రూపం సత్ =) అది నిత్యమైనస్వరూపము గలదియే యగుచు (ప్రవృత్తి విజ్ఞానవత్ =)

ప్రవృత్తివిజ్ఞానము (అనఁగా వస్తుజ్ఞానము) వాసనల కెట్లాధారము కాఁజాలదో యట్లే యదియు (వాస .... కరణం=) వివిధవస్తువాసనల కాధారమైనది (భవితుం +న+అర్హతి=) కాఁజాలదు.

(తాను స్వయముగా నిత్యము గానిదియే- అనఁగా క్షణికమే యైనయాలయ విజ్ఞానము- వస్తుజ్ఞానమును బుట్టింపఁగల వాసనలను దనయందు నిల్పియుంచుటకు సమర్థము గాఁజాలదని భావము.)

నహి కాలత్రయసంబంధి న్యేకస్మి న్నన్వయి న్యసతి కూటస్థే వా సర్వార్థదర్శిని, దేశకాలనిమిత్తాపేక్షవాసనాధీనస్మృతిప్రతిసంధానాదివ్యవహార స్సంభవతి. స్థిరరూపత్వే త్వాలయవిజ్ఞానస్య సిద్ధాంతహానిః.

(కాల ... బంధిని=) భూతభవిష్యద్వర్తమానకాలములు మూఁటికిని సంబంధించిన (ఏకస్మిన్ + అన్వయిని=) యొకనిత్యవస్తువుగాని (సర్వార్థదర్శిని కూటస్థే=) లేదా సర్వజ్ఞుఁడు కూటస్థుఁడు (ఎవ్వఁడును నెట్టిమార్పును జెందనివాఁడు) నని చెప్పఁబడఁదగినయాత్మగాని, (అసతివా=) యంగీకరింపఁబడనియెడల (దేశకాల .... వ్యవహారః=) భిన్నభిన్న దేశకాలములతో సంబంధించిన వస్తువులయొక్క వాసనలను బట్టి వచ్చుచుండుస్మృతి (జ్ఞప్తి)- ప్రతిసంధానము (గుర్తుపట్టుట) అను నీమొదలగు జ్ఞానములలో జరుగుచుండు లోకవ్యవహార మేదియు (నహి సంభవతి=) సంభవింపఁ జాలదు.

(క్షణములో నశించిపోవునాలయవిజ్ఞానముకన్న మఱొక్కఁడేదియు లేనందునఁ బూర్వవస్తుస్మృతిగాని పూర్వవస్తుప్రతిసంధానముగాని యేర్పడఁజాలవు కాని యట్టిస్మృతి కుఁ బ్రతిసంధానము వ్యవహారములో నున్నందునఁ బూర్వోత్తరకాలములతో సంబంధించి ప్రతిక్షణము నశించిపోనియొకవ్యక్తి యుండితీరవలయును సుమా- యని భావము)

(ఆల ... నస్య=) బౌద్ధులయాలయవిజ్ఞానమన్నది (అనఁగా - నేను- నేను- అను నాకారము గలజ్ఞానము) (స్థిరరూపత్వేతు=) స్థిరమై యుండునది యందమా, (సిద్ధాంతహానిః=) ఆలయవిజ్ఞానమునైనను క్షణికమే యని చెప్పుబౌద్ధయోగాచారుల సిద్ధాంతమునకు భంగము వచ్చును.

(అట్లు నశించిపోవువ్యక్తియే బౌద్ధులయాలయవిజ్ఞాన మగునని చెప్పుచో- వారిసిద్ధాంతము చెడిపోవునని భావము )

అపిచ విజ్ఞానవాదేఽపి క్షణికత్వాభ్యుపగమస్య సమానత్వా ద్యాని బాహ్యార్థవాదే క్షణికత్వనిబంధనాని దూషణా న్యుద్భావితాని "ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్" బ్ర॥సూ॥ III_2_20 ఇత్యేవమాదీని తానీహా ప్యనుసంధాతవ్యాని.

(అపిచ=) ఇంతేగాక (విజ్ఞానవాదేఽపి=) యోగాచారులయొక్క విజ్ఞాన వాదమందుసైతము (క్షణి .... త్వాత్=) సౌత్రాంతిక వైభాషికులవాదమునందు వలెఁ బ్రతిపదార్థము క్షణికమే యనువిషయము సమానముగా నున్నందువలన (బాహ్యార్థవాదే=) బాహ్యావస్తువు లున్నవని చెప్పు సౌత్రాంతిక వైభాషికుల పైవాదముమీఁద క్షణి ... నాని=) క్షణికత్వహేతువునుబట్టి రాఁదగు (యాని దూషణాని ) నేయేదోషములు ( ఉత్త ... మాదీని=) లోఁగడి (ఉత్తరో ... నిరోధాత్=) II -2.20 అను మొదలగు సూత్రములచే నిరూపింపఁబడినవో (తాని) యాదోషముల నన్నింటిని (ఇహాపి=) యోగాచారుల విజ్ఞానవాదముయొక్క యీ ఖండనమందును (అనుసంధాతవ్యాని=) జేర్చుకొనవలెను-

(అవిద్యాదు లన్నియు క్షణికములే యైనందున వానిలో నేదియు దానితరు వాతిసంస్కారాదులను బుట్టింపఁజాలవని లోఁగడి II -2-20 మొదలగు సూత్రము లలో సౌత్రాంతిక వైభాషికులమతఖండన విషయమునందు దోషములు నిరూపింపఁ బడియున్నవి. ఈవిషయమం దిట్టిదే యగుయోగాచారుల మతఖండననుందుఁగూడ నాదోషములే కలవని భావము.)

ఏవ మేతౌ ద్వావపి వైనాశికపక్షౌ నిరాకృతౌ బాహ్యార్థవాదిపక్షో విజ్ఞానవాదిపక్షశ్చ.

(ఏవం=) ఈతీరుగా (బాహ్యార్థ ... పక్షశ్చ=) బాహ్యావస్తువులు కల వను సౌత్రాంతిక వైభాషికులవాదము, విజ్ఞానము మాత్రమే కల దనుయోగాచారుల వాదము (ఏతౌ + ద్వౌ + వైనాశికపక్షౌ + అపి=) అనునీరెండు తెఱఁగుల బౌద్ధుల మతములు (నిరాకృతే=) ఖండింపఁబడినవియే యని తెలియవలెను.

శూన్యవాదిపక్షస్తు సర్వప్రమాణవిప్రతిషిద్ధ ఇతి తన్నిరాకరణా యానాదరః క్రియతే.

( శూన్యవాదిపక్షస్తు = ) సర్వశూన్యవాదు లైనబౌద్ధమాధ్యమికులమత పక్షమో (సర్వ ... ఇతి=) ప్రత్యక్షాదిసర్వప్రమాణములకు విరుద్ధముగా నున్నది గావున (తన్ని ... ణాయ=) ఆమతమును బ్రత్యేకసూత్రములద్వారమున ఖండించు ప్రయత్నమునందు (అనా ... క్రియతే=) శ్రద్ధ తీసికొనఁబడలేదు.

(యోగాచారులమతమును ఖండించిన కొన్ని హేతువులే మాధ్యమికుల స్వ

శూన్యవాదమును సైతము ఖండింపఁగలవని భావము) మఱియును రాఁబోవు 32 సూత్రము మాధ్యమికులమతమును బ్రత్యేకముగా ఖండింపఁగలదనియుఁ దలఁప వచ్చును.

న హ్యయం సర్వప్రమాణసిద్ధో లోకవ్యవహారోఽన్యత్తత్త్వ మనధిగమ్య శక్యతేఽపహ్నోతు మపవాదాభావే ఉత్సర్గప్రసిద్ధేః.

(సర్వప్రమాణసిద్ధః=) సర్వప్రమాణములచే ననుభవసిద్ధమగు (అయం .... హారః=) ఈలోకవ్యవహారము (అన్య ... గమ్య=) దీనిని నిరాకరించుమఱియొక ప్రబలసిద్ధాంతమును దెలిసికొనకయే (అపహ్నోతుం =) నిషేధించుట- అనఁగా లేదని త్రోసివేయుట (నహి శక్యతే=) సాధ్యము గాదు. (అపవాదాభావే=) నిషేధ విధి (exception) లేనప్పుడు (ఉత్స .... ద్ధేః=) సామాన్యవిధియే (general rule) ప్రామాణిక మగునుగదా.

('లోకవ్యవహారము ప్రత్యక్షమం దున్నది
'వాస్తవమున లోకవ్యవహారము లేనిదియే'
(=నిషేధవిధి) ఈయపవాదమును ఋజువుచేయఁదగినచో
నుత్సర్గమే ప్రామాణిక మగునని భావము.)

32 సూత్రావతారిక :— ఆలయవిజ్ఞానముగూడ క్షణికమే నది వాసనల కాశ్రయ మగుట సంభవింప నేరదని పైసూత్రము వవిధముగఁజూచినను బౌద్ధమత మాదరణీయము గానేరదని నిరూపింపఁబడఁబోవుచున్నయది.

## ౩౨ సూ॥ సర్వథాఽనుపపత్తేశ్చ.

ప॥ వి॥ — సర్వథా - అనుపపత్తేః — చ.

ప్రౌ॥ ప॥ అ॥ — సర్వథా = సర్వప్రకారములుగాను, పత్తి (=పొసఁగుఁబాటు) లేకపోవుటవలన; చ = కూడ.

సూత్రార్థము :— సర్వప్రకారములఁ జూచినను— ఉపపత్తి గనుప పోవుటవలనఁగూడ (నాదరణీయము గాదు.)

సూత్రతాత్పర్యము :— (సర్వథా=) సర్వప్రకారముల నాలోచించి చూచి నను, (అనుపపత్తేః- చ=) ఏవిధమైనయుపపత్తియు (= సామంజస్యము- పొసఁగుఁ

బాటు) నందు లేనందున, నీబౌద్ధమతము శ్రేయస్సును బొందవలయునని కోరువారి చేత నాదరింపఁబడఁదగినది గాదు.

భాష్యము — భాష్యార్థము

కిం బహునా, యథాయథాఽయం వైనాశికసమయ ఉపపత్తిమత్త్వాయ పరీక్ష్యతే, తథాతథా సికతాకూపవ ద్విదీర్యత ఏవ; న కాంచిద ప్యతోఽపపత్తిం పశ్యామః.

పెక్కులు చెప్పనేల! అయంవై ... మయః=) ఈవైనాశిక (=బౌద్ధ) సిద్ధాంతమునందు (ఉపపత్తిమత్త్వాయ=) నెట్టియుపపత్తి (=సామంజస్యము - ఒప్పఁదగిన హేతువు) యైన నున్నదేమోయని (యథాయథా .... పరీక్ష్యతే=) యేయేప్రకారములఁ బరీక్షించిచూచినను (తథాతథా-) యాయాప్రకారముల నన్నింటను నది (సికతాకూపవత్=) యనుకబావివలె (విదీర్యతే + ఏవ=) కూలిపోవుచునే యున్నది. (అత్ర=) ఆమతమునందు (కాంచిదపి — ఉపపత్తిం=) నెట్టియుపపత్తినిగూడ (న పశ్యామః=) గనిపెట్టుటకు సాధ్యముగా లేదు.

అత శ్చానుపపన్నో వైనాశికతంత్రవ్యవహారః.

(అతశ్చ=) కాఁబట్టి (వైనా ... హారః=) యాబౌద్ధసిద్ధాంతతంత్రములు (=మార్గములు) లోకవ్యవహారానుకూల్యము లగు ననుటకు (అనుపపన్నః=) నెట్టి న్యాయ్యమైనయుక్తియును గానిపింపదు.

అపిచ బాహ్యార్థ, విజ్ఞాన, శూన్యవాదత్రయమ పీతరేతరవిరుద్ధ ముపదిశతా సుగతేన స్పష్టీకృత మాత్మనోఽసంబద్ధప్రలాపిత్వం, ప్రద్వేషో వా ప్రజాసు విరుద్ధార్థప్రతిపత్త్యా విముహ్యేయు రిమాః ప్రజా ఇతి

(అపిచ=) అంతేగాక మఱియును. (ఇత .... విరుద్ధం=) పరస్పరవిరుద్ధసిద్ధాంతములతో (బాహ్య ... త్రయమపి=) (1) సౌత్రాంతికవైభాషికు లనుసరించు బాహ్యార్థవాదము— అనఁగా బాహ్యపదార్థము లన్నియు యథార్థముగ నున్నవే యని చేయువాదము; (2) యోగాచారు లనుసరించు విజ్ఞానవాదము— అనఁగా విజ్ఞాన మొక్కటి mental ideas) దక్క మఱేమియును లేదని చేయువాదము; (3) మాధ్యమికు లనుసరించు శూన్యవాదము— అనఁగా బాహ్యాంతరపదార్థములు సమస్తము శూన్యమే యని చేయువాదము— అనునీమూఁడుసిద్ధాంతము లనుగూడ ఉప ... తేన=) నుపదేశించినాఁడని చెప్పఁబడుబుద్ధుఁడు (అందువలన— అనఁగాఁ బరస్పరవిరుద్ధాంశములతోఁ గూడినమూఁడుసిద్ధాంతముల నుపదేశించినందువలన—

(ఆత్మనః=) ఆబుద్ధుఁడు (అసంబ ... పిత్వం=) ఒకదానితో నొకటి విరోధించు చుండు నర్థములేని (=పిచ్చి) బోధలు చేసియున్నాఁడని యైనను (స్పష్టీకృతం=) నిశ్చయించవలసియున్నది; లేదా— (ప్రజాసు ప్రద్వేషః=) ప్రజలయందు లోకము నందుఁ దనకు గాఢమైయున్న ద్వేషము (=అసహ్యతనుబట్టి) (విరు...ప్రతిపత్త్యా=) తనయొక్క పరస్పరవిరుద్ధ బోధోపదేశములలోఁబడి (ఇమాః ప్రజాః=) యీవేద బాహ్యులైనప్రజలు (విముహ్యేయుః=) చెడిపోయినఁ జెడిపోదురుగాక యని యెంచినాఁడనియైనను నిశ్చయింపవలసియున్నది.

సర్వథా వ్యనాదరణీయోఽయం సుగతసమయః శ్రేయస్కామై రిత్యభిప్రాయః.

(సర్వథాఽపి=) ఏవిధమున నాలోచించిచూచినను (అయం సుగతసమయః=) ఈబౌద్ధమతము (శ్రేయస్కామైః=) శ్రేయస్సును (=మోక్షమును) గోరువారిచేత (అనాదరణీయః- ఇతి) నాదరింపఁబడక త్రోసివేయఁబడఁదగినదే యని (అభిప్రాయః=) మానిశ్చితాభిప్రాయమైయున్నది. మాధ్యమికులశూన్యవాద మీ 32 సూత్రముచేతఁ బ్రత్యేకముగా ఖండింపఁబడినట్లు తలంచవచ్చును. లేదా యీయధికరణములోని మొదటి 28వ సూత్రముసైతము మాధ్యమికులశూన్యవాదమును ఖండించఁగలిగినట్లు సరళముగానే దోఁచఁగలదు. అందుచేతనే యీమతఖండనమునకుఁ బ్రత్యేకసూత్రములు రచియింపఁబడలేదని తోఁచెడిని !

## నైకస్మిన్నధికరణము (సూ. 33 నుండి 36 వఱకు)

6. అధికరణావతారిక :—

లోఁగడి రెం డధికరణములందు బౌద్ధమతము నిరాకరింపఁబడినది. ఈయధికరణమందు జైనమతము నిరాకరింపఁబడుచున్నది (ఈమతస్థాపకుఁడు జినుఁడు, అందుచే దీనికి జైనమత మనుపేరు వచ్చినది. ఈజినునిపేరో, కుమారునిపేరో — లేక పూర్వునిపేరో 'అర్హతుఁడు'—అనియుఁ గలదు. అందుచే దీనికి 'అర్హత'మతమనియుఁ బేరు గలదు.)

౩౩ సూత్రావతారిక :— అన్యోన్యవిరుద్ధములైన 'స్యాదస్తి–స్యాన్నాస్తి' మొదలగులక్షణములు లోకేపదార్థమున కొకేకాలమందు వర్తింపఁగల వనుజైన సిద్ధాంత మీమొదటిసూత్రమందు ఖండింపఁబడుచున్నది.

## 33 సూ॥ నైకస్మి న్నసంభవాత్.

ప॥ వి॥ — న – ఏకస్మిన్ – అసంభవాత్.

ప్ర॥ ప॥ అ॥ — న = కాదు; ఏకస్మిన్ = ఒకదానియందు; అసంభవాత్ = సంభవింపక పోవుటవలన.

మాతార్థము :— (జైనమతము) యుక్తము కాదు- (ఎందుచేననఁగా) (విరుద్ధధర్మములు) ఒకదానియందే- సంభవింపక పోవుటవలన.

సూత్రతాత్పర్యము :— జైనమతమందు జీవాజీవములు మొదలగు నేడు పదార్థములు గలవనియు, నీయేడుపదార్థములలో నేయొక్క దానికైనను 'ఉన్నదియే యగును– లేక లేనిదియే యగును'— 'ఒకటియే యగును, లేక పెక్కులే యగును' అనుమొదలగు పరస్పరవిరుద్ధధర్మములు వర్తింపఁగలవనియును జెప్పఁబడుచున్నది. కావున (న) జైనమతము యుక్తమైనది గాదు. ఎందుచేతననఁగా— (ఏకస్మిన్ అసంభవాత్) పరస్పరవిరుద్ధధర్మము లొకేవస్తువునకు నొకేకాలమందు వర్తింపఁజాలవు.

భాష్యము — భాష్యార్థము

నిరస్తః సుగతసమయః; వివసనసమయ ఇదానీం నిరస్యతే.

(సుగ....మయః=) సుగతులని చెప్పఁబడు బౌద్ధులయొక్క మతము (నిరస్తః=) ఇంతకుముందు నిరాకరింపఁబడినది (ఇదానీం=) ఇఁకనిప్పుడు (వివసనసమయః=) దిగంబరు లగుజైనులయొక్క మతము (నిరస్యతే=) నిరాకరింపఁబడుచున్నది.

సప్త చైషాం పదార్థా స్సమ్మతాః; జీ వాజీ. వాస్రవ, సంవర, నిర్జర, బంధ మోక్షా నామ.

(ఏషాం=) ఈజైనమతస్థులచేత (సప్త చ పదార్థాః=) నేడు పదార్థములు (సమ్మతాః=) అంగీకరింపఁబడినవి. అవి యేవియనఁగా :—

(జీవా ... మోక్షా నామ =)

(1) జీవుఁడు (= భోక్త)

(2) అజీవము (= భోగ్యము)

(3) ఆస్రవము (= ఇంద్రియములు విషయములపైకిఁ బోవుట)

(4) సంవరము (= యమనియమాదులచేత నింద్రియములను నివారించుట)

(5) నిర్జరము (= పాపనివృత్తికొఱకుఁ గాలినబండపై కెక్కుట మొదలగు వ్రతము)

(6) బంధము (= కర్మపాశమువలనఁ గల్గు చెఱ)

(7) మోక్షము (= కర్మబంధము నశించినపిదప నలోకాకాశములోఁ జేరి యందు నిత్యమును సూర్ధ్వగమనమును జేయుట.

సంక్షేపతస్తు ద్వావేవ పదార్థౌ జీవాజీవాఖ్యౌ.

(సంక్షేపతః తు=) సంగ్రహముగాఁ జూచిన వారిమతమున (జీవాజీవాఖ్యౌ=) (1) జీవుఁడు— (2) అజీవము అనునవి(ద్వౌ+ఏవ=) రెండే (పదార్థౌ=) పదార్థాలు.

యథాయోగం తయోరే వేతరాంతర్భావా దితి మన్యంతే; తయో రిమ మపరం ప్రపంచ మాచక్షతే.

ఈ రెండు గాక మిగిలినపదార్థవిభాగములు (యథాయోగం=) వీలునుబట్టి —అనఁగా నెట్లనుకూలించునో యట్లే (తయోః=) అజీవాజీవములయొక్క (ఇత ... భావాత్ - ఇతి =) యంతర్భావమందే యిమిడియుండునట్లు చేయవచ్చునని (మన్యంతే =) వారు తలంచుచున్నారు. (తయోః =) అజీవాజీవముల రెంటినే (ప్రపంచం=) వృద్ధిగాఁజేసి (ఇమ మపరం=) యీక్రిందిమఱికొన్నింటినిగూడఁ (ఆచక్షతే=) జెప్పుచున్నారు.

పంచాస్తికాయా నామ, జీవాస్తికాయః, పుద్గలాస్తికాయః, ధర్మాస్తికాయః, అధర్మాస్తికాయః. ఆకాశాస్తికాయశ్చేతి.

(పంచాస్తి ... నామ =) ఈక్రొత్తవిభాగము లైదును అస్తికాయము (=కలదని చెప్పఁబడుపదార్థములయొక్క పేరు) లని చెప్పఁబడును- అవి యెవ్వియన-

(1) జీవాస్తికాయము (= జీవపదార్థము)
(2) పుద్గలాస్తికాయము (=పరమాణువులయొక్క గుమిచేత నేర్పడినశరీరపదార్థము)
(3) ధర్మాస్తికాయము (= యోగ్యప్రవర్తనముచేత రాఁదగినయదృష్టపదార్థము)
(4) అధర్మాస్తికాయము (= అధర్మప్రవర్తనముచేత రాఁదగినఫలవిశేష మను [పదార్థము)
(5) ఆకాశాస్తికాయము (=ఆవరణము లేనిపదార్థము)

సర్వేషా మప్యేషా మవాంతరప్రభేదాన్ బహువిధాన్ స్వసమయపరికల్పితాన్ వర్ణయంతి.

(ఏషాం-సర్వేషాం—అపి=) ఈపదార్థవిభాగములకే (బహువిధాన్=) పలువిధములైన (అవాం ... భేదాన్ =) సందర్భానుసారము లగునంతర్భేదములను (స్వసమ ... కల్పితాన్=) తమసిద్ధాంతమునందుఁ గల్పించి (వర్ణయంతి=) వర్ణించుచున్నారు.

సర్వత్ర చేమం 'సప్తభంగినయం' నామ న్యాయ మవతారయంతి.

(సర్వత్రిచ=) అనమస్తపదార్థములకు ('సప్తభంగీనయం' నామ=) సప్తభంగీ నయము'(=ఏడుభంగుల వర్తించున దను పేరుగల యీక్రిందిన్యాయ (Reasoning) లక్షణములను (అవతారయంతి=) వర్తింపఁజేయుచున్నారు. అవి యెవ్వి యన–

స్యాదస్తి స్యాన్నాస్తి. స్యాదస్తి చ నాస్తిచ. స్యాదవక్తవ్యః. స్యాదస్తి చావక్తవ్యశ్చ. స్యాన్నాస్తి చావక్తవ్యశ్చ. స్యాదస్తి చ నాస్తి చావక్తవ్యశ్చేతి.

(1) స్యాదస్తి (=ఏదో యొకవిధమున నుండుట)

(2) స్యాన్నాస్తి (=ఏదో యొకవిధమున లేకపోవుట)

(3) స్యాదస్తి చ నాస్తి చ (=ఏదో యొకవిధమున నుండుట – లేకుండుట)

(4) స్యాదవక్తవ్యః (= వస్తువు కలదనిగాని లేదనిగాని చెప్ప నశక్యమగుట)

(5) స్యాదస్తి చావక్తవ్యశ్చ (= వస్తు వొకవిధముగాఁ గలదుగాని చెప్ప నశక్యమగుట)

(6) స్యాన్నాస్తి చావక్తవ్యశ్చ (= వస్తు వొకవిధముగా లేదు గాని చెప్ప నశక్యమగుట)

(7) స్యాదస్తి చ నాస్తి చావక్తవ్యశ్చ (= వస్తు వొకవిధమున నున్న నుండు, లేకున్న లేకుండుఁ జెప్ప నశక్య మగుట)

ఏవమే వైకత్వనిత్యత్వాదిష్వ పీమం సప్తభంగినయం యోజయంతి.

(ఏవం=) ఇట్లే (ఇమం 'సప్తభంగీనయం=) పైని వివరింపఁబడిన 'సప్తభంగీ నయము' అను నేడువరస్పరవిరుద్ధధర్మములను (ఏక ... ష్వపి=) 'ఏకత్వము (ఎల్లప్పుడు నొకటిగానే యుండుట'–) 'నిత్యత్వము (నిత్యమై యుండుట') అనువిషయము లందుఁగూడ (యోజయంతి=) ప్రవర్తింపఁజేయుచున్నారు.

అద్వైతసిద్ధాంతి :—

అత్రాచక్ష్మహే.

(అత్ర =) పై వివరింపఁబడినజైనులసిద్ధాంతమువిషయమై (ఆచక్ష్మహే=) యీక్రింది విమర్శముఁ జేయుచున్నాము.

నాయ మభ్యుపగమో యుక్త ఇతి.

"(అయం – అభ్యుపగమః=) జైనులయొక్క యీసిద్ధాంతము (నయుక్తః=) సరియైనది గాదు" (ఇతి=) అనియే మావిమర్శనసారము.

కుతః ?

అట్లు చెప్పుట యేల యందురేమో ! వినుఁడు.

ఏకస్మి న్నసంభవాత్.

మా ముఖ్యవిమర్శనము ('ఏక ... వాత్ =) 'ఏకస్మి న్నసంభవాత్' అను సూత్రరూపముననే యున్నదిసుమా !

న హ్యేకస్మిన్ ధర్మిణి యుగప త్సదసత్త్వాదివిరుద్ధధర్మసమావేశ స్సంభవతి శీతోష్ణవత్,

సూత్రార్థ మేమనఁగా :— (ఏకస్మిన్ ధర్మిణి=) ఒకపదార్థమునందు (యుగపత్ =) నొక్కసారిగా (శీతోష్ణవత్ =) చల్లఁదనము- వేడిమివంటి (సదస...వేశః=) ఉండుట (=సత్)- 'ఉండకపోవుట' (=అసత్) యనువరస్పరవిరుద్ధధర్మము లేకమై నిల్చుట (నహి సంభవతి=) యెన్నటికిని సంభవించదు.

య ఏతే సప్తపదార్థా నిర్ధారితా ఏతావంత, ఏవంరూపా శ్చేతి తే తథైవ వా స్యుః, నైవ వా తథా స్యుః.

(ఏతావంతః=) 'ఇన్ని యనియు, (ఏవంరూపాశ్చ- ఇతి=) ఇట్టిరూపము గలవనియు, (యే- ఏతే .... రితాః ) ఏయీయేడుపదార్థములు మీచే (=జైనులచే) మున్ను నిర్ధారణము చేయఁబడియుండెనో, (తే=) అవి (తథైవ వా స్యుః=) 'అట్లే యుండవచ్చును' లేదా (నైవ ... స్యుః=) 'అట్లుండకపోవచ్చును'-

ఇతరథా హి తథా వా స్యుః, అతథావే త్యనిర్ధారితరూపం జ్ఞానం సంశయజ్ఞానవ దప్రమాణ మేవ స్యాత్,

అంతేగాని (ఇతరథాహి=) మఱియొక మూఁడవవిధమున-అనఁగా- ('తథావా స్యుః=) 'అట్లైన నుండవచ్చును' లేక ('అతథావా'=) మఱియొకవిధముననైన నుండవచ్చును' (ఇతి=) అని (అనిర్ధారితరూపం=) నిశ్చయము లేనివిధమున నుపదేశింపఁబడిన (జ్ఞానం =) వస్తుజ్ఞానము (సంశయజ్ఞానవత్ =) సంశయమాత్రమే యైనదై (అప్ర....స్యాత్ =) నమ్మఁదగిన ప్రామాణికజ్ఞాన మెంతమాత్రమును గానేరదుగదా

జైనపూర్వపక్షి :—

నన్వనేకాత్మకం వస్త్వితి నిర్ధారితరూపమేవ జ్ఞాన ముత్పద్యమానం సంశయజ్ఞానవ న్నాప్రమాణం భవితు మర్హతి,

(అనేకాత్మకంవస్తు'=) ఏదేని యొకవస్తువు బహుస్వరూపమైనది- అనఁగా బహుస్వభావములు గలది యని యుపదేశింపఁబడినవస్తుజ్ఞానము (నిర్ధా ... మానం=) ఉపదేశింపఁబడిన నిశ్చితజ్ఞానమే (నిర్ధారణ చేయఁబడినజ్ఞానమే) యై సరియైనదిగానే యుండునుగాని (సంశయజ్ఞానవత్=) సంశయముమాత్రమేయై యను అప్ర ... మర్హతి=) యప్రామాణిక మగునని చెప్పుటకు వీలు లేదుసుమా!

(అనఁగా- అనేకస్వభావములు గలవస్తువు ననేకస్వభావములు గలదిగా నుపదేశించుట నిశ్చితజ్ఞానము నుపదేశించినట్లే యగునుగాని సందేహ ముపదేశించి నట్లు గాదని భావము.)

అద్వైతసిద్ధాంతి :—

నేతి బ్రూమః.

(న+ఇతి=) అట్లు చెప్ప వలనుగాదని (బ్రూమః=) వక్కాణించుచున్నాము.

నిరంకుశం హ్యనేకాంతం సర్వవస్తుషు ప్రతిజానానస్య నిర్ధారణస్యాపి వస్తుత్వావిశేషాత్. స్యాదస్తి స్యాన్నాస్తీత్యాదివికల్పోపనిపాతా. దనిర్ధారణాత్మకతైవ స్యాత్,

(సర్వవస్తుషు =) సర్వవిషయములయందును (నిరంకుశం=) దప్పనిసరియైన (అనేకాంతం హి=) వైచిత్ర్యమే- అనఁగా వివిధాకారమే (అనఁగా- ఉండవచ్చును లేకపోవచ్చును - కావచ్చును, కాకపోవచ్చును-అనునట్టిదానిని) (ప్రతిజానానస్య=) కలదని వాదించువాఁడు (నిర్ధార... శేషాత్=) వాఁడు చేయుచున్ననిర్ధారణ మను నదిగూడ నొకవిషయమే యని యొప్పుకొని తీరవలసియున్నదిగాన- అట్టి నిర్ధారణ' విషయమందైనను ('స్యాద ... పాతాత్ =) 'ఉండవచ్చును, లేకపోవచ్చును; గావచ్చును- గాకపోవచ్చును' అనుసందేహరూపము లైనవికల్పములే రావలసివచ్చుచుండుటచేత నిర్ధారణ' మన్నది అనిర్ధా ... స్యాత్=) 'అనిర్ధారణ'మే యైపోవును- (అనఁగా మీమతమునం దేవిషయమైనను ఇట్టిది' యని నిర్ధారణచేయఁబడుటకు వీలులేదు. ఎందుచేతననఁగా- ఏవిషయమునైనను మీరు 'అది యట్టి దగును- అట్టిది గాకపోవును-అన్నట్లుగానే యుండునని చెప్పుచున్నారుగదా యని భావము.)

ఏవం నిర్ధారయితు ర్నిర్ధారణఫలస్య చ స్యాత్పక్షే స్తితా. స్యాచ్చ పక్షే నాస్తితేతి.

(ఏవం=) ఈతీరుగానే (నిర్ధారయితుః - నిర్ధారణఫలస్యచ=) 'నిర్ధారణము చేయువాఁడొకఁడున్నాఁడా' యనువిషయమందును, 'నిర్ధారణమునకు ఫల మున్నదా' యనువిషయమందును (పక్షే) ఒకపక్షములో (అస్తితా స్యాత్=) ఉండవచ్చు

ననియు (పక్షే=) మఱియొకపక్షములో (నాస్తితా స్యాత్=) లేకపోవచ్చుననియు (ఇతి) చెప్పవలసినదేగదా !

ఏవంసతి కథం ప్రమాణభూతస్సం, స్తీర్థకరః ప్రమాణప్రమేయ, ప్రమాతృ. ప్రమితి ష్వనిర్ధారితా సూపదేష్టుం శక్నుయాత్ ?

(ఏవంసతి=) మీమతములోని నిర్ధారణవిషయ మిట్టిదై యుండఁగా (ప్రమాణభూతః=) మీకుఁ బ్రమాణభూతుఁడును, (తీర్థకరః =) మీమతకర్తయునైన జినుఁడు (ప్రమాణ .... ప్రమితిషు=) ప్రమాణ (=జ్ఞానసాధన) - ప్రమేయ (=జ్ఞానవిషయ) ప్రమాతృ (=జ్ఞాతృ - తెలిసికొనువాఁడు) -ప్రమితు (=జ్ఞాన) లను విషయములుగూడ (అనిర్ధారితాసు=) ఇట్టివేయని స్పష్టముగా నిర్ధారణము చేయఁబడఁజాలనివిషయములే యైనచో (ఉపదేష్టుం కథం శక్నుయాత్ =) నుపదేశించుట కెట్లు సమర్థుఁడగును?

కథంవా తదభిప్రాయానుసారిణ స్తదుపదిష్టేఽర్థే

(అ[illegible]ర్ధారితరూపే=) అనిశ్చయస్వరూపములైన కర్త యుపదేశించినవిషయములందు (తదభి ... రిణః=) ఆయనయుపదేశమునందు లక్ష్యభావము గలవారు (కథం ప్రవర్తేరన్=) ఎట్లు ప్రవర్తించఁగలరు !

ఐకాంతికఫలత్వనిర్ధారణే హి సతి, తత్సాధనానుష్ఠానాయ సర్వో లోకో[illegible] ప్రవర్తేత; నాన్యథా,

(ఐకాం .... రణేహి=) 'తప్పక యిట్టిఫలము కలిగినప్పుడే (సర్వో లోకః=) ప్రజలందఱును నకు సాధ్యమైనకర్మయొక్క యనుష్ఠానమునందు ర్తేరన్ =) ప్రవర్తింతురుగాని (న+అన్యథా=) మీరు చెప్పినట్లు ఫలముగూడ ననిర్ధారితవిషయము జాలదు.

అత శ్చానిర్ధారితార్థం శాస్త్రం ప్రణయన్ మత్తోన్మత్తాదివ దనుపాదేయవచన స్స్యాత్.

(అతశ్చ=) ఈహేతువునుబట్టియే (అనిర్ధా ... స్త్రం=) యెట్టినిశ్చయము లేని అనఁగా అస్తినాస్తివాదగ్రస్త మైనజైనశాస్త్రమును, (ప్రణయన్=) రచియించినమీజినుఁడు (మత్తోన్మత్తాదివత్=)మదించి తొడలు తెలియనివానివలె, లేక

పిచ్చివాఁడు మొదలగువారివలె (అను ... స్యాత్=) విశ్వసించరానియుపదేశము చేసినవాఁడే యగుచున్నాఁడు.

తథా పంచానా మస్తికాయానాం పంచత్వసంఖ్యాఽస్తి వా, నాస్తి వేతి వికల్ప్యమానా స్యాత్తావ దేకస్మిన్ పక్షే; పక్షాంతరే తు న స్యా దిత్యతో న్యూనసంఖ్యాత్వ మధికసంఖ్యాత్వం వా ప్రాప్నుయాత్.

(తథా=) అప్రకారమే (పంచా .... సంఖ్యా=) అస్తికాయము లనఁడియైదు పదార్థధర్మములయొక్క 'అయిదు' అనె' సంఖ్యవిషయమై పైని దెలుపఁబడిన 'సప్తభంగీనయ' లక్షణము లనువర్తింపఁజేసి యాసఖ్య (అస్తి .... వికల్ప్యమానా=) యున్నదా, లేదా యని రెండువిధములఁ జూడఁగా (తావదేకస్మిన్ పక్షే=) నొక పక్షమందు (స్యాత్=) నైదుసంఖ్య యుండుననియు, (పక్షాంతరే తు=) మఱియొక పక్షమందో (న స్యాత్=) నైదుసఖ్య యుండదనియు (ఇతి=) నేర్పడును. (అతః=) అట్లేర్పడిన రెండుపక్షములలో 'నైదుసంఖ్య యుండ దని యేర్పడినరెండవపక్షము ననుసరించి చూచుచో, (న్యూనసంఖ్యాత్వం=) నైదుకంటెఁ దక్కువసంఖ్యగానో, (అధికసంఖ్యాత్వం వా=) లేక యైదుకంటె నక్కువసంఖ్యగానో ('అస్తికాయ') పదార్థధర్మము లున్నట్లు (ప్రాప్నుయాత్=) తేలునుగదా!

న చైషాం పదార్థానా మవక్తవ్యత్వం సంభవతి.

(చ=)మఱియును, (ఏషాం పదార్థానాం=)ఈపదార్థములకు (అవక్తవ్యత్వం=) చెప్ప నలవిగాకపోవుట యను 'సప్తభంగీనయ' లక్షణముసైతము (న సంభవతి=) సంభవము గాదు.

అవక్తవ్యాశ్చే. న్నోచ్యేరన్.

(అవక్తవ్యాశ్చేత్=) ఆపదార్థములు అవక్తవ్యములు = చెప్ప నలవిగానివి అన్నట్లగుచో (న + ఉచ్యేరన్=) వానినిగూర్చి చెప్పుటకే వీలు లేదు.

ఉచ్యంతే చావక్తవ్యాశ్చేతి విప్రతిషిద్ధమ్.

(ఉచ్యంతే చ=) వానిఁగూర్చి చెప్పుచు, నవి (అవక్తవ్యాశ్చ=) చెప్ప నలవిగానివి యని (ఇతి=) చెప్పుచో (విప్రతిషిద్ధం=) రెంటికిని విరుద్ధస్థితి గల్గును. చెప్ప నలవిగానివి యని చెప్పుచు వానినిగూర్చి చెప్పుట యెట్లని భావము.)

ఉచ్యమానాశ్చ తథై వావధార్యంతే నావధార్యంత ఇతిచ,

(ఉచ్యమానాశ్చ=) ఆపదార్థములు చెప్పఁబడుచున్నవైనను, (తత్రైవ=) అట్టి పక్షములో నవి (అవధార్యంతే=) తెలిసికొనఁబడుచున్నవి. (నావధార్యంతే=) తెలిసికొనఁబడుట లేదు (ఇతిచ=) అనియును

తథా తదవధారణఫలం సమ్యగ్దర్శన మస్తివా నాస్తివా.

(తథా=) అట్లే (తద ... ఫలం=) వానిని దెలిసికొన్నందువలనఁ గలుగు ఫలము (సమ్య .... నాస్తివా=) యథార్థానుభవము 'అగును - కాదు' అనియును,

ఏవం తద్విపరీత మసమ్యగ్దర్శనమ ప్యస్తివా నాస్తివా.

(ఏవం=) అట్లే (తద్విపరీతం=) యందులకు వ్యతిరేకమైన (అసమ్య ... ర్శనమపి=) అయథార్థానుభవము (అస్తివా నాస్తివా=) ఉన్నది-లేదు-అనియును,

ఇతి ప్రలప న్మత్తోన్మత్తపక్షస్యైవ స్యాత్.

(ఇతి ప్రలపన్=) ఇట్లు (పరస్పరవిరుద్ధములుగా) వదరువాఁడో (మత్తో స్యాత్=) మదించినవాఁడో యగునుగాని

న ప్రత్యయితవ్యస్య పక్షస్య.

(ప్రత్యయితవ్యస్య పక్షస్య - న=) ఇతరులకు జ్ఞానవి సని బోధించువాఁడు గానేరఁడు.

స్వర్గాపవర్గయోశ్చ పక్షే భావః. పక్షే చాభావః.

అట్లే (స్వ .... ర్గయోః=) స్వర్గము మోక్ష ఒకపక్షమందు (భావః=) నున్నవి (పక్షేచ=) లేనివి యన్నట్లగును.

తథా పక్షే నిత్యతా. పక్షే చానిత్య తేత్యనవధారః

(తథా=) అట్లే యీస్వర్గమోక్షములు నిత్యములైనవి (పక్షేచ=) మఱియొకపక్షమందు గానివి- అని చెప్పినట్లగుచో (అనవధారణాయ లేనిస్థితి తటస్థించి (ప్రవృత్త్యనుపపత్తిః=) స్వర్గ యసంభవ మగును.

అనాదిసిద్ధ జీవప్రభృతీనాం చ స్వశాస్త్రావధృతస్వభావానా మయథావధృతస్వభా వత్వప్రసంగః,

(స్యాశా ... భావానాం =) మీ జైనమత శాస్త్రముచే నిశ్చయింపఁబడిన స్వభావము గలిగి (అనాది ... తీనాం=) అనాదిసిద్ధు లగుజీవుఁడు మొదలగువారికి మీసిద్ధాంతమందలి సప్తభంగీనయ లక్షణము లనుబట్టి (అయథా ... సంగః=) మీ శాస్త్రములలోఁ గల్పించుస్వభావమే లేదని చెప్పవలసివచ్చుచున్నది.

ఏవం జీవాదిషు పదార్థే ష్వేకస్మిన్ ధర్మిణి సత్త్వాసత్త్వయో ర్విరుద్ధయో ర్ధర్మయో రసంభవాత్ సత్త్వే చైకస్మిన్ ధర్మేఽసత్త్వస్య ధర్మాంతర స్యాసంభవాత్. అసత్త్వే చైవం సత్త్వ స్యాసంభవా దసంగత మిద మార్హతం మతమ్.

(ఏవం=) ఈతీరుగానే (జీవా ... ర్థేషు=) జీవుఁడు మొదలగు సప్తపదార్థము లలో (ఏక ... ధర్మిణి=) ఒకపదార్థమునందే సత్త్వము (=ఉండుట) అసత్త్వము (ఉండకపోవుట) అను (విరు ... ధర్మయోః=) విరుద్ధధర్మము లుండుట (అసంభ వాత్=) సంభవింపదు — ఎట్లన—

(సత్త్వే ... ధర్మే=) 'ఉండుట' (=సత్త్వము) యనునొకధర్మము గలప్పుడు (అసత్త్వ ... భవాత్=) 'ఉండకపోవుట' (అసత్త్వము) యను మఱియొకవిరుద్ధ ధర్మము (అసంభవాత్=) సంభవింపదు. (ఏవం=) అట్లే (అసత్త్వేచ=) 'ఉండక పోవుట' యనునొకధర్మము గలప్పుడు (సత్త్వస్యాసంభవాత్=) 'ఉండుట' యను మఱియొకవిరుద్ధధర్మము (అసంభవాత్=) సంభవింపదు కాఁబట్టి (ఇదం+ఆర్హతం మతం=) అర్హతునిచేఁ గల్పింపఁబడిన యీ (జైన) మతము (అసంగతం=) యుక్త మైనది గాదు.

ఏతే నైకానేకనిత్యానిత్యవ్యతిరిక్తావ్యతిరిక్తాద్యనేకాంతాభ్యుపగమా నిరాకృతా మంతవ్యాః.

(ఏతేన=) ఈహేతువులవలన (ఏకానేక ... భ్యుపగమాః=) ఏకము నగును, అనేకము నగును— నిత్యము నగును, అనిత్యము నగును— వ్యతిరేకము నగును, అవ్యతిరేకము నగును— ఈమొదలగు పరస్పరవిరుద్ధము లగు (=అనేకాంతములగు) (అభ్యుపగమాః=) సిద్ధాంతములు (నిరా ... తవ్యాః=) ఖండింపఁబడినట్లె తలఁచ వలయును.

యత్తు పుద్గలసంజ్ఞకేభ్యోఽణుభ్య స్సంఘాతా స్సంభవంతీతి కల్పయంతి తత్ పూర్వేణై వాణువాదనిరాకరణేన నిరాకృతం భవతీ త్యతో నపృథ క్తన్నిరాకరణాయ ప్రయత్యతే.

(పుద్గల ... ణుభ్యః=) పుద్గలము లను పేరు గలయణువులవలన (సంఘాతాః= పృథివ్యాది శరీరాదిపదార్థములు (సంభవంతి — ఇతి) కలుగుచున్నవని (యత్తు కల్ప

యంతి తత్=) జైనులచేఁ జేయఁబడినకల్పన మేదిగలదో యది (పూర్వే ... ణైవ=) పూర్వమందే-అనఁగాఁ బరమాణువాదఖండనమందే (బ్ర॥ సూ॥ II-2-12 మొ॥ 17 సూ) (నిరాకృతం భవతి=) నిరాకరించఁబడినది (ఇత్యతః=) యగుటవలన (పృథక్=) మరల నిప్పుడు (తన్నిరా ... ణాయ=) ఆఖండనమునే చేయుటకై (న ప్రియత్యతే=) పూనుకొనుట లేదు.

[34 సూత్రావతారిక :— ఒకపదార్థమునకు నేకకాలమందే విరుద్ధ ధర్మములు లుండఁజాల వనువిషయము లోఁగడిసూత్రమందుఁ జెప్పఁబడినది. తనశరీర మెంతగా నుండునో జీవునిపరిమాణముసైత మంతగానే యుండునని జైనులమతి యొక్కసిద్ధాంత మీసూత్రమందు ఖండింపఁబడుచున్నది.)

## 34 సూ॥ ఏవం చాత్మాఽకార్త్స్న్యమ్.

ప॥ వి॥ ఏవం - చ - ఆత్మా - అకార్త్స్న్యమ్.

ప్ర॥ ప॥ అ॥ — ఏవంచ = ఇట్లగుచో; ఆత్మా = జీవునికి; అకార్త్స్న్యం= అపరిపూర్ణత్వము; (అనఁగా- కృత్స్నభావము లేకపోవుట - కృత్స్నమనఁ బూర్ణ మని యర్థము.

సూత్రార్థము :— ఇట్లగుచో- జీవునకు- అపరిపూర్ణత్వదోషము గలుగును.

సూత్రతాత్పర్యము :— జీవుఁ డుండుశరీరముయొక్క- పరిమాణ మెంతదిగా నుండునో, జీవునికిసైత మంతయే పరిమాణ ముండునని జైనులు చెప్పుదురు. (ఏవంచ=) శరీరమంతటిపరిమాణమే జీవునికిసైత ముండునని చెప్పుచో (ఆత్మనః- అకార్త్స్న్యం) జీవుఁడు పరిచ్ఛిన్నుఁడేయని- అనఁగా మితమైనపరిమాణము గల వాఁడే యని యొప్పుకొనవలసివచ్చును- అట్లొప్పుకొనుచోఁ బరిచ్ఛిన్నము లైన ఘటాదిపదార్థము లెట్లనిత్యములో, జీవుఁడుసైత మట్లే యనిత్యుఁడై పోవును.

భాష్యము — భాష్యార్థము

యథైకస్మిన్ ధర్మిణి విరుద్ధధర్మాసంభవో దోష స్స్యాద్వాదే ప్రసక్తః ఏవ మాత్మనోఽపి జీవ స్యాకార్త్స్న్య మపరో దోషః ప్రసజ్యేత.

(స్యాద్వాదే=) జైనులమతమందు- అనఁగా 'స్యాదస్తి-స్యాన్నాస్తి' అను మొదలగువాదములు చేయుజైనులమతమందు (ఏకస్మిన్ ధర్మిణి=) ఒకపదార్థము నందు (విరు .... భావః=) విరుద్ధధర్మములు సంభవింపఁగలవనుట (యథాదోషః

ప్రసక్తః=) యెట్లు దోషమైనదో (ఏవం=) అట్లే (ఆత్మ ... పర్య=) ఆత్మ యైన జీవునికిసైతము అకార్త్స్న్యం=) అపరిపూర్ణత్వము- అనఁగాఁ బరిచ్ఛిన్నత్వము- మితమైయుండుట యనెడి (అపరః దోషః + అపి =) మఱియొకదోషముసైతము (ప్రసజ్యేత=) వచ్చితీరును

కథం ? — అ దెట్లందు రేమో

శరీరపరిమాణో హి జీవ ఇత్యార్హతా మన్యంతే.

(జీవః=) జీవుఁడు (శరీ ... ణో హి=) శరీరమంతటిపరిమాణము గలవాఁడు (ఇతి=) అని (ఆర్హతాః=) ఆర్హతులైనజైనులు (మన్యంతే=) తలఁచుచున్నారు.

శరీరపరిమాణతాయాంచ సత్యా మకృత్స్నోఽసర్వగతః పరిచ్ఛిన్న ఆత్మే త్యతో ఘటాదివ దనిత్యత్వ మాత్మనః ప్రసజ్యతే.

(శరీర ... సత్యాం=) శరీరమున కెంతపరిమాణమో యాత్మకును (=జీవునికిని) నంతయే పరిమాణ ముండు నన్నచో, (ఆత్మా=) అప్పు డాత్మ- అనఁగా జీవుఁడు (అకృత్స్నః=) అపరిపూర్ణుఁడును (అసర్వగతః=) అంతటను నుండనివాఁడును (అపరిచ్ఛిన్నః=) మితమైనవాఁడును- అని చెప్పవలసివచ్చును. (ఇత్యతః=) అట్లు చెప్పుచో (ఘటా ....త్యత్వం=) పరిచ్ఛిన్నములైన ఘటాదిపదార్థముల కనిత్యత్వమెట్లో యట్లే (ఆత్మనః=) ఆత్మకు ననఁగా జీవునికిసైత మనిత్యత్వమే (ప్రసజ్యతే=) ప్రాప్తించును.

శరీరాణాం చానవస్థితపరిమాణత్వా న్మనుష్యజీవో మనుష్యశరీరపరిమాణో భూత్వా పునః కేనచిత్కర్మవిపాకేన హస్తిజన్మ ప్రాప్నువ న్న కృత్స్నం హస్తిశరీరం; వ్యాప్నుయాత్ పుత్తికాజన్మ చ ప్రాప్నువ న్న కృత్స్నః పుత్తికాశరీరే సమ్మీయేత.

శరీరా ... ణత్వాత్=) శరీరము లనియతములైన (not fixed) పరిమాణములు గలవిగావున, (మనుష్యజీవః=) మనుష్యజీవుఁడు (మనుష్య ... భూత్వా= మనుష్యుఁడుగా నున్నంతవఱకు మనుష్యున కున్నంతపరిమాణము గలవాఁడై (పునః) మరల (కేన ... కేన=) నతని యొక్క కర్మవిపాకము (= ఫలము) చేత (హస్తి ... ప్రాప్నువన్=) ఏనుఁగుజన్మము ను బొందినవాఁడై (కృత్స్నం=) మిక్కిలిపెద్దదైన (హస్తి .... యాత్ =) ఏనుఁగుశరీరమంతటిని వ్యాపింపలేఁడుగదా ! తరువాత (పుత్తి .... ప్నువన్=) చీమజన్మమును బొందినవాఁడగుచో, (కృత్స్నః=) ఏనుఁగంతటి పెద్దపరిమాణముతోఁ (పుత్తికాశరీరే=) చీమశరీరములో (న సమ్మీయేత =) దూరలేఁడుగదా !

సమాన ఏష ఏకస్మిన్నపి జన్మని కౌమారయౌవనస్థావిరేషు దోషః.

(ఏషః దోషః=) ఈదోషము - అనఁగా జన్మాంతరములయందుఁ బెద్దచిన్న శరీరములయందుఁ బ్రవేశింపవలసివచ్చుట యనునది (ఏక ... జన్మని=) ఒక్కజన్మ మందున్నైతము కౌమా ... రేషు=) బాల్యమందున్నది వయసునందు, ముసలితన మందుఁగూడ (సమానః=) సమానముగానే యుండును.

(అనఁగా బాల్యములో నున్నశరీరపరిమాణము కంటె నడివయసులోని శరీరపరిమాణము హెచ్చగుటయు,ముసలితనములోని శరీరపరిమాణము తగ్గుటయుఁ గలదు. శరీరమునుబట్టియే జీవపరిమాణము మాఱిపోవలసియుండును- అని భావము.)

జైనపూర్వపక్షి :—

స్యా దేతత్.

అట్లే యగుఁగాక ! అది యొకదోషములోఁ జేరిక గాదు.

అనంతావయవో జీవ స్తస్య త ఏవావయవా అల్పే శరీరే సంకుచేయు ర్మహతి

చ వికసేయురితి.

(జీవః=) జీవుఁడనఁగా (అనంతావయవః=) అనంతములైన– అనఁగా లెక్క లేనియవయవములు గలవాఁడుసుమా (తే+ఏవ+అవయవాః=) ఆయనంతావ యవములే (అల్పే .... చేయుః=) కొద్దిశరీరమందు ముడుచుకొనియుండును (మహతిచ=) పెద్దశరీరమందు (వికసేయుః=) వ్యాపించియుండును.

(ఒకదీపముయొక్క యవయవములే చిన్నగదిలో ముడుచుకొనియుఁ బెద్ద గదిలో వ్యాపించియు నెట్లుండునో యట్లుండునని భావము.)

సిద్ధాంతి :—

తేషాం పున రనంతానాం జీవావయవానాం సమానదేశత్వం ప్రతిహన్యేత వా నవేతి

వక్తవ్యమ్.

(తేషాం పునః=) అట్లు వాదించుజైను లొకసంగతిని జెప్పవలసియుండును. అదేదన (అనంతా ... వానాం=) జీవుని కున్నవని చెప్పుననంతము లైనయవయవ ములు (సమాన...ప్రతి=) (ఒకప్రదేశములోనే యుండు ననువిషయము (హన్యేత .... వక్తవ్యం=) సంభవింపకపోవునా ! లేక సంభవించునా ? అనువిషయమును జెప్పవలసియున్నది.

అనఁగా– జీవునియనంతావయవములు వేఱుచోట్ల నుండునో– యొకచోట నుండునో ముందుఁ జెప్పుమని భావము.)

ప్రతిఘాతే తావ న్నానంతావయవాః పరిచ్ఛిన్నే దేశే సంమీయేరన్

(ప్రతి .... తావత్=) జీవునియొక్క యనంతావయవములు వేఱుచోట్ల నుండు ననుపక్షమున (అనం .... వాః=) ఆయనంతావయవములు (పరిచ్ఛిన్నే దేశే=) కొద్దిప్రదేశము గలదేహమునందు (న సంమీయేరన్=) ఇమిడియుండఁజాలక పోవలసివచ్చును

(అనఁగాఁ బట్టినంతవఱకుఁ గొన్నియవయవములుమాత్రమే యాకొద్దిశరీరములో నుండి మిగిలినవి యాశరీరముకంటె వెలుపల నుండవలసివచ్చునని భావము.)

అప్రతిఘాతే ప్యేకావయవదేశత్వోపపత్తేః.

(అప్రతిఘాతేఽపి=) జీవునియొక్క యనంతావయవము లొకచోటనే యుండు ననుపక్షమున, (ఏకావ ... పత్తేః=) శరీరముయొక్క యొకయవయవ మెంత ప్రదేశములో నిల్చియుండఁగలదో యన్నియవయవములున్నైత మంతప్రదేశము లోనే యుండునని చెప్పవలసివచ్చును (అవయవము– అనఁగా నణువే యని గ్రహించునది.)

అవయవానాం ప్రథిమానుపపత్తే ర్జీవ స్యాణుమాత్రత్వప్రసంగ స్స్యాత్.

అట్లుచెప్పుచో (అవయ ... నుపపత్తేః=) అవయవములు వృద్ధిఁ జెందునని చెప్పుట కవకాశము లేనందున, (జీవస్య ... స్స్యాత్= జీవుఁ డణుమాత్రపరిమాణము– అనఁగా నొకయవయవమాత్రపరిమాణము గలవాఁడే యనవలసివచ్చును.

అపిచ శరీరమాత్రపరిచ్ఛిన్నానాం జీవావయవానా మానంత్యం నోత్ప్రేక్షితుమపి శక్యమ్.

(అపిచ=) ఇంతేగాక (శరీర ... వానాం=) జీవావయవములు జీవునిశరీర మెంతయో యంత మితముగానే యుండునని చెప్పుచో (ఆనంత్యం=) జీవునియొక్క యవయవము లంతము (= నాశము) లేనివి యని (ఉత్ప్రేక్షితుమపి=) యూహించుటకైనను (న శక్యం=) సాధ్యము గాదు.

అథ పర్యాయేణ బృహచ్ఛరీరప్రతిపత్తౌ కేచిజ్జీవావయవా ఉపగచ్ఛంతి తనుశరీరప్రతిపత్తౌ చ కేచి దపగచ్ఛం తీత్యుచ్యేత; తత్రా ప్యుచ్యతే.

(అథ=) అట్టిదోషమును బోఁగొట్టుకొనుటకై –అనఁగా జీవుఁ డనంతావయవ

ములు గలవాఁడు కాఁడు— అనుదోషమును బోఁగొట్టుకొనుటకై (పర్యాయేణ=) అవసరమునుబట్టి మాటిమాటికి మాఱుచు, (బృహ .... పత్తౌ=) పెద్దశరీరము వచ్చినప్పుడు (కేచిత్ ... గచ్ఛంతి=) కొన్ని యవయవములు (ఉపగచ్ఛంతి=) క్రొత్తవి వచ్చును, (తను ... పత్తౌ చ=) కొద్దిశరీరము వచ్చినప్పుడు (కేచిత్=) అంతవఱకున్న యవయవములు కొన్ని (అపగచ్ఛంతి) పోవును (ఇత్యుచ్యేత=) అని చెప్పుదురేమో! (తత్రాపి=) అట్లుచెప్పినను (ఉచ్యేత=) దోషము రాకపోదు— అని రాఁబోవుసూత్రము చెప్పుచున్నది చూడుఁడు.

౩౫ సూత్రావతారిక :— శరీరపరిమాణమే జీవపరిమాణమని చెప్పుజైనుల సిద్ధాంతము లోఁగడిసూత్రమందు ఖండింపఁబడినది— జీవుఁడు పెద్దశరీరములోనికిఁ బోవలసివచ్చినప్పుడు జీవావయవములలోనికిఁ గొన్ని క్రొత్తయవయవములు వచ్చి చేరుచుండుననియుఁ గొద్దిశరీరములోనికిఁ బోవలసివచ్చినప్పుడు జీవావయవములు కొన్ని తగ్గిపోవుచుండుననియు, జీవుఁడు మాత్రము నిత్యముగానే యుండుననియుఁ జెప్పుజైనసిద్ధాంత మీసూత్రమందు ఖండింపఁబడుచున్నది.

## ౩౫ సూ॥ న చ పర్యాయా ద ప్యవిరోధో వికారాదిభ్యః

ప॥ వి॥ — న - చ - పర్యాయాత్ - అపి - అవిరోధః - వికారాదిభ్యః.

అ॥ క్ర॥ — పర్యాయాత్ - అవిరోధః - అపి - నచ - వికారాదిభ్యః.

ప్ర॥ ప॥ అ॥ — పర్యాయాత్ = వచ్చిపోవుచుండుటవలన; అవిరోధః = విరోధము లేదు— అపిచ = అయినను (=అన్నను) న = చెల్లదు; వికారాదిభ్యః = వికారదోషములు వచ్చుటవలన.

సూత్రార్థము :— (జీవావయవములు కొన్ని (క్రొత్తవి) వచ్చి (ప్రాతవి) పోవుచుండుటవలన (శరీరమంతగా జీవుఁ డుండు ననుసిద్ధాంతమునకు) విరోధము లేదు— (అని) అన్నను— (అప్పటికిని) జెల్లదు. (ఎందుచేతననఁగా) (జీవునకు) వికారాదిదోషములు వచ్చుటవలన.

సూత్రతాత్పర్యము :— (పర్యాయాదపి) జీవునియొక్క యవయవములలోఁ గ్రొత్తవి వచ్చిచేరుచుఁ బ్రాతవి పోవుచుండునని చెప్పుటవలనఁగూడ, (అవిరుద్ధం — న) శరీరపరిమాణమే జీవపరిమాణమని చెప్పెడివిషయమునకు నిబ్బంది (= విరోధము లేకపోదు. అనఁగాఁ జీవు మొదలకు మిక్కిలిచిన్నజంతువులశరీరములోఁ బ్రవేశించి జీవునియొక్క యవయవములలోఁ గొన్ని లేచిపోవుటవలన నాచిన్నజంతువుల

శరీరపరిమాణము జీవునకు సంభవించును. ఏనుఁగు మొదలగు మిక్కిలి పెద్దజంతువులలోఁ బ్రవేశింపఁబోవుజీవునకుఁ బూర్వము లేనికొ్రత్తయవయవములు వచ్చి చేరుటవలన నాపెద్దజంతువుల శరీరపరిమాణము జీవునకు సంభవించు నని చెప్పుటకు సాధ్యపడదు. ఎందుచేతననఁగా —

(వికారాదిభ్యః) జీవునకుఁ బూర్వ మున్నకొన్నియవయవములు వదలి పోవుచుఁ బూర్వము లేనికొన్నియవయవములు వచ్చిచేరుచుండునని చెప్పుటవలనఁ జీవుఁ డెల్లప్పుడును క్షీణించిపోవుచుండుటగాని లేక వృద్ధియగుచుండుటగాని తటస్థించుటవలన జీవునకు వికారాదిదోషములు గల్గును. మఱియు జీవుఁ డట్టివికారములకు లోనగుటచేతఁ జర్మాదులవలె ననిత్యమే యైపోవును- అని యంగీకరింపవలసివచ్చును,

కాఁబట్టి జీవుఁడెల్లప్పుడును నొకేతీరుగా గొప్పపరిమాణము గలవాఁడుగానో, కొద్దిపరిమాణము గలవాఁడుగానో యుండునని చెప్పనొప్పునుగాని శరీరమంతపరిమాణము గలవాఁడని చెప్ప వలనుపడదు.

భాష్యము — భాష్యార్థము

నచ పర్యాయేణా వ్యవయవోపగమాపగమాభ్యా మేతద్దేహపరిమాణత్వం జీవ స్యావిరోధేనోపపాదయితుం శక్యతే.

(పర్యాయేణ=) పర్యాయములుగా- అనఁగా నవసర మగుమార్పులతో (అవయ .... మాభ్యాం=) జీవునియొక్క యవయవములు హెచ్చుచుఁ దగ్గిపోవుచునుండుటవలన (ఏతత్ ... జీవస్య=) దేహ మెంతటిపరిమాణమో జీవునిపరిమాణమంతటిదే యని (అవిరోధేన=) యెట్టియిబ్బంది (=విరోధము) లేకుండఁ (ఉపపాదయితుమపి=) జెప్పుటసైతము (నచ శక్యతే=) సాధ్యము గాదు. (అట్లు చెప్పుటవలనఁ గూడఁ గొన్ని జైనసిద్ధాంతములకు విరోధము లేకపోదని భావము)

కుతః ? — ఎందుచే సాధ్యముగా దందురేమో !

వికారాదిదోషప్రసంగాత్.

అట్లు చెప్పచో జీవుఁడు (వికా ... గాత్=) కొన్నివికారములకు- అనఁగా మార్పులకు లోనుగావలసివచ్చు ననెడిదోష మాపాదించునని యొప్పుకొనవలసివచ్చును.

అవయవోపగమాపగమాభ్యాం హ్యనిశ మాపూర్యమాణ స్యాపక్షీయమాణస్య చ జీవస్య విక్రియాత్వం తావ దపరిహార్యమ్.

(అవ ... భ్యాంహి=) జీవునకుఁ గొన్ని క్రొత్తయవయవములు వచ్చుచుఁ, గొన్ని పోవుచు నుండుటవలన (అనిశం =) నెల్లప్పుడును (జీవస్య =) జీవునకు (అపూర్వ ... ణస్యచ =) వృద్ధియగుచుండుట- క్షీణించిపోవుచుండుటయను (విక్రి యావత్వం =) వికారములు (= మార్పులు) గలుగు ననుదోషము (తావ దవరి హార్యం=) తొలఁగింపఁబడఁజాలదు.

విక్రియావత్త్వే చ చర్మాదివ దవిత్యత్వం ప్రసజ్యేత.

(విక్రి ... త్త్వేచ=) జీవుఁ డట్టివికారములకు (=మార్పులకు) లోనగుచుండు నని యొప్పుకొనుటచే (చర్మాదివత్ =) శరీరముయొక్క (చర్మము రక్తము మొద లగునవి యెట్లో యట్లే (అనిత్య ... జ్యేత=) జీవుఁడునైత మనిత్యమైనవాఁడేయని చెప్పవలసివచ్చును.

తతశ్చ బంధమోక్షాభ్యుపగమో బాధ్యేత.

(తతశ్చ=) జీవుఁ డనిత్యమైనవాఁ డగుచో (బంధ ... గమః=) జీవునకు బంధమోక్షములు (= చెఱయు- విడుదలయు) గలవని (=అభ్యుపగమః) చెప్పుసిద్ధాంతము (బాధ్యేత=) భంగపడిపోవును.

కర్మాష్టకపరివేష్టితస్య జీవ స్యాలాబువత్ సంసారసాగరే నిమగ్నస్య బంధనోచ్ఛేదా దూర్ధ్వగామిత్వం భవతీతి.

(కర్మా ... తస్య=) ఎన్మిదివిధము లగుకర్మములచేత నావరింపఁబడి (అలా బువత్ =) సొరకాయబుఱ్ఱవలె (సంసార ... గ్నస్య=) సంసారసముద్రమందు మునిఁగియున్న (జీవస్య=) జీవునకు (బంధనోచ్ఛేదాత్= నాకర్మబంధములు దెగి పోయినంతనే (ఊర్ధ్వగా .... భవతి=) యూర్ధ్వగమనము (అనఁగా మోక్షము) సిద్ధించును (ఇతి=) అని చెప్పునదియే వారిసిద్ధాంతమగుట (ఇట్టిసిద్ధాంతము భంగపడి పోవునని భావము.)

(1 జ్ఞానావరణీయము- 2 ధర్మావరణీయము- 3 మోహనీయము- 4 అంత రాయికము- అనునాల్గును ఘాతికర్మములు- 1 వేదనీయము- 2 నామకము- 3 గోత్రికము- 4 ఆయుష్కము- అనునాల్గును అఘాతికర్మములు- మొత్తముఁ గర్మము లెనిమిది- వీనినే జైనమతమందుఁ గర్మాష్టక మందురు )

కించాన్యత్- ఆగచ్ఛతా మపగచ్ఛతాం చావయవానా మాగమాపాయధర్మవత్త్వాదే వాత్మత్వం శరీరాదివత్.

(కించ + అన్యత్ =) మఱింకేమనఁగా— (ఆగచ్ఛ ... తాంచ=) వచ్చుచుఁ బోవుచు నుండునని చెప్పఁబడు (అవయవానాం=) జీవునియొక్క యవయవములు (ఆగమా ... వత్త్వాదేవ=) వచ్చుట- పోవుట యనెడిధర్మములు (=లక్షణములు) కలిగియుండుటచేతనే (శరీరాదివత్ =) శరీరాదులవలెనే (అనాత్మత్వం=) యనాత్మలై (నశించున చేతనపదార్థములై) పోవు ననెడిమఱియొకదోషము తటస్థించును.

తత శ్చావస్థితః కశ్చి దవయవ ఆత్మేతి స్యాత్. నచ స నిరూపయితుం శక్యతే అయ మసావితి.

(తతశ్చ=) వచ్చుట- పోవుట యనుదోషము జీవావయవములకుఁ గల్గు నన్న పక్షమున— (అవస్థితః ... యవః=) (వచ్చుచుఁ బోవుచుండునవి గాక) స్థిరముగా నుండునేదోయొకయవయవమే (ఆత్మా + ఇతి స్యాత్ =) కూటస్థుఁ డైనయాత్మ (జీవుఁడు) యగు నందువేమో !

(సః =) అట్లు స్థిరముగా నుండునొక యవయవము ('అయం + అసౌ'- ఇతి=) 'అది యిదియే' యని (నిరూపయితుం=) నిరూపించుటకు (నచ శక్యతే=) సాధ్యము గాదుగదా !

(కూటస్థావయవ మగునాత్మ గుర్తింపఁబడఁజాలదుగావున 'ఆత్మజ్ఞానము' గలుగమిచే మోక్షము చేకూరదని భావము)

కించాన్యత్; ఆగచ్ఛన్త శ్చైతే జీవావయవాః కుతః ప్రాదుర్భవం త్యపగచ్ఛన్తశ్చ క్వ విలీయన్త ఇతి వక్తవ్యమ్. నహి భూతేభ్యః ప్రాదుర్భవేయుః, భూతేషు విలీయేరన్; అభౌతికత్వా జ్జీవస్య.

(కించాన్యత్ =) మఱియొకవిశేష మేమనఁగా- (ఆగచ్ఛన్తశ్చ=) క్రొత్తగా వచ్చుచుండునని చెప్పఁబడు (జీవావయవాః=) జీవావయవములు (కుతః ప్రాదుర్భవంతి= ఎందునుండి పుట్టుచున్నవో (అపగచ్ఛన్తశ్చ=) ఉండిపోవుచుండునని చెప్పఁబడు జీవావయవములు (క్వ విలీయంతే=) దేనియందు లీనమైపోవుచున్నవో (ఇతి వక్తవ్యం=) జైనపూర్వపక్షి చెప్పవలసియున్నదనుమా ! 'జీవావయవములు (భూతే ... ర్భవేయుః=) భూతములనుండి పుట్టుచున్నవి- (భూతే ... యేరన్ =) భూతములయందే లయమగుచున్నవి (నహి=) అని చెప్పవలనుగాదుగదా- ఎందుచేననఁగా (అభౌ ... వస్య=) జీవుఁడు భూతములనుండి పుట్టినవాఁడు- అనఁగా భూతముల యొక్క వికారము- గాఁడుసుమా ! (ఈవిషయము పూర్వపక్షి వైనసీ పంగీకరించు నదియే యని భావము.)

నాపి కశ్చి దన్య స్సాధారణోఽసాధారణో వా జీవానా మవయవాధారో నిరూప్యేత ప్రమాణాభావాత్.

(అపి=) మఱియును (జీవా ... ధారః =) జీవులయొక్క వచ్చిపోవుచుండు నవయవములకు నాధారమైన– అనఁగా– ఆయవయవములను గలుగఁజేయునట్టి (సాధా ... ణో వా=) సాధారణమైనవాఁడో (common) లేక యసాధారణమైన వాఁడో (special) (అనఁగా జీవుల కందఱికి నొకఁడో- లేక– ఒక్కొక్కజీవున కొక్కొక్కఁడో) (కశ్చిదన్యః=) యొకఁ డున్నట్లు (న నిరూప్యేత=) నిరూపింప సాధ్యముగాదు. ఎందుచేననఁగా— (ప్రమాణాభావాత్=) ప్రమాణము (ఋజువు చేయఁదగిన యాధారము) గన్పింపదు.

కించాన్యత్: అనవధృతస్వరూప శ్చైవం సత్యాత్మా స్యాత్. ఆగచ్ఛతా నుపగచ్ఛతాం చావయవానా మనియతపరిమాణత్వాత్.

(కించాన్యత్=) మఱియొకదోష మేమనఁగా— (ఏవం=) ఈప్రకారముగా నగుచో-ఆత్మ వచ్చిపోవుచుండు నవయవములు గలవాఁడె యగుచో (ఆత్మా=) ఆత్మ (=జీవుఁడు) (అనవధృతస్వరూపశ్చ స్యాత్=) తెలిసికొనఁబడఁజాలని– అనఁగా నవయవములయొక్క హెచ్చుతగ్గులచేత నిట్టివాఁడని నిశ్చయించుటకు సాధ్యపడని స్వరూపము గలవాఁడే యగును. ఎందుచే ననఁగా (ఆగ ... వానాం=) వచ్చుచుఁ బోవుచుండు జీవావయవములు (అనియ ... ణత్వాత్=) నియతములైన (fixed) పరిమాణములు గలవి గాఁజాలవు. (ఆత్మ నిశ్చయస్వరూపుఁడు గానందున ముక్తి రాఁజాల దని భావము.

అత ఏవమాదిదోషప్రసంగా న్న పర్యాయేణా వ్యవయవోపగమాపగమా వాత్మన ఆశ్రయితుం శక్యతే.

(అతః=) కాఁబట్టి (ఏవ ... సంగత్=) యీ మొదలగుదోషములు సంభవించుచుండుటవలన (పర్యాయేణ + అపి=) వంతులవరుసనుసైతము (ఆత్మనః=) జీవునకు (అవయ ... గమః=) అవయవముల యొక్క రాకపోకలు (న ఆశ్రయితుం శక్యతే=) ఆరోపించుట సాధ్యపడదు.

(పైనిఁ దెలుపఁబడినదోషములు–అనఁగా (1) అనిత్యత్వము (2) అసత్త్వము (3) అచేతనత్వము (4) అనేకాత్మత్వము- అనునవి సంభవించుచుండుటవలన దేహమంతటి ప్రమాణమే జీవునకుఁ గల్గుచుండునని చెప్పుట సరిగాదని భావము)

అథవా.

(అథవా=) (బ్ర. సూ. II-2-35) 'నచ పర్యాయాద ప్యవిరోధో వికారాదిభ్యః' [(పర్యాయాదపి=) వచ్చుచుఁబోవుచుండునని చెప్పుటవలనఁగూడ, (నచ అవిరోధః=) విరోధము లేకపోవుట లేదు— అనఁగా నాత్మకు నపరిపూర్ణత్వము- తద్ద్వారమున ననిత్యత్వము నను దోషము సంభవింపకపోవుట లేదు- ఎందుచేననఁగా (వికారాదిభ్యః=) వచ్చుచుఁబోవుచుండునని చెప్పుటవలన నాత్మకు వికారము లే- అనఁగా మార్పులే కలుగుచుండునని యొప్పుకొనవలసివచ్చునుగావున] అను నీ సూత్రముయొక్క యభిప్రాయము, (=purpose) మఱియొకవిధముగా నర్థము చేయవచ్చును— ఎట్లనఁగా :—

పూర్వేణ సూత్రేణ శరీరపరిమాణ స్యాత్మన ఉపచితాపచితశరీరాంతరప్రతిపత్తావకార్త్స్న్య ప్రసంజనద్వారే ణానిత్యతాయాం చోదితాయాం. పునః పర్యాయేణ పరిమాణానవస్థానేఽపి స్రోతస్సంతాననిత్యతాన్యాయే నాత్మనో నిత్యతా స్యాత్.

(పూర్వే ... త్రేణ=) బ్ర. సూ. II-2-34 'ఏవం చాత్మాఽకార్త్స్న్యమ్' అను లోఁగడినూత్రము చేత (శరీర ... త్మనః=) శరీరమంతటిపరిమాణమే కలిగి యుండునాత్మకుఁ (ఉపచి ... ప్రతిపత్తౌ=) బెద్దశరీరములుగాని చిన్నశరీరములుగాని కలుగుట కవకాశ మున్నప్పుడు, (అకార్త్స్న్య ... ద్వారేణ=) అపరిపూర్ణత్వమేర్పడి తద్ద్వారమున నాత్మకు (అనిత్య ... తాయాం=) అనిత్యత్వమనెడిదోషము సంభవించునని చెప్పఁబడినప్పుడు (పునః=) పూర్వపక్షియైనజైనుఁ డొక సమాధానము చెప్పవచ్చును- ఎట్లనఁగా,

("స్రోతస్సం .... యేన=) ఎడతెగనిప్రవాహముయొక్క జలములు మాఱుచున్నప్పటికి బ్రవాహపరంపర (=స్రోతస్సంతాన) మాత్రము నిత్యమై యున్నట్లె (పరిమా ... నేఽపి=) ఆత్మయొక్క పరిమాణములు మాఱుచున్నప్పటికి (పర్యాయేణ=) పరంపరారూపమున— అనఁగా బ్రవాహరూపమున (ఆత్మనో నిత్యతా స్యాత్=) ఆత్మమాత్రము నిత్యమైనదిగానే యుండును." అనఁగా- 'ఆత్మ' ఎడతెగని ప్రవాహమువంటిదిగాని ప్రవాహమును గలుగఁజేయు తరంగజలములవంటిది గాదని భావము. తరంగజలముల పరిమాణము మాఱుచున్నను బ్రవాహమనునది మాత్ర మెప్పటికిని మాఱకే యుండునని పూర్వపక్షి భావము.)

యథా రక్తపటాదీనాం విజ్ఞానానవస్థానేఽపి తత్సంతాననిత్యతా తద్వత్ విసిచామపి ఇత్యాశంక్య అనేన సూత్రేణోత్తర ముచ్యతే.

(రక్తపటాదీనాం =) ఎఱ్ఱనివస్త్రములను ధరించు క్షణికవిజ్ఞానవాదులైన బౌద్ధులమతములో (విజ్ఞా ... నేऽపి=) విజ్ఞానమనునది క్షణక్షణము నశించిపోవునది యైనను (సన్తానానిత్యతా యథా=) విజ్ఞానప్రవాహముమాత్ర మెట్లు నిత్యమైనదిగా నున్నదో (తద్వత్ =) యట్లేయని (వివసనా ... అపి=) దిగంబరులైన జైనులు సమాధానము చెప్పవచ్చును. (ఇత్యాశంక్య=) అనియూహించి (అనేన సూత్రేణ=) యీసూత్రము చేత (బ్ర. సూ. II-2.౩౫) (ఉత్తరం=) నందులకు సమాధానము (ఉచ్యతే=) చెప్పఁబడుచున్నది.

ఈసందర్భములో సంతాన (=ప్రవాహ) మనునది వస్తు వగునా కాదా యని విచారించవలసియున్నది.

(1) సంతానస్య తావ దవస్తుత్వే నైరాత్మ్యవాదప్రసంగః.

(1) (తావత్ =) మొదట (సంతానస్య=) సంతాన మనునది వస్తువు కాదను కొనుపక్షమున (నైరాత్మ్యవాద ... ప్రసంగః=) 'ఆత్మయే లేదు' అని చెప్పు శూన్యవాదము తటస్థించును ('ఆత్మ' యనఁగా నొకస్థిరమైనవస్తువే యగును గదా- సంతాన (=ప్రవాహ) మను నాత్మ మొదట వస్తువే గానిచో- అనఁగా 'ఉన్నదియే' గానిచో 'ఆత్మ లేదు' అని చెప్పినట్లె యగునని భావము)

(2) వస్తుత్వే ప్యాత్మనో వికారాదిదోషప్రసంగాత్.

(2) సంతాన మనునది (వస్తుత్వేऽపి =) వస్తువే యని తెలంచుపక్షమున (వికారా ... సంగాత్ =) వికారాదిదోషములు- అనఁగా ఘటపటాదివస్తువులకువలె జన్మాదిదోషములు గలది యని చెప్పవలసివచ్చును.

(అట్టిసందర్భములో ఆత్మ (=జీవుఁడు) అనిత్య మగుటచే మోక్ష మన్నది సిద్ధించుట కవకాశము లేదు.)

అస్య పక్షస్యానుపపత్తిః.

కాఁబట్టి (అస్య పక్షస్య=) ఈజైనులవాదమునకు (అనుపపత్తిః=) నుపపత్తి (ఒప్పుఁదగినహేతువు లేదు.

36 సూత్రావతారిక :— దేహపరిమాణమునుబట్టి జీవపరిమాణము మాఱుచుండునని చెప్పఁబడిన జైనసిద్ధాంతముపై వచ్చువిరోధము (=దోషము) లోఁగడి సూత్రమం దుదుఁ జెప్పఁబడినది. మఱియొకదోషము (=విరోధము) పైరీతిని సంభవింపఁ గలదని యీ ౩౬ సూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౩౬ సూ॥ అంత్యావస్థితే శ్చోభయనిత్యత్వా దవిశేషః

ప॥ వి॥ అంత్యావస్థితేః – చ – ఉభయనిత్యత్వాత్ – అవిశేషః

ప ॥ వ॥ అ॥ అంత్యావస్థితేః – అంత్య = కట్టకడపటియవస్థయం దుండు దానికి; అవస్థితేః = నిత్యత్వ ముండుటవలన; చ = కూడ; ఉభయనిత్యత్వాత్; ఉభయ = మిగిలిన రెండవస్థయం దుండునవియు; నిత్యత్వాత్ = నిత్యమే గావలసి వచ్చుట వలన; అవిశేషః = భేద మేమియును లేదు.

సూత్రార్థము :— అంత్యమం దుండుదానికి నవస్థితి (= నిత్యత్వము) యంగీకరించుటవలన – కూడ – తక్కిన రెండును నిత్యములే గావలసివచ్చుటచే – (మూటియం దుండుదేనికిని) భేదము లేదు. (అనగా– అన్నియు నొకవిధముగానే యుండును.)

సూత్రతాత్పర్యము :— (చ) మఱియును (అంత్యావస్థితేః అంత్యావస్థ– అనగా మోక్షావస్థయం దుండుజీవపరిమాణమునకు నిత్యత్వమును జైను లంగీకరించుటవలన (ఉభయనిత్యత్వాత్) ఆద్యమధ్యమావస్థలయం దుండు జీవపరిమాణములకుగూడ నిత్యత్వమే చెప్పవలసివచ్చుటచే (అవిశేషః=) ఏదోయొకశరీరపరిమాణమే జీవునకు జెప్పవలసియుండునుగాని జీవపరిమాణములో భేద మేమియును జెప్పదగదు (అనగా దేహపరిమాణమునుబట్టి జీవపరిమాణము మాఱుచుండునని యెంతమాత్రము చెప్పదగదని భావము)

కాబట్టి యార్హతులని పిల్వబడుజైనులయొక్క మత మెంతమాత్రమును శ్రేయస్కాములచేత నాదరింపబడదగినది గాదు.

భాష్యము — భాష్యార్థము

అపి చాంత్యస్య మోక్షావస్థాభావినో జీవపరిమాణస్య నిత్యత్వ మిష్యతే జైనైః తద్వత్ పూర్వయోర ప్యాద్యమధ్యమయో ర్జీవపరిమాణయో ర్నిత్యత్వప్రసంగా దవిశేష ప్రసంగ స్స్యాత్: ఏకశరీరపరిమాణతైవ స్యాత్ నోపచితాపచితశరీరాంతరప్రాప్తిః.

(అపిచ=) మఱియును– అనగా లోగడిసూత్రమందు జెప్పబడిన యాక్షేపణమేగాక మఱియొకటియు గలదు– అదేమన— (అంత్యస్య= మోక్షా... వినః=) అంత్యావస్థ= అనగా మోక్షావస్థయం దుండు (జీవ .... ణస్య=) జీవపరిమాణమునకు (జైనైః=) జైనమతస్థులచేత (నిత్య ... ష్యతే=) నిత్యత్వ మంగీకరింపబడుచున్నది. (తద్వత్=) అట్లే (పూర్వయోః=) ఆమోక్షావస్థకు బూర్వమం దుండు

(ఆద్య ... మయోః=) మొదటినడిమిదగు వస్థలకు సంబంధించిన (జీవ ... ణయోరపి=) జీవపరిమాణములకుఁగూడ (నిత్యత్వప్రసంగాత్=) నిత్యత్వమే చెప్పవలసి వచ్చునుగావున (అవిశే ... స్స్యాత్=) ఆమూఁడవస్థలం దుండు జీవపరిమాణములకును భేద మేమియు నుండఁజాలదని చెప్పుటయే సరిగా నుండును. అప్పుడు జీవునకు (న + ఉపచి ... రప్రాప్తిః=) మఱియొక యెక్కువశరీరము తక్కువ శరీరము తటస్థించక (ఏక ... త్రైవ స్యాత్ =) యెల్లప్పుడును నొకవిధమైన శరీరపరిమాణమే యుండుట నిశ్చయమై జైనసిద్ధాంతమునకు భంగము కలుగును. (అంత్యశబ్దమునకు మోక్షావస్థయం దుండు జీవపరిమాణము-అనియర్థము చెప్పఁబడిన దని గ్రహించునది.

అథవా

లేక సూత్రమునకు మఱియొకవిధముగా నర్థము చెప్పవచ్చును- అదెట్లన —

అంత్యస్య జీవపరిమాణ స్యావస్థితత్వాత్. పూర్వయోర వ్యవస్థయో రవస్థితపరిమాణఏవ జీవ స్స్యాత్. తత శ్చావిశేషేణ సర్వదై వాణు ర్మహాన్ వా జీవోఽభ్యుపగంతవ్యో న శరీరపరిమాణః.

(అంత్య .... తత్వాత్ =) జీవుని యంత్య (=కడపటి స్థితియొక్క- పరిమాణము నిత్యమైనదగా నుండుటవలన (పూర్వ .... స్థయోః =) పూర్వమందలి యాద్యమధ్యమస్థితులలోనైతము (జీవః =) జీవుఁడు (అవస్థి .... ణఏవ=) నిత్యమైనయొంకటి పరిమాణముగలవాఁడే (స్యాత్ =) కావలసియుండును. (తతశ్చ=) అప్పుడు (అవిశేషేణ=) ఎట్టిభేదమును లేకుండఁగనే (సర్వదా + ఏవ=) యన్నియవస్థలలోఁగూడ (అణుర్మహాన్ వా జీవః =) అణువుగానో మహత్తుగానో జీవుఁ డొకేపరిమాణము గలవాఁడుగా నుండవలయునుగాని (న + శరీరపరిమాణః=) శరీరమునుబట్టి మార్పులు చెందుపరిమాణములు గలవాఁడై యుండుటకు వీలు లేదు.

(సూత్రమునకుఁ జెప్పిన యీపై రెండవయర్థములో 'అంత్య' శబ్దమునకు 'జీవుని కట్టకడపటి పరిమాణము' అనియర్థము చేయఁబడినది. మొదటియర్థమునకును ఈరెండవయర్థమునకును భేదము 'అంత్య' శబ్దార్థమందు మాత్రమే- రెండర్థములలోను జీవపరిమాణము నిత్యమేయని యొప్పుకొనఁబడుచున్నందున- నిత్యమైన దెల్లప్పుడును నొకటిగానే యుండవలసియుండుటచే బూర్వమధ్యమావస్థలయం దుండు జీవపరిమాణములునైతమెట్టిభేదమును బొందక సమానముగానే యుండితీరవలయుననియు శరీరములనుబట్టి జీవపరిమాణము మాఱుచుండు నని చెప్పుట సరిగాదనియును భావము)

అతశ్చ సౌగతవ ద్బాహ్యతమపి మత మసంగత మిత్యుపేక్షితవ్యమ్.

(అతశ్చ=) కాఁబట్టి (సౌగతవత్=) బౌద్ధమతమువలె (ఆర్హతమపి మతం=) ఆర్హతు లైన జైనులమతముగూడ (అసంగతమితి=) నసందర్భమైనదేయని (ఉపేక్షితవ్యమ్=) నిరాకరింపఁబడవలసియున్నది.

## పత్యు రసామంజస్యాధికరణము (సూ॥ 37 నుంచి 41 వఱకు)

7. అధికరణావతారిక :- భోక్తలలవారైన జైనులమతము పూర్వాధికరణమందు ఖండింపఁబడినది జడలు పెంచుకొనువారైన పాశుపతుల యొక్క మతమీయధికరణమందు ఖండింపఁబడుచున్నయది. ఈపాశుపతమతస్థులు 'నిమిత్తకారణము' 'ఉపాదానకారణము' అనునీరెండు కారణములను నొకపదార్థమునందే యుండఁజాలవని యెంచి, యీశ్వర - ప్రధాన - జీవు - లనెడివ్యక్తిభేదములను గల్పించి జీవులయొక్క ప్రయోజనమునకై ప్రధానము నధిష్ఠించి - అనఁగాఁ బ్రేరేపించి, ప్రధానముం దీజగత్సృష్టిని నీశ్వరుఁడు చేయుచున్నాఁడని చెప్పుదురు. కొంచెమెచ్చుతగ్గుగా సేశ్వరసాంఖ్యులును, పాతంజలయోగులును, తార్కికవైశేషికులను నిట్లే చెప్పుదురు. ఈపాశుపతులకుఁ బాశుపతాగమము ప్రమాణము. ఈపాశుపతులను శైవులును-ఇంక మఱికొందఱును మాహేశ్వరు లని చెప్పఁబడువారిలోఁ జేరినవారే. వారిలో వారికి నాచారభేదములుమాత్రము గల వందురు.

పాశుపతమతసిద్ధాంతానుసారము వ్యక్తులు 3 (సర్వగతులు - నిరవయవులు-అనంతులు).

ఈశ్వరుఁడు (పశుపతి) (సర్వజ్ఞుఁడు) (ప్రధానపురుషుల కధిష్ఠాత=పరిపాలకుఁడు ప్రేరకుఁడు) (జగత్తునకు నిమిత్తకారణము)

ప్రధానము (రూపాదిహీనము - అవ్యక్తము) (జగత్తున కుపాదానకారణము) (పురుషులకు భోగ్యము=సంసారము)

(పురుషులు (=జీవులు=పశువులు) (భోక్తలు-సంసారులు) (బంధయుక్తులు-మోక్షార్హులు)

పాశుపతమతస్థులముఖ్యసిద్ధాంతము

ఈశ్వరుఁడు ప్రధానపురుషుల కధిష్ఠాతగా నుండి పురుషార్థము ప్రధానమునందు జగత్సృష్టిని జేయుచుండుటచే జగత్తునకుఁ గేవలనిమిత్తకారణము.

ఈవిషయము 37-38-39-40 సూత్రములచే ఖండింపఁబడినది.

37 సూత్రావతారిక :— పాంచరాత్రాదులు వాదించుప్రకారము 'జగత్తున కీశ్వరుఁడు కేవలనిమిత్తకారణము గాఁజాలఁ' డను విషయ మీసూత్రముఁదు ఖండింపఁబడు చున్నది.

## 38 సూ॥ పత్యు రసామంజస్యాత్.

ప॥ వి॥ — పత్యుః - అసామంజస్యాత్.

అ॥ క్ర॥ — అసామంజస్యాత్ - పత్యుః

ప్ర॥ వా॥ అ॥ — అసామంజస్యాత్ = యుక్తియుక్తము గాకపోవుటవలనఁ, పత్యుః = (ఈశ్వరుని యొక్క = ఈశ్వరునిదైన) ఈశ్వరుఁడు.

సూత్రార్థము :— సమంజసము గాకపోవుటవలన- ఈశ్వరుఁడు (జగత్తునకు నిమిత్తకారణ మగు ననుట చెల్లదు.)

సూత్రతాత్పర్యము :— (పత్యుః=) పశుపతి యైనయీశ్వరుఁడు జగత్తునకు నిమిత్తకారణ మగునని చెప్పపాశుపతమతము సరిగాదు. ఎందుచేననఁగా

(అసామంజస్యాత్) యుక్తియుక్తము గానందువలననే - పాశుపతమతస్థులనుమానప్రమాణముచేత నీశ్వరుఁ డొకఁ డున్నాఁడని సాధించి, యట్టియీశ్వరుఁడు ప్రధానపురుషుల కధిష్ఠాత (పాలకుఁడు = పైనుండువాఁడు = ప్రేరకుఁడు) గా నుండి జగత్సృష్టికిఁ గారణ మగుచున్నాఁడని చెప్పుచున్నారు- అట్లు చెప్పుట సరిగాదు- ఈశ్వరుఁడు జగత్సృష్టికి నిమిత్తమే యగునన్నచో హీనులు, మధ్యములు, ఉత్తములు ననుభేదములతోఁ బ్రాణులను సృజించుచున్నాఁ డనవలయు నుగదా- అప్పు డీశ్వరుఁడు రాగద్వేషాదిదోషములలోఁ దగుల్కొన్నవాఁడై యందఱు జీవుల వంటివాఁడే- అనఁగా- వాస్తవమున కీశ్వరుఁడు గానివాఁడే యని చెప్పవలసివచ్చును.

భాష్యము — భాష్యార్థము

ఇదానీం కేవలాధిష్ఠాత్రీశ్వరకారణవాదః ప్రతిషిధ్యతే.

(ఇదానీం=) ఈయధికరణమందు (కేవలా ... వాదః=) ఈశ్వరుఁ డీజగత్సృష్టికిఁ గేవల మధిష్ఠాన (ప్రేరక) కారణ మగు ననువాదము (ప్రతిషిధ్యతే=) ఖండింపఁబడు చున్నది.

తత్ కథ మవగమ్యతే ?

(తత్ =) అట్లగు ననువిషయము (కథం.) ఎట్లు (అవగమ్యతే=) తెలియఁబడగల దందురేమో

'ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్. (బ్ర॥సూ॥ I- 4_23 ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్ )

ప్రతిజ్ఞ దృష్టాంతములను బట్టి చూడఁగా ఈశ్వరుఁడు జగత్తునకు (ప్రకృతిశ్చ=) నిమిత్తకారణము- ఉపాదానకారణము రెండును నగును.'

అభిధ్యోపదేశాచ్చ (బ్ర॥సూ॥ I- 4_24 అభిధ్యోపదేశాచ్చ)

'సృష్టికై బహుస్వరూపము లగుదును' అనుటమూలముగా 'అభిధ్యను = తలయిమ్పమును' ఉపదేశించుటవలన నీశ్వరుఁడు జగత్తునకు నుపాదానకారణ మగును.

ఇత్యత్ర ప్రకృతిభావే నాధిష్ఠాతృభావేన చోభయస్వభావ స్యేశ్వరస్య స్వయమే వాచార్యేణ ప్రతిష్ఠాపితత్వాత్.

(ఇత్యత్ర=) అనునీలోఁగడి సూత్రములచేత (ఈశ్వరస్య=) నీశ్వరుఁడు జగత్తునకు (ప్రకృతిభావేన=) నుపాదానకారణము (అధిష్ఠాతృభావేన చ=) ప్రేరకుఁడైన నిమిత్తకారణము (ఉభయస్వభావస్య=) రెండుకారణములును నగునని (స్వయమేవ=) స్వయముగానే (ఆచార్యేణ) సూత్రకారుఁడైనవ్యాసాచార్యులచేత (ప్రతిష్ఠాపితత్వాత్ = నిశ్చయింపఁబడియుండెనుగదా. (ఉపాదానకారణమనఁగా- కుండకు మృత్తువంటిది నిమిత్తకారణ మనఁగా- కుండకుఁ గుమ్మరివంటిది.)

యది పున రవిశేషే ణేశ్వరకారణవాదమాత్ర మిహ ప్రతిషేదేత్. పూర్వోత్తరవిరోధా ద్వ్యాహతాభివ్యాహార స్సూత్రకార ఇత్యేత దాపద్యేత.

(అవిశేషేణ=) ఎట్టివిశేషమును (= భేదమును) జూపకుండ (ఇహపునః=) నీసూత్రమం దిప్పుడు (ఈశ్వరకారణవాదమాత్రం=) జగత్తున కీశ్వరుఁడు కారణ మగుటను (యదిప్రతిషేధేత్ =) నిరాకరించుచో- అనఁగా- ఈశ్వరుఁడు జగత్తునకుఁ గారణము గాదని యీసూత్రమందు మఱల నిప్పుడు చెప్పుచోఁ (పూర్వో ... ధాత్ =) పూర్వము చెప్పినదానికి నిప్పుడు చెప్పినదానికి విరోధము తటస్థించి (సూత్రకారః=) సూత్రకర్త యైనవ్యాసాచార్యుడు (వ్యాహతాభివ్యాహారః+ ఇతి =) కొట్టఁబడినపల్కులు గలవాఁడు- అనఁగా- అవిశ్వసనీయసంభాషణముచేయు వాఁడను (ఏతత్ =) దూషణము (ఆపద్యేత=) సంభవించును.

తస్మా 'దప్రకృతి,రధిష్ఠాతా కేవలం నిమిత్తకారణ మీశ్వరః' ఇత్యేష పక్షో వేదాంతవిహిత బ్రహ్మైక్యప్రతిపక్షత్వా ద్యత్నే నాత్ర ప్రతిషిధ్యతే.

(తస్మాత్ =) కాఁబట్టి '(ఈశ్వరః=) ఈశ్వరుఁడు (అధిష్ఠా ... కారణం=) ప్రేరేపించునట్టి కేవలనిమిత్తకారణ మగునేగాని (అప్రకృతిః=) ఉపాదానకారణము మాత్రము కాఁడు (ఇత్యేష పక్షః=) అనునీ పాశుపతాదులవాదము (వేదాంత ... పక్షత్వాత్ =) వేదాంతవం లగునుపనిషత్తులు బోధించుబ్రహ్మైకత్వ (అంతయు నొకబ్రహ్మమే - యను) వాదమునకు వ్యతిరేకమైనందున, (అత్ర=) యిప్పుడు అనఁగా నీసూత్రమందు (యత్నేన=) పట్టుదలతో (ప్రతిషిధ్యతే=) ఖండింపఁబడు చున్నది.

సా చేయం వేదబాహ్యేశ్వరకల్పనా౽నేకప్రకారా.

(సా చే ... కల్పనా=) ఉపనిషత్తులు బోధించునీశ్వరునికంటె - (అనఁగా - జగత్తునకు నిమిత్తోపాదానోభయ కారణ మగునని బోధించునీశ్వరునికంటె) భిన్నుఁ డగునీశ్వరుఁ డున్నాఁడని చెప్పనాయీకల్పన (అనేకప్రకారా=) బహువిధములుగా నున్నది (అనఁగా - ఇట్టియీశ్వరునిగూర్చి పెక్కురు పెక్కువిధములుగాఁ జెప్పు చున్నారని భావము)

కేచి త్తావత్ సాంఖ్యయోగవ్యపాశ్రయాః కల్పయంతి "ప్రధానపురుషయో రధిష్ఠాతా కేవలం నిమిత్తకారణ మీశ్వరః. ఇతరేతరవిలక్షణాః ప్రధానపురుషేశ్వరా" ఇతి.

(తావత్ =) ఆబహువిధము లెట్టివనఁగా - (సాంఖ్య .... శ్రయాః=) కపిలుని సాంఖ్యమతమును, పతంజలియొక్క యోగమతమును నవలంబించినవారైన (కేచిత్ =) కొందఱు-అనఁగా- సేశ్వరసాంఖ్యులును (ఈశ్వరుఁడు లేఁడని చెప్పువారు గాక, ఈశ్వరుఁ డొకఁడున్నాఁడని యొప్పుకొనుసాంఖ్యులు) పాతంజలయోగులును "(ఈశ్వరః) ఈశ్వరుఁడన్నవాఁడు (ప్రధాన... ష్ఠాతా=) ప్రధానమును పురుషుని (=జీవుని) ప్రేరేపించువాఁడును (కేవ ... రణం=) జగత్తునకుఁ గేవలము నిమిత్త (=efficient) కారణమును అగుననియును "(ప్రధాన ... శ్వరాః ) ప్రధానము- జీవుఁడు - ఈశ్వరుఁడు ననుమువ్వురును (ఇత ... క్షణాః =) అన్యోన్యవిలక్షణ స్వభావము గలవారనియును జెప్పుదురు.

మాహేశ్వరాస్తు మన్యంతే కార్య కారణ, యోగ విధి. దుఃఖాంతాః పంచ పదార్థాః పశుపతినేశ్వరేణ పశుపాశవిమోక్షా యోపదిష్టాః. పశుపతి రీశ్వరో నిమిత్తకారణ మితి.

(మాహేశ్వరాస్తు =) ఈయధికరణమందు విమర్శింపఁబడుచున్న మాహేశ్వరు లన్ననో "పశుపాశవిమోక్షాయ=) జీవుల యొక్క బంధవిముక్తికొఱకు (పశుపతి ... ... రేణ.= జీవప్రభు వైనయీశ్వరునిచేత (కార్య ... ... ఖాంతాః=)

(1) కార్యము=మహదాదిక మనుప్రధానముయొక్క వికారము (effect) (2) కారణము = ఈశ్వరుఁడును, బ్రధానమును (3) యోగము = సమాధి (4) విధి = త్రికాలస్నానాద్యాచారములు (5) దుఃఖాంతము= మోక్షము–అను (పంచపదార్థాః=) ఐదుపదార్థములు (ఉపదిష్టాః=) ఉపదేశింపఁబడిన వనియును" "(పశు .... రీశ్వరః=) అజీవపరిపాలకుఁడే యీశ్వరుఁడనియును." "(నిమి ... రణం + ఇతి=) అయీశ్వరుఁడే జగత్తునకు నిమిత్తకారణ మనియును" (మన్యంతే=) తలంచుచున్నారు.

తథా వైశేషికాదయోఽపి కేచిత్ కథంచిత్ స్వప్రక్రియానుసారేణ నిమిత్తకారణ మీశ్వరం వర్ణయంతి.

(తథా=) అట్లే (వైశే ... కేచిత్=) పరమాణుకారణవాదులని చెప్పఁబడు వైశేషికులలోఁ గొందఱు "(స్వప్ర... రేణ=) తమమతసిద్ధాంతముల కనుసారముగా (నిమిత్త ... శ్వరం=) నీశ్వరుఁడు జగత్తునకు నిమిత్తకారణ మగునని (వర్ణయంతి) వర్ణించుచున్నారు.

అత ఉత్తర ముచ్యతే.

(అతః=) కాఁబట్టి ప్రస్తుతము మాహేశ్వరులనే ముఖ్యముగా నుద్దేశించినప్పటికి 'ఈశ్వరుఁడు జగత్తునకు నిమిత్తకారణమేయగు' నని వాదించు పైనఁదెలుపఁబడిన సర్వమతములయొక్క ఖండనమునకు సరిపోవురీతిగా (ఉత్తర ముచ్యతే=) నీమొదటి సూత్రముచేతఁ బ్రత్యుత్తరము చెప్పఁబడుచున్నది చూడుఁడు.

పత్యురసామంజస్యాదితి.

(పత్యు ... స్యాదితి=) ఈసూత్రమున కర్థ మేమనఁగా—

పత్యు రీశ్వరస్య ప్రధానపురుషయో రధిష్ఠాతృత్వేన జగత్కారణత్వం నోపపద్యతే.

(పత్యు ... రీశ్వరస్య=) ప్రభువైనయీశ్వరుఁడు (ప్రధాన... తృత్వేన=) ప్రధానమునకును జీవునకును బ్రేరేపకుఁడుగా నుండుటనుబట్టి (జగత్కారణత్వం=) జగత్తునకు నిమిత్తకారణము కాఁగలఁడనుట (న + ఉపపద్యతే=) యుక్తియుక్తము గాదు

కస్మాత్ ?

(కస్మాత్=) ఎందుచే నందురేమో ?

అసామంజస్యాత్.

(అసా... స్యాత్ =) అట్లనుట యసమంజసము- అనఁగా యుక్తముగానందు వలననేసుమా ! అని సూత్రమే సమాధానము చెప్పుచున్నది.

కిం పున రసామంజస్యమ్ ?

(కిం పున ... జస్యం=) అసమంజసము- అనఁగా యుక్తము గాకపోవుట యెట్టిది యని ప్రశ్నింపవచ్చును వివరించెదము చూడుఁడు.

(1) హీనమధ్యమోత్తమభావేన హీనప్రాణిభేదాన్, విదధత ఈశ్వరస్య రాగద్వేషాది ప్రసక్తే రస్మదాదివ దనీశ్వరత్వం ప్రసజ్యేత.

(1) ఈశ్వరుఁడే జగత్తునకుఁ గేవలము నిమిత్తకారణమని యెంచుచో (హీన ... భేదాన్=) జగత్తులోని ప్రాణులను గొందఱిని హీనులుగాను, మఱికొందఱిని మధ్యములుగాను, మఱికొందఱిను త్తములుగాను- ఇట్లు వివిధభేదములతో (విద ధతః=) సృజించుచున్నాఁడని చెప్పఁబడు (ఈశ్వరః=) నీశ్వరుఁడు (అస్మదాదివత్= సామాన్యజీవుల మఱుమనవలెనే (రాగ .... సక్తేః =) రాగము (= అనురాగము) ద్వేషము (=అనిష్టము) మొదలగు పక్షపాతాదిదోషములు గలవాఁడేయని చెప్ప వలసివచ్చుటచేత (అనీశ్వ ... జ్యేత=) నాయీశ్వరుఁడు వాస్తవమున కీశ్వరుఁడు గాఁజాలకపోవుటయే తటస్థించును.

(2) ప్రాణికర్మాపేక్షత్వా దదోష ఇతిచే న్న.

(2) (ప్రాణి ... క్షత్వాత్=) ప్రాణులను వివిధభేదములతో సృజించుట వారివారికర్మానుసారముగా జరుగుచున్నందున (అదోషః=) ఈశ్వరునియం దట్టి పక్షపాతాదిదోష మారోపింపఁబడఁదగదు - (ఇతి చేత్ =) అని సమాధానము చెప్పుదురేమో- (న=) అట్టిసమాధానమున కవకాశము లేదుసుమా.

(అనఁగాఁ బ్రాణులయొక్క కర్మములు జడము లగుటవలన నవి ప్రేరేపింపఁ గలవని చెప్పుటకు వీలు లేదు. కాఁబట్టి యీశ్వరుఁడు సృష్టికినిమిత్తకారణమని యెంచుచో నతనియందుఁ బక్షపాతాదిదోషము లేదనుట కవకాశము లేదు- అని భావము )

కర్మేశ్వరయోః ప్రవర్త్య ప్రవర్తయితృత్వే ఇతరేతరాశ్రయదోషప్రసంగాత్.

(కర్మే ... తృత్వే=) ప్రాణులకర్మము- ఈశ్వరుఁడు- అనునీరెండును- వానిలో నొకటి యగుకర్మము ప్రవర్త్యము- అనఁగా నీశ్వరునిచేఁ బ్రవర్తింపఁ

జేయఁబడునది- మఱియొకటి యగునీశ్వరుఁడు ప్రవర్తయిత- అనఁగాఁ బ్రాణికర్మములను బ్రవర్తింపఁజేయువాఁడు ననిగదా మీయభిప్రాయము- ఇట్లగుచోఁ (ఇతరే ... సంగాత్ =) అన్యోన్యాశ్రయదోషము సంభవించి మీసమాధానము నిస్సారమైపోవును- అనఁగాఁ బ్రాణికర్మములమీఁద నీశ్వరుఁ డాధారపడియున్నాఁడు- ఈశ్వరునిమీఁదఁ బ్రాణికర్మము లాధారపడియున్నవి యని చెప్పినట్లగును- ఇది యొకదోషముగాదా ? ఆరెంటిలో నేదియు ను స్వతంత్రమైనది గాక యొకదానిపై మఱియొకటి యాధారపడియుండును (న=) ఇట్టిసందర్భములో నీశ్వరుఁడు స్వాతంత్ర్యముగా సృష్టికి నిమిత్తకారణము గాఁజాలఁడని చెప్పినాము సుమీ !

(అనఁగాఁ గర్మములు జడములైనందున నీశ్వరుని బ్రేరేపింపఁజాలవు- ఈశ్వరుఁడు స్వాతంత్ర్యుఁడు గానందున సృష్టిఁజేయఁజాలఁడు- అస్వాతంత్ర్యులైనయిర్వురొకరికి నొకరు సాయపడఁజాలనందున నీశ్వరునిచే సృష్టి చేయఁబడఁజాలదని భావము)

(3) అనాదిత్వా దితిచే న్న.

(అనాది ... చేత్ =) పరస్పర ప్రేరకములైనప్రాణికర్మములును- ఈశ్వరుని విషమసృష్టియును నొకనాఁటివి గాక యనాదినుండి వచ్చుచున్నవిగావున నారెంటికిని నన్యోన్యాశ్రయదోషము సంభవింపదని యందురేమో ! (న=) అట్లు చెప్పుటకు వీలులేదు. (అనఁగా నట్లుచెప్పినను నన్యోన్యాశ్రయదోషము వచ్చియేతీరునని భావము)

వర్తమానకాలవ దతీతేష్వపి కాలే ష్వితరేతరాశ్రయదోషావిశేషా దంధపరంపరా న్యాయాపత్తేః.

ప్రాణికర్మములు- ఈశ్వరసృష్టి- యనునీరెండును (వర్త ... కాలేషు=) ప్రస్తుతకాలమందెట్లో జరిగిపోయినకాలమందుసైత మట్లే (ఇతరే ... శేషాత్ =) యేదియును స్వతంత్రమైనది గాక యొకదానిపై మఱియొకటి తప్పనిసరిగా నాధారపడియున్నవని చెప్పవలసివచ్చు దోషము (=లోపము) హెచ్చుతగ్గులు లేక యెల్లప్పుడును నొకటిగానే యుండుటవలన (అవిశేషాత్ =)- ఆరెంటికిని- అనఁగాఁ బ్రాణికర్మములు- ఈశ్వరవిషమసృష్టి యనునీరెంటికిని (అంధ .... పత్తేః=) అంధపరంపరాన్యాయమే సంభవించును. (అనఁగా- ఒకగ్రుడ్డివానిని- మఱియొకగ్రుడ్డివాఁడు, వీనిని వేఱొకగ్రుడ్డివాఁడు- వీని నింకొకగ్రుడ్డివాఁడు- ఇట్లు పరంపరగా లాగుకొని పోవుచున్నారని చెప్పినట్లగును. వారిలో నేఁడును స్వాతంత్ర్యుఁడు గాఁడు ఎవఁడును మార్గ మెఱిఁగినవాఁడు గాఁడు-

(అనఁగాఁ– ప్రాణులవివిధకర్మములును, ఈశ్వరునివిషమసృష్టియును ననాదిగా వచ్చుచున్న వేయైనను బూర్వపూర్వకర్మములకు ఫలముగా నుత్తరోత్తరకర్మములను బ్రాణుల కీశ్వరుఁ డిచ్చుచున్నాఁడని యెంచినను నివ్వి డెట్లో జరిగినకాలమందు సైతము మల్లే యొకటిపై మఱియొకటి యాధారపడియున్నట్లే యంగీకరించవలసియున్నదిగావున నన్నికాలములయందును నీయన్యోన్యాశ్రయదోష ముండియే తీరును. కర్మములు– జడములు, ఈశ్వరుఁ డస్వతంత్రుఁ డగుటనుబట్టి యంధపరంపరాన్యాయము తగిలియే తీరును. కాఁబట్టి యీదోషములను దప్పించుకొనవలెనన్నఁ బ్రాణికర్మములమీఁద నాధారపడకయే యీశ్వరుఁడు విషమసృష్టిని జేయుచున్నాఁడనియు నొప్పుకొనవలసియున్నది. కాఁబట్టియే మీవాదము యుక్తియుక్తము గాదని చెప్పినారమని భావము.)

(4) అపిచ ప్రవర్తనాలక్షణా దోషా ఇతి న్యాయవిత్సమయః.

(అపిచ = మఱియును (ప్రవర్త .... దోషాః=) దోషములు– అనఁగా రాగద్వేషాదిదోషములు ప్రవర్తింపఁజేయుటయే లక్షణముగాఁ గలవి– అనఁగాఁ బ్రవర్తనము గల్గునది రాగద్వేషాదిదోషములవలననే– (ఇతి) అని (న్యాయవిత్సమయః=) నైయాయికసిద్ధాంత మొకటి యున్నది. (న్యా. సూ. I–1–18)

నహి కశ్చి దదోషప్రయుక్తః స్వార్థే పరార్థే హి ప్రవర్తమానో దృశ్యతే.

(కశ్చి ... యుక్తః=) దోషముతోఁ గూడుకొననివాఁ డెవఁడును (స్వార్థే... ర్థే వా) దనప్రయోజనమునకై గాని యితరులప్రయోజనమునకై గాని (ప్రవర్త... దృశ్యతే=) ప్రవర్తించుట కానఁబడదు. (అనఁగా– ఈశ్వరుఁడైనను మనవలెనే ప్రవర్తించుచున్నాఁడని యంగీకరించవలసివచ్చునని భావము.)

స్వార్థప్రయుక్తఏవ చ సర్వో జనః పరార్థేపి ప్రవర్తతే.

(సర్వోజనః=) ప్రతిమనుష్యుఁడును (స్వార్థ .... ఏవచ=) స్వప్రయోజనమును– అనఁగా స్వలాభమును గోరినవాఁడై సుమీ (పరా .... ర్తతే=) అన్యప్రయోజనమునకై ప్రవర్తించుచుండును. (స్వలాభాపేక్ష లేనిది యన్యలాభమునకై పాటుపడుట లేదని భావము.)

ఇత్యేవమ ప్యసామంజస్యమ్.

(ఇత్యేవం=) ఇట్లగుటచేఁగూడ 'ఈశ్వరః మిత్తకారణత్వము' అసమంజసమే– అనఁగా యుక్తియుక్తము గాదనిదియే యగుచున్నది.

స్వార్థవత్త్వా దీశ్వర స్యానీశ్వరత్వప్రసంగాత్.

(స్వార్థ ... శ్వరస్య=) ఈశ్వరుఁ డను వానికి సృష్టికార్యమందు స్వప్రయోజనము గలదని చెప్పుటచేత (అనీశ్వ ... సంగాత్=) వాస్తవమున కాతఁ డీశ్వరుఁడు గాఁడనియే చెప్పవలసివచ్చును.

(5) పురుషవిశేషత్వాభ్యుపగమా చ్చేశ్వరస్య పురుషస్య చౌదాసీన్యాభ్యుపగమా దసామంజస్యమ్.

(5) (పురుష ... గమాచ్చ ఈశ్వరస్య=) ఈశ్వరుఁ డను వాఁ డెట్టిదోషముల చేతను నంటువడని యొకమహాపురుషుఁడని (పాతంజలయోగులు) యంగీకరించుచున్నా రనుకొన్నను— అప్పటికిని— అనఁగా— నట్టిసందర్భములోను— (పురుషస్య చౌదాసీన్యాభ్యుపగమాత్ =) మహాపురుషుఁడని చెప్పఁబడునాయీశ్వరుఁడు (సృష్టికి నిమిత్తకారణమై) సృష్టిప్రవర్తకుఁడుగా నున్నాఁడనియును (దోషములచే నంటువడని మహాపురుషుఁడై) సృష్టి చేయక యుదాసీనుఁడుగా నున్నాఁడనియును జెప్పిన ట్లగును గావున (అసామంజస్యం=) అట్లు చెప్పినను బరస్పరవిరుద్ధమై యసమంజసమే- అనఁగా యుక్తియుక్తము గాకపోవుటయే యగునుసుమా.

38 సూత్రావతారిక :— పశుపతిమతస్థులు చెప్పుచొప్పున నీశ్వరుఁడు ప్రేరకుఁడుగా నుండి జగత్తునకుఁ బ్రకృతిపురుషు ద్వారమునఁ గేవలనిమిత్తకారణ మగునని చెప్ప వలనుపడదని లోఁగడిసూత్రమందు నిరూపింపఁబడినది. ప్రధాన పురుషులకును నీశ్వరునకును నెట్టిసంబంధమైనను నుండునని చెప్పుట కవకాశము లేనందునఁ బ్రధానపురుషులకుఁ బ్రేరకుఁడై జగత్తునకు నిమిత్తకారణ మగుచున్నాఁ డనువాద మీసూత్రమందుఁ బరిహరింపఁబడుచున్నది.

## 39వ సూ॥ సంబంధానుపపత్తేశ్చ.

ప॥ వి॥ — సంబ ధానుపప త్తేః — చ

ప్ర॥ ప॥ అ॥ — సంబంధ... పత్తేః; సంబంధ = సంబంధము; అనుపపత్తేః = సందర్భింపకపోవుటవలనను, చ = కూడ.

సూత్రార్థము :— (ఈశ్వరునకును బ్రధానపురుషులకును) సంబంధము సందర్భింపకపోవుటవలననుగూడ (ఈశ్వరుఁడు నిమిత్తకారణము కాఁజాలఁడు)

సూత్రతాత్పర్యము : — (సంబంధానుపపత్తేశ్చ) ప్రధానపురుషేశ్వరులు ముగ్గురును సమానముగా సర్వగతులు నిరవయవులు నని చెప్పుటవలన నీశ్వరునకును

ప్రధానపురుషులకును నడుమ సంయోగలక్షణ (=వస్తువునకును వస్తువునకును మధ్య నుండునట్టువంటి) సంబంధముగాని, ప్రధానపురుషు లిరువురును నీశ్వరుఁ డనెడి కారణమునుండి పుట్టిన కార్యద్రవ్యము లు (అనఁగా నూలునుండి పుట్టినవస్త్రములవంటివి) గానివి యగుటచేఁ బరస్పరము ధర్మధర్మిభావము (అనఁగా నొకటి ధర్మము– రెండవది ధర్మము గలది యనుభావము) లేకపోవుటవలనఁ బ్రధానపురుషులకును నీశ్వరునకును మధ్య సమవాయలక్షణ (=ధర్మధర్ములకు అనఁగా- నూలునకును వస్త్రమునకును మధ్యనుండునటువంటి) సంబంధముగాని చెప్పుట కవకాశము లేనిహేతువును బట్టి-ప్రకృతిపురుషుల కీశ్వరుఁ డధిష్ఠాతయై (ప్రేరకుఁడై) సృష్టికి నిమిత్తకారణ మగుచుండు ననుట యెన్నటికిని సంభవింపదు.

భాష్యము — భాష్యార్థము

పునర ప్యసామంజస్య మేవ.

(పునరపి=) మఱియొకహేతువువలనఁ జూచినను, జగత్తున కీశ్వరుఁడు నిమిత్త కారణ మగు ననుట (అసా ... మేవ=) యుక్తియుక్తము గానిదే.

నహి ప్రధానపురుషవ్యతిరిక్త ఈశ్వరోఽన్తరేణ సంబంధం ప్రధానపురుషయో రీశితా.

(ప్రధాన .... రిక్తః=) ప్రధానపురుషులకు భిన్నుఁడైనయీశ్వరుఁడు (అంత ...సంబంధం=) వారితో నేదియో యొకసంబంధ మున్ననేతప్ప (నహి-ప్రధాన ... ఈశితా=)నాప్రధానపురుషులను బరిపాలించువాఁడు (=ప్రేరకుఁడు) గానేరఁడుగదా!

న తావ త్సంయోగలక్షణ స్సంబంధ స్సంభవతి. ప్రధానపురుషేశ్వరాణాం సర్వగతత్వా న్నిరవయవత్వాచ్చ.

(ప్రధాన ... రాణాం=) ప్రధానము- పురుషుఁడు– ఈశ్వరుఁడు– అనునీ ముగ్గురును (పాశుపతమతసిద్ధాంతముల ననుసరించి) (సర్వగతత్వాత్=) సర్వగతులు– అనఁగా నంతటను నిండియుండువారును, (నిరవ ... త్వాచ్చ=) అవయవములు (=భాగములు) లేనివారును- అనఁగా నిస్సంగులను నగుటవలన (సంయో ... బాధః) సంయోగమువంటిసంబంధము– అనఁగా నవయవములు గలిగి కొంత ప్రదేశమునుమాత్రమే యాక్రమించుకొని యుండునొకవస్తువు వేఱొకవస్తువు కలిసి నప్పు డుండునట్టి సంబంధము (న–తావ త్సంభవతి=) సంభవింపదు. ప్రధానపురుషులకును నీశ్వరునకును మధ్య సంభవింపఁజాలదు

నాపి సమవాయలక్షణః ఆశ్రయాశ్రయిభావనిరూపణాత్.

(ఆశ్రి ... పణాత్=) ప్రధానపురుషేశ్వరులలో నొకటి యాశ్రయము-(=ఆధారము) మఱియొకటి యాశ్రయి (=ఆధేయము= ఆధారము గలిగియుండునది) యని నిరూపించుటకు సాధ్యము గానందున- అనఁగా- నూలు-వస్త్రమువలె నుండునవి గానందున, (సమవాయలక్షణః అపి=) వానిమధ్య సమవాయమువంటి సంబంధము (ఆధారాధేయసంబంధము) గూడ (న- సంభవతి =) సంభవింపఁజాలదు. ('నూలు'- ఆధారము; 'వస్త్రము'- ఆధేయము- నూలు లేకుండ వస్త్రము మండఁజాలదు. నూలు- వస్త్రములకు మధ్య నుండునట్టిసంబంధము 'సమవాయసంబంధ'మని చెప్పఁబడును)

నాప్యన్యః కశ్చిత్కార్యగమ్యస్సంబంధశ్శక్యతే కల్పయితుం కార్యకారణభావస్యైవాద్యాప్యసిద్ధత్వాత్.

(అపి=) మఱియును ఈశ్వరునకును ప్రధానపురుషులకును మధ్య (కార్యగమ్యః=) కార్యమైనయీజగత్తునుబట్టి యూహింపఁదగిన (సంబంధః) సంబంధము (అన్యః ... కశ్చిత్=) మఱియొకటి యేదైనను నున్నట్లు (కల్పయితుం=) కల్పించుటకు (న శక్యతే=) శక్యము గాదుసుమా! ఎందుచేతనఁగా (కార్య... ద్ధత్వాత్=) ఈశ్వరుఁడు ప్రేరకుఁడగు కారణముగా నుండుటచేఁ బ్రధానపురుషులనుండి యీ జగత్కార్యము గలుగుచున్నదను విషయ మింతవఱకు మీచే సిద్ధాంతము చేయఁబడియుండ లేదు. (అనఁగా నద్వైతుల మగుమే మొప్పుకొనని యీవిషయమును మీ రింతవఱకు ఋజువుచేసియుండ లేదనిభావము)

బ్రహ్మవాదినః కథ మితిచేన్న, తస్య తాదాత్మ్యలక్షణసంబంధోపపత్తేః.

(బ్రహ్మ ... మితిచేత్=) బ్రహ్మజగత్కారణవాదు లగుమీయద్వైతులు మాత్ర మెట్లావిషయమును ఋజువుచేయఁగలిగియున్నారని యందురేమో! (న=) మాయద్వైతులు ఋజువుచేయువిషయములో నెట్టికష్టమును లేదు. ఎందుచేతనఁగా (తస్య తాదా ... వత్తేః =) మాబ్రహ్మమునకును బ్రకృతికిని దాదాత్మ్య మనెడి సంబంధము (వేదయుక్త్యనుభవముల ననుసరించి 'అదియే యిది' యనిచెప్పుసంబంధము) సరిపోఁగలదు.

అపి చాగమబలేన బ్రహ్మవాదీ కారణాదిస్వరూపం నిరూపయతీతి, నావశ్యం తస్య యథాదృష్టమేవ సర్వ మభ్యుపగంతవ్యమితి నియమోఽస్తి.

(అపిచ=) అంతమాత్రమే గాదుసుమా! (బ్రహ్మవాదీ=) బ్రహ్మజగత్కారణవాదుల మైన మేము (ఆగమబలేన=) వేదప్రమాణాధారముచేత (కార ... స్వరూపం=) బ్రహ్మ మొక్కటియే యీజగత్తునకుఁ గారణము 'బ్రహ్మజగత్తులకుఁ దాదాత్మ్యసంబంధము' అని (నిరూపయతీతి=) నిరూపించుచున్నారముగావున (సర్వం యథాదృష్టమేవ=) సమస్త మెట్లు ప్రత్యక్షమునకుఁ గన్పించుచున్నదో యట్లే (అవశ్యం=) తప్పక సరిగా (అభ్య ... తవ్యమితి=) నంగీకరించితీరవలయునను (నియమః=) నియమము (hard and fast rule) (తస్య=) బ్రహ్మవాదుల మైన మాకు (న+అస్తి=) లేదుసుమా!

పరస్య తు దృష్టాంతబలేన కారణాదిస్వరూపం నిరూపయతో యథాదృష్టమేవ సర్వమభ్యుపగంతవ్యమి త్యయ మస్త్యతిశయః.

(దృష్టాంతబలేన=) వేదప్రమాణ మంగీకరింపక ప్రత్యక్షాద్యనుభవములకుఁ దోఁచుదృష్టాంతములబలముచేత (కారణా ... స్వరూపం=) నీజగత్తునకుఁ గారణమేదియో యను నీమొదలగువిషయములను (నిరూపయతః పరస్య తు=) నిరూపించుటకుఁ బూనుకొన్న (ప్రతిపక్షివైన) నీకన్ననో (= నీకే) ('యథాదృ ... తవ్యమితి=) అనుభవసిద్ధము లగుసిద్ధాంతములనే యంగీకరింపవలయును' అను (అయం అతిశయః=) నీనియమవిశేషము (అస్తి=) గలదుసుమా! (అనఁగా—అనుభవమునకు నీసిద్ధాంతములను సరిపుచ్చి చూపుభారము నీయందే యున్నదని భావము.)

పరస్యాపి సర్వజ్ఞప్రణీతాగమసద్భావాత్, సమాన మాగమబల మితిచేత్_న.

(సర్వజ్ఞ ... వాత్=) సర్వజ్ఞు లనఁదగువారిచేత రచియింపఁబడినయాగమ (=శాస్త్రము) ప్రమాణము (పరస్యాపి=) మాకుసైత మున్నందున (సమాన ... చేత్=) ఆగమప్రమాణబలము మీకును మాకును సమానమే యగునందురేమో. (న=) అట్లనుట కవకాశము లేదు. ఎందుచేతననఁగా—

ఇతరేతరాశ్రయప్రసంగా, దాగమప్రత్యయా త్సర్వజ్ఞత్వసిద్ధిః, సర్వజ్ఞత్వప్రత్యయాచ్చాగమసిద్ధి రితి.

(ఆగమ ... సిద్ధిః=) అట్టిమీమీయాగమములు ప్రమాణములని మీ రంగీకరించుటచే వానిని రచించినవారు సర్వజ్ఞులైనారా, లేక (సర్వజ్ఞ ... సిద్ధిరితి=) వారు సర్వజ్ఞులని యంగీకరించుటచే వారు రచించిన యాగమములు ప్రమాణములైనవా- (ఇతరే ... సంగాత్=) మీ రెట్లు చెప్పినను అన్యోన్యాశ్రయదోషమే

సంభవించును. అనఁగా వారిసర్వజ్ఞత్వముగాని వారియాగమప్రామాణ్యముగాని నిర్ధారితములైన యంశములు గానివై యొకదానిపై మఱియొకటి యాధారపడి యున్నందున మీవాదము నిస్సారము.

తస్మా దనుపపన్నా సాంఖ్యయోగవాదినా మీశ్వరకల్పనా.

(తస్మాత్ =) కాఁబట్టి (సాంఖ్యయోగవాదినాం=) వేదబాహ్యు లగునీశ్వర సాంఖ్యులు పాతంజలయోగులు (ఈశ్వరకల్పనా =) అధిష్ఠానరూపనిమిత్తకారణ మీశ్వరుఁడని చేయుకల్పన (అనుపపన్నా=) సిల్వఁదగినది గాదు.

ఏవ మన్యాస్వపి వేదబాహ్యా స్వీశ్వరకల్పనాసు యథాసంభవ మసామంజస్యం యోజయితవ్యమ్.

(ఏవం=) ఇట్లే అన్యా ... కల్పనాసు=) వేదప్రమాణమునకు విరుద్ధముగా జగత్తున కీశ్వరుఁడు కేవలనిమిత్తకారణమని చెప్పుపాశుపతాద్యన్యమతములనైతము (యథాసంభవం=) సాంఖ్యమతఖండనహేతువులను యథార్థరీతిగాఁ (-తగినట్లుగా, ప్రయోగించి చూచి (అసామంజస్యం=) యుక్తియుక్తములు గావని (యోజయితవ్యం=) తోసివేయఁబడఁ దగియున్నది.

39 సూత్రావతారిక :— ఈశ్వరునకును ప్రధానపురుషులకును మధ్య నెట్టి సంబంధ ముండఁజాలనందునఁ బ్రధానపురుషులకుఁ బేరకుఁడుగా నుండి యీశ్వరుఁడు జగత్తునకు నిమిత్తకారణ మగుచున్నాఁ డనువాదము పూర్వసూత్రమందుఁ బరిహరింపఁబడినది. ఈశ్వరుఁడు ప్రధానపురుషులకుఁ బ్రేరకుఁడుగా నుండుట యసంభవమైనందునఁగూడ జగత్తునకు నిమిత్తకారణ మగుట యుక్తియుక్తము గాదని యీసూత్రమందుఁ జూపఁబడుచున్నది.

## 39 సూ॥ అధిష్ఠానానుపపత్తేశ్చ.

ప॥ వి॥ — అధిష్ఠానానుపపత్తేః - చ

ప్రి॥ ప॥ అ॥ — అధిష్ఠా ... త్తేః; అధిష్ఠాన = అధిష్ఠించుట — ప్రేరేపించుట, అనుపపత్తేః = సంభవముగా నందున, చ = కూడ.

సూత్రార్థము :— (ప్రధానాదులయందు నీశ్వరునకు) ప్రేరణ ముండుట-యసంభవమైనందునఁగూడ- (జగత్తున కీశ్వరుఁడు నిమిత్తకారణము కాఁజాలఁడు )

సూత్ర తాత్పర్యము :— (అధిష్ఠానానుపపత్తేశ్చ) రూపాదిహీనమై ప్రత్యక్షము గాని ప్రధానము నీశ్వరుఁడు జగత్సృష్టికార్యమునకై ప్రేరేపించుచున్నాఁడనుట యసంభవమైనందువలనఁగూడ జగత్తున కీశ్వరుఁడు నిమిత్తకారణమని చెప్పుట యుక్తియుక్తము గాదు. కుండలు మొదలగువానినిర్మాణమునకై కుమ్మరివానిచే నుపయోగింపఁబడుమృత్తు మొదలగువస్తువు రూపాదులు లేనిదియే యగుచో, దానిని కుమ్మరివాఁ డుపయోగించుట సాధ్యపడదుగదా.

భాష్యము — భాష్యార్థము

ఇత శ్చానుపపత్తి స్తార్కికపరికల్పిత స్యేశ్వరస్య.

(ఇతశ్చ=) ఈయుక్తియొక్క హేతువువలనఁగూడ (తార్కి ... శ్వరస్య=) యుక్తివాదు లగుతార్కికులచే జగత్తునకు నిమిత్తకారణముగాఁ గల్పింపఁబడినయీశ్వరుఁ డొకఁ డున్నాఁడనుటయే (అనుపపత్తిః=) సంభవింపదు.

కుంభకార ఇవ మృదాదీని ప్రధానాదీ న్యధిష్ఠాయ ప్రవర్తయేత్.

(మృదాదీని=) కుండలను జేయుటకై మృత్తు మొదలగుపదార్థములయందుఁ (కుంభకారఇవ=) కుమ్మరివాఁ డెట్లు తనవ్యాపారమును సాగించుచున్నాఁడో యట్లే (పరికల్ప్యమానః=) తార్కికులచేఁ గల్పింపఁబడిన యీశ్వరుఁడుగూడఁ (ప్రధా ... ష్ఠాయ=) ప్రధానాదులయందుఁ దనప్రేరణవ్యాపారమును సాగించుట (నహి+ఉపపద్యతే=) సంభవము గాదు.

న చైవ ముపపద్యతే.

(నచై ... ద్యతే=) అది యంగీకరింపఁదగినవిషయము గాదు- ఎందుచేననఁగా—

న హ్యప్రత్యక్షం రూపాదిహీనం చ ప్రధాన మీశ్వర స్యాధిష్ఠేయం సంభవతి మృదాది వైలక్షణ్యాత్.

(మృదాది .... ణ్యాత్=) రూపముగల్గి ప్రత్యక్షమై యుండుమృత్తు మొదలగుపదార్థములకంటె (అప్రత్య ... ధానం=) రూపము లేక ప్రత్యక్షము గాని ప్రధానము భిన్నలక్షణము గలదియగుటచేత (ఈశ్వ .... ష్ఠేయం=) అట్టిప్రధానముపై నీశ్వరుఁడు తనసృష్టివ్యాపారమును సాగించుట (నహి సంభవతి=) సంభవింపఁజాలదు.

40 సూత్రావతారిక :— ఈశ్వరుఁడు రూపాదులు లేనిప్రధానపురుషులను ప్రేరేపించుట యసంభవ మైనందున జగత్తునకు నిమిత్తకారణము కాఁజాలఁడని లోఁగడిసూత్రముఁదుఁ జెప్పఁబడినది. రూపాదులు లేని ప్రత్యక్షములు గాని చక్షు రాదీంద్రియములు జీవునిచేఁ గర్మములయం దెట్లు ప్రేరేపింపఁబడుచున్నవో యట్లే ప్రధానాదులుసైత మీశ్వరునిచే నేల ప్రేరేపింపఁబడఁగూడ దనువిషయ మీసూత్ర మందు ఖండింపఁబడుచున్నది.

## ౪౦ సూ॥ కరణవ చ్చే న్న భోగాదిభ్యః.

ప॥ వి॥ —— కరణవత్ – చేత్ – న – భోగాదిభ్యః.

ప్ర॥ ప॥ అ॥ — కరణవత్ = ఇంద్రియములవలె; చేత్ = అగున ట్లన్నచో న = అట్లు కాదు; భోగాదిభ్యః = భోగాదులవలన.

సూత్రార్థము :— ఇంద్రియములు (జీవున కధిష్ఠాన మైనట్లు— అనఁగా జీవు నిచేఁ గర్మములయందుఁ బ్రేరేపింపఁబడునవి యైనట్లు) వలెనే (సృష్టికార్యమందుఁ బ్రధానాదు లీశ్వరునిచేఁ బ్రేరేపింపఁబడవచ్చు నన్నచో- అట్లనుటకు వీలు లేదు; భోగాదిహేతువులవలన (ఇంద్రియములు జీవునిచేఁ బ్రేరేపింపఁబడవచ్చునుగాని ప్రధానాదు లీశ్వరునిచేఁ బ్రేరేపింపఁబడునని చెప్పుటకు వీలు లేదు)

సూత్రతాత్పర్యము : — (కరణవత్) చక్షురాదీంద్రియములు రూపాది హీనము లైనను జీవున కధిష్ఠేయము లగుచున్నవి- అనఁగా జీవునిచేఁ గర్మముల యందుఁ బ్రేరేపింపఁబడుచున్నవి- అట్లే- (చేత్) ప్రధానముసైత మీశ్వరున కధి ష్ఠేయ మగుచున్నది. అనఁగా నీశ్వరునిచే జగత్సృష్టియందుఁ బ్రేరేపింపఁబడు చున్నది— అన్నచో, (న) అట్లనుటకు వీలు లేదు. ఎందుచేననఁగా (భోగాదిభ్యః=) సుఖదుఃఖాదిభోగములను బొందుటకు జీవుఁ డింద్రియాదులను గర్మములయందుఁ బ్రేరేపించుచున్నాఁడు- ప్రధానమును సృష్టికార్యమునందుఁ బ్రేరేపించుటచే నీశ్వ రున కట్టిసుఖదుఃఖభోగానుభవము లేదు- ఈశ్వరునికిసైతము భోగాదు లున్నవన్నచో నాతఁ డీశ్వరుఁడని చెప్పుటకే వీలు లేదు.

భాష్యము — భాష్యార్థము

యథా కరణగ్రామం చక్షురాదిక మప్రత్యక్షం, రూపాదిహీనం చ పురుషోఽధితిష్ఠతి, ఏవం ప్రధాన మపీశ్వరోఽధిష్ఠాస్యతీతి_తథాపి నోపపద్యతే, భోగాదిదర్శనాద్ధి కరణ గ్రామ స్యాధిష్ఠితృత్వం గమ్యతే.

(అప్రత్యక్షం=) ప్రత్యక్షము గానట్టియు, (రూపాదిహీనం చ=) రూపము మొదలగుగుణములు లేనట్టియు, (చక్షురాదికం =) కనులు మొదలగు (కరణ గ్రామం=) నింద్రియసమూహమును (పురుషః=) జీవుఁడు (యథా=) ఏప్రకారముగా (అధితిష్ఠతి =) నియమించుచున్నాఁడో- అనఁగాఁ బనులయందుఁ బ్రేరేపించు చున్నాఁడో (ఏవం =) ఆప్రకారముగానే (ప్రధానమపి =) ప్రధానమునుగూడ (ఈశ్వరః=) నీశ్వరుఁడు (అధిష్ఠాస్యతి ఇతి=) నియమించుచున్నాఁడు- అనఁగా సృష్టి కార్యమందుఁ బ్రేరేపణము చేయుచున్నాఁడు — అని సమాధానము చెప్పినను (తథాపి -) అట్టిసమాధానమున్నైతము (న + ఉపపద్యతే=) సరిపోవునది గాదు. ఎందుచేననఁగా— (భోగాదిదర్శనాత్ =) ఇంద్రియములద్వారమున ననుభవింపఁబడు సుఖదుఃఖభోగాదులు జీవున కంటుచుండుటవలన (కరణ ... ష్ఠితత్వం=) నింద్రియ సమూహమును జీవుఁడు నియమించుచున్నాఁడు- అనఁగా నింద్రియములు జీవునకు లోఁబడి పనిచేయుచున్నవి- అని (గమ్యతే=) తెలియఁబడుచున్నది. (అనఁగా— ఇంద్రియములు చేయుపనులయొక్క ఫలము జీవునియీఁదఁ గన్పించుచున్నందున నింద్రియ ములను జీవుఁడు నియమించుచున్నాఁడని చెప్పఁగలిగినామని భావము )

న చాత్ర భోగాదయో దృశ్యంతే.

(అత్ర=) ప్రధానేశ్వరులవిషయమందు— అనఁగాఁ బ్రధానమువలనఁ గలుగు చుండుసృష్టికార్యవిషయమందు ( భోగాదయః = ) సుఖదుఃఖాదిభోగములు (న దృశ్యంతే=) ఈశ్వరునియందుఁ గన్పించుట లేదుగదా.

(కాఁబట్టి జగత్సృష్టికార్యమునందుఁ బ్రధానము నీశ్వరుఁడు నియమించు చున్నాఁడు- అనఁగాఁ బ్రేరేపించుచున్నాఁడనిచెప్పుటకు సాధ్యపడదని భావము )

కరణగ్రామసామ్యే చాభ్యుపగమ్యమానే సంసారిణామి వేశ్వరస్యాపి భోగాదయః ప్రసజ్యేరన్.

(కరణ ... మానే=) ఒకవేళ నింద్రియసమూహోపమాన మంగీకరింపఁబడి నచో- అనఁగా నింద్రియములకు జీవునకు నెట్టినియామకసంబంధ మున్నదో యట్టి సంబంధమే ప్రధానమునకును నీశ్వరునకును గలదని యంగీకరించుపక్షమున (సంసా ... మివ=) సుఖదుఃఖాదిసంసారమునందు మునిఁగితేలు జీవులకువలెనే (ఈశ్వర స్యాపి=) యీశ్వరునకున్నైతము (భోగాదయః=)సుఖదుఃఖభోగాదులు (ప్రసజ్యేరన్=) అంటుచుండునని చెప్పవలసినదేగదా ! (అట్టిసందర్భమం దీశ్వరుఁడున్నైత మొక సామాన్యజీవుఁడే యగునుగాని మఱే మగునని భావము)

అన్యథా వా సూత్రద్వయం వ్యాఖ్యాయతే.

(సూత్రద్వయం=) ఈయధికరణములోని లోఁగడి 39-40 రెండు సూత్రములు (అన్యథా వా=) మఱియొక విధమునఁగూడ (వ్యాఖ్యాయతే=) నర్థము చెప్పఁబడ వచ్చును. అ దెట్లంటేని—

'అధిష్ఠానానుపపత్తేశ్చ' II-2-39 సూ॥ 'అధిష్ఠానానుపపత్తేశ్చ'

(సూత్రార్థము) (సృష్టికిఁ గావలసినవ్యాపారము నకుఁ దగినశరీరాదుల యొక్క) అధిష్ఠానము (ఈశ్వరునికి) లేకపోవుటవలనఁగూడ— (ఈశ్వరుఁడు ప్రధానమును సృష్టికార్యమందుఁ బ్రేరేపించుచున్నాఁడని చెప్పుట కు సాధ్యపడదు.)

N. B. 'రూపాదిహీనము నప్రత్యక్షము నైనప్రధానము నీశ్వరుఁ డధిష్ఠించుట (=పరిపాలించుట- ప్రేరేపించుట) యసంభవమైనందున' అని లోఁగడను- 'సృష్టివ్యాపారమునకుఁ గావలసిన శరీర మీశ్వరునకు లేనందున' అని యిప్పుడును నర్థము చేయఁబడినదని యెఱుఁగునది.

ఇతశ్చానుపపత్తి స్తార్కికపరికల్పిత స్యేశ్వరస్య,

(ఇతః=) ఈహేతువువలనఁగూడ (తార్కిక ... శ్వరస్య=) తార్కికులచేఁ గల్పింపఁబడినయీశ్వరుఁడు— అనఁగాఁ- బ్రధానాదులను సృష్టికార్యమందుఁ బ్రేరేపించుచున్నాఁడని తార్కికులు చెప్పునీశ్వరుఁడు (అనుపపత్తిః=) ఉండుటయే సంభవింపదు

సాధిష్ఠానో హి లోకే నశరీరో రాజా రాష్ట్ర స్యేశ్వరో దృశ్యతే. న నిరధిష్ఠానః,

(రాష్ట్రస్య+ఈశ్వరః=) రాజ్యమును బరిపాలించు- శాసించు- నియమము చేయు (రాజా=) రాజు (సాధిష్ఠానః=) అధిష్ఠానముతోఁ గూడుకొన్నవాఁడై- అనఁగా (సశరీరః=) శరీరముతోఁ గూడుకొన్నవాఁడై (దృశ్యతే=) కనుపట్టుచున్నాఁడుగాని (నిరధిష్ఠానః=) అధిష్ఠానము లేనివాఁడుగా- అనఁగా శరీరము లేనివాఁడుగా (న— దృశ్యతే=) నెక్కడను గన్పించుట లేదు.

అతశ్చ తద్దృష్టాంతవశే నాదృష్ట మీశ్వరం కల్పయితు మిచ్ఛత ఈశ్వరస్యాపి కించిచ్ఛరీరం కరణాయతనం వర్ణయితవ్యం స్యాత్.

(అతశ్చ=) కాఁబట్టి (తద్దృ ... శేన=) యీరాజదృష్టాంతమునుబట్టి గోచరించునది యేమనఁగా— (అదృష్ట ... మిచ్ఛతః=) గోచరింపక యే సృష్టిని నియామ

కము చేయునీశ్వరుఁ డొకఁ డున్నాఁడని కల్పింపఁగోరువాఁడు (ఈశ్వరస్య=) అట్టి కల్పింపఁబడిన యీశ్వరునకు (కరణాయతనం=) నింద్రియములు ప్రవేశించియుండఁ దగిన (కించిచ్ఛరీరమపి=) యేదోయొకకొద్దిపాటి శరీరముగూడఁ గలిగియున్నట్లే (వర్ణ .... స్యాత్=) కల్పించవలసియుండెను.

నచ తద్వర్ణయితుం శక్యతే.

(తద్వర్ణయితుం=) అట్లు కల్పించుటకు (నచ శక్యతే=) సాధ్యమన్ననో-కాదు ఎందుచేతననఁగా—

సృష్ట్యుత్తరకాలభావిత్వా చ్ఛరీరస్య ప్రాక్సృష్టే స్తదనుపపత్తేః.

(సృష్టికై సృష్టికిఁ బూర్వము ప్రధానమును నియమించుటకుఁగదా యీశ్వరునకు శరీరకల్పనము చేయవలసివచ్చుట! ఇట్టికల్పన మసంభవమే యని చెప్పుచున్నాఁడు (శరీరస్య=) శరీరమన్నది (సృష్ట్యు ... విత్వాత్=) సృష్టికి నుత్తరకాలమందుమాత్రమే యుండఁదగినదిగావున (ప్రాక్సృష్టేః=) సృష్టికిఁ బూర్వకాలమందు (తద.. పత్తేః) అట్టిశరీరమన్నది యొకటి యున్నదనుకొనుటకే యవకాశము లేదు (పోనీ! అట్టియసంభవమైనశరీరము నీశ్వరునకుఁ గల్పింపనేల యందుమా:

నిరధిష్ఠానత్వేన చేశ్వరస్య ప్రవర్తకత్వానుపపత్తిః.

(నిరధి .... రస్య=) ఈశ్వరుఁ డెట్టి శరీరమును గలిగియుండకున్నచో (ప్రవర్త ... పత్తిః=) అట్టియీశ్వరుఁడు ప్రవర్తకుఁ డగుటయే-అనఁగా సృష్టికార్యమునకై ప్రధానమును నియమింపఁ (ప్రేరేపింప) గలవాఁ డగుటయే సంభవింపదు.

ఏవం లోకే దృష్టత్వాత్.

(ఏవం=) ఇట్లగుట- అనఁగా శరీరము లేనివాఁ డితరులను నియమింప లేకపోవుట (లోకే దృష్టత్వాత్=) లోకానుభవసిద్ధవిషయమే. (రాజాది దృష్టాంతములచేత నెఱుఁగునది.) (శరీరము లేకపోవుచో నీశ్వరునకు సృష్టినియామకత్వమే పొసఁగదు సృష్టితరువాత రాఁదగినశరీరము సృష్టికిఁ బూర్వ మీశ్వరున కుండఁగలుగుటయే యసంభవము, కాన సృష్టికార్యమునకై నియమించ నీశ్వరుఁ డున్నాఁడని తార్కికులు చేయుకల్పనము చెల్లదని భావము.)

కరణవచ్చే న్న భోగాదిభ్యః. (బ్ర॥సూ॥ II-2-40 కరణవచ్చే న్న భోగాదిభ్యః.

'ఈశ్వరుఁడు (కరణవత్=) దేహాదీంద్రియములు గలవాఁడే యని (చేత్=)

భావించుచో (న=) అట్టికల్పన కవకాశము లేదు. ఎందుచేతననగా (భోగాదిభ్యః=) ఈశ్వరునకు సుఖదుఃఖభోగానుభవము కున్నదని చెప్పవలసివచ్చుటవలన—

N.B — రూపాదిహీనములైనయింద్రియములు జీవునిచేఁ బరిపాలింపఁబడుచున్నట్లే రూపాదిహీనమైనప్రధాన మీశ్వరునిచేఁ బరిపాలింపఁబడుచున్నదని చెప్పుచో— అని లోఁగడను ఈశ్వరుఁడు దేహాదీంద్రియములు గలవాఁడే యని భావించుచో— అని యిప్పుడును వర్ణములు చేయఁబడినవని గ్రహించుఁడు.

అథ లౌకికదృష్టానుసారేణేశ్వరస్యాపి కించిత్కరణానామాయతనం శరీరం కామేన కల్ప్యేత.

(అథ=) పోనీ! ఎంతయసంభవమైనదైనను (లౌక ... రేణ=) లోకానుభవమునకు సరిపోయినట్లుగా— అనఁగా 'దేహమున్నచో నియమింపఁగల్గుట' అను లోకానుభవమునకు వ్యతిరేకత లేకుండునట్లుగా (ఈశ్వరస్య=) ఈశ్వరునకు (కరణా ... శరీరం కించిత్ — అపి=) ఇంద్రియములు ప్రవేశించియుండఁదగిన యేదోయొకపాటి శరీరమునుగూడ (కామేన=) యథేచ్ఛముగా— అనఁగా నిష్టానుసారముగాఁ (కల్ప్యేత=) కల్పింపఁబడినదనియే యనుకొందము. అనఁగా సృష్టికిఁ బూర్వ మీశ్వరునకు నేదోయొకశరీర మున్నదనియే యనుకొందము— అనిభావము)

ఏవమపి నోపపద్యతే.

(ఏవమపి=) అట్లనుకొనుటకైనను (న+ఉపపద్యతే=) నట్టియవకాశమును లేదు.

సశరీరత్వే హి సతి, సంసారివద్భోగాదిప్రసంగా దీశ్వరస్యాప్యనీశ్వరత్వం ప్రసజ్యేత.

(సశరీర ... సతి=) ఈశ్వరున కేదోయొకశరీర మున్నదని తలఁచుపక్షమున (సంసారివత్=) సామాన్యజీవునివలెనే (ఈశ్వరస్యాపి=) యీశ్వరునికైనను (భోగా ... సంగాత్ = సుఖదుఃఖభోగానుభవ మున్నదనియే చెప్పవలసివచ్చి (అనీశ్వరత్వం=) యట్టియీశ్వరుఁ డీశ్వరుఁడు గాఁజాలకపోవుటయే (ప్రసజ్యేత=) తటస్థించును.

4 సూత్రావతారిక :— రూపాదిహీనములైనను చక్షురాదీంద్రియములు జీవునిచేఁ గర్మములందుఁ బ్రేరేపింపఁబడుచున్నట్లు రూపాదిహీనములైనప్రధాన పురుషులునైతే మీశ్వరునిచే సృష్టికార్యమందుఁ బ్రేరేపింపఁబడుచున్నారని చెప్పుచో

శరీరునకువలెనే యీశ్వరునకును సుఖదుఃఖభోగానుభవదోషము సంభవించును. కావున నైయాయికులు చెప్పురీతిగా నీశ్వరుఁడు ప్రధానపురుషులను బ్రేరేపించుట ద్వారమున జగత్తునకు నిమిత్తకారణము కాఁజాలఁడని లోఁగడిసూత్రమునఁదుఁ జెప్పఁబడినది. ఈశ్వరునకు సర్వజ్ఞత్వాదులు పొసఁగనేరవని పాశుపతమతమునందు మఱియొకదోషమీసూత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

## ౪౧ సూ॥ అంతవత్త్వమసర్వజ్ఞతా వా.

ప॥ వి॥ — అంతవత్త్వం - అసర్వజ్ఞతా - వా.

ప్ర॥ ప॥ అ॥ — అంతవత్త్వం = వినాశిత్వము; వా = లేక; అసర్వజ్ఞతా = అసర్వజ్ఞత్వము.

సూత్రార్థము :— ప్రధానపురుషేశ్వరులయొక్క పరిమాణాదు లీశ్వరునిచేఁ దెలియఁబడునేని యాముువ్వురకు వినాశిత్వము — లేక (పరిమాణాదు లీశ్వరునిచేఁ దెలియఁబడఁజాలవందురేని నీశ్వరునకు) అసర్వజ్ఞత్వము (ప్రాప్తించునుగావునఁ బాశుపతమత మసమంజసము)

సూత్రతాత్పర్యము :— ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడనియును బ్రధానపురుషేశ్వరులు మువ్వురును ననంతులనియును బాశుపతమతస్థులు సిద్ధాంతీకరించియున్నారు. అట్టిసందర్భములోఁ బ్రధానపురుషులయొక్కయుఁ దనయొక్కయుఁ బరిమాణాదు లింతయని సర్వజ్ఞుఁడైనయీశ్వరుఁడు తెలిసికొనఁగలిగి యుండవలయునుగదా. (అంతవత్త్వం) ఆమువ్వురును నెంతెంతో కొంతపరిమాణము గలవారేయని తెలిసికొనఁబడఁగల్గినచో వా రంతము (=వినాశము) లేనివారని చెప్పుటకు వలనుపడదు. (అసర్వజ్ఞతా వా) లేక ప్రధానపురుషులయొక్కయుఁ దనయొక్కయుఁ బరిమాణ మింత యని యీశ్వరుఁడు తెలిసికొనఁజాలఁడన్నచో నీశ్వరుఁడు సర్వజ్ఞుఁడే కాకపో వలసివచ్చును. ఇట్టి యసందర్భసిద్ధాంతములతోఁ గూడిన పాశుపతమతము సమంజస మైనది గాదు

భాష్యము — భాష్యార్థము

ఇతశ్చానుపపత్తి స్తార్కికపరికల్పిత స్యేశ్వరస్య.

(ఇతశ్చ=) ఈ చెప్పఁబోవు మఱియొక కారణమువలనఁగూడ (తార్కిక ...

రస్య =) జగన్నిమిత్తకారణముగాఁ దార్కికులచేఁ గల్పింపఁబడిన యీశ్వరుఁ డొకఁ డున్నాఁడనుట (అనుపపత్తిః =) సరిగాదు.

న హి సర్వజ్ఞ స్తై రభ్యుపగమ్యతే; అనంతశ్చ.

(సః హి=) ఆయీశ్వరుఁడు (సర్వజ్ఞః=) సర్వజ్ఞుఁడనియును, (అనంతశ్చ=) అంతము లేనివాఁడనియును (తైః=) ఆతార్కికులచేత (అభ్యుపగమ్యతే=) నంగీక రింపఁబడుచున్నాఁడు.

అనంతం చ ప్రధానం, అనంతాశ్చ పురుషా మిథో భిన్నా అభ్యుపగమ్యంతే.

(ప్రధానం=) ప్రధాన మనునదిగూడ (అనంతం చ=) నంతము లేనిదే యని యును, (పురుషాః=) జీవులుగూడ (అనంతాశ్చ=) నంతము లేని వారును (మిథః ... భిన్నాః=) పరస్పరము– అనఁగా వారిలో వారు భిన్నులనియును (అభ్యుపగమ్యతే=) నంగీకరింపఁబడుచున్నది.

తత్ర సర్వజ్ఞే నేశ్వరేణ ప్రధానస్య పురుషాణా మాత్మన శ్చేయత్తాపరిచ్ఛిద్యేత వా ?
నవా పరిచ్ఛిద్యేత ?

(తత్ర=) అందు (సర్వ ... రేణ=) సర్వజ్ఞుఁడైనయీశ్వరునిచేతఁ (ప్రధాన ... మాత్మనః =) ప్రధానముయొక్కయు జీవులయొక్కయుఁ దనయొక్కయు (ఇయత్తా=) పరిమాణము (పరిచ్ఛిద్యేత వా?) (1) పరిచ్ఛిన్నము చేయఁబడుచున్నదా —అనఁగా వేఱుగా నింతయని నిశ్చయింపఁబడుచున్నదా ? (నవా పరిచ్ఛిద్యేత=) (2) లేక నిశ్చయింపఁబడుట లేదా ? (అనఁగా సర్వజ్ఞుఁడైనయీశ్వరుఁడు తెలిసి కొనుచున్నాఁడా లేదా యని భావము)

ఉభయథాపి దోషోఽనుషక్త ఏవ. కథమ్ ?

(ఉభయథాపి=) నిశ్చయింపఁబడుచున్నదని చెప్పినను లేదని చెప్పినను (దోషోఽ ... ఏవ=) దోషమే వచ్చితీరను. (కథం=) అది యెట్లు ?

పూర్వస్మిం స్తావ ద్వికల్పే ఇయత్తాపరిచ్ఛిన్నత్వా త్ప్రధానపురుషేశ్వరాణా మంతవత్త్వ మవశ్యంభావి; ఏవం లోకే దృష్టత్వాత్.

(1) (౧) (పూర్వ ... వికల్పే=) మొదటివికల్పమునందు (ఇయత్తాపరి చ్ఛిన్నత్వాత్=) అనఁగా నాముగ్గురికిఁ బరిమాణము (=ఇయత్తా) కలదని నిశ్చ యింపఁబడినప్పుడు (ప్రధాన .... భావి=) ప్రధానపురుషేశ్వరులైనయీముగ్గురును నవశ్యముగా 'అంతము' గలవారే కావలసివచ్చును.

(ఏవం=) ఇట్లే (లోకే=) లోకానుభవమందును (దృష్టత్వాత్=) గనుపడుచున్నందుచేత.

యద్ధి లోకే ఇయత్తాపరిచ్ఛిన్నం వస్తు ఘటాది త దంతవ ద్దృష్టమ్.

(యత్-హి=) ఎట్లనఁగా- (లోకే=) లోకమునందు (ఇయత్తా ... ఘటాది తత్=) ఇంతపరిమాణము (= ఇయత్తా) గలవని చెప్పఁదగినఘటాదివస్తువు లన్నియును (అంతవ ద్దృష్టం=) అంతముగలవిగానే గన్పించుచున్నవి.

తథా ప్రధానపురుషేశ్వరత్రయమ పీయత్తాపరిచ్ఛిన్నత్వా దంతవ త్స్యాత్

(తథా =) అప్రకారముగానే (ప్రధాన .... మపి =) ప్రధానజీవేశ్వరులు ముగ్గురున్నైతము (ఇయత్తా .... న్నత్వాత్=) ఇంతపరిమాణము గలవారని నిశ్చయింపఁబడఁగలిగినప్పుడు (అంతవత్స్యాత్=)వారును నంతము గలవారే యగుదురు.

సంఖ్యాపరిమాణం తావ త్ప్రధానపురుషేశ్వరత్రియరూపేణ పరిచ్ఛిన్నం.

(బి) (తావత్=) మఱియును (ప్రధాన ... రూపేణ=) ప్రధానమనియు, జీవుఁడనియు, నీశ్వరుఁడనియు వేఱువేఱుగాఁ జెప్పఁబడినప్పుడు (సంఖ్యాపరిమాణం=) 'మూఁడు' అనెడిసంఖ్యాపరిమాణము (=స్వరూపము) (పరిచ్ఛిన్నం=) వారియందున్నదిగదా !

స్వరూపపరిమాణమపి తద్గత మీశ్వరేణ పరిచ్ఛిద్యేతేతి. పురుషగతా చ మహాసంఖ్యా.

(తద్గతం=) ప్రధానజీవేశ్వరులని ముగ్గురుగా నున్నట్టు చెప్పఁబడు (స్వరూపపరిమాణమపి=) స్వరూపపరిమాణమును, (పురుషగతా చ మహాసంఖ్యా=) జీవులయందుండెడిమహాసంఖ్యయును (=పరిమాణము—Large number) (ఈశ్వ ... ద్యేతేతి=) సర్వజ్ఞుఁడైనయీశ్వరునిచేతఁ దెలిసికొనఁబడవలెనుగదా !

తతశ్చ ఇయత్తాపరిచ్ఛిన్నానాం యే సంసారా న్ముచ్యంతే తేషాం సంసారోఽన్తవాన్ సంసారిత్వం చ తేషా మంతవత్.

(తతశ్చ=) అట్టిసందర్భమందు (ఇయత్తా ... పరిచ్ఛిన్నానాం మధ్యే=) పరిమాణము గలవారని చెప్పఁబడినవీరిలో (యే సం....చ్యంతే=) నెవరు సంసారమునుండి ముక్తులగుచున్నారో (తేషాం... అన్తవాన్=) వారియొక్క సంసార మంతరించిపోవుటయేగాక (సంసారి .... మంతవత్=) వారు సంసారులగుటయు నిఁకముందుండఁజాలదు.

ఏవ మితరేష్వపి క్రమేణ ముచ్యమానేషు సంసారస్య సంసారిణాం చాంతవత్త్వం స్యాత్.

(ఏవం=) ఈవిధముగానే (ఇతరే ... మానేషు =) క్రమముగా మిగిలిన వారును ముక్తులైనప్పుడు, (సంసార ... స్యాత్ =) ఆయాయుదిచతిసంసారము లంత రించిపోయి, వా రికమీఁద సంసారు లగుటయు నుండఁజాలదు.

ప్రధానం చ సవికారం పురుషార్థ మీశ్వర స్యాధిష్ఠేయం సంసారిత్వే నాభిమతం.
తచ్ఛూన్యతాయా మీశ్వరః కి మధితిష్ఠేత్? కింవిషయే వా సర్వజ్ఞతేశ్వరతే స్యాతామ్?

(పురుషార్థం =) జీవులయొక్క ప్రయోజనమునిమిత్తము (ఈశ్వర స్యాధి ష్ఠేయం=) ఈశ్వరునివలనఁ బరిపాలింపఁ (=అధిష్ఠింప) బడుచున్నట్టి (సవికారం=) మహదాదివికారములతోఁ గూడిన (ప్రధానం చ=) ప్రధానమే (సంసారిత్వేన=) సంసారమైనట్లుగా (అభిమతం =) ఆపాశుపతాదిమతస్థులవలన నంగీకరింపఁబడుచు న్నదిగదా!

(పైనిఁజెప్పఁబడినప్రకారము) (తత్ =) సంసారముగాఁ బరిగణింపఁబడు నాప్రధానమే— అనఁగా నాసంసారమే (శూన్యతాయాం =) యంతరించిపోయి నప్పుడు— అనఁగా శూన్యమైనప్పుడు (ఈశ్వరః=) ఈశ్వరుఁడు (కి మధితిష్ఠేత్ =) ఇఁక దేని నధిష్ఠింపఁగలఁడు? (=పరిపాలింపఁగలఁడు ?)

(కింవిష .... స్యాతాం=) అప్పు డీశ్వరునియొక్క సర్వజ్ఞత్వమును (=సర్వ జ్ఞతా) పరిపాలనాశక్తియును (=ఈశ్వరతా) నిర్విషయములై లేకపోవలసివచ్చును. (అనఁగా 'ప్రధాన' మనెడిసంసారమె లేనప్పుడు జీవులును లేకపోదురు; సర్వజ్ఞుఁడై పరిపాలించునీశ్వరుఁడును లేకపోవును— అని భావము)

ప్రధానపురుషేశ్వరాణాం చైవ మంతవత్త్వే స, త్యాదిమత్త్వప్రసంగః.

(ఏవం=) అట్లు (ప్రధాన .... రాణాం చ=) ప్రధానపురుషేశ్వరులు ముగ్గు రును (అంతవత్త్వే సతి=) అంతము గలవారని తేలినప్పుడు (ఆదిమ...ప్రసంగః=) ఆది గలవా రనియును జెప్పవలసివచ్చును.

ఆద్యంతవత్త్వే చ శూన్యవాదప్రసంగః.

(ఆద్యం....త్త్వేచ=) ఆదియు నంతము నంగీకరింపఁబడినప్పుడు (శూన్యవాద ప్రసంగః=) శూన్యవాదమే పటస్థించును (అనఁగా ఒకప్పు డేదియు నుండదనియే చెప్పవలసివచ్చును)

అథ మాభూ దేష దోష ఇత్యుత్తరో వికల్పోఽభ్యుపగమ్యేత. తదా న ప్రధానపురుషాణా మాత్మన శ్చేయత్తేశ్వరేణ పరిచ్ఛిద్యేత ఇతి.

(2) (అథ=) మొదటివికల్పమువలన- అనఁగా- ప్రధానపురుషేశ్వరులపరిమాణ మీశ్వరునివలనఁ దెలిసికొనఁబడునని చెప్పుటచే- (ఏష దోషః=) (ఈశ్వరునికి సర్వజ్ఞత్వము లేకపోవుట- యను) నీదోషము సంభవించినందున, (మాభూత్ ఇతి) ఆ మొదటివికల్పమును దోసివేసి, (ఉత్తరో వికల్పః=) రెండవవికల్పమును- అనఁగా (ప్రధాన .... మాత్మనశ్చ=) ప్రధానపురుషేశ్వరులయొక్క (ఇయత్తా=) పరిమాణము (ఈశ్వరేణ= ఈశ్వరునిచేఁ (న- పరిచ్ఛిద్యతే + ఇతి=) దెలిసికొనఁబడఁజాలదు- అను విషయమును (తదా- అభ్యుపగమ్యేత=) సంగీకరించుపక్షములో-

తత ఈశ్వరస్య సర్వజ్ఞత్వాభ్యుపగమహాని రపరో దోషః ప్రసజ్యేత.

(తతః=) అప్పుడు (ఈశ్వ.... హానిః=) ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడని యొప్పుకొను వారి (తార్కికుల) మొదటిసిద్ధాంతమునకే భంగము గలుగునను (అపరో దోషః=) మఱియొకదోషము (ప్రసజ్యేత=) దగుల్కొనును.

తస్మాద వ్యసంగత స్తార్కికపరిగృహీత ఈశ్వరకారణవాదః.

(తస్మాత్=) కాఁబట్టి (తార్కిక ... వాదః=) యీశ్వరుఁడు కేవలనిమిత్తకారణమని చెప్పుతార్కికులవాదము (అసంగతః=) యుక్తియుక్తమైనది కాదు.

... ... ... ... ...

ద్వితీయాధ్యాయ ద్వితీయపాదము నందలి చివరి నాల్గుసూత్రములు

సూ॥ ४२ ఉత్పత్త్యసంభవాత్.

సూ॥ ४३ న చ కర్తుః కరణమ్.

సూ॥ ४४ విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః.

సూ॥ ४५ విప్రతిషేధా చ్చ.

ద్వితీయాధ్యాయ-ద్వితీయపాదః

సమాప్తః